ఆత్రేయసాహితి
మొదటి సంపుటం
ప్రమోదూత - ఉగాది
1990

ముఖపత్రం :
గంగాధర్

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
మదరాసు-1

ప్రతులకు :
మ న స్వి ని
పబ్లిక్ ఛారిటబుల్ ట్రస్ట్,
ఎ. సి. 4, సెకండ్ ఎవెన్యూ
అన్నానగర్
మదరాసు - 600 040
లేక
నవోదయా పబ్లిషర్స్
కారల్‌మార్క్స్ రోడ్
విజయవాడ - 520 002

వెల :
ఏడు సంపుటాలు (సెట్) :
రూ. 225/-

# ఆత్రేయసాహిత్యం

మొదటి సంపుటం

## నాటకాలు -1


సంపాదకుడు :

కొంగర జగ్గయ్య

సహసంపాదకుడు :

పైడిపాల





మనస్విని

పబ్లిక్ ఛారిటబుల్ ట్రస్ట్

మదరాసు

# ఆత్రేయ గురించి ....

అసలు పేరు : కిళాంబి వెంకట నరసింహాచార్యులు.

కలం పేరు : పేరులోని 'ఆచార్య' + గోత్రంలోని 'ఆత్రేయ' కలిసి: ఆచార్య ఆత్రేయ.

పుట్టింది : 7-5-1921 న నెల్లూరు జిల్లా, సూళ్లూరుపేట తాలూకా మంగళంపాడు గ్రామంలో.

పెరిగింది : ప్రాథమిక విద్యాభ్యాసం సహా, స్వగ్రామమైన 'ఉచ్చూరు'లో. తరువాత మేనమామల ఇంట్లో—

తల్లిదండ్రులు : శ్రీమతి సీతమ్మ, శ్రీ కృష్ణమాచార్యులు.

చదువు : ఎస్.ఎస్.ఎల్.సి. వరకు చిత్తూరులో — ఇంటర్మీడియెట్ రాయ వెల్లూరులోని ఊరీస్ కళాశాలలో — టీచర్స్ ట్రెయినింగ్ చిత్తూరులో.

వివాహం : 1940 లో, శ్రీమతి పద్మావతితో.

రాజకీయాలు : 'క్విట్ ఇండియా' ఉద్యమంలో పాల్గొని జైలుకు వెళ్ళటం; 1955 లో కమ్యూనిస్ట్ పార్టీకోసం ప్రచార ప్రదర్శన లివ్వటం.

ఉద్యోగాలు : నెల్లూరు మున్సిఫ్ కోర్టులోనూ, తిరుత్తణి సెటిల్‌మెంట్ ఆఫీసులోనూ గుమాస్తాగానూ - 'జమీన్ రైతు' పత్రికలో సహాయ సంపాదకునిగానూ - ఆంధ్ర నాటక కళాపరిషత్తులో వేతనకార్యదర్శిగానూ.

రచనలు : పోయినవి పోగా పది నాటకాలూ, పదిహేను నాటికలూ, సుమారు 400 చిత్రాలకు మాటలూ, పాటలూ, పద్య కవితలూ....

బిరుదులు : ఇచ్చినవి మరచిపోగా, జనంనోళ్ళలో 'మనసుకవి'. 1989 మే లో సార్వత్రిక విశ్వవిద్యాలయం వారి డాక్టరేట్.

నిర్యాణం : 13-9-1989 బుధవారం రాత్రి 10 గం॥కు మదరాసులో.

# మా మాట

ఆచార్య ఆత్రేయ చివరి రోజులలో, ఆయన కోరిక మేరకు, ఆయన ఆమోదంతో, 'ఆత్రేయ సాహితి'కి పరిమిత పరిధిలో అంకురార్పణ చేశాం. ఆయన మరణానంతరం, పెరిగిన మా బాధ్యతను పురస్కరించుకుని, 'మనస్విని' ట్రస్టును నెలకొల్పి, ఆయన రచనలన్నీ వివిధ సంపుటాలలో ప్రచురించాలన్న విస్తృత కార్యక్రమాన్ని చేపట్టాం.

లభ్యమైన శ్రీ ఆత్రేయ రచనలన్నీ ఏడు సంపుటాలుగా విభజించాం. నాటకాలు రెండు సంపుటాలు, నాటికలు ఒక సంపుటం, సినిమా పాటలు మూడు సంపుటాలూ, ఆత్మకథ మొదలైన ఇతర రచనలన్నీ కలిపి ఒక సంపుటమూ. అనేక చలనచిత్రాలకు శ్రీ ఆత్రేయ వ్రాసిన సంభాషణలను మాత్రం గ్రంథస్థం చేయడం సాధ్యం కాలేదు - కాదు. అందుకు విచారిస్తున్నాం. 1947 కు ముందు శ్రీ ఆత్రేయ వ్రాసిన నాలుగు నాటకాలూ, స్వాతంత్ర్యం రాగానే వ్రాసిన ఒక నాటకమూ కలిపి మొదటి సంపుటంగానూ, 1947 తరువాత వ్రాసిన ఐదు నాటకాలూ రెండవ సంపుటంగానూ వెలువరిస్తున్నాము. అయితే, తొలి రోజులలో ఆయన వ్రాసిన 'శాంతి', 'సాధన', 'డాక్టర్ కోట్నీస్' నాటకాలు మాత్రం ఎక్కడా లభ్యం కాలేదు. అది తీరని కొరత.

ఈ మహత్తర కృషిని ఆదరించి, 'మనస్విని' ట్రస్టుకు విరాళాలందించి, ప్రోత్సహించిన చిత్రసీమ ప్రముఖుల, ట్రస్టు సభ్యుల ఔదార్యానికి మేము సర్వదా ఋణపడి వున్నాం. అందులోనూ నిర్మాతలు శ్రీ కె. దేవీ వరప్రసాద్, శ్రీ కె. మురారి ఆదినుండీ అందించిన అండదండలు మరువలేనివి.

'ఆత్రేయ సాహితి' యీ రూపంలో వెలువడడానికి మిత్రుడు శ్రీ పైడిపాల చేసిన పరిశ్రమ విలువ కట్టలేనిది. ఈ కృషిలో మాకు బాసటగా నిలిచిన (రాజమండ్రి పేపర్ మిల్స్) శ్రీ ఎస్. వి. చౌదరికీ, శ్రీ అవధానికీ, 'క్రాంతి ప్రెస్' అధినేత శ్రీ శ్రీధర్‌కీ, ముఖపత్ర రచయిత శ్రీ గంగాధర్‌కీ, ఆర్టిస్టు మిత్రుడు శ్రీ కౌండిన్యకీ, మా కృతజ్ఞత.

ఈ ప్రచురణ ద్వారా మిత్రుడు శ్రీ ఆత్రేయ ఒకప్పటి కోరిక తీర్చగలిగామనీ, మా బాధ్యతను నెరవేర్చుకో గలిగామనీ నమ్ముతున్నాం.

మనవాడు,

ప్రమోదూత - ఉగాది.
27-3-1990.

కొంగర జగ్గయ్య
సంపాదకుడు



మనస్విని
పబ్లిక్ ఛారిటబుల్ ట్రస్ట్
మదరాసు

## ఈ సంపుటంలో...

## ధన్యవాదాలు :

ఈ నాటకాల సేకరణలో
మాకు తోడ్పడిన

టి. వెంకటపతిరాజు గారికి
(విజయవాడ),

ఎ. బి. ఆనంద్ గారికి
(ఆలిండియా రేడియో, విశాఖపట్నం)

# గౌతమబుద్ధ

'బెర్నార్డ్ షా' రచించిన 'ది బ్లాక్ గర్ల్ ఇన్ సెర్చ్ ఆఫ్ గాడ్' కథ ఈ నాటకానికి ప్రేరణ. ఈ నాటకంలోని పాత్రలను ఆ యా దృశ్యాలకు ముందు మాత్రమే పేర్కొన్నారు. రాధాకృష్ణుల నృత్య గీతిక తప్ప మరెక్కడా సంభాషణలకు ముందు పాత్రల పేర్లు లేకపోవడం దీనిలోని నూతన ప్రయోగం. దీనిలోని 'సప్త స్వప్నాల వృత్తాంతం' బౌద్ధ గ్రంథాలు ఆధారంగా రాసింది. 1943 లో రచించిన ఈ నాటకం 44 లో అచ్చయింది.

# స్మృతి

ఇదిగో నా కవితాప్రసూనములకీ
వే స్వర్గమందారసూ
నవితానమ్ములఁగూర్చి యప్పలుకుచా
నఁజేరి, కొల్వున్న మా
కవితాబ్రహ్మలుచూడ, నా యుపదగా
కంఠమ్మునఁవైచి, నీ
నవభావోదయచేవనల్ పఱపుమా
నా తల్లి సీతమ్మరో!

# మొదటి రంగం

రంగస్థలమంతా చిమ్మచీకటి - ఎక్కడా ఏమాత్రం వెలుగూ గోచరించదు.

కొందరు ప్రవేశం.

: అబ్బ! ఒకటే చీకటి!

: అవును. కళ్ళు అపజయంలో పనిమాని వూరుకున్నవి.

: ఇంతదాకా భూమ్యాకాశాలు రెండూ ఏదో సంధిచేసుకొంటున్నట్లుంది. ఇంతవరకూ జరిగిన మహాసంగ్రామం మీరు చూడలేదూ? అబ్బ! చాలా విషాదకరం.

: నిజమే - అవిగో సంగ్రామంలో తెగిన యోధుల దుఃఖితుల ఏడ్పుల లాగున్నవి ఆ రాళ్ళలో నుండి వచ్చే నిశ్శబ్ద శబ్దాలు.

: సూర్యుడు నిప్పులబాణాలు కురిపించాడు. మేఘాలు పిడుగులు విసిరినవి.

: భూమి ఊరుకుందా?

: లేదు. తామరకన్నుల లోంచి రావిమంటల విసిరింది. నిముసాటి నెమలి ఫించాల శూలాలతో పొడిచింది. శాంతిహోమం చేసింది.

: ఈ మహావరాల యుద్ధమెన్నడు ఆగుతుందో ___

: యుద్ధం చూడకపోయినా మా మెదడుమూలలు చితికిపోయినవి. కంచం నిండుకు అన్నం, కడుపునిండుకు ఆకలి వుండినవే కానీ తినలేని చవట తనం తెలియకుండా తెచ్చిపెట్టుకున్నామనుకొంటాను. ఇంతదాకా సంధి కుదిరేనా?

: ఏమో! అబ్బబ్బ! ఉక్క పెట్టేస్తుంది. చెమటలు కారిపోతున్నవి. ఊపిరాడటమేలేదు. వాయుదేవునికి కూడా మన గతే పట్టినట్లుంది. ఏదో చెప్పరాని మంట. ఆవేదన!

: ఆకలి!

: కాదు. ఆకలి కాదు. భూమి పంటలు పండేందుకు మనం పెట్టే బాధలన్నీ సహిస్తూనే వుంది. పూలు పండ్లు పండేందుకు రాలిపోతూనే వున్నవి. మనకు వాన నిచ్చేందుకు మబ్బులు దూర ప్రయాణాలు సాగిస్తూనే వున్నవి. ఇంతవుండీ ఏమిటో మంట - ఎందుకో ఆకలి కాదనుకొంటాను.

: అవునవును. అన్నీ ఆలాగే ఎప్పటిలాగే జరిగిపోతున్నవి. మనలో మాత్రం ఎందుకో ఆవేదన వుంది.

: కాదు కాదు. మునుపటిలా ఎప్పుడు లేదట మనమంతా వెలిగే - అంతా ఆనందమేనట.

: ఎవరన్నారు?

: గ్రంథాల్లో వుంది.

: మా తాత చెప్పేవాడు.

: నిజం. నిజం. మనకే యీ అవస్థ. మనం చాలా దౌర్భాగ్యులం.

: నా బట్టలెవరో చింపేస్తున్నారు.

: నా శరీరం నిముష నిమిషానికి ఎందుకో ముడుతలు పడుతూంది.

: నా కళ్ళు మూతలు పడుతున్నవి.

: నాకు చచ్చిపోవాలనిపిస్తూంది.

: నా కెవరేన్నా పీక్కుతినేద్దామనిపిస్తూంది.

: నా కెవరో కత్తులతో పొట్లాడుతూన్న శబ్దంలా వినిపిస్తూంది.

: నా కాళ్ళక్రింద ఏదో తడి - తడి కాదు ప్రవాహం - నీళ్ళు కాదు రక్తం.

: నా చేతుల కేవో గట్టిగా ఎముకలు, కృత్తిలు, నరాలు తగుల్తున్నవి.

: ఎవరో ఏడుస్తున్నారు.

: ఏదో పెద్ద మంట. నక్షత్రాలని మాడ్చటానికి అవసరంగా[1] పోతూంది.

: మనందాన్ని వెంటపడ్దాం.

: నాకు భయమేస్తూంది.

: మబ్బు అడ్డుపడుతున్నవి.

: వాటిని దాటిపోదాం.

: ఎందుకు?

. అక్కడ దేవుడున్నాడట.

: అతడేం చేస్తాడిప్పుడు?

: నక్షత్రాల వెలుగులో కొంత కొంత తీసి చంద్రుణ్ణి చేసిస్తాడు.

: అప్పుడు. ఎప్పుడు వెలుగొస్తుంది.

: వెలుగొస్తే అన్నీ సర్దుకోగలవు.

---

1. తొందరపడు అర్థంలో మాండలిక ప్రయోగం.

: ఇప్పుడు హాయిగా ఉంటాం.
: మన కిప్పుడు కావాల్సింది వెలుగేనా?
: అవును. అదే ముఖ్యం.
: వెలుగు పంచటానికి పోవాలా?
: అవును. అది దేవుడివ్వాల్సిందే.
: ఎవరో నవ్వుకుంటున్నారు. ఎందుకు?
: అవి పిశాచాల నవ్వు.
: శ్! అదిగో - తారలేమో మాట్లాడుకొంటున్నవి.
: వాళ్ళ లోకమూ యిలాగే చీకటిగా వుంది.
: కానీ - వాళ్ళల్లోనే వెలుగుంది.
: నిజం. అదో, ఓ తార దిగివస్తూంది.
: ఎక్కడికి పోతుందో - చూడు - చూడు.
: రాజనగరులోకి పోతుంది.
: రాండి, రాండి. పోయి చూద్దాం.

అందరూ వెళ్తారు.

రంగస్థలం అలాగే వుంటుంది. అయిదుగురు వికారస్వరూపులు, మృత్యువు, హింస, అసత్యం, స్వార్థం, దారిద్ర్యం ప్రవేశం.

: ఆ పక్షుల కిచకిచలు విన్నావా? ఏలా రెక్కలు కొట్టుకొంటున్నవో! ఎదటి పక్షిని మోసం చేసి తానే సుఖంగా వుండాలని ప్రతి పక్షి మనం పెట్టిన పంజరంలో తానుగా చేరింది. గొప్ప వింతగా లేదూ?

: వింతగానే వుంది. అన్ని పక్షులు చేరి పంజరాన్నెత్తుకుపోతాయేమో!

: నీ దెప్పుడూ విరికితనమే - పంజరాన్నెత్తుకుపోవడం అంత సులభం కాదు. అదిగో చూడు - పంజరపు గోడల్లో ఏమున్నవో - రత్నాలు - బంగారు తీగెలు - పట్టుకుచ్చులు.

: ఇంతకూ నా ప్రతిభే కారణమని సమ్మతిస్తావా? 'నీవు బ్రతకడమే నీ పరమావధి - లేని కాలంలో ఎవరూ నిన్ను చూడరు' అని చెప్పి లోకాన్నంతా నా వశం చేసుకున్నాను.

: స్వార్థం! నీవాలా ఒక జీవిచేత యింకొక జీవిని అణచి పీల్చి పిప్పిచేస్తుంటే ఆ పిప్పిలో నే నాశనహించి యిసుకగజ్జెలు కట్టుకొని నాట్యం చేస్తున్నాను.

: అంతేకదటోయ్. నే నీ యిటువురిలో వున్నాను. నాకు చాలినంత రక్త మాంసాలు దొరుకుతున్నవి. నా ప్రాతినిధ్యంలో కొన్ని శాస్త్రాలు. యంత్రాలు. ఆయుధాలు, అభివృద్ధి పొందినవని వాళ్ళూ వీళ్ళూ తృప్తి పడుతున్నారు. ఏమిటోయ్. అసత్యం! ఆ వంక చూచి ఆలా నవ్వుతున్నావు?

: ఆ వింత చూడండి ఏలాగుందో, నా విరోధి సత్యానిని ఏలా మెడబెట్టి గెంటుతున్నారో? ఏం చేశానో తెలుసా? సరిగ్గా అతనిలాగే తయారయ్యాను. ఇప్పుడు ఎవరు ఎవరా పోల్చుకోలేకున్నారు.

: మీరు ఎంత పనిచేస్తే అంతా నా గుట్టతెగుతూంది. చూచారా నా గ్రంథం ఎంత పెరిగిందో? ఒకని శవం సరిగా నా యిల్లు చేరకముందే యింకొకడక్కడ చాచుకున్నా డంటారు. ఒకని చితిలోని అగ్గి తీసి మరొకని కట్టెలకూర్పునకు పెడుతున్నారు.

: అవునుమరి. ఏనాటికో ఒకనాటికి తన శరీరం నీ వశమవుతుందనే భయంతో ఎదటివాని శరీరం ఎంత వీలుంటే అంత త్వరగా నీ వశం చేయ ప్రయత్నిస్తున్నాడు మానవుడు.

: ఆ మార్గాన భద్రత గడించాలనుకొంటాడు.

: వాడి మనసే గజిబిజి పడిపోయి వుంది.

: అన్ని వెలుగులూ ఆరిపోయినవి పూర్తిగా. అదిగో విను. చీకట్లో ఆ పక్షులేలా చాట్లాడుకొంటున్నవో. పంజరపు కమ్ములలో తల లిరికించుకొని గిజగిజ లాడుతున్నవి.

: ఏలాగైతేనేం, దేవు డున్నాడనే నమ్మకంతోనే దేవుడికి కేవలం వ్యతిరేకమైన కార్యాలు చేయిస్తున్నాం.

: అందరికీ ప్రాణాలంటే తీపి.

: అందుచేతే ఎదటివాడి ప్రాణం తీస్తారు.

: అందరికీ చావంటే భయముంది.

: అందుకే అంత త్వరగా నా దగ్గరకు వస్తారు.

: అందరూ అన్నిటికీ దేవుణ్ణి నమ్ముతున్నారు పూర్తిగా.

: అందుకే తమను రాము నమ్మరు.

: అందరూ శాంతి లేదంటున్నారు.

: అందుకే అశాంతి కల్పించుకొంటారు. ఏడుస్తారు:

ఒకడు రోజుకొంటూ ప్రవేశం.

: ఏం?

: రాచనగరులో ప్రవేశించిన రాణి —

: ఏమైంది?

: శిశువుగా జన్మించింది.

: పండితులు రాలేదూ?

: వచ్చారు:

: ఏమన్నారు?

: అదిగో - వినండి —

'పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.'

దేవుడన్నారు. మనల్నంతా జయిస్తాడట. అతని కళ్ళల్లో శాంతం, దయ వున్నవట. ముప్పై రెండు శుభలక్షణాలతో పుట్టాడట. మ్రోడైన మాను చిగిరించిందట. దేవతలు పూలు కురిపించారట. మహర్షులందరూ జోహారు అర్పించారట.

: ఇంకా ఎన్ని 'అట'లు —

: మన ఆట ఇంక సాగదు.

: సరే.

: అదిగో - బంగారు రెక్కలతో సూర్యుడు వస్తున్నాడు. ఆ పసిపాప పాదాలవద్ద వదలిపోతున్నాడు. ఆ పాదాలు చిరునవ్వుతో అందుకొంటున్నవి.

: పట్టణమంతా సంతోషంతో పొంగిపోతూంది. ఎక్కడ చూచినా సంగీతం, నాట్యం, అలంకారం, విందులు - అదిగో చెఱలో వున్నవారి నందరిని

విడుదల చేయమని రాజాజ్ఞాపిస్తున్నాడు. రాజసౌధం వసంతశోభతో వెలుగుతూంది —

: ఇంతకీ పేరేమన్నారు?

: సిద్ధార్థుడు.

: మాయనుంచి వెలువడ్డ బిడ్డ!

: రాండి. ఏమాత్రం భయంలేదు. మన ఆటలు సాగకపోవు. అంతగా అయితే ఈ ప్రపంచాన్ని వీడి దూరమైపోయి ఆచరణ కసాధ్యమైన వేదాంతాన్ని సాధిస్తాడేమో, లేక తన ముక్తిని సాధించుకొంటాడు, అంతే. ఏమైనా రాండి. పంజరములో పక్షి ఏలాగున్నదో చూద్దాం.

అందరూ వెళ్తారు.



# రెండవ రంగం

రాచనగరు: రాజు, మంత్రి.

: అంతా సిద్ధమైందా?

: చిత్తం.

: అందులో విషాదఘట్టాలేవీ లేవుకదా?

: చిత్తం.

: సిద్ధార్థుడింకా రాలేదేం?

: మందిరంలో వున్నారు.

: ఏం చేస్తున్నాడు?

: నేను వెళ్ళేటప్పటికి కిటికీవద్ద కూర్చొని వుండినారు. ఆయన చూపులు అనంత విశ్వంలోకి జారబడి దూరప్రయాణం సాగించినట్లుండినవి.

: తరువాత?

: వాతావరణ మతిప్రశాంతంగా వుండినది. చల్లని గాలి కూడా నిశ్శబ్దంగా మందిరంలోకి ప్రాకుతూండినవి. ఆయనను పలుకరించలేకపోయాను.

: తరువాత?

: పలుకరించాను. తారాపథం తాకిన గాలిపటాన్ని త్రాటితో లాక్కొనేలాగు ఆయన తన చూపుల నెక్కడినుంచో బలవంతాన కనురెప్పలతో లాక్కున్నారు. పొంగివచ్చే వేడినిట్టూర్పు గాలిలో లీనమైంది. విషాద రేఖలు కనుకొనలలో పుట్టి నొసటి ముడుతలలో కలసిపోయినవి. అలాగే చూస్తూ వూరుకున్నారు. విషయం విన్నవించాను.

: కిటికీలోంచి అతని నంత ఆకర్షించిన దృశ్యమేదో గమనించావా?

: చిత్తం. నా కేమీ గోచరించలేదు. నీలి ఆకాశాన్నంతా రక్తకాంతులతో నింపి పడమటి కొండలలోకి సన్యసిస్తూన్న సూర్యుడు, కలకల అంటూ అతన్ని సాగనంపిస్తూన్న పక్షులు, సరస్సులో ముడుచుకొంటూన్న కమలాలను చూచి విప్పారని ముసిముసి నవ్వు నవ్వుతూన్న కలువలు, తోటమాలి. అంతే.

: తోటమాలి ఏం చేస్తూండినాడు?

: బావిలోంచి నీరు తోడి చెట్లకు పోస్తూండినాడు.

: అతని వయసెంత?

: సుమారు అరవై వుంటుంది.

అతన్ని సిద్ధార్థుడు చూస్తూండగా సేరు పోయవద్దని చెప్పు.

చిత్తం.

సిద్ధార్థునితో ఎప్పుడేనా కొంతకాలం మాట్లాడావా?

చిత్తం ఆయన హృదయం కనుగోలేకున్నాను. వింత వింత ప్రశ్న లడుగుతుంటారు. ఆలా కొంతసేపు ఆలోచించి 'ఇంతేనా ప్రపంచం, ఇదేనా?' అంటారు. ఒకరోజు 'మన నగరు దాటి ఏముంది?' అన్నారు.

నిజం. ఆనాడు కూడా ఆలాగే. ఆనాడు క్రిములను పట్టుకోబోతున్న కప్పను వెంబడిస్తున్న నాగును తన్నుకుపోతుండే డేగను వేటకాడు పడగొట్టాడు. సిద్ధార్థుడు ఉలికిపడ్డాడు. ఆనాటి సాయంకాలం వరకు ధ్యానంలో లీనమైన ముని లాగు కూర్చున్నాడు తోటలో.

: చిత్తం. దేవదత్తులవారు వేటాడిన పక్షి బాధకు కూడా ఆయన హృదయం కరిగి కన్నీరయింది. మొన్నటి మహోత్సవంలో కూడా ఆయనంతగా పాల్గొనలేదు. ఎప్పుడూ ప్రకృతిలోకి ఆత్రంతో చూస్తుంటారు. పతంజలి ప్రభృతుల గ్రంథా లెప్పుడూ చదువుతూంటారు. అప్పుడప్పుడు ఆయన కన్నులలో కన్నీటితెరలు కప్పివుంటవి.

: ఈ విషాదరేఖలను తుడిచేయగలిగితే ప్రపంచాన్నంతా పాలించే ప్రభువవుతాడన్నారు పండితులు. నిజం. సిద్ధార్థుడి కా లక్షణాలన్నీ వున్నవి. కానీ - ఒక్క బిడ్డ. అతన్ని కాదని నాకేం కావాలి - కానీ - మంత్రీ - వుపాయం?

: ప్రభువులవారు కలవరపడకండి. యవ్వనంలో హృదయం పరిపరి విధాల పరువెత్తుతుంది. క్షణికాలైన పొంగు లెన్నో వస్తూండగలవు.

: సిద్ధార్థుని రాచకార్యాలలో నియోగిస్తామనుకున్నాను. కానీ అది మరింత ప్రమాదకరంగా వుంది. సిద్ధార్థుని హృదయం నవనీతం. సుకుమార హృదయం. రాచకార్యాలకు చిక్కేదురు.

: చిత్తం.

: పండితులవారిని పిలిపించు.

: తమ అభిప్రాయం?

: సిద్ధార్థుని ఈ విరాగపథాన్నుంచి తప్పించే ఉపదేశాలేవేనా చేయిద్దాం.

: అవసరపడకండి. ప్రయోజనంకన్నా ప్రమాద మధికంగా వుంటుందేమో? పండితు రెటుతిరిగీ వైరాగ్యానికి వస్తారు.

: ఇక మార్గం?

: మునివి. ఎట్టి వైరాగ్యభావమేనా మానినీమందహాస శృంఖలాలకు కట్టుబడి పోతుంది. పరిత్యాగసాగరమంతా వనితావీక్షణాలకు యింకిపోతుంది. ప్రపంచాన్ని చేతనంగా చేసి నడిపించే మహాశక్తి స్త్రీ.

: నీ అభిప్రాయం?

: వివాహం ఎందరి జీవిత గ్రంథాలలోనో క్రొత్తపోకడలు కల్పించింది.

: అవును. కానీ యీనాడు సిద్ధార్థు డొక్కడే. నాడు సిద్ధార్థునితో, సిద్ధార్థునిపై మరొక జీవితం అంటగట్టబడుతుంది.

: అది సుఖకరమే.

: నిజమే - అదిగో సిద్ధార్థుడు వస్తున్నాడు. ఇక నాటకం మొదలిడతాం.

: చిత్తం.

: సిద్ధార్థా!

: నాన్నా.

: రా, కూచో. క్రొత్త నటబృందం వచ్చింది. ఈ ప్రదర్శనం వారిదే.

యవనిక కదలిపోతుంది. రంగస్థలం ఆవిష్కరింపబడుతుంది. వెన్నెల వెలుగు. పున్నమచంద్రుడు, తారలు, కలువలు, మల్లెలు మొదలైన పూలు ఎక్కడ చూచినా నవ్వుకొంటున్నవి. చిన్నవెల.

విరికన్నె పాట

శూన్యసుందరి నీలిచెరగులో విసరితిని
తొలితేట నునుపారు చిఱునవ్వువాసనలు
నీబాట వెలిగించెరా,
తారలై
నా గాథ లెరిగించురా॥

పురిటివెన్నెల దోమతెరచాటులోనుండి
చివురుటాకులశయ్య పొగరుకన్నులనెత్తి
నీ కొరకె యున్నానురా,
నీ అడుగు
నీడచలువను కోరిరా॥

వెలుగుమ్రోతల తేనె చినుకు మువ్వల తోడ
కావిరంగురేకు భావరంగములోన
ఆడుతూపాడేనురా,
నీ కెదుట
స్వాగతమ్మిచ్చేనురా॥

* * *

తేటి పాట

ఝుం ఝుం ఝుం ఝుం ఝుం ఝుం
అందీవే మధుపాత్రా అందీవే ఆనందమధువు
వెన్నెలజిగినా సన్ననితీవెల
జిలుగువలువ పయ్యెదముసుగున
ఆడుచునూ పాడుచునూ
అదృశ్యమౌ నీ ఆనందామృతమందీవే
జలజలపారే సెలరంగములో
అలలతెరలలో ఆటాడుచునూ
భావములో రాగములో
పరవశత్వమున చిదిమిన మధువును అందీవే.

* * *

సెల పాట

పారుచుండెద నెపుడు పరువెత్తుచుందు
ఎంతెంతదూరమో చింతింపబోను

చీలిపోయెద మరల చేరిపోయెదను
రాళ్ళగుండ్లనుదాటి సాగిపోయెదను
యవ్వనానంద నిర్ఝరిణి నేను
ప్రకృతిపయ్యెదలోని ప్రణయామృతమును.

* * *

అందరు

మాకున్నదానందమే మేమిచ్చుటానందమే
తెలిసినది ఆనందమే తెలిపేది ఆనందమే ॥మా॥

మాసిపోతుంటాము మారిపోతుంటాము
మరలివస్తుంటాము తరలిపోతుంటాము ॥మా॥

మా బ్రతుకు ఆనందమే మా లోక మానందమే
మా కావి ఆనందమే మా తావి ఆనందమే ॥మా॥

* * *

రాధాకృష్ణ నృత్యం

కృ:— రాధికా!
రా:— ప్రేమికా!
కృ:— రాధికా!
కృ:— ప్రేమికా!

కృ:— వలపులసరసికి పదవే పోదము
ప్రణయమధువులను గ్రోలుదము
రాధికా

రా:— ప్రేమికా!
కృ:— రాధికా!

రా:— పరుగిడరా వడివడిగా
కౌగిలివెన్నల జిలుకుమురా
ప్రేమికా!—ప్రేమికా!

కృ:— ప్రేమసరసి అదో కనుచాయల
పూవుబాన్పు లవిగో
జిలిబిలినడలా చెలువము గులుకా

రా:— కిలకిలనుడులా వలపులు జిలుకా
రావో

కృ:— రావో రావో రావో రావో

తెర



# మూడవ రంగం

రాజోద్యానవనం. తోటమాలి, అతని మనుమరాలు.

: ఈ పూలన్నీ ఏం చేస్తాం తాతా?
: మహారాజులవారి కర్పిస్తామమ్మా.
: ప్రతిరోజూ యిన్ని పూలూ మహారాజుల కివ్వాల తాతా?
: ఔను తల్లీ! ఈ తోట వారిదేకదా అమ్మా.
: మరి - మరి, ఇన్ని పూలు ఏంచేస్తారు? ఇవన్నీ ఏమవుతవి?
: నడిచేదారంతా పూలే కదమ్మా వారికి ఈ రోజు యిచ్చిన పూలు వాడిపోతవి. రేపు క్రొత్తపూలు
: నగరిలో కూడా పూలు వాడిపోతాయా తాతా?
: పిచ్చితల్లీ! పూలు నగరిలోనైనా నడివీధిలోనైనా వాడిపోక తప్పదమ్మా.
: ఇంత బాగుందే యీ పువ్వు, ఎందుకు వాడిపోవాలి? వాడిపోకుండా అలాగే వుంటే ఎంత హాయిగా వుంటదు?
: ఈ పువ్వేమిటమ్మా? ఈలా ఎన్ని పూలు రాలిపోయాయి, ఎన్ని మొగ్గలు తేరి పూలుగా వికసించినవి. ఓ! నా కళ్ళముందే ఎన్నో లెక్కలేనన్ని. అది కాలచక్రం తల్లీ - దాన్ని ఆపేవారెవరు?
: అదేంటి తాతా, నువ్వేమేమో అంటావు. నాకేమీ అర్థం కాలేదు.
: వెఱ్ఱితల్లీ, నీ కర్థంకాదులేమ్మా. పూలు కోయమ్మా త్వరగా - పొద్దయింది.
: నాకు ఏడుపొస్తూంది తాతా.
: ఎందుకమ్మా?
: మరి - మరి యీ పూలు?
: చిట్టితల్లీ, ఈలా చూడు. పాట పాడవూ? నేనూ పాడతా నాతో పాడవూ?
: కానీ, పాడు తాతా, పాటలు వాడిపోవు కదూ?
: అవును తల్లీ ——

ఈ పసిలతలో యీ చిరువిరిలో
ఈ కసుగాయలో ఆశలు నింపెదవేలా?

ఆశలు నిండిన అరనిమిషానికే
వాడిపొమ్మని శాసించెదవేలా?
ఇన్ని లతలను ఇన్ని పూలను
కన్నులముందే కాలరాచెదవే
ఇదె నీ క్రీడా! ఇదె నీ లీలా!
ఇదె నీ కానందముగా!

రాజకుమారుల ప్రవేశం.

: ఆయనేనా తాతా?
: అవునమ్మా, పూలాయనకే. సమర్పించుకొందాంరా.
: ఈ పూలన్నీ ఎవరికి?
: ప్రభువుల వారికే.
: ప్రతిరోజు చెట్లనుంచి యిన్ని పూలు కోసేస్తారా?
: చిత్తం, ప్రభువు ఆజ్ఞ.
: ఈలా రా.
: బుద్ధి!
:, ఏందుకాలా దూరంగా విలుస్తావు? దగ్గర రా.
: బుద్ధి. ప్రభువులు.
: అయితే?
: నేను సేవకుణ్ణి.
: నువ్వు సేవకుడివా?
: చిత్తం.
: నువ్వేకదూ యీ తోటను పెంచింది? నువ్వేకదూ ప్రతిరోజూ యీ తోటకు నీళ్ళు పోసేది? నువ్వేకదూ యీ తోటకు కాపలా వుండేది?
: చిత్తం, ప్రభువుల దయ.
: మరి, యీ పూలు నా కెందుకు?
: ప్రభువులవారి పాదపూజకు - నగరి నలంకరించటానికి - శయ్యలను కూర్చటానికి.
: నీకు నగరిలేదూ? నీ కలంకారం వద్దూ? నీవు తీసుకుపోరాదూ?
: ప్రభువుల పాదసేవకుణ్ణి.

: మాది చిన్నగుడిసె, ఎప్పుడూ కురుస్తూంటుంది.
: శ్ః ఊరుక్కోండమ్మా - పసితనం, మన్నించాలి.
: ఈలా రామ్మా - రానీ ఫరవాలేదు. అయితే యీ నగరి కవతల ఏముంది?
: ఇళ్ళు.
: నగరులు లేవు?
: చిత్తం.
: ఆ కుప్ప ఏమిటి?
: ఎండుటాకులు.
: ఎందుకలా మూల తోసిపున్నారు?
: అవి ఎండి రాలిపోయినవి. అవి మహారాజులవారి పుద్యానవనానికి అందం రాదు.
: ఏంచేస్తారు వాటిని?
: దూరంగా పారేస్తాం?
: నిజంగా?
: చిత్తం.
: అదిగో, ఓ పండు రాలిపోయిందే!
: చిత్తం.
: ఆలా ఎందుకు రాలిపోవాలి?
: బాగా పండితే రాలిపోతవి.
: అన్నీ ఆలాగేనా?
: కొన్ని పండి రాలిపోతవి. కొన్ని కుళ్ళిపోతవి. కొన్ని పక్షులు కొట్టిపడేస్తవి. కొన్ని ప్రజలు కోసేస్తారు. కొన్ని పిందెలుగానే రాలిపోతవి.
: ఆ పండు నీలాతే.
: తల్లీ! నాయనా!..........
: తాత ఏమో అరుస్తున్నాడు - వణికిపోతున్నాడు - అదో కూలిపోయాడు.
: ఆఁ ___
: తాతా - తాతా!
: ఎందుకు పలుకడు?
: పలుకడం లేదే - తాతా - తాతా!
: ఎవరు నువ్వు?

: మృత్యువును.

: ఎందుకొచ్చావు?

: ప్రపంచంలో ప్రతిజీవి నా వశం కావలసిందే. నా దగ్గర చేరటమే మరణ మంటారు. ఈ ముసలికిప్పుడిగిన అవస్థ అదే. అతడిక యీ లోకాన లేడు, వట్టి శరీరమే మిగిలివుంది.

: ఇతని నేంచేస్తావు?

: అతని శరీరాన్ని కాల్చేస్తారు - మన్నుమంటిలో కలిసిపోతుంది.

: ఇతడు మరల బ్రతుకడా?

: ఇతడంటే యీ శరీరం కాదు. ఇతని ఆత్మ మరల వేరే రూపంతో పుడుతుంది.

: నీ వెక్కడుంటావు?

: నా లోకముంది.

: నేనూ వస్తా, చూపెడతావా?

: అది అసాధ్యం.

: ఇంతసేపెవరితో మాటాడుతున్నారు? తాత ఏం పలకడు?

: నీ తాత మరణించాడట.

: నిజంగా, తాతా - తాతా!

: ఏడవకు! దేవదత్తా - దేవదత్తా!

: ఏం?

: ఈ తోటమాలి మరణించాడట.

: అవును - ఎవరక్కడ?

: ఎందుకు?

: ఇది యిక్కడుండకూడదు

: 'ఇది' అంటావేం.

: మరణించినవాని శరీరం శవం. దాన్ని వుంచరాదు.

: ఏం?

: దుర్వాసన.

: దుర్వాసనా? ఈతడు కోసియిచ్చిన పూలతో నగరంతా ఘమఘమ లాడింది. నా పడకమీద చల్లుకున్నాను. నేనూ యశోధర పడుకొని హాయిగా నిద్రించాం. ఇతడు పెంచిన చెట్లన్నీ ఎంతో ఆనందదాయకంగా జీవం

వుట్టిపడుతూ మన జీవరక్తంలోకి ఏవో కలల కెరటాలు పంపు
తున్నవి.

: అవును. ఆ పూలు కూడా నీవు నిద్ర లేచిందే తీసిపారేస్తారు. వేరే పూలు చల్లుతారు. అవి వాడితే వేరే పూలు....

: నిజంగా?

: అవును.

: నే చూడలేదే.

: అన్నీ ఆలాగే. కాలంతీరితే కర్మానుగుణంగా నశించాల్సినవే. వచ్చినచోటే చేరుకుంటవి.

: నేను?

: నీవూ!

: యశోధర?

: ఆమె కూడా!

: యశోధర కూడా???

: తీసికెళ్ళండి. అమ్మాయీ, వెళ్ళు - వెళ్ళమ్మా - సిద్ధార్థా! ప్రపంచంలో అన్నీ నశించాల్సినవే. తప్పవు!

: ఆవేవో మూల్గులు వినబడుతున్నవి.

: అవును, కుష్ఠురోగి.

: అత దేలాగుంటాడు? రమ్మను.

: అతన్ని దగ్గర చేర్చరాదు.

: ఏం?

: దుర్వాసన.

: శవానికి దుర్వాసనే. అతనికీ దుర్వాసనే. ఆలాకాదు. అతన్ని పిలు-

: ఏయ్ - యీాలా రా.

: 'ఏయ్' అంటావేం? పేరు లేదూ?

: వాడు బిచ్చగాడు.

: అత డెందుకాలాగున్నాడు?

: అది ఒక భయంకర రోగం.

: ఎందుకతడి కా రోగం?

: కర్మ.

: నువ్వెవరు?

: బిచ్చగాణ్ణి బాబూ.

: అంటే మానవుడు కాదూ?

: అలాగేనండి. మొదట నేనూ బాగుండేవాణ్ణండి. కర్మవల్ల రోగం వచ్చి బ్రతకలేక యీలా బిచ్చమెత్తాల్సి వచ్చింది.

: అసలు నీ వెవరు?

: రైతుని బాబూ. దున్ని, పండించి, బాబుగారికి చాలారోజులు పన్ను కూడా కట్టి వున్నానండి.

: నాన్నకు నువ్వు తెలుసా?

: పన్ను కట్టనప్పు డొకసారి పిలిపించారండి. దర్శించుకొన్నానండి. అప్పుడు బావున్నానండి.

: మధ్య వచ్చిందా?

: చిత్తం. అప్పుడు మారాజులమీద ఆళ్ళు దండెత్తి వచ్చారండి. పెద్ద యుద్ధమైంది. మేమంతా జగడమేశామండి. ఆ యుద్ధంలో నా ఒకే కొడుకు పోయాడండి. ఆడుంటే ___

: నీ కీ రోగ మెందుకు వచ్చింది?

: కర్మ బాబూ.

: దేవదత్తా, అందరికీ యీ రోగం వస్తుందా?

: అవును. సరే, వెళ్ళవోయ్.

: వెళ్ళమంటావేం? నాన్న దగ్గరకు పిల్చుకెళ్తాను.

: సిద్ధార్థా, నీకు వెఱ్ఱెత్తింది. వాడు నగరులోకి రావీల్లేదు.

: ఏం?

: అది అలా, వాడి కర్మ.

: సరే, నువ్వెళ్ళు. నాన్నను రమ్మంటావా?

: నీకు మతిపోయింది.

: మారాజుల వారొస్తారు. ఎళ్తానండి.

: ఏం ఎందు కెళ్ళాలి?

: మారాజులవారి యెదటపడటమే! బుద్ధి బాబూ బుద్ధి.

: ఎందుకాలా భయపడతావు? నాన్నగారొస్తున్నారు.

: సిద్ధార్థా.

: నాన్నా. అతన్ని చూచారా నాన్నా?
: ఎవర్ని?
: ఆ కుష్ఠురోగిని.
: ఇక్కడి కెందుకు వచ్చాడు?
: నే రమ్మన్నాను. మీరు చూడలేదూ?
: అతనితో ఏం ప్రమేయం నాయనా? రా, పోదాం.
: అలాకాదు నాన్నా. అతన్ని మీ రెరుగరు? ఆ కుష్ఠురోగిని ——
: ఎందరో కుష్ఠురోగులు.
: నిజంగా? - పోనీ, మీకు పన్నుకట్టే అతన్ని. పొలం దున్ని. పండించి——
: ఎందరో అలాంటివారు.
: యుద్ధంలో మీకోసం పోరాడిన అతణ్ణి?
: అలా పోరాడినవా రెందరో.
: యుద్ధంలో తన కొడుకును పోగొట్టుకొన్న అతణ్ణి?
: మరణించినవా రెందరో.
: అదేంటి నాన్నా ఎందరో, ఎందరో అంటున్నారు? ఈ వూరికంతా నగరు యిదొకటే; ఈ రాజ్యానికంతా రాజు మీ రొక్కరే; ఈ పూలంతా మన నగరు కొక్కదానికే! ఈ పన్నంతా మీకే; కానీ, ఎందరో పన్ను కట్టేవారు, ఎందరో యోధులు, ఎందరో రోగులు, ఎందరో రైతులు, ఎందరో మరణించేవారు! ఏంటి నాన్నా యిది?
: ఊర్కే కలతపెట్టుకోకు. రా, నగరులోకి పోదాం, రా.
: ఇంకోటి నాన్నా. ఇంతకూ మీరూ, నేను, యశోధర. అందరూ మరణించా లటగా! అదెంచేత?
: ఇవన్నీ ఎవరు చెప్పారు? రా నాయనా, పోదాం.
: అంతా కర్మట కర్మ! గాలిలో రొద పుట్టింది. పువ్వులలో నలుపు కమ్మింది. చెట్లు ఊగిపోతున్నవి. నగరులోకి పోతే యివేవీ తాకవు కదు?
: ఔను నాయనా! ఏదో గాలివాన చెలరేగుతూంది. ఆ దూరపుకొండల్లోంచి దాని అడుగుల చప్పుడు వినపడుతూంది. అంధకారం బాటతీరుస్తూ ముందు నడచి వస్తూంది. పోదాం, రా.



# నాలుగవ రంగం

రాజు: మంత్రి.

: అంతా ధ్వంసమైంది దేవదత్తా, నా ముద్దుబిడ్డకు వైరాగ్యాన్ని కల్పించి వనాంతరాల్లోకి రాజ్యభ్రష్టుని చేసి తరిమేయాలని నీ ఆశా? సిద్ధార్థుడు నీకేం చేశాడు?

మంత్రి ప్రవేశం.

: మంత్రీ!

: ప్రభూ!

: అంతా నిరుపయోగమైంది.

: ఏంటి ప్రభూ?

: సిద్ధార్థుని జీవితంలో నూతన ప్రకరణం మొదలిడలేదు. వైరాగ్యం వేళ్ళు బారిపోతూంది. ప్రపంచజీవిత రహస్యాలకోసం వెతుకుతూ తారాడుతూన్న సిద్ధార్థుని కన్నులలోని విషాద తిమిరాలు నా గుండెలను బాకులలా చీలుస్తున్నవి. భూమ్యాకాశముల దవ్వు కొలతలేసి అలసిపోయి మూతపడ్డ అతని కన్నుల కొనల నుండి రాలే కన్నీటిచుక్కలు నా జీవరక్తాన్ని గడ్డకట్టించే కఠోర పాషాణగుళికలుగా ఉన్నవి. మంత్రీ!

: ప్రభూ!

: నా సర్వస్వం సమర్పిస్తా. నా ముద్దులబిడ్డను కాపాడుకోవాలి మంత్రీ! ఎందరు పండితులు, ఎందరు కవులు, ఎందరు కళాకోవిదులు-ఎందరు మంత్రవేత్తలు - పిలు, అందరినీ పిలు. నా ఏకైక పుత్రుని రక్షింప మార్గం చెబుతారేమో!

: ప్రభూ! వృథాకలవరపాటు! మన్నించాలి. రాకుమారులవారి జాతకం అమోఘం. ఎలాగైనా ప్రపంచ విఖ్యాతితో పూజ్యులవుతారు.

: మంత్రీ! నారచీరలతో నా బిడ్డ వనాంతరాల్లోకి నడుస్తాడు. శుద్ధోదనుని హృదయం వ్రక్కలవుతుంది. నగరులో వెలుగు ఆరిపోతుంది.

: హృదయం ప్రక్కలై ఆత్మ ఆవిష్కరింపబడుతుందేమో. నగరులోని వెలుగు ఆరి ప్రపంచానికంతా అఖండజ్యోతి ప్రకాశిస్తుందేమో!
: ఏమో, ఏమో, ఎవరు చూచారు? ఏం సాధిస్తాడో? కానీ....కానీ, ఇది మాత్రం నిజం - సిద్ధార్థుడు ఎముకలగూడవుతాడు, ఆ పసిడిబుగ్గల లోని పాలంతా యింకిపోయి. రక్తానికి రక్తిమ పోయి వైల్యమవ్వు తుంది. యశోధర ...మంత్రీ!
: ప్రభూ!
: ఆనాడు అరివీరులను కోటగోడలుదాటి రానీక నిలిపిన వీరులు, కొండలను దొర్లించి మహాసౌధాలుగా తీర్చిన శిల్పులు, నిష్ఠురనిష్ఠాగరిష్ఠులై బ్రహ్మతేజోవిరాజితులై, కేవల అరుణావలోకన మాత్రాన ఇహపరా లను సైతం బూదిచేయ శక్తిగల్గిన ఆ బ్రాహ్మణులు, శిలలకు రూపమే గాక ప్రాణం కూడా పోసి స్థాపింప గలిగిన ఆ పండితులు - ఇప్పు డెక్కడ? ఎక్కడ? నా సిద్ధార్థుని కాపాడటాని కెవరూ రారా? ఎవరి వలనా కాదా? మంత్రీ!
: కొంచం శాంతించండి.
: అలాకాదు, మంత్రీ! నా సిద్ధార్థునికి ప్రత్యేక ప్రపంచం సృష్టించు. ఆ పొలి మేరలో ఎక్కడా నిట్టూర్పు, బాధ, ముదిమి, వ్యాధి మృత్యువు కనిపించ కూడదు. ప్రపంచంలో ఎక్కడెక్కడ సౌందర్యం, సౌకుమార్యం, యవ్వనం, సంగీతం వుందో అంతా ఆ ప్రపంచంలో తెచ్చి నింపు. నా సర్వస్వం యిచ్చేస్తా. లోకంలోని ఆనందాన్నంతా అక్కడే తాండ వించేటట్లు చేయి. ఎండుటాకులు కనబడకూడదు - పూలు వాడిపోయే దృశ్యం సిద్ధార్థుని కళ్ళ పడకూడదు - ఒక్క నెరసిన వెంట్రుక లోన ప్రవేశింపకూడదు. వానలు లేకపోనీ సెల లింకరాదు. ఎప్పుడూ సంగీతమే, ఎప్పుడూ నృత్యమే - ఎప్పుడూ ఆనందమే. లేళ్ళ కన్ను లన్నీ అక్కడే వుండాలి. ఆ కన్నుల పోటీచేసే యవ్వనాంగనల వీక్షణచంద్రిక లక్కడే వెలగాలి. కానీ - త్వరగా - పో ——
: చిత్తం.
: విఖ్యాతశిల్పులను, చిత్రకారులను పిలిపించు. వైరాగ్యవాసనలు చిమ్మే ఒక్క చిత్రంకూడా వుండకూడదు. అంతా సౌందర్యం, భోగం, ఆనందం.

: చిత్తం.

: ఆ సౌధానికొక కంచుద్వారాన్ని నిర్మించు. అందులో ఏడుద్వారాలు. అక్కడ యిద్దరు అప్రమత్తులయిన యోధులను కాపలా వుంచు.

: ఆజ్ఞ.

: సృష్టికి ప్రతిసృష్టి చేశాడు విశ్వామిత్రుడు. ఇది మాత్రం ఎందుకు కాకూడదు? అది తపోబలమైతే యిది ప్రేమబలం!



# అయిదవ రంగం

నూతన భవనం, విశ్రామవనం. సిద్ధార్థుడు, యశోధర,
వివిధ వాద్యాలతో అంగనలు.
యశోధర సిద్ధార్థుని కొనగోటితో తన పెదవి నొక్కుకొంటూ,

: ప్రియా! అవిగో చిలుక గోరువంకలు.

: యశోధర చెక్కిళ్ళపై ఎరుపు పండనుకొంటూవున్నవి కాబోలు.

: అవును. పండే - వాటి కందదు పాపం.

: అమ్మో..... . .

రాజు ప్రవేశం.

ఇరువురు వందనం చేశారు.

: శుభమస్తు - సిద్ధార్థా - ఏలాగుందీ భవనం?

: చాలా అందంగా వుంది నాన్నా - హాయిగా వుంది యిక్కడుంటే - మీ కోడలి సంతోషం ___

: అవునామ్మా ___

: [సిగ్గు]

సంతోషంతో వెళ్ళాడు రాజు.

: నళినీ - రావే ___

యశోధర, నళిని, నాట్యం చేస్తున్నారు. నాట్యం మధ్య యశోధర సిద్ధార్థుని పక్కకు వచ్చి గిలిగింతలు పెట్టి అతని శిరం తన వక్షస్థలంపై ఆనించుకొన్నది. నళిని మాత్రం నాట్యం చేస్తూంది. అలాగే చూస్తూ సిద్ధార్థుడు యశోధర ఒడిలో విశ్రమించాడు.

: శ్!

నాట్యం, సంగీతం, ఆగిపోయింది. లంపరూ వెళ్ళారు. సిద్ధార్థునికి చెమటలు పోస్తున్నవి. యశోధర విసురుతూ కూర్చుంది. ఒక్కనిమిషం నిశ్శబ్దం. మరల ___

జంత్రగాండ్రు లేరు గాని వాద్యాలు మ్రోగుతున్నవి. కాళ్లు కనబడవు గానీ నాట్యంలో గజ్జెల సడి వినపడుతూంది. ఎవరూ లేరుగానీ పాట వినపడుతూంది.

మునుపటి రాగమే - తాళమే - నాట్యమే - కానీ పాట వేరు.

కామినీ కాముకుడు కలిసీ
పొరలిపోయే కెంపుదొన్నెను
పెదవి పెదవికి చేర్చబోతే
అంతలోగా దొన్నె ఎటకో
ఎగిరిపోయిందీ!

రిచ్చపడి శిరసెత్తి చూస్తే
జేగురించిన నెల హసించీ
ధూళిధూళిని గాలిగాలిని
ఇంతలోగా ముద్దులేలని
వెక్కిరించిందీ!

సిద్ధార్థ ఉలికిపడి లేచాడు.

: నళిని - నళిని - నళిని ఎక్కడ?
: ఏం ప్రియా? ఎందుకలా ఉలిక్కిపడ్డారు? ఏం? ఏమైంది?
: నళిని? అబ్బ, ఏం వికారం? ఎందుకలా జుట్టు విరబోసుకుంది!
ఎందుకలా ఏడ్చింది? ఇన్నిరోజులుగా ఎప్పుడూ యింత భయంకర నృత్యం చేయలేదే నళిని? ఆ చూపులు - అడుగడుగునకు భూమి కంపించిపోయింది. అదిగో విను - యింకా వినపడుతుందా పాట.
: ఏ పాట?
: నళిని పాడిన పాట.
: ఏమని?
: జీవితమంతా కన్నీటి కెరటాలు - నిట్టూర్పు గాడ్పులు - క్షోభ - సుడి గుండాలు - తుపాను - వినాశనం - అంతేనట.
: నళిని పాడిన పాట అదికాదే - నే పాడి చూపుతా వినండి.
: పాడు. మరల వినాలనిపిస్తూంది. పాడు యశోధరా.

చిరుచిరుమువ్వల నవ్వురువ్వులో
పండువెన్నెలల అలలో
మునుగుతీసి నిరంకుశకేళిలో
విసుగువాసి వసంతపు కలలో

కలిసి ఆడుదమా
ఆమని
సొలసిపాడుదమా!

అందము ఒకటే ఆనందము ఒకటే
ఇదే జీవితమ్మి నేడే
ప్రపంచమిది ఆ స్వర్గమ్మేదో
మన మమర్త్యుల మీనాడే
కౌగిలింతసొలసి
విడువని
సొలింతలో మరచీ!

అదికాదు యశోధరా. నళిని పాడిన పాట అదికాదు నే విన్నాను.

ఎప్పుడు విన్నారు? కలలోనా?

కల ఒక క్షణమైతే జీవితం మరొక క్షణం. అంతే. నళిని పాడిన పాటలో సత్యముంది. అదే సత్యం. నీవు పాడిన పాట కల్పితం. మాయ! అవును - యశోధరా! నన్ను మోసం చేస్తున్నావా?

ప్రభూ!

ఇదో వస్తున్నా. మీ పిలుపు విన్నాను. నళినీ! నీ సంజ్ఞ చూచాను, వస్తున్నా.

ఎక్కడికి?

నళిని ఎక్కడికో రమ్మని సంజ్ఞ చేసింది.

నన్ను వదలి వెళ్తారా?

యశోధరా!

అదిగో చూడండి - ఆ మాలతీలత ఎలా విరబూచి వుందో - ఏలా పిల్ల గాలుల చక్కిలిగింతలకు కిలకిల నవ్వుకొంటూందో, ఆ లేళ్ళ గుంపులు ఏలా రాగిణీ హృదయంలా గంతులేస్తున్నాయో. చంద్రికల బాకులతో హృదయాన్ని చీల్చి ప్రేమరుధిరం సమర్పిస్తూన్న ఆ మావిచివుళ్ళు చూడండి. వాటిని లాలిస్తూ పాడుతూన్న కోకిల - వనానికంతా ప్రేమసందేశాన్ని సౌందర్య సౌరభాన్ని, ఆనంద మాధురిని, అందిస్తూంది తన పాటలో. లతల ఆనందమేగా పూలు

ఎరుపులో పొంగేది? ఆ చివురుటాకుల ప్రేమేగా కోకిల కూతలో ప్రతిధ్వనించేది?

: ప్రియా! యిలా చూడు.

: అబ్బ వేడిగా వుంది. ఫాలభాగం కాలిపోతూంది. విశ్రాంతి తీసుకోండి.

: అదికాదు. శివుడు మూడవ కన్ను తెరచాడు. అందువల్లే ఆ వేడి.

: అదిగో ఆ మురళీలోయిదు. నేను వట్టి మురళి. అశక్తను. మీ ప్రేమ వాయువీచికలు నాలో వూదండి. మధురగానం వెలువడుతుంది. క్రొత్త క్రొత్త పాట లాలపిస్తాను. మీకే ప్రకృతిని, సౌందర్యాన్ని, ఆనందాన్ని బానిస చేస్తాను.

: కన్నీరు యింకిపోతుందా? నిట్టూర్పు నిలిచిపోతుందా?

: కృష్ణుని సందేశమే అది.

: ఆలాగైతే నళిని సందేశం అబద్ధమేనా? ఈ ప్రపంచం నే నిప్పుడు చూచే లాగే వుందా? అంతా ఆనందమయమేనా?

యశోధర చేతులు తట్టింది. మరల నటీబృందం ప్రవేశం.

: యశోధరా! ఏదో అగోచరమైన మాధుర్యంతో నింపిన గాజు పాత్రలలా గున్నారు. నిజంగా యశోధరా. పూ తీవెలపై నుండి అవ్యక్త మధుర స్వరములతో ఒకరినొకరు పిలచుకొంటూ ఎగిరిపోయే ముద్దుపిట్టలలా గున్నారు. ఎంత సౌందర్యపిపాసి సృష్టికర్త! భయంకర కాముకునిలా గున్నాడు. ఆ పెదవులలో, ఆ ముద్దు చేతులలో, ఆ కనుకొనలలో ఎప్పుడూ రుధిర స్రవంతులు చిమ్ముతుంటాడు. కమలా - యిలా రా - లేళ్ళ కొమ్ముల రాపిడిపడ్డ పూలగుత్తులలాగు వీణా తంత్రులు మీటి నీ వేళ్ళు ఎర్రబారినవి - కాయలు కాచినవి కూడా. అయినా పూవు రాలి కాయలు కలిగితేనే లత కానందం. కాసీ - ఏదీ పాడు.

పాట, నృత్యం.

చాలు! - యశోధరా! ఆనాడు ఈలాగే చంద్రుని ముందు నడచిపోయే మబ్బులలాగు, భూమాత కన్న స్వప్నాలలాగు. ప్రకృతి అల్లిన సాలెగూండ్లలాగు, సముద్రం విసరిన తుంపరలలాగు, ఎందరో

రాచకన్నెలు నాముందు నాట్యంచేస్తూ పోయారు. ఎందుచేతనో నీవాలా కదలివస్తుంటే నీ కళ్ళల్లోకి చూడాలనిపించింది.

: ప్రియా! అది నా సుకృతం.

: ఆ విల్లును వంచింది నీ ప్రేమబలమే నని నీవు ఒకసారి చెప్పావు కదూ? అవును. ఆ గుఱ్ఱాన్ని సాధించింది నీ చూపుల కళ్ళెమే. ప్రియా! చీకటిపడుతూంది.

: లేదు, వెన్నెల వస్తూంది.



# ఆరవ రంగం

రాజు: మంత్రి

: కలలు కల్లలంటారు.

: పసిపిల్లల నోదార్చ అలా చెప్పు. ఆనాడు మాయ కన్నకలకు అర్థం చెప్పారు పండితులు. నిజమైంది. ఈనాడు నా కలకూ అర్థముండాలి. అది జరిగి తీరాలి. జరిగే ముందే దాని అర్థం తెలుసుకోవాలి. పండితులను ___

: పండితుల వాక్కుల విశ్వసించాలని చెప్ప ధైర్యం చాలదు. కానీ ___

: కానీ లేదు - ఏమీలేదు. నీవలా చెప్పినా విశ్వసించటానికి నేను సంసిద్ధుణ్ణి. పండితులపై నాకు పూర్ణవిశ్వాసముంది.

: కొన్ని కాకతాళీయాలను చూచి - సిద్ధాంతాలు ___

: మంత్రీ! కాకతాళీయమూ ఒక సిద్ధాంతమే!

: చిత్తం.

: పండితులను పిలిపించు.

: చిత్తం.

: భయంకర స్వప్నాలు యీలా నన్ను వెన్నాడటం ఎందుకు? ప్రశాంత నిశాంతాలను విషవంతాలు చేస్తున్నవి. రేయి నా గుండె పొంగి పొంగి పగిలిపోతుందేమో అనిపించింది. ఏడు స్వప్నాలు, ఏడు పిడుగులు. పోనీ, యీ స్వప్నాల కాలమంతా యీలా నన్ను వెంటాడటంలోనే గడచిపోనీ. నా నిశివేళలు దుర్భరాలైనా ఫరవా లేదు. కార్యరూపం దాల్చటానికి మాత్ర మీ కలలకు కాలం చిక్కకుంటే చాలు. నా సిద్ధార్థుడు రక్షితుడవుతాడు .......ఏం?

: పండితులు వచ్చారు.

: రానీ .......

దయచేయండి. రేయి ఏడు కలలు కన్నాను.
వాటి యథార్థం తెలుసుకోవాలని.
సెలవీండి.

: రేయి ఏ వేళకు?

: తెల్లవారుజామున.

: ఏ మా స్వప్నాలు?

: మొదటిది: సూర్యబింబాంతోటి ఇంద్ర పతాకం అఖండ జ్యోతిస్స్వరూపమై వెలుగుతూంది. గొప్ప గాలి వీచింది. పతాకం నేల తాకింది. ఇంతలో కొందరు వచ్చి ఆ పతాకాన్ని పునరుద్ధరించి తూర్పునకు నడిచి పోయారు. రెండవది: వెండి దంతాలతో పది మదగజములు వస్తున్నవి. ముమ్ముందు వచ్చే ఏనుగుపై సిద్ధార్థుడున్నాడు. మూడవ స్వప్నం: ధవళధూమ పుంజములు వెదల్చగక్కుతూన్న నిగనిగలాడే నాలుగు గుఱ్ఱాలతోటి రథంతో సిద్ధార్థు దూరేగి వస్తున్నాడు. నాల్గవది: ఒక పెద్ద చక్రం పసిడినేమితో, రత్నాలు చెక్కిన రేకులతో తిరుగుతూంది. పట్టణానికీ, కొండకు మధ్య ఓ పెద్ద ఢంకా మ్రోగిస్తున్నాడు రాకుమారుడు; ఇది అయిదవది. ఓ పెద్ద గోపురం ఆకాశాన్నంటుతూంది. దానిపై నుంచి సిద్ధార్థుడిరుకేలతో అమూల్య రత్నాలు వెదజల్లుతూంటే ప్రజలందరూ మూగి ఏరుకొంటున్నారు; ఇది ఆరవది. ఇక ఏడవ కల: ఆర్గు రేడుస్తూ వెళ్తున్నారు. ఏమంటారు? మీరు?

: మహారాజా నా కేమీ గోచరించటంలేదు.

: సరి. మీరు?

: మహాప్రభూ? ఏమీ చెప్పలేకున్నాను.

: మరి మీరు?

: నాకూ ఏమీ అర్థంకావటంలేదు.

: సరి. అందరూ వెళ్ళండి - వెళ్ళండి. ఏమీ తెలియటంలేదు; ఏమీ చెప్పలేకున్నాను. అందరూ పండితులే, శ్రేయోభిలాషులే, ఏం వుపయోగం? కూలిపోనున్న శాక్యవంశ కులాన్ని నిలబెట్టలేరు. మంత్రీ! మంత్రీ!

: ప్రభూ! మనవి.

: ఏం?

: ద్వారంవద్ద తమ దర్శనానికై ఒక తపస్వి వేచియున్నారు.

: రమ్మను.

: దయచేయండి.

: రాజా నీ కలల కర్థం చెబుతాను విను. ప్రథమం పాతమతాలన్నీ పోయి కొత్తమతం వెలుగబోతుందని సూచిస్తుంది. రెండవది దశవిధ జ్ఞానాలలో ప్రధానమైన సత్యాన్ని నీ కుమారుడు నడిపిస్తాడని. మూడవది నిర్వివాదాలైన నాల్గు సత్యథాలతో నీ కుమారుడు చీకటి నుండి వెలుపడిపిస్తాడని. నాల్గవది సద్ధర్మచక్రం నీ సిద్ధార్థుడు త్రిప్పుతాడని. ఐదవది నీ కుమారుడు ప్రపంచానికి చాటబోయే బోధ. ఆ గోపురం బుద్ధగీతి. అందుండి వెదజల్లబడ్డవి అమూల్య సూత్రాలు. ఏడవది షడ్గురువులు. వారిని నీ కుమారుడు జయిస్తాడు. తెలిసిందా?

: ఇంతకూ సిద్ధార్థుడు విరాగికాక తప్పదా? ఉపాయం లేదా?

: లలాటలిఖితం తప్పించాలనుకోడం వెఱ్ఱికాదూ? సెలవు.

: వెఱ్ఱికాదూ? కాదు! నా ప్రేమంతా వెచ్చిస్తాను. మంత్రీ?

: ఆజ్ఞ.

: సిద్ధార్థుని మందిరంలో ఒకటే ఉత్సవాలు - నాట్యప్రదర్శనములు - విందులు - క్రొత్తక్రొత్తవారిని పిలిపించు. కానీ - స్వర్గం చేసే విశ్రామవనాన్ని.

: చిత్తం.

: ఇదిగో, ఆ కవాటం దగ్గర - ఆ కంచుద్వారంవద్ద ఎందరున్నారు కావలా?

: ఇద్దరు.

: మరి యిద్దర్ని పంపు జాగ్రత్త అని చెప్పు. సిద్ధార్థుడైనా సరే నాకు తెలియక పోవీలులేదు. అజాగ్రత్త ప్రాణాలను తింటుంది.

: చిత్తం.

: లలాటలిఖితం తప్పించాలనుకోపటం వెఱ్ఱికాదూ? వెఱ్ఱి! వెఱ్ఱి! ప్రతిదీ లలాటలిఖితం అయితే, ప్రతిదీ తప్పించటానికి వీలులేకపోతే, అన్నిటికీ దేవతలు 'మేము మే'మని ముందు వచ్చేట్లయితే, మానవుడి కి దౌర్భాగ్యపు మేధ ఎందుకివ్వాలి? ఎందుకు? కాల్పనా? ఈ మంత్రాలు, శాస్త్రాలూ, వైద్యాలు. అన్నీ ఎందుకు? మానవుడు కేవలం దేవుడిచేతి కీలుబొమ్మ అయిపోయాడా? ఎంత దౌర్భాగ్యపు బ్రతుకు!

పురుష ప్రయత్నం కొంత వుండాలట. కొన్ని మన చేతుల్లో వున్నవి. చేతగానివన్ని కర్మ! ఇంతేనా?........

మానవుడు తన మేధాశక్తినంతా ఉపయోగించి దేవతలపై విప్లవం తేరాడూ? తెస్తాడు, తప్పక తెస్తాడు.
ఎన్నాళ్ళిలా ఊరోర్చగలడు? యెన్నాళ్ళిలా కర్మశృంఖలాలతో కట్టుబడి వుండగలడు? పశువుకన్నా అధమంగా తన్ను చూస్తుండే దేవతల్ని ఎన్ని దినాలు సహించగలడు? మేధనీ యుక్తాయుక్త విచక్షణనూ ఇచ్చి ఇలా బానిసగా వుంచుకోడం వచ్చి అవమానం! సిగ్గు! — .... ....

ఏదో ధ్వని

: శుద్ధోదనా!
: ఎవరు?
: శుద్ధోదనా! సిద్ధార్థుడు శాక్య సింహాసనాన్ని అధిష్ఠించేందుకు కాదు, ప్రపంచ మానవహృదయ సింహాసనాన్ని అధిష్ఠించటానికి. సిద్ధార్థుడు నీ ఆనందమే కాదు, ప్రపంచానందం. అతని బోధామృతం నీ రాజ్యాన్నే కాదు, లోకాన్నంతా పాలిస్తుంది. ప్రపంచ విముక్తికోసం జనించినాడు. సంతోషించు.
: ఏమో! ఏమో అన్నాను - అనుకున్నాను.... ....సిద్ధార్థా!
: శుద్ధోదనా! ఎంత అజ్ఞానం? విశ్వమానవ సౌభ్రాత్రాన్ని, సకల ప్రపంచ శాంతికల్యాణాలను స్థాపించి, చరాచర ప్రపంచ మందంతటా ప్రేమామృతధారలు కురిపించి, ప్రావించి, భారతవర్షానికే అనిర్వాచ్యమైన యశస్సు గడింపబోయే పుత్రుని, ఆవగింజంత సింహాసనాన్నధిష్ఠించి, చెదలుపుట్ట లాంటి జానెడు రాజ్యాన్ని పాలిస్తూ, కొలిమిలోంచి వెలువడే రవ్వలలాక్షణంలో ఆరిపోయే భోగాల ననుభవిస్తూంటే చూస్తూ సంతోషిస్తా నంటావు. నీ హృదయం ఎంత గొందిగా వుందో వూహించుకో.
: అవును, నిజమే. కానీ - సిద్ధార్థుడు చేసేది, చేయాల్సింది, చేయగలది ఏముంది? నాల్గు వేదాలు, ఉపనిషత్తులు, బ్రాహ్మణమతం ఈ వరకే మానవ విజ్ఞాన సాగరాన్నంతా వెలికి గ్రక్కేసినవి.
: నిజమే - కానీ - కర్మకాండ అధికమైపోయింది. సామాన్య ప్రజలకందని సాహిత్యం, అర్థంకాని సిద్ధాంతాలు, ఆచరణకు అసాధ్యాలైన

సూత్రాలు. ఇహముకన్న పరమునే అధికం చేసి ఇహమును విస్మరింపజేసి, ఎదురుచూడని అవాంతరాలను తెచ్చిన తత్వం, స్వార్థం - అధికమైంది. మానవలోకం తహతహ లాడుతూంది. వెలుగవసరం. ఆ వెలుగే నీ సిద్ధార్థుడు.

నా సిద్ధార్థుడు వెలుగు కావచ్చు, ప్రపంచరక్షకుడు కావచ్చు. కానీ నా పుత్రవాత్సల్యం నా తండ్రి కన్నులు, అతన్ని రాజకిరీటంతో, చీనాంబరాలతో చూడాలని ఉవ్విళ్ళూరుతున్నవి. అది ఆరని ఆశ - నెరవేరక పోలే మంట - దాంతోనే వినాశమేమో!

ఆరకపోదు. సిద్ధార్థుడే 'సిద్ధార్థుడై' దాన్ని ఆరుస్తాడు. అదిగో దేవతలేలా సంకీర్తనం చేస్తున్నారో విను.

'బుద్ధదేవ సమోదేవో నభూతో నభవిష్యతి'



# ఏడవ రంగం

నడిరేయి: తారల వెలుగు గవాక్షలద్వారా సిద్ధార్థుని శయ్యాగారంలోకి తొంగి చూస్తూంది. ఆకాశపు రంగు దీపం వెలుగు శయ్యాగారంలో. శయ్యపై యశోధర ఉయ్యాలలో పాపాయి. కొంతదూరంలో కిటికీవద్ద సిద్ధార్థుడు. ప్రకృతి నిద్రపోతూంది. ఆకాశంలోకి మబ్బులు మెల్లమెల్లగా ప్రాకుతూన్నవి.

గమనిక: రంగస్థలం రెండు భాగాలుగా విభజింపబడి వుంది. ముందు భాగం వన్న వెనుక భాగం కొంచెం చిన్నదిగా ఉంది. ముందుభాగంలో శయ్యాగారం. వెనుకవైపు రంగస్థలంలో సిద్ధార్థుని మానసిక చిత్రాలు ప్రదర్శింపబడగలవు. వెనుకవైపు రంగస్థల ప్రధాన యవనిక నీలిరంగు. అది వదిలిపోతే తెల్లటితెర. ఆ తెర వెనుకభాగం నుంచి గొప్ప వెలుగు తెరను దూసుకొని వచ్చి రంగస్థలాన్ని ఆవరిస్తూంది కొద్దిగా. ఈ రంగస్థలానికి వెలుగు తప్ప వేరే దీపాలే లేవు. ప్రదర్శింపబడే పాత్రలన్నీ వట్టి ఛాయలు.

నిద్రపోతూన్న యశోధర ఉలికిపడి లేచింది.

: ప్రభూ! ప్రభూ!

: ఏం? ఏంటి ప్రియా? ఎందుకాలా కలవరపడుతున్నావు? అబ్బ! చెమటలు పోసినవే? ఏమైంది?

: అదో మరల అదే స్వరం?

: ఏం స్వరం?

: మీకు వినపడలేదూ?

: ఏమిటి?

: 'సమయమైంది. బయటపడు. సమయమైంది' అని.

: అంతేనా యశోధరా? ఆ మాత్రానికే యింత ఆరాటమా?

: నాకెందుకో భయమేస్తూంది. ఈ పైకప్పు మెల్ల మెల్లగా క్రిందికి ది వస్తూన్నట్లుంది ప్రభూ!

: యశోధరా!

: వెళ్ళకండి. కూచోండి - మీ వక్షస్థలంలో దాగివుంటే యీ శిరోభార లేదు. వెళ్ళకండి.

---

: పిచ్చిదానా! సత్యానికి భయపడతా వెందుకు? నీ వీ ఒక్క నిమిషం కన్నీరు కార్చటం కాదు, లోకమంతా అహోరాత్రము లీలా కన్నీరు కారు స్తూంది. భూమి ఎప్పుడూ నిట్టూర్పులు వదలుతూంది.
కలువలోని కావి ప్రేమ అంటావే - కాదు వెఱ్ఱిదానా! ఏడ్చి ఏడ్చి తేరిన ఎరుపు. సమయమైందేమో! లేకుంటే ఎందుకా వాణి? లోక శోకం ఆగేందుకు సమయమైందేమో!

: ప్రభూ! నన్ను ——

: యశోధరా! నిన్ను - ప్రేమించాను - ప్రేమిస్తున్నాను - ప్రేమిస్తాను. కానీ - అదిగో, మానవప్రపంచం, జంతుజాలం - ఎలా ఎడతెరపిలేని కన్నీటి వరదలలో మూర్ఛిల్లి వున్నాయో! అదిగో. మంటలు-పొగలు. అవిగో మూల్గులు - వీరి కష్టాలన్నీ తనవనుకొని రాత్రింబవలు విముక్తి మార్గాన్ని వెదకుతూండే యీ హృదయం నిన్నేలా మరచి పోతుంది? భయపడకు - పడుకో ——

: మీరు పడుకోరాదూ?

: అదిగో, అదేమిటో ఆ మంట చూడు. కాటిచితి!

: అబ్బ!

: అవును - నీవు భయపడతావు. పో - పడుకో. నేనూ ఇప్పుడే ——

యశోధర పడుకొంది.

: ఆ జ్వాలలలో రగిలి, బూదిలో తృప్తిని పొందే ఆ మహాశక్తి ఏమిటో? తనలో లీనమైపోతూండే ఆ నిర్భాగ్యుని గాధను శూన్యంలో, అస్పష్టాక్షరాలతో, అగ్రాహ్యమైన భాషలో లిఖిస్తుందా మంట. ఆ భాష తెలుసుకున్నామా మానవు డిన్నాళ్ళుగా జీవన మృత్యువులతో జరుపుతూండే మహాసంగ్రామం అంతరిస్తుందేమో! ఏమిటా ఏడ్పులు? మానవజీవిత గ్రంథంలో ప్రథమవాక్యం దుఃఖమేమో? తల్లిగర్భం నుంచి అప్పుడే అవతరించిన చిన్నికూన ఎందు కేడవాలి? అందరూ ఎందుకు నవ్వుకోవాలి? తన పాత్ర నంతా నిర్వహించి రంగస్థలం నుండి విరమించే కాలంలో అందరూ ఎందు కేడవాలి? అతడు ఆ చితిలో ఎందుకు నవ్వుకోవాలి? నవ్వు పెట్టే హింస దుఃఖం! హింస యొక్క దుఃఖమే నవ్వు! అంతేనా??

పాపాయి నిద్రించాడు. అతని కన్నులలో ఏవో కలల కెరటాలు రేగి కన్నురెప్పల్ని ఆడిస్తున్నవి. ఎందుకా నవ్వు? నన్ను చూచి నవ్వు తున్నావా? కాదు....నీలో హింస దుఃఖిస్తూంది. దాని కింకా కాళ్ళు, చేతులు, మాటలు, శక్తి, రాలేదు. నీ తల్లి వక్షస్థలం నుంచి, నా జీవితం నుంచి రావాలి ఆ శక్తి. ఔనా? ఆలాగైతే —

వెనుకవైపు రంగస్థల ప్రధాన యవనిక కదలిపోయింది.

అయితే - హింస —

: నేనే.

: ప్రపంచంలో నీవులేని చోటు లేదా?

: లేదు.

: లేనికాలం?

: లేదు.

: ఇక రాదా?

: నన్నడిగితే రాదంటాను.

: ఎందుకిలా వేపిస్తావు? ఎందుకిలా లోకాన్నంతా కొలిమిలోపెట్టి వూదటం? ఎందుకిలా యీ ప్రకృతినంతా ఏడ్పులతో మూల్గులతో నింపుతావు? నీకేం లాభం?

: సిద్ధార్థా! ఇదెవరో చూడు.

: ఎవరు?

: దారిద్ర్యం, స్వార్థం, అసత్యం, ఇక యితడు —

: మృత్యువు.

: అవును.

: ఏమంటా విప్పుడు?

: మమ్మల్ని కాదని యీ లోక వ్యవహారం ఏదీ జరగదు. మేమన్యోన్యాశ్రయ జీవులం. ఇతడికి ఇనుపగజ్జెల సంగీతం అతిమనోహరం. నెత్తు టేళ్ళల్లో స్నానం చేస్తేనే నేను బ్రతుకుతాను. ఇతడికి అమితమైన ఆకలి - అన్నీ భక్షించేయాలని ఎప్పుడూ కనిపెట్టి వుంటాడు. ఇతడు —

: ఇక చాలు.

మేము లేకుంటే లోకం నిర్జీవమవుతుంది.

అయితే అన్నీ యీలాగే జరిగిపోవాల్సిందేనా? ఈ యుద్ధాలు, రక్తపాతం, క్షోభ, ఆకలి, ఆత్మహత్యలు - అన్నీ యీలాగే జరుగుతూ ఉండాల్సినదేనా? దేవుడు యీ ప్రపంచాన్ని సృష్టించింది యీ హృదయవిదారక దృశ్యాలను చూస్తూ ఆనందించటానికేనా?

: కళ్ళు మూసుకుని కాలవాహినిలో పడి అందరిలా జీవితాన్ని గడుపు. లేదా - అదిగో చూడు మునులు, యోగులు, భక్తులు వారి దారి పట్టు.

: వారేం చేశారు? ఏం చేయదలచుకొన్నారు?

: వారూ నీలాగే లోకాన్ని చూచి ఏడ్చారు. నీలాగే శాంతికోసం తపించారు. మా ప్రాతినిధ్యాన్ని తొలగించేందుకు ఎన్నో ప్రయత్నాలు చేశారు. నీలాగే యీ దృశ్యాలను చూడలేమంటూ వనాంతరాల్లోకి నడిచారు.

: వారు సఫలులు కారా?

: అది నే చెప్పలేను. ప్రపంచం నుండి దూరమైపోయిన వానివలన ఏదో శాంతి ననుభవింపవచ్చు. తామనుభవించే శాంతి యితర సామాన్య ప్రజల గడపలకు తెచ్చేలోగా అందరూ అస్తమించారు- అస్తమిస్తారు.

: మిమ్మల్నెవరు సృష్టించారు?

: దేవుడు.

: ఎందుకు?

: తాను సృష్టించిన ప్రపంచాన్ని నడపటానికి.

: మీ రవసరమా?

: అవును............వెళ్తున్నాం.

: నా సందేహా లింకా తీరలేదు

: తీరవు.

పెనుగాలి. ప్రకృతిలో రొద. వెళ్ళారు.

: అవేమిటా మంత్రాలు? 'సర్వేజనా స్సుఖినోభవంతు' ఔనా? ప్రథమం, అంత్యం, అదేనా? ఎక్కడుంది సుఖం? బ్రాహ్మణులు యజ్ఞాలు చేస్తున్నారు, క్షత్రియులు బ్రాహ్మణులను పోషిస్తున్నారు, శూద్రులు కాయకష్టంపడి ధనధాన్యరాశులు నింపుతున్నారు. కాని ఎవరికి శాంతి వుంది?

బ్రాహ్మణులలో వైషమ్యాలు. క్షత్రియులలో యుద్ధాలు. శూద్రులలో బాధ. దారిద్ర్యం.

సూర్యుని, వరుణుని, అగ్నిని, ఇంద్రుని - ఇందరినీ పూజిస్తున్నారు. ఇందరి పేరిట యాగాలు - బలులు - ఏం ఫలం? ఎవరిని కాపాడగలిగారు యీ దేవతలు?

ఎక్కడో పొరబాటుంది. ఎక్కడ?

నే నీ ప్రపంచంలో పుట్టాను. ఈ ప్రపంచం చేత పెంచబడ్డాను. ఒక్క జీవి తన పని మానివుండినా నేను మరణించేవాణ్ణే. ఇంత ప్రేమతో నన్ను పెంచి పెద్దచేసిన ప్రపంచం ఏడుస్తూంది. కన్నీరు తుడవడం నా భారం. అవును.

: కుమారా!

: ఏం?

: ఈ ప్రపంచమంతా మాయ!

: అయితే?

: వెలికి రా.

: అప్పుడు?

: కలిమిలేములు, సుఖదుఃఖాలు. ప్రపంచ హింసలు నిన్ను తాకవు. శాంతి తప్పక చేకూరుతుంది.

: ఈ సృష్టి ఉద్దేశ మేమిటి?

: అవన్నీ వలలు. వాటిని తప్పించుకొన్నావా స్వర్గసీమలో దేవుని పాద ధామంలో శాశ్వతశాంతిని గ్రోలుతుంటావు.

: తాను సృష్టించిన దానిచేత, తాను సృష్టించిన దాన్నే చులకనచేసి, నీచమని నిరసింపచేయడమే సృష్టికర్త మహానందమా?

: అవును, నమ్ము. వెలికి రా. నీకేం కావాలి?

: శాంతి.

: ఈ ప్రపంచం నీ కెలాగుంది?

: దుర్భరంగా.

: అలాగైతే, రా, నన్ను వెంబడించు.

: ఎక్కడికి?

: ప్రశ్నించకు - త్వరగా —

వెనకవైపు రంగస్థల ప్రధాన యవనిక కదలివచ్చి ఆ వీధప్రక్కన నిల్చుంది.

: యశోధరా: అమాయకత్వం నిద్రబోతూంది. అబల —

: ప్రభూ:

: యశోధరా:

: సిద్ధార్థా: కానీ - త్వరగా —

: యశోధరా: నా ప్రేమ నీ కెల్లప్పుడూ ఉంది. సిద్ధార్థుడు కాషాయాంబరాలతో దేశాటనం చేస్తూండిన భిక్షువని చరిత్రకారుడు సృష్టించినా యశోధరను ప్రేమించాడని, లోకంతోపాటు ప్రేమిస్తూండినాడని వ్రాయక తప్పదు. యశోధరా: ఈ లోకబాధను చూచి తపిస్తూండే నా హృదయం యిక యిక్కడుంటే భయంకరమైన వినాశనం పొందుతుంది. విశాలప్రపంచంలోకి దాన్ని విసరు. నీ త్యాగం సువర్ణాక్షరాలతో లిఖింపబడుతుంది.

: ప్రభూ: నా జీవితం?

: నీ జీవితం నాపై ఆధారపడిందా?

: కుమారా: అదే మాయ:

: అవునా? కానీ........ఈ ముద్దు ఎంత మధురంగా వుంది.

: కుమారా: అది విషం.

: ఈ పాపాయి చిన్నిచేతుల చల్లటి స్పర్శను యీ గాలి కూడా విడిపోలేక మోసుకపోతూందే. ఎంత హాయి:

: సిద్ధార్థా: అది నీ ఆత్మను కాల్చే అగ్గి చలువ.

: అబ్బ నమ్మలేను.

: కుమారా: పడిపోతున్నావు. అదిగో చూడు, ఆవైపు, దినానికి ఎందరు శిశువులు జన్మిస్తున్నారో - ఎందరు తమ సుఖజీవనానికై ఎందరిని దోపిడి చేస్తున్నారో - ఎందరు తిండీ - గుడ్డా లేక చస్తున్నారో - ఎన్ని యుద్ధాలు - ఎన్ని మరణాలు. మానవజీవితంలో సుఖం ఎక్కడైనా కనపడుతూందా? ఒకరినొకరు పీక్కుతినడం తప్ప వేరింకేమైనా వుందా? హంసతూలికల్లో పెరుగబోయే నీ ఒక్క పాపాయికోసం వెనుకంజవేశావా - ఈలాంటి అన్యాయ మానవ సాంఘిక వ్యవస్థను ఎందరు శిశువుల మెడ కంటగట్టి వారి జీవితాలను కూడా దుర్భరం చేస్తావో యోచన చేయి. భారతభూమికి త్యాగభూమి అని ప్రతిష్ఠ నీ

వల్ల రావాలి. ఎందరు ఆత్మహత్యలు చేసుకొంటున్నారు? ఎందరు పురికంబా లెక్కుతున్నారు? రా - త్వరగా - రా.

: ఇదో వస్తున్నా............

: మరల వెనుకడుగు వేస్తున్నావు.

: లేదు. యశోధరను కడపటిసారి చూచివస్తాను - పాపం! మూర్తీభవించిన సౌందర్యరాశి - నా తోడిదే లోకమని తన సర్వస్వం నా కర్పించింది. యశోధరా - తండ్రి యెవరనే ప్రశ్నకు తల్లి కన్నీటిలో బదులు తీసుకోబోయే పాపాయీ - లోకోపకారార్ధం మిమ్మల్ని విడిచిపోతూన్న నన్ను చిరునవ్వుతో పంపండి.

: కుమారా - సమయమైంది - కానీ ——

: వస్తున్నా ——

పోబోయేముందు అడ్డుగా ఒక వీర

: ఎవరు నువ్వు?

: ద్వారపాలకుణ్ణి.

: ఎందు కడ్డునిలుస్తావు?

: నువ్వెక్కడికి పోతున్నావు?

: ఎక్కడికో - శాంతికి ——

: పిరికిపందా!

: ఏం?

: మానవప్రపంచాన్ని వదలి అర్థంలేని అనంతశూన్యంలోకి పోయి, ఒంటరి పాటున నీ వలన నీకూ, యితరులకూ, నిన్నూ యీ ప్రపంచాన్నీ సృష్టించి ఆడిస్తూన్నాడనే దేవుడికీ, ఏలాంటి వుపయోగం లేక నీ జీవితాన్ని గడిపేయాలనుకొంటున్నావా? భీరువులాగు పిరుద చూపుతున్నావా? నిలు.

: నిలచి?

: ఈ నీలాంటి మానవుల మధ్య - నీవారి మధ్య జీవితాన్ని గడుపు. నా కీ లోకం అసహ్యంగా వుంది. బాధాకరంగా వుంది. దారివిడు. నే పోవాలి.

: నీ కొక్కడికేనా? నీలా గెందరు బ్రతకడంలేదు. వారందరూ యీ అసహ్య బాధాకర ప్రపంచాన్ని సహించి తమ చెమటోడ్చి నీకు జీవం, జీవితం యిచ్చారుకదా? వారినంతా వదలి నీ వరకు నీవే శాంతిని, సుఖాన్ని, ఏదో - చూడని మోక్షాన్ని అనుభవించాలంటావా?

: నా కోసం కాదు. వారి కోసమే. వారి బాధలు, వారి దుఃఖం చూడలేకున్నాను.

: అందుకై వారిని వదలిపోవాలా?

: అవును. ఇక నన్ను ప్రశ్నించకు. నే పోవాలి తప్పదు.

: ఇది నీ తుది నిర్ణయమా?

: అవును.

: అదో చూడు, పాపాయి ఏడుస్తున్నాడు.

: పాపాయి కాదు ఏడ్చేది - అతన్ని భరించాల్సిన భూమి ——

: కాదు. పాపాయి ఏమంటున్నాడో విను. 'అహమస్మి, అహమస్మి' అంటున్నాడు. "నేను కోరివచ్చాను. ఏమాత్రం యోచన చేయలేదు. నా తొలి అరపులలో సకల చేతనాచేతనాలను పిలిచి సన్నిహితుల చేసుకొని 'మిమ్ము ప్రేమించి వచ్చాను' అన్నాను. నీ వెందుకు విడిపోతా వీ లోకాన్ని. వద్దు" అంటున్నాడు. సిద్ధార్థా. తిరుగు.

: కాదు!

: యశోధర కనుబొమలు నిన్ను చూచి ఏవేవో కలలుకని రమ్మని సంజ్ఞ చేస్తున్నవి. అదిగో, ఆమె అధరం. మధు వందిచ్చింది, త్రాగావు. ఇంకా అందిస్తూంది. నీ పంటి నొక్కులింకా మాయలేదు. ఆమె కనుకొనల నుంచి రెండు కన్నీటిచుక్కలు నీ పాదపీఠం మీద రాలినవి. సిద్ధార్థా - చూడు.

: కాదు, చూడను....అవును, ఆమె కదలుతూంది. నే పోవాలి. అతడెక్కడ?

**మునుపు సిద్ధార్థుని రమ్మని సంజ్ఞ చేసిన నీడ కొంచం అస్పష్టంగా వుండి పలుకుతూంది.**

: సిద్ధార్థా! ఇప్పుడు చూడు నీ యశోధరను.

: ముదుసలి!

: ఇప్పుడు?

: రోగి!!

: ఇప్పుడు?

: కళేబరం!!!

: ఇప్పుడు?

: బూది!

: మరి - రా - త్వరగా —

ఒక్కసారి పెనుగాలి. పడకనుంచి ఓ పువ్వు గవాక్షంలోకి కొట్టుకుపోయింది.

: లే - నే పోవాలి - అడ్డు నిలువకు. పిశాచమా! నన్నావకు.

: యశోధర కదలుతూంది.

: అవును, త్వరగా వెళ్ళాలి.

: వెళ్ళాలా? తప్పదా? వెళ్ళు - వెళ్ళు —

: ప్రియా - ప్రభూ - నాథా —

: పిరికిపందా! పో - పో —

: ప్రియా - వెళ్తున్నావా? వెళ్ళావా - ప్రభూ —

: సిద్ధార్థుడు పిరికిపంద! ప్రపంచ మహాసంగ్రామంలో నిలువలేకపోయాడు. భీరువు!

: నా గతి —

పాపాయి ఏడుపు వినపడుతూనే వుంది.



# ఎనిమిదవ రంగం

అనోమా నదీప్రాంత సైకతస్థలము. సిద్ధార్థుడు, అతని వెంబడే తలవంచుకొని చెన్నుడు ప్రవేశం.

: చెన్నా:

: ప్రభూ!

: అదిగో చూడు, పగటివెలుగు నిశ్శబ్దంగా ప్రాకుతూంది. ప్రపంచ సరిహద్దులు విడివడి దూరమైపోతున్నవి.

: చిత్తం ప్రభూ!

: ఎన్నోనాళ్ళుగా భూమిలో పాతిపెట్టబడిన పసిడిభాండంలాగు భార్గవమహర్షి ఆశ్రమం చీకటినుండి వెలువడుతున్నది. అందు దాచబడ్డ అమూల్య రత్నాలలాగున్న భిక్షాపాత్రలు చూడు. చెన్నా, ఇన్నాళ్ళ ఆశ యీనాడు ఫలించింది. శుభసూచకంగా కంటకమూ యిక్కడే ఆగింది. నేటితో —

: ప్రభూ! ప్రభూ! ఇదేమిటి?

: వెఱ్ఱివాడా! ఇవన్నీ నా కెందుకింక? కాషాయాంబరాలు, భిక్షాపాత్ర నన్నెదురుచూస్తున్నవి. తీసుకో —

: ప్రభూ! సన్యసిస్తారా? తప్పదా?

: చెన్నా! ఎందుకాలా కన్నీరు? సంతోషించాల్సిన సమయం కదా యిది? దుఃఖపూరితమైన యీ లోకాన్ని ఉద్ధరించే మార్గాన్ని అన్వేషిస్తూ పోతూన్న నీ ప్రభువును చిరునవ్వుతో పంపక ఆలా దుఃఖిస్తావెందుకు? వెళ్ళు.

: ప్రభూ! యశోధరమ్మగారి కన్నీటితో తడిసిన వదనాన్ని ఏలా చూడగలను? నా గుండె బ్రద్దలై పోదా ప్రభూ? ఆమె కనుల నుండి రాలే ప్రతి కన్నీటిబొట్టు తిరుగులేని శాపమై నన్ను, నా వంశాన్నీ ధ్వంసం చేయదా? ఆమె నిట్టూర్పు వేడి నా హృదయాన్ని, జీవితాన్ని, సజీవంగా మాడ్చేయదా? ప్రభూ! కరుణించండి. ముదిమిలో ముద్దారపెంచిన కొడుకే జీవిత తారకమార్గమని, సద్గతి కారకుడని నమ్మి ఎన్నో దేవతలకు మ్రొక్కి, ఎన్నో యాగాలు చేసి, కని, పెంచిన మహారాజుల

మనసులో కార్చిచ్చు రేపకండి. కన్నతండ్రి పెదవుల స్పర్శసుఖం పాల్గారు చెక్కిళ్ళతో ఎదురుచూస్తున్న పాపాయి రాహులకుమారుని తండ్రిలేని బిడ్డను చేయకండి. ప్రభూ! లోకం ఏలాగైనా పోనీండి! సన్యసించకండి ప్రభూ!

: చెన్నా! ఏమిటిదీ? నేను సన్యసించడానికి నీవే కారణమని భయపడు తున్నావా?

: లేదు ప్రభూ! సన్యాసివస్త్రాలలో మిమ్మ చూడలేనని ఏడుస్తున్నాను.

: నీ అనురాగపరిపూర్ణ హృదయాన్ని గుర్తించాను. కానీ. చెన్నా, ఆ అనురాగాన్ని యీ ప్రపంచాని కంతా పంచిపెట్టి చూడు. నా ఒక్కడి మీదే కేంద్రీకరింపబడివున్న ఆ హృదయాన్ని కట్టువిప్పి యీ అనంతవిశ్వం మీద సారించు. ఏం గోచరిస్తుంది? నీలాగే విశ్వమంతా దుఃఖిస్తూంది. నీ దుఃఖ నివారణకోసం నీవేలా తపిస్తూ బాధపడుతున్నావో అలాగే యీ లోకమంతా బాధపడుతూంది. నీవేలా నీతో నేను రావటమే దుఃఖోపశమనంగా భావిస్తున్నావో అలాగే ప్రపంచం నన్నాహ్వానిస్తూంది. నీవు, యశోధర తండ్రిగారు, ఆశించే ఉపశాంతి భ్రాంతి! చెన్నా, ఆమాత్రం విశాలదృష్టి కలుగలేదా? ప్రపంచాన్నంతా కాదని మిమ్మల్ని సుఖపెట్టడానికి నన్ను, నా ఆత్మను, జీవితాన్ని చంపుకో మంటావా? ఇదేనా నీ ప్రభువుపై నీకున్న అనురాగం?

: క్షమించండి ప్రభూ! ఏది సత్యమో, ఏది భ్రాంతియో, ఏది అవసరమో, ఏది అనవసరమో తెలుసుకోగల పరిస్థితిలో లేదు. నా మనసు ప్రభూ! తుదిప్రార్థన —

: ఏమది?

: మీ పాదాల ననుసరించేందు కీ సేవకునికి ఆజ్ఞ దయచేయండి.

: చెన్నా! అది యిప్పుడు కాదు. నేనే చీకటిలో నడుస్తున్నాను. కాననివాని ఊతలాగవుతుంది. వద్దు. త్వరలో నిన్ను కలుసుకొంటాను. ఇప్పటికి వెళ్ళు.

: ఏమని పోగలను ప్రభూ! కపిలవస్తు పురజనుల పెన్నిధిని అర్ధరాత్రములో హరించి తీసుకుపోయి అగాధ అనంత సముద్రంలో పారవేసి - వారి నేమని చూడను? - వారికేమని చెప్పను? ప్రభూ! నా వలనకాదు. ఇక్కడే - ఇక్కడే - ప్రాణత్యాగమైనా సరే —

: చెన్నా! ఇది నా ఆజ్ఞ!

: ప్రభూ!

కాళ్లంటి కళ్ళ కద్దుకొన్నాడు.

ప్రభూ! ఏనాటికైనా మీ సేవకుణ్ణి, ఆజ్ఞానుబద్ధుణ్ణి! ప్రభూ, మా అనురాగం నిర్వీర్యమని నిరూపింపబడింది. సెలవు.

వెనుదిరిగి పోతున్నాడు.

: చెన్నా - ఆగు. మనసు నొప్పించానా? నీ అనురాగాన్ని అర్థం చేసుకోలేక కాదు, దానికి తావిచ్చానా నా హృదయం మరల దొర్లుతుంది, నిలుకడ లేకపోతుంది. నీ అజ్ఞానాన్ని నీ కళ్ళముందు చూపటానికి కాలం, శక్తి, చాలదు. అందువల్లనే దాన్ని ఆజ్ఞాబద్ధం చేశాను —

తండ్రిగారితో చెప్పు 'మీ తనయుడు మీ కొకరికే కాదు లోకాని కంతటికీ సద్గతికారకుడు కాబోతున్నాడ'ని. యశోధరతో 'సిద్ధార్థుని ప్రేమసామ్రాజ్యాధిపత్యం నుంచి ఆమె తొలగింపబడ లేద'ని, 'తొలగింపబడద'ని చెప్పు. పాపాయి రాహులునికి నా ముద్దు లాశీర్వాదాలు.

చెన్నా, తూరుపు ముసుగు తొలగింది. ఇక వెళ్ళు - కపిల వస్తు ప్రజలకు నా ఆశీస్సులు..................

: ప్రభూ - మబ్బులలో జారబడుతూండే చంద్రునిలాగు ఆ చెట్లగుంపులలో ప్రశాంతంగా నడిచిపోతున్నారు ప్రభువు.........ఈ గాలి కూడా బరువెక్కి కదలిపోలేకుంది.........నా కంటె ముందుగా పోయి యీ గాలి సిద్ధార్థకుమారుల సన్యాసివాసనలు యశోధరమ్మగారికి అందిస్తుంది. పాలిపోయిన విరహిణీలోకానికి నిద్రలేపి లాగుతుం దీ నీరెండ. సిద్ధార్థుని ఎడబాటు శూన్యంలో కపిలవస్తు ప్రజల కలకలలు వినబడుతుంది.

ఆ దృశ్యాన్నేలా ఓర్వగలను?



# తొమ్మిదవ రంగం

యశోధర, పాపాయి.

యశోధర దిండులో తల పెట్టుకొని దుఃఖిస్తూంది. పాపాయి ఏడ్పు. యశోధర కన్నీరు కప్పిన ముఖమెత్తి అలాగే ఒక్క నిముషం చూసి తటాలున మరల దిండులో దాచుకొంది, ఇంతవరకూ మొక్కపోయిన కత్తులలా నిలబడివున్న దాదులలో ఒకతె వచ్చి పాపాయిని తీసుకొన్నది.

రాజు ప్రవేశం - వెంట సేవకుడు.

: అమ్మా. యశోధరా!

: మామయ్యా!

: ఏడవకమ్మా - ఏంచేస్తాం? తల్లీ - మన ప్రేమ నిర్వీర్యమైంది. ఆ వైరాగ్య ఘోరాటవిని ప్రళయకాల దావానలమై దహించలేకపోయింది. ఇదిగోనమ్మా - మహాసాగరంలో వెనక్కు మరలి మరగిపోయిన తరంగం వదలిపోయిన నురుగులాగు, మెఱసిపోయిన విద్యుల్లత విడిపోయిన పిడుగుపాటులాగు. నీకూ నాకూ సిద్ధార్థుడు విడిచిపోయిన చిహ్నాలు.

కరవాలం, దీనాంబరాలు. శిరోజాలు - అబ్బ! పాదరక్షలు కూడా —— మన నవ్వు, మన ప్రేమ, మన ఆనందం, యిన్ని సిద్ధార్థుని నిలుపలేకపోయినవి. మన దుఃఖమైనా అతన్ని మరల్చుకొస్తుందేమో. నీ కన్నీరైనా అతని దారికడ్డుగా దాటరాని ఏరవుతుందేమో! అవును, నిన్నేలా దుఃఖించవద్దనటం?

: మామయ్యా.

: అదిగోనమ్మా, పువ్వును తీసుకపోయి ఎడారిలో పారేసి రంగులు లేని శుష్క సౌరభాన్ని మోసుకొచ్చిన పెనుగాలి. నీ కన్నీటిబాటలు తీరిన చెక్కిళ్ళతనికి చూపు.

: తండ్రీ, క్షమించండి.

: చెన్నా! క్షమ వాచకం నిష్ఫలం. యశోధర ప్రేమనిధి కొల్లగొట్టబడింది. ఆ అదృశ్య హస్తానికి సహాయకుడవు నీ పయ్యావను అపయశస్సు -

రాదు - ఎలా చెప్పగలను? - ఏదో, చిరస్థాయిగా సిద్ధార్థుని వెంటనే చరిత్రలో లిఖింపబడుతుంది.

: ప్రభూ! ఆయన కృతనిశ్చయులైనారు. గుహ నుండి వెలువడి కంటకావృత వనగర్భంలోకి అత్యుత్సాహంతో పరువెత్తుతూండే సెలయేటి నిస్సంగత్వాన్ని మాపి వెనుదిరుగ చేసేంతటి కష్టమనిపించింది ఆయన్ను మరల్పటం.

: నీవూ ఆ సెలతో కదలిపోలేకపోతివా చెన్నా? ఆ మాత్రం త్యాగం సి సిద్ధార్థునికోసం చేయలేకపోతివా? ఇంతటి స్వార్థంతో కూడుకొన్న ప్రపంచాన్ని సిద్ధార్థుడేంచేయబోతాడు? వెఱ్ఱివాడా! అప్పుడే సత్యాన్ని గ్రహించి వుండవచ్చునే - స్వార్థం ఒక్కటే యీ ప్రపంచాన్నేలు తూండేదని.

: ప్రభూ! వృథాపనింద. సిద్ధార్థులవారు విడిపోతూండగా తేనెబొట్టు రాలి పోతూన్న పూవులాగు కంపించిపోయాను. రాకుమారులను వెంబడిస్తా నని ఎంతో ప్రార్థించాను.

: ఏమన్నాడు?

: ఇప్పుడు కాదు. నీవు నగరికిపోయి నా మహాభినిష్క్రమణాన్ని తండ్రి గారికి, యశోధరకు, నా ముద్దుబిడ్డకు చెప్పు. కొద్దికాలంలో నిన్ను నే నను గ్రహిస్తా నన్నారు.

: సరే వెళ్ళు. మంత్రిని రమ్మను.

: చిత్తం.

: ఆనాడు కొడుకు పుట్టాడన్న శుభవార్త వనంలోవున్న సిద్ధార్థునికి తెలియ పరచాను. అప్పుడు 'చంద్రుని మ్రింగవచ్చిన రాహువు', 'ఇదొక రాహులము' అన్నాడు. అతని వాక్కైనా సిద్ధించకపోయింది. అలాగే అవుతాడేమో, తండ్రిని అర్థంలేని నవ్వుల పసిపూలతో కట్టేస్తాడేమో, అని రాహులుడని నామకరణం చేశాను. అన్నీ దాటి పోయాడు సిద్ధార్థుడు.

: ప్రభూ!

: మంత్రీ! ఆనాడు సిద్ధార్థుని జీవితంపై పరొక జీవితం అంటగట్టబడుతుం దన్నాను. మీరేమన్నారు?

: చిత్తం. సుఖకరమే అన్నాను.

: ఈనాడు ఒక్క అబల జీవితం. ఒక్క సుకుమారి జీవితం, ఒక్క అమాయకురాలి జీవితం, సదా కన్నీటితో తడిపి. బూదితో నింపినాడన్న అపకీర్తి నా నెత్తినకట్టక కాపాడండి.

: చిత్తం. ప్రభువుల ఆజ్ఞ.

: అంటే ఏం చేయతలచుకున్నారు?

: సిద్ధార్థులవారిని వెదుక నలుదిక్కులా సేవకులను పంపుతాను.

: ఎక్కడున్నాడో తెలుసుకురమ్మను చాయను.

: చిత్తం.

: అమ్మా యశోధరా. నీ మామగారిపై నీకసహ్యం, కోపంలేవూ?

: ఎందుకు మామయ్యా? మీరేం చేశారు? అది నా సుకృతం. పిందెకోసమే చెట్టు పూవును కౌగిలిలో చేర్చుకొంటుంది. కానీ పిందె కలిగిందే పూవు రాలిపోతుందని ఎరుగునా? అది ఆ పసికూన చేసుకొచ్చిన ప్రతినయేమో?

: అలాకాదమ్మా - నేనే నీ దురవస్థకు కారణం. తెలిసి తెలిసే చేశానమ్మా. సిద్ధార్థుడు పుట్టినరోజే పండితులు చెప్పారు అతడు సన్యసిస్తాడని. ఆపలేకపోతామా అనుకున్నాను. నా ప్రయత్నానికి నిన్ను బలి యిచ్చాను. నీ కన్నీరు కడవరకు మోసుకుపోతానులేమ్మా.

: ఆలా అనకండి....

: అవును నిజమే. అనుకొని వుపయోగంలేదు. ఏమేమో అనుకున్నాను. అనుకున్నది చేసివుంటే నా అనుకునేదానికి ఒక అర్థం వుండేది.

: గులాబిని కౌగలించిన ఆదిత్యకిరణాలలాగు కైకారణ్యం నా ప్రభువును కౌగలించింది. ఏ రంగులు వ్రాస్తుందో - ఏ సౌరభం రేపుతుందో - తేనె లొలుకుతుందో - కాలంకూడా తన వేయినక్షత్రాల కన్నులతో ఎదురుచూస్తూండాలిసిందే.



# పదవ రంగం

రంగస్థలం పూర్వంలాగే రెండు భాగాలు.

ఇప్పుడు —

ముందుభాగం:— వనం. చెట్లు కనపట్టంలేదు. చెట్లనీడలు మాత్రం పడు తూన్నవి. వెనుకభాగం రంగస్థలాన్ని ఆనుకున్నట్లుగా ఒక బోధివృక్షం. ఎత్తయిన స్థలం. చుట్టూ రాళ్ళూ, గుళ్లు. ప్రక్కనే ఓ జలపాతం నిలుపుదల లేని శబ్దం చేస్తూ దుముకుతూంది. వెలుతు రంతగాలేదు.

సిద్ధార్థుడు బోదివృక్షంక్రింద కూర్చున్నాడు.

వెనుకభాగం:— ప్రధానయవనిక తీసేవుంది. ముందులాగే తెల్లటితెర వెనుక నుంచి వచ్చి రంగస్థలాన్ని కొద్దిపాటి వెలుగు ఆక్రమిస్తుంటే అందు మిణు గురు పురుగులాంటి ఓ చిన్న వెలుగు ఓ మూల స్పష్టంగా వుంది. రాను రాను వెనుక వెలుగు తగ్గుతూంటే యిది ప్రకాశవంతమై పెద్ద జ్యోతిగా మారుతుంది. రంగస్థలంలో ఒకటే పెనుగాలి. ఎండుటాకులు, పుష్పాలు, తాళపత్రాలు, లతలు కొట్టుకపోతున్నవి. వికారస్వరాలు, మధ్య మధ్య మెఱపులు. పాములు బుసలు కొడుతూ పుట్టలనుంచి తలలెత్తినవి. సింహాలు గర్జిస్తూ పరుగెత్తిపోయినవి. వన్యమృగాలన్నీ యిలాగే — ఆ వెనుక కొంత నెమ్మది.

ఒక కాంత నాట్యం చేస్తూంది పాడుతూ

రెక్కలల్లార్చుతూ రివ్వురివ్వున పక్షి
పరచిపోతూన్నదే ప్రియుడా
తరిగిపోతున్నదే వెలుగు
ఇంతలో శూన్యాన అది మరిగిపోతుంది
త్రాగవే వేవేగ మధువు
చూడరా నా లోని సొబగు
చీకట్లకాంతిలో సర్వమూభ్రాంతియే
అందుకో నాలోని వలపు
నింపుకో ఆనందరసము
పూలలోతావిలా తేనెలో తీపిలా
లీనమై కేళిలో మనము
ఏలుదా మానందజగతి

: రాకుమారా.

పానపాత్ర అందిస్తూంది.

: కుమారా! మాయ! మాయ! నీ తపోభంగం చేయటాని కీలాంటి రూపాలు వస్తూంటవి. చలించకు.

: అవును, అతడు ముందే హెచ్చరించాడు. చలించను.

యశోధర వచ్చింది, పాపాయిని కన్నీటితో తడుపుతూ.

: తీసుకోండి! మీ ముద్దుపాపాయి నొకసారి తీసుకోండి! ఒక్క ముద్దు ప్రియా - ప్రభూ.

: యశోధరా!

: ప్రియా! నా వక్షస్థలంలోని పాలంతా కన్నీరుగా ప్రవహించి అయిపోయింది. నన్ను కరుణించరూ? మన ఇరువురి ప్రణయజీవిత నాటకంలో గీతాలు ముత్యాల తుంపరలతో వ్రాసి పాడిన ఆ సెలయేరు ఈ రోజు వియోగ విషాదంతో మూలుగుతూంది. చూడరూ? ప్రకృతిని, ప్రణయినినీ, యీలా అసహ్య శూన్యంలో దిగజార్చి ఏం సాధిస్తారు? ప్రియా! నా బ్రతుకు తోటలో పూదీవెలు వాడిపోతున్నా మాడిపోక ఏవో ఆశలతో జీవంతో వున్నవి. మీ ప్రేమవారితో తడిపి ఆకులు పూలలోకి, పూరేకులు పిందెలలోకి, పిందెలు పండ్ల లోకి, పండ్లలోని తీపి నూతన జీవిత మాధురీఝరిలోకి మార్పరాదా?

ప్రభూ! మీ చుట్టూన్నరాళ్ళు కరిగి మీ పాదాలు సోకుతున్నాయే, మీ హృదయం కరిగి నా గుండెల్లోకి ఆ సెలయేటిలా దూకరాదా? అబ్బ! కళ్ళెత్తి చూడరాదా? ఇదో - పాపాయి చేతు లందిస్తున్నాడు.

: యశోధరా! ఎందు కింతదూరం వచ్చావు? పాపాయిని కీకారణ్యంలోకి తెచ్చావే! వెళ్ళు - వెళ్ళు - నాన్న నీకోసం ఎదురుచూస్తుంటాడు.

: నాధా! మీరు లేని బ్రతుకు ___

: యశోధరా! నీ ప్రేమంతా నా ఒక్కడికేనా? ప్రపంచమంతా నేనేనా?

: ప్రభూ! కనపడని లోకాలను ఆకాశాన్ని దూసుకొనిపోయి చూచిరావాలనే మీ దృష్టిని నా యీ కొట్టుకొంటూండే ప్రత్యక్షహృదయంలోకి జొరబారనీండి. పూవులలోంచి వాసనను. తేనెనుండి మాధుర్యాన్ని,

చంద్రుని నుండి చలువను విడదీసేస్తున్నారు. మీ వీక్షణాలు పిడుగులైనా సరే ఓర్వగలను. మీ వియోగం స్వర్గసోపానమైనా సరే, వద్దు ప్రభూ, వద్దు.

: యశోధరా! కౌగలిస్తున్నావా?

: కుమారా! పతనం! పతనం! యశోధర కాదు - భ్రాంతి! మారునిదండు.

: ఔనా? అసత్యస్వరూపమా! నా అడుగుజాడలు పసికడుతున్నావా? పో - నీ వికారస్వరూపాన్ని తెలుసుకొన్నాను.

: ప్రభూ!

: వెళ్ళు! వెళ్ళు!

మాయమయింది. యవ్వనం ప్రవేశం.

: ఇక్కడికెందుకు వచ్చావు?

: దేవుణ్ణి వెతుకుతూ.

: ఎందుకు?

: ఈ ప్రపంచాన్ని ఇంత క్రూరంగా ఎందుకు సృష్టించాడో తెలుసుకోటానికి.

: అది నీ కెందుకు? ఈ ప్రపంచం దాటి ఇంకేమీ లేదు. కాబట్టి ఏలా అందివ్వబడుతుందో ఆలాగే అనుభవించు. కాటిచితితో సర్వం అంతరిస్తుంది. అది శూన్యగృహద్వారం. అన్ని దారులు అక్కడ ఎడారిలోని ఏళ్ళలా ఇంకి అదృశ్యం కాగలవు. శూన్యచ్ఛాయలో అంతా మాయ. నీ నాసాగ్రము వరకే చూసుకో. ఆలా చూచుకొన్నావా అంతకు మించి ఏదో వుందనే ఆశతో, ఆనందంతో గడచిపోతుంది. కళ్ళు మూసుకుని వుండటం కష్టం. నాకు దేవుడు కావాలి. ఆ దేవుడే నా ఆశ, ఆనందం. అతన్ని చూడగలననుకొంటాను.

: ఎలా చెప్పగలవు? నా హితవాక్కు విను. ప్రాప్తమును అనుభవించు. చేయగలది చేయగలప్పుడు నిర్వర్తించు. ఆలాగే ఆ అనివార్యమైన తుదివరకు నీకున్న కాలాన్ని వృథాపోనీక ఉపయోగించి యశోవంతం చేసుకో. అనివార్యమైన తుదిలో ఏమీ వుండదు. సర్వం శూన్యం.

: లేదు. నా మరణానంతరం నాకో భవిష్యత్తు వుంది. దాన్ని తెలుసుకోవాలి.

: జరిగిపోయినదాన్ని ఎరుగుదువా? జరిగిపోయినదే తెలియనప్పుడు యిక జరుగవలసినదాన్నెలా తెలుసుకోగలవు?

: తెలుసుకోవచ్చు. సూర్యుడు రేపు - ప్రతిరోజూ ఉదయిస్తాడు. అదీ మాయే. సూర్యుడు కాలిపోతున్నాడు. ఏనాడో పూర్తిగా కాలి తీరి పోతాడేమో?

: జీవితం కూడా ఆలాగే కాలి ఆరిపోతుంది. కానీ ప్రతి శిశు జననానికి మరల నిప్పంటుకొంటూంది. - సత్కార్యమని తెలిస్తేనే చేయాలి. ఆలా తెలియటానికి ముందువెనుకలు, దేవుడు తెలియాలి.

: ముందు 'మంచి' వెనుకకు లేదు. వెనుక 'మంచి' ఇక ముందుండదు. 'మంచి'కి మంచి నిర్వచనమే లేదు. - ఏలాగైనా అవి తెలియాలంటే నీవు దేవుడు కావాలన్నమాట.

: కొత్త సత్యం నేర్పావు. 'నేను' దేవుడు కావాలి.

: ఆలాగైతే సాధించు.

మాయమయింది. ఒకడు అట్టలింగాన్ని మోసుకొచ్చాడు.

శంభోశంకర మహదేవా!
హరహర గిరిజాహృదయధవా!
పన్నగభూషణ! భవభయవారణ!
అమరవందితచరణా!

ఒకడు విష్ణు విగ్రహాన్ని మోసుకొచ్చాడు.

శ్రీరమణా! శ్రితభరణా!
కౌస్తుభభూషణ! జగదుద్ధారణ!
శంఖచక్రగదాద్యాయుధభూషిత!
సకలాగమసన్నుతచరితా!

: సకలం శ్రీవిష్ణుమయం! ఓం నమోనారాయణాయ!

: సకలం శంకరమయం! ఓం నమశ్శివాయ!

: శైవమత నిర్మూలనార్థం మహాఖండహోమంకరిష్యే!

: వైష్ణవమత విధ్వంసనార్థం మహాయాగం కరిష్యే!

: నిర్మూలనం. విధ్వంసనం! ఇవి రెండూ మతా లేలాగవుతవి? చూడు, ఒకడు బూది ఊదుతున్నాడు, మరొకడు మంత్రజలం వదలుతున్నాడు. కాదు - దేవుడు కాదు.

వారిరువురు వెళ్ళారు. ఒకడు కత్తి, కలశంతో ప్రవేశం.

గొఱ్ఱెపిల్లకోస్తానె కోటేరమ్మ — నీకు —
మేకపిల్లనిస్తానె సాకేటమ్మ — నేను —
కల్లుతెచ్చిపోస్తానె గంగమతల్లి — దున్న —
పోతుతెచ్చి నరకతానె పోలేరమ్మ —

: మూర్తీభవించిన రక్తదాహం. మానవులెంతో నయం. రక్తమాంసాదుల పైననే జీవికను నిలుపుకొని వుండిన కాలాలలో సృష్టించుకొన్న యీ దేవతలను మానవు లింకా ఎందు కారాధించాలి?

వాడు వెళ్ళాడు. భక్తుడు ప్రవేశం, పాడుతూ గంతులేస్తున్నాడు.

భక్తియోగం కామోసు. దుఃఖాలు మరవడం. మరుగుపరచడం కాదు కావలసింది, దుఃఖాలను మాపడం.

వాడు వెళ్ళి యోగి ప్రవేశం.

: ఈ ప్రపంచంతో నాకు పనిలేదు. నా యింద్రియాలను, అరిషడ్వర్గాలను జయిస్తాను. కనుబొమల మధ్య దృష్టిని నిలిపి ఆ జ్యోతిని కనుగొంటాను. అందులో లీనమైపోతాను. ఈ దేహం ఆత్మకు వైరి. దీన్ని శుష్కింపచేస్తేనే మోక్షం.

: ఔనా: అబ్బ! ఏలా శుష్కించిపోయాడు? ఎంత హింస? చూడలేకున్నాను.

యోగి వెళ్ళాడు.

: ఇందులో ఏముంది? వట్టి హింస. అంతేనా? ఈలాగే అందరూ శుష్కించి పోతే మానవ ప్రపంచమే క్షీణించిపోదా? ఇంకేముంటుంది? ప్రపంచంలో ఎక్కడ చూచినా హింస, స్వార్థం, తాండవం చేస్తున్నవి. నిస్సంగత్వంలో, భక్తిలో, యోగంలో, అన్నిటిలో స్వార్థం. లోకాన్నుంచి దూరంగా పోవటమో, లోకాన్ని పూర్తిగా మరచిపోవటమో తప్ప తోటిమానవులతో హాయిగా బ్రతికే విధానం,

బ్రతుకనిచ్చే మతం లేదా? ప్రతిమానవుడు యింకొకడి కెందుకో అంత భయపడటం? భయంచేత తన్ను తాను రక్షించుకోవాలని స్వార్థ పరుడవుతున్నాడు.

: ఆ స్వార్థంతో హింస పుడుతూంది. అంతేనా?

: నా తర్కంలోనే ఎక్కడైనా పొరబాటుందా?

వెనుకవైపు రంగస్థలంలో సుడిగాలి, రొద. మరల నిశ్శబ్దం.

అంతా చీకటి అయిపోయింది.

ఎంత హాయిగా వుంది. సమత్వంలాంటి చీకటిలో అసహ్య సంప్ర దాయ తార లింకా కొద్దికొద్దిగా వెలుగుతూనే వున్నవి. ఇవీ ఆరిపోతే ఎంత సుఖంగా వుంటుంది! అదో, చాలాదూరంలో విప్లవమేఘా లేవో వస్తూన్న సడి గాలి మోసుకొస్తూంది. ఆ మేఘాలు త్వరగా వచ్చి యీ మిగిలివున్న తారలను కూడా కప్పేస్తే సర్వం సమమవుతుంది. అబ్బ! ఎందుకింత హింస, స్వార్థం!

ఒక ధ్వని.

: ప్రతిమానవుడు తాను మరణిస్తాడని భయపడుతున్నాడు.

: నిజంగా మరణిస్తాడా? మరణిస్తే తుదకు మరణం మాత్రమే నిలువ వద్దా? తన్ను తానే చంపుకోవద్దా?

: మానవుని జీవితం అనంతం. ఎవడూ మరణించడు. బ్రతికి వున్నానని తెలుసుకొంటే బ్రతికి వుంటాడు శాశ్వతంగా.

: అయితే నేను చూసిందేమిటి? మరణం కాదా?

: కాదు. ప్రకృతిసిద్ధమైన ఓ మార్పు. దానికేమాత్రం చింతించాల్సిన దక్కర లేదు. మానవుని జీవితం భయదుఃఖరహితమైతే ఎవడూ మరణాన్ని గూర్చి చింతించడు.

: అది ఏలాగవుతుంది?

: సత్కర్మవల్ల.

: కర్మ అంటే ఏమిటి? కర్మ అనివార్యమా? కర్త ఎవరు? మానవుడా దేవుడా?

: మానవ జీవితం అన్యోన్యాధార జీవితం, అనంతం. ఆలాంటప్పుడు అది ఒకరి నుండి యింకొకరికి అందివ్వబడుతుంది. మన పూర్వులు తర

తరాజుగా చేసిన కర్మ మన మనుభవిస్తున్నాం. అంటే మానవుడు తన కర్మ ననుభవించి తీరాలి. మానవజీవితం ఒక మొత్తంగా తీసుకున్నప్పుడు ఇది విశద మవుతుంది. దీన్నే చరిత్ర అంటాం. అన్యోన్యాధార జీవితం అవడంవల్ల సర్వం ఇచ్చిపుచ్చుకోవడమే. ఏ గింజ వేస్తే ఆ చెట్టే, ఆ పండే. తెలిసిందా? నిన్ను కలవరపెట్టి వనాంతరాల్లోకి తరిమింది యవ్వన వార్ధక్య మరణావస్థ దృశ్యాలేనా?

: కావు. ఇంకా ఏవో అంతర్లీనమై వున్నవి.

: ఏవి?

: ఏదో దోపిడి. ప్రతిమానవుడు ఇంకొకడి వద్ద నుండి ఏదో హరించాలని ఆత్రపడుతున్నాడు. ధన ధాన్య శీల సుఖాలే కావు, సామాన్య జీవిత హక్కులు, జీవితమే.

: సత్యం! అది ఆగాలి.

: ఆగగలవా?

: తప్పక. అవన్నీ మానవకల్పితాలు.

: ప్రతివాడూ సుఖం కోరుతూన్నాడే - ఎందుకు కల్పించుకోకూడదు?

: మంచి ప్రశ్నే. మానవుడే తన కష్టసుఖాలకు కారణం. ఇది మరచిపోయాడు. మానవుని ఆశంతా ఎదటి మానవుని అందే వుంది. స్వర్గం, నరకం - రెండూ మానవులు ఒకడు మరొకడికి కట్టుకోవలసినవే. ఇది తెలుసుకోలేదు. తాను సుఖించాలని కోరుతున్నాడు. ఇక తన జీవితాన్ని, మానవజీవితాన్ని ప్రేమించటం లేదు.

: మార్గం?

: దోపిడితనం నశించాలి.

: ఏలా?

: ప్రేమ అహింస!

ప్రేమ! అహింస! ప్రేమ! అహింస!

: సిద్ధార్థా! నీవు సిద్ధార్థుడవు! — హింస కూలింది.

: సిద్ధార్థా! నీవు బుద్ధుడవు! — అసత్యం నశించింది.

: సిద్ధార్థా! నీవు లోకరక్షకుడవు. — దారిద్ర్యం క్షీణించింది.

: సిద్ధార్థా! నీవు జగదోద్ధారకుడవు! — స్వార్థం చచ్చింది.

: కుమారా! నీవు సార్ధకజీవివి! సజీవివి! నే నిప్పుడు నిర్వీర్యమైనాను. నన్ను జయించావు. అందరివలె నేను నీకు మృత్యువు కాను. కేవలం ఒక మార్పు. పో, కుమారా, నన్నిలా దాటివెళ్ళు.

పో! గడప గడపకు పోయి ఈ సత్యాన్ని బోధించు. ప్రపంచములో ఏనాటికైనా శాంతిసుఖా లేర్పడితే ఈ సత్యాన్ని గ్రహించినదాని వల్లనే కలగాలి.

: ఎంత పొరబడ్డాను. అనవసరమయిన హృదయాందోళన తెచ్చిపెట్టుకున్నాను. చిన్నతనం నుండీ నాకు ఉగ్గుబాలతో పోయబడ్డ నిరాధార తత్వం, నిస్సంగత్య బోధ, తదితర భావాలు నన్నిలా కలవరపెట్టకుంటే మానవసహజమయిన యీ సత్యాన్ని సులభంగా ఏనాడో తెలుసుకోగలిగేవాణ్ణి. స్పష్టంగా నాలో వుండే జ్యోతినే కనుగొనలేక ఎంతదూరం వచ్చాను! ప్రేమ, అహింస, ఇవి రెండే సాధనాలు. మానవుడు నిరాధారుడు కాడు, సర్వ శక్తియుతుడు. అతడే దేవుడు!

ఈ అనంత జీవకోటి నుండి తీసుకున్న అప్పు జీవితం. ఆ అప్పునకు జమ ప్రేమించటం.

ప్రతి ప్రాణికి జీవించేందుకు హక్కు ఉంది. ఆ హక్కును లాక్కోవటమే హింస.

అగ్ని తన్ను తానే తిని బూది అవుతుంది.

వర్షం మావిచివుళ్ళయి కోకిలకూతలో హాయిగా విహరిస్తుంది.

ప్రత్యక్ష మానవరూపాన్ని సంతోషపరచలేనివాడు కనుల కందని దేవుణ్ణి సంతోషపెట్టడం భ్రమ.

వట్టి జ్యోతి మాత్రముంది.

మొదటిరంగంలో ప్రవేశించిన కొందరు ప్రవేశం.

: అబ్బ! వెలుగొచ్చిందిరా!

: హాయి! హాయి!

: ఇప్పు దాకలి లేదు. ఆవేదన లేదు.

: నెత్తురులేదు, ఎముకలు లేవు.

: నాలో నూతనశక్తి కలిగింది.

: నాపై నాకేదో నమ్మకం కుదిరింది.
: మనల్నంతా ఏదో - యిది - దగ్గర చేరుస్తూంది కదూ?
: అవును, అదే ప్రేమ.
: మునుపిలా లేదు. నిన్ను చూస్తే నాకు —
: నీ బట్టలు చింపేసింది నేనే.
: అసలు నీకు తెలియక నీ నెత్తురు లాగేసింది నేనే.
: నీ పీకనొక్కి వూపిరాడకుండా చేసింది నేనే.
: అవునుగానీ, యీ వింత చూడూ - అందరూ ఒకేలాగున్నాం!
: అవునురా. పాడాలనిపిస్తూందిరా!
: నాట్యం చేయాలని కూడా!
: సరేకానీండి.

బుద్ధ జ్యోతికి జై! ప్రేమ జ్యోతికి జై!!



జయజయ బుద్ధజ్యోతీ.
జయజయ ప్రేమజ్యోతీ.
జయజయ సత్యజ్యోతీ.
జయజయ శాంతిజ్యోతీ.
అహింసాపరమో ధర్మః...
కారుణ్యం పరమోత్కృష్టం.
మానవలోకం,
నిర్భయం, నిర్మలం,
సుఖాకరం, శాంతియుతం.
సర్వేజనాస్సుఖినోభవంతు.
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.
వెలుగు వెలుగుతూనే వుంది.
మ ం గ ళ ం.



# అశోక సమ్రాట్

ఆత్రేయ నెల్లూరు గ్రంథాలయంలో చదివిన ఒక చారిత్రక గ్రంథం ఈ నాటకానికి ఆధారం. అందులోని అశోకుడు దుష్టాశోకుడు. 1944 లో రచించిన ఈ నాటకం 1956 లో వెలువడింది. తన 'మాతామహులు కీ॥ శే॥ శ్రీ ఈయుణ్ణి కృష్ణమాచార్యుల వారి పాద పద్మములకు' ఈ నాటకాన్ని ఆత్రేయ అంకిత మిచ్చారు.

# పాత్రలు

| | | |
|---|---|---|
| అశోకుడు | : | రాజు |
| సమరానందుడు | . | సర్వసేనాధిపతి |
| మహావీరుడు | : | సహాయసేనాధిపతి |
| రాధాగుప్తుడు | : | మంత్రి |
| చండగిరికుడు | : | కారాగారాధికారి |
| విజయుడు | | రథ, గజ, తురగ పద దళాల నాయకులు |
| రణవీరుడు | | |
| జయానందుడు | | |
| విశ్వాసుడు | | |
| ప్రేమానందుడు | : | బౌద్ధసన్యాసి |
| తిష్య | : | రాణి |
| శాంతి | : | మహావీరుని సతి |
| నిరూప | : | మహావీరుని తల్లి |
| కాంత | : | ఒక సామాన్య స్త్రీ |

భటులు తదితరులు....

# మొదటి రంగం

అశోకుని ఆలోచనా మందిరం. అశోకుడు, రాధాగుప్తుడు,
సమరానందుడు, మహావీరుడు ఉన్నారు.

అశోకుడు: భారతభూమి నీరసించిపోతుంది. బౌద్ధమతం భారతజాతి ఉడుకు నెత్తురు చల్లార్చేస్తుంది.

మగధసామ్రాజ్యపు అంకుశం లేని ఏలికలు. చీలికలై ఎవరికివారై, స్వేచ్ఛా విహారం చేస్తూ, స్వలాభదృష్టి కల్పిత న్యాయాన్ని, ధర్మాన్ని శాసింప చూస్తున్నారు. ఈ విధంగా పగుళ్ళుబారిన భారతావని బలహీనమై పరదేశీయుల పాలబడుతుందని మా భయం.

రాధాగుప్తుడు: నిజం! —

సమరానందుడు: నిజమేకానీ - ప్రజాబాహుళ్యం ఈ పరితర్వాన్ని గమనించలేకుంది.

రాధా: గమనించే విజ్ఞానం లేదు.

మహావీరుడు: ప్రభువులు చిత్తగించాలి. సమర నిర్వాహణానికి ఒక్క యోధులదే కాదు; సామాన్య పౌరజనం సహకారం అత్యావసరం. కళింగదేశ దండయాత్ర ప్రజామోదాన్ని పొందకుంది.

అశో: సర్వసేనాధిపతులు మీరు.

సమ: ప్రభువుల అభిమానం.

అశో: అధైర్యపడటం ఆ పదవికే అవమానకరం. సామాన్య ప్రజాహృదయాన్ని చెప్పవలసినవాడవు నువ్వు కావు. అందుకు మంత్రులున్నారు. సైన్య పరిస్థితి గురించి చెప్పుకోవలసిం దేదైనా ఉంటే —

సమ: చిత్తం. ఇప్పుడున్న సైన్యం కనుపుటాటికి కట్టుబడి వుంది.

అశో: అంతకన్న కావలసింది లేదు.

సమ: అది శాశ్వతం కాదేమో నని.

రాధా: వారికి వేరే ఆలోచనావకాశం లభించకుండా చేయడం నీ విధి.

సమ: చిత్తం. కళింగదేశ దండయాత్రకు యీ బలగం చాలదు. సైనికులు చేరడం సులభసాధ్యంగా లేదు.

రాధా: అది మీ ప్రబోధంపై ఆధారపడి వుంటుంది.

సమ: లేదు ప్రభూ! చల్లని వెన్నెలకై కన్నులప్పగించిన చకోరాలలా ప్రజలు శాంతికై పరితపిస్తున్నారు. సమరోత్సాహం జనుల్లో పట్టాభిషేకం చేసిన పశుగుణం పతనదశకు వస్తూంది. మానవత్వం తల ఎత్తుతూంది. అహింసా సూత్రం మానవు డింతవరకు ఎరగని ఏదో హాయిని, ఆనందాన్ని కలగ జేస్తుందనే ఆశ అందరినీ ఆవహించింది. యుగ యుగాలుగా వస్తూన్న యుద్ధ వాతావరణం నుంచి బైటపడాలని మానవుడు తహతహ లాడుతున్నాడు.

రాధా: బౌద్ధమతం వేళ్ళుబారుతూంది కదూ?

సమ: మతం కాదు. ఏదో మార్పు - పోల్చుకోలేని గొప్ప మార్పును అర్థిస్తున్నారు. ప్రస్తుత సాంఘికవ్యవస్థకు విసిగి వెఱ్ఱిగా ఎక్కడికో పరుగెత్తుతున్నారు.

అశో: సమరానందా!

సమ: రాజభృత్యుని ధర్మం నెరవేర్చాను.

అశో: ప్రజల మానసిక తత్వాన్ని గమనించలేకున్నావు. ప్రచార ప్రబోధాలతో స్వర్గాన్ని నరకంగా, నరకాన్ని స్వర్గంగా చిత్రించి నమ్మించవచ్చు.

మహా: ప్రభూ! కళింగదేశీయులు స్వతంత్రప్రియులు, వీరులు.

రాధా: అది హర్షింపతగ్గ సుగుణమే కానీ మన కడ్డురాదు. వీరులందరు అజేయులు కాలేరు.

మహా: మహాసాగరం వారి సైనికబలం!

అశో: అది మన విజయానికి వన్నెతెస్తుంది.

మహా: చిత్తం! ఎదిరిబలం తెలియజేశాను. దండయాత్ర ఇప్పుడు భావ్యం కాదు.

అశో: మహావీరా! మగధసామ్రాజ్యం పిరికిపందలకు నిలువ నీడకూడా ఇవ్వదు.

మహా: మగధ సామ్రాజ్యాధిపతులు ఒక్క సింహాసనానికే కాదు, సామాన్య ప్రజా హృదయాధిపతులు కూడా కావాలని కృషి చేశారు ప్రభూ!

అశో: ఈ సామ్రాజ్యం మౌర్యరాజన్యుల శౌర్యచిహ్నం.

సమ: అంతేకాదు. ప్రజలయెడ వారికి, వారియెడ ప్రజలకు గల అభిమాన చిహ్నం కూడా!

భౌతికబలం మాత్రం నిరుపయోగం. నైతికబలం అత్యవసరం. ప్రజాభిప్రాయ విరుద్ధమైన పనికి నైతికబలం వుండదు.

అశో: ప్రజ! ప్రజ! అర్థంలేని మాట!

మహా: ప్రభువులు ప్రశాంతంగా ___

అశో: మహావీరా! రేపే సుముహూర్తం. దండయాత్రకు సైన్యం తయారుచేయమని రాజాజ్ఞ.

మహా: ప్రభూ! ప్రజాకంటకం వద్దని ఘోషిస్తూంటే —

అశో: ఆజ్ఞాపాలనమే నీ కర్తవ్యం. మంచిచెడ్డలు మాకు.

మహా: సేవకధర్మం మానవుని హక్కైన యుక్తాయుక్త విచక్షణను తలదన్ని పోతుందా ప్రభూ?

అశో: మహావీరా! కృతఘ్నుడవు కాలేవు.

మహా: కావాలని నా ఆశ కాదు. క్షమించండి.

అశో: మరి.

మహా: విన్నవించుకున్నాను.

అశో: మేము ఆజ్ఞాపిస్తున్నాము.

మహా: ఆజ్ఞాపాలనమే మన కర్తవ్యం. సెలవు.

వెళ్ళారు.

అశో: గురూ! కర్తవ్యం?

రాధా: అశోకా! అవసరాన్నిబట్టి మానవజీవితం మారుతూంటుంది. నీతి, ధర్మం, ఆదర్శం అన్నీ యీ జానెడుపొట్టకు లొనినయి. ఇది మానవజీవిత రహస్యం. సైన్యంలో చేరి సమ్రాట్టుకు సహకారం చేయాల్సిన అవసరం సామాన్య ప్రజలలో కలిగించాలి. తెలిసిందా?

అశో: అవును. ఆకలి, ఆశ ఇవి రెండే మానవజీవితాన్ని శాసిస్తున్నవి. వీటిచేతనే మనం శాసించాలి.

రాధా: దేశభక్తి, వీరస్వర్గం అన్న పదాలే మత్తుమందు. వీటి పేరటనే ఆదినుంచి ఎన్నో హింసాచర్యలు జరిగినవి.

అశో: అభిమానం ఆవేశకారణం.

రాధా: ఇంతకూ మన అభివృద్ధి నిరోధకశక్తులు కొంత ప్రబలిపోతున్నారని పిస్తూంది.

అశో: ఎవరు? అహింసోపాసకులేనా?

రాధా: అవును. ప్రజలలో జొరబడే అవకాశం వారికి అనాలోచితంగా ఇచ్చేశాము. ఈ భిక్షువులు ఏంచేయగలరని ఉపేక్షచేసింది పొరపాటే.

అశో: ఇప్పుడు మించిం దేమిటి? వారి నణచివేయటం ఎంతోకాలం పట్టదు.

రాధా: ప్రజాహృదయాన్ని చూరగొన్నవారి నణచివేయడం అంత సులభం కాదేమో!

అశో: ప్రజ! ప్రజ! ఎక్కడి ప్రజ! కడుపును తొక్కిపడితే మిగిలిన శక్తులన్నీ పాదా క్రాంతం కాగలవు. భయంలేదు. [గంట మ్రోగించాడు. సేవకుడు వచ్చాడు.] కారాగారాధికారి చండగిరికుని తక్షణం రమ్మను.

సేవ: [వెళ్ళాడు].

అశో: ఈ దౌర్భాగ్యపు అహింసాతత్వం భారతజాతిని తినేస్తుంది. దీని నిర్మూలనమే భారతీయ అభ్యుదయం.

చండగిరికుడు: [వచ్చాడు] జయము మహారాజులవారికి!

అశో: ఈ సామ్రాజ్యంలోని బౌద్ధభిక్షువుల నందరిని బంధింపవలసిందిగా ఆజ్ఞ నిస్తున్నాము. నిలుచున్నవారిని నిలుచున్నట్లే కారాగారాని కర్పించాలి. రాజ ద్రోహులుగా పరిగణింపబడే వీరికి ప్రత్యేక కారాగారం. 'నరకమ'ని నామ ధేయం.

చండ: చిత్తం! శిక్షావిధానం?

అశో: అవసరాలను, అనుకూలాల ననుసరించి శిక్షలు ప్రయోగించే అధికారం నీది.

చండ: చిత్తం!

రాధా: ఈ భిక్షువులను ఒకటొకటిపేళ్ళతో పెకలించివేయటమే నీ విధి. న్యాయాన్యాయ విచారణ అక్కరలేదు. అవన్నీ మానవకల్పితాలే. పూర్వోక్త ధర్మాధర్మ తర్కం నీ హృదయాన్ని ఆవరించి అధైర్యాని కవకాశం యీకుండా కాపాడుకో.

చండ: బౌద్ధభిక్షువులను మాత్రమేనా?

అశో: తదనుచరులను కూడా.

చండ: విచారణకు ——

అశో: విచారణ విజయానంతరం. యుద్ధవైరుధ్యం ప్రబలకుండా చూడటం నీ విధి. రహస్యచారులు అవసరం.

చండ: ఆజ్ఞ. సెలవు.

రాధా: అశోకా! నా గురుత్వం సార్ధకం సఫలీకృతం చేశావు.

అశో: గురూ! పితృతుల్యులు మీరు. మీరు నింపిన శౌర్యం యింకా యీ రక్తాన ప్రవహిస్తూంది. మీరు వినిపించిన వీరగాధలే యింకా యీ చెవుల్లో మారు మ్రోగుతున్నవి. అశోకుని యోధునిగా, సమ్రాట్టుగా తీర్చింది మీరు. భారత దేశం అశోకునికి ఋణపడినది మీ ప్రసాదమే.

రాధా: భారతదేశాన్నంతా ఏకపాలన క్రిందికి తేగల ప్రభువు కావాలని ఆశించాను. నీలో అగుపడుతుందా శక్తి. రాజ్యాంగంలోని అగాధరహస్యాలు అవగాహన చేసుకున్నావు. విజయం నీది. నీ చరిత్ర సువర్ణాక్షరాలతో లిఖింపబడుగాక!

అశో: తమ ఆశీస్సు.

రాధా. [దీవించి వెళ్ళాడు]

తిష్య వచ్చింది.

అశో: తిష్యా! ఏమిలా వచ్చావు?

తిష్య: ఈ కుసుమంలో యీ వాసన ఎందుకొచ్చింది?

అశో: నిజమే. కానీ —

తిష్య: కానీ?

అశో: రాచరహస్యాలతో నిండిన వజ్రాల్లాంటి హృదయాలు రాపిడిపడే స్థలం ఇది. చీకటికోనల్లాంటి కనుగూళ్ళల్లో ఆకలిగొన్న పులుల్లా తిరుగుతూండే కనుపాపలు కలిసికొనే చోటిది. ఎన్నో దినాలుగా దాచుకున్న కోప, రోష పూరిత హృదయా లిక్కడ అగ్ని పర్వతాలలా పేలుతుంటవి. పూలు, వాసన ఇక్కడ అనుభవవేద్యం కావు.

తిష్య: ఈ తావిని ఆనందించే శక్తి, కాలం మీకు లేదు. అవునా?

అశో: వేళ్ళచేత భూమికి బంధింపబడ్డా, ప్రేమచేత చెట్టు తన సర్వస్వం ఆకాశం వంకకే అర్పిస్తూంటుంది. మానవునికి విధి వేళ్ళలాంటిది.

తిష్య: నీరు పల్లానికి ప్రవహిస్తుంది, కానీ తన జన్మస్థానాన్ని మరల చేరుకోగల శక్తి దానికి లేదు. పిట్టలు ఆకాశంలోకి ఎగిరిపోతవి కానీ, మరల ప్రియురాలిని కలుసుకోగలవు.

అశో: పోనీలే తిష్యా! ఏదీ ఆ పువ్వు.

తిష్య: నలి పేస్తారా?

అశో: ఎందు కంత భయం? అబ్బ! ఎంత వాసన - భరించలేకున్నాను.

తిష్య: భరించటానికి కానిది బాధే కదూ!

అశో: ఆ పరిమళం చిన్ననాటి దృశ్యాలను జ్ఞాపకం చేస్తూంది. అది బాధాకరం. మరణించినవారి జీవితరహస్యాలు మరణించబోయే వారి కెలా బాధాకరాలో, అలా నేటి యవ్వనం నాటి బాల్యాన్ని తలచుకొని ఏడుస్తూంది.

తిష్య: కానీ అనంతమైన జీవితం ప్రేమోపాసకుడైన మౌనివలె యీ యద్వాన వార్ధక్యాలవంక చిరునవ్వుతో చూస్తూంటుంది.

అశో: ఏమో! ప్రేమ జీవితం అనంతం. నా కేమీ అర్థంకాదు.

తిష్య: అవును. వినాశం వంకకు సౌఖ్యం అనుకొని అత్యుత్సాహంతో పరువెత్తుతూండే ప్రపంచానికి స్వర్గసందేశాన్ని తెచ్చే ఆశ నిరాశల ఆచ్ఛాదనంలేని నా చిన్నిపాపాయి చిరునవ్వు అర్థంకాదు. పోనీ - వీణ మీటనా?

అశో: వీణ! వీణ కాదు, తిష్యా! ఢంకా - భేరీ!

తిష్య: మరల యుద్ధమా?

అశో: అవును.

తిష్య: మరి సెలవు.

అశో: ఏం?

తిష్య: నా కింక చోటులేదు.

అశో: తిష్యా!

తిష్య: క్షమించండి.

అశో: వెళ్తున్నావా?

తిష్య: మీరే వెళ్ళగొడుతున్నారు.

అశో: ఎవర్ని?

తిష్య: ప్రేమను.

అశో: ఎక్కడికి?

తిష్య: ఈ మీ సామ్రాజ్యపు పొలిమేరలు దాటి.

అశో: నీ ఊహాసామ్రాజ్యంలోకి వెళ్తావా?

తిష్య: మీకు ఊహాతీతమైన సామ్రాజ్యంలోకి. ప్రేమ సామ్రాజ్యం.

వెళ్ళింది.

అశో: ప్రేమ! ప్రజ!



# రెండవ రంగం

ఈ తెరతీయగరాదా?
మము దరిజేర్పగరాదా? ప్రభు!
చిరుచిరునవ్వుల చిందెడికూనను
వలపుల తేనెల చిలికెడి కాంతను
తెరద్రోసికొని త్యజియించిన ప్రభు!
చీకటితెరలను చీల్చుకుపోయి
సత్యామృతమును సాధనజేసి
పీడిత దుఃఖిత జగతికి పంచిన ప్రభు!

మహావీరుని మందిరం. శాంతి ఉంది.

మహా: శాంతీ! ఎప్పుడూ ఎందు కిలా తెల్లటి పూలు జడనిండా తురుముకుంటావు?

శాంతి: స్వచ్ఛమైన వెన్నెల, తెల్లటి మల్లెపూలు నా కతి ప్రియం.

మహా: ఆ మందారాలు అందంగా లేవూ? ఎప్పుడూ వాటివంకే పోవు. ఎందుచేత?

శాంతి: నాకు భయమేస్తుంది.

మహా: పూలను చూచి భయమా!

శాంతి: అవును. అబ్బ! ఎంత ఎరుపు!

మహా: ఆ కల్హారం?

శాంతి: అబ్బ! అదీ అంతే! భూమాత ఎందు కిలా రక్తాన్ని చిమ్ముతూంది?

మహా: ప్రకృతి అంతా ధవళమైతే అందం ఏముంటుంది శాంతీ.

శాంతి: అది కాదు. ఆ రక్తరాగాన్ని సహించే శక్తి నా యీ గుండెకు లేదు. ఏం చేయను?

మహా: వీరభారతనారీలోకానికి చెందినదానివన్న విషయం విస్మరిస్తున్నావు శాంతీ!

శాంతి: రక్తాన్ని త్రాగటం వీరత్వం కాదు! రాక్షసత్వం.

మహా: శాంతీ! సకలజగజ్జనని అయిన కాళికామాతకు రక్తం ఎంత ఇష్టమో తెలుసా? ఉదాత్తులైన దేవతలు కూడా రక్తహోమం చేస్తే సుముఖులౌతారట.

శాంతి: వట్టి అబద్ధం. క్రిమికీటక మృగాద్యవస్థలు దాటివచ్చిన మానవుడు దేవతలను గూర్చి అంతకన్న అధికంగా ఊహించుకోలేకున్నాడు.

మహా: నువ్వూ బౌద్ధసన్యాసివి కానున్నావేం?

శాంతి: సన్యాసి కానక్కర్లేదు. మానవులు మానవులుగా ఉంటే చాలు.

మహా: శాంతీ! యుద్ధరంగాన్ని ఊహించుకోగలవా?

శాంతి: అహో!

మహా: అక్కడ ఒక్కపొద్దు నిలబెడితే ఏమవుతావు?

శాంతి: కళ్ళనిండుకు ఒక్కసారి ఏడుస్తాను.

మహా: భయంవల్ల కదూ?

శాంతి: కాదు ప్రేమవల్ల - జాలివల్ల!

మహా: అదే దౌర్బల్యం!

శాంతి: అలాగైతే మనం నిర్భయంగా నిశ్చింతగా మృగాలు కావచ్చు.

నేపథ్యంలో

కళింగదేశ దండయాత్రకు సర్వసేనాధిపతులు సాయంకాలాని కంతా హాజరు కావలసింది.

శాంతి: మరల యుద్ధం!

మహా: అవును. ఏదీ - త్వరగా నా దుస్తు లందుకో. కవచం - కరవాలం - బల్లెం - ఆ డాలు కూడా!

శాంతి: [వెళ్ళింది]

నిరూప వచ్చింది.

మహా: అమ్మా!

నిరూ: నాయనా! కళింగదేశ దండయాత్ర నిశ్చయమైందా.

మహా: అవునమ్మా!

నిరూ: మీ నాన్న, మీ తాత యీ వయసుకే ఎన్ని యుద్ధాలు చూచారు. ఎన్ని జయించారని. నువ్వు అచ్చం మీ తాతగారి పోలికే సుమా!

మహా: అత్తాకోడళ్ళల్లో ఎంత భావభేదమమ్మా!

నిరూ: దాని దెప్పుడూ అంతేలే! పసితనం, ఏం తెలుస్తుంది చెప్పు.

మహా: పేరుకు తగ్గట్టు ఎప్పుడూ శాంతి శాంతి అంటూంటుంది.

నిరూ: రాజధర్మమైన యుద్ధాన్ని కూడా హింసగా చూస్తారు ఈ బౌద్ధభిక్షువులు. దానికీ ఆ తత్వం పట్టుబడుతూంది.

మహా: అవునుగానీ, నువ్వైనా చెప్పమ్మా దిగులుపడవద్దని.

నిరూ: దిగులేముంది. నాయనా! చూడు. నా చిన్నతనంలో మీ తాతగారు మహా రాజును ఓ యుద్ధంలో అపమృత్యువు నుంచి కాపాడారట. అందుకు మహా

రాజులవారు మీ తాత కో రత్నాలు చెక్కిన కత్తి బహూకరించారు. మీ నాన్న ప్రతిసారి యుద్ధానికి వెళ్ళేముందు ఆ కత్తికి నమస్కరించి మరీ వెళ్ళేవారు. అపజయం అన్నమాటే ఎరుగరు ఆయన కాలంలో.

మహా: నేనూ నమస్కరించే వెళ్తానమ్మా!

నిరూ. మంచిది నాయనా! ఈనాటికీ ఏమాత్రమైనా ఉడుకునెత్తురు మనలో ఉందంటే ఆ మహావీరుల గాథలే కారణం. భారతదేశాన్ని సజీవంగా వుంచింది వారు. ఈనాడు ఆ భారం మీమీద వుంది నాయనా!

మహా: కన్నతల్లి ఆశీస్సుంటే ముల్లోకాలు జయించవచ్చమ్మా?

నిరూ: పుత్రుని చూచి గర్వించగలిగే భాగ్యం ఈ జన్మలోనే అందరి తల్లులకూ కలుగుతుందా నాయనా!

మహా: శాంతీ!

శాంతి: [లోనుంచి] నేను వీటిని ధరించలేకున్నాను.

వెళ్తాడు.

నిరూ: అయ్యో నాయనా! దాన్ని తెమ్మన్నావా? అది తాకుతుందా? దాని ఒళ్ళు జల్లుమంటుంది. ముచ్చెమటలు పోసి మూర్ఛపోతుంది. పసితనంలో మీ నాన్నకు నేను స్వయంగా తొడిగేదాన్ని ఆ కవచం.

మహా: సరే నేనే వెళ్ళొస్తా — [వెళ్తాడు]

శాంతి: [వచ్చింది] అత్తా! నా కాళ్ళు తేలిపోతున్నవే!

నిరూ: మరీ పసిపిల్ల వవుతున్నావు శాంతీ!

శాంతి: నా కళ్ళు మూతలుపడుతున్నాయి.

నిరూ: వీరపత్ని కావడం పూర్వజన్మ సుకృతం కాదటే! అందరికీ లభిస్తుందా? తిలకం తేలేదూ!

శాంతి: నా చేతులు వణికిపోతున్నవే! తిలకం దిద్దలేనేమో!

నిరూ: అలా అనకు తల్లీ! ఆ తిలకమే భారతజాతికి అంగరక్ష! అంత దిగులుపడితే ఎలాగే! ఈ ఇంటి కోడలి కెవ్వరికీ లే దీ దిగులు. శాంతీ!

శాంతి: అత్తా! ఆయన వస్తున్నారు. అబ్బ!

మహా: కళ్ళు తెరచి చూడు, శాంతీ!

శాంతి: కళ్ళు తెరచినా నీటితెరలు అడ్డువస్తున్నాయి.

మహా: పిచ్చిదానవు శాంతీ!

నేపథ్యంలో భేరి.

అదిగో పిలుపు. తల్లీ! ఆశీర్వదించు.

నిరూ: కన్నతల్లిప్రేమ కేదైనా శక్తి వుంటే అదే నిన్ను రక్షిస్తుంది నాయనా! వెళ్ళిరా విజయలక్ష్మితో. శాంతీ! తిలకం దిద్దు!

శాంతి: [తిలకం దిద్దుతూంది]

మహా: చేతులు వణకుతున్నా యెందుకు!

శాంతి: కాళ్ళు తేలిపోతూన్నందువల్ల. కూలిపోతానేమో!

మహా: పదిరోజులపాటు కూడా కాలేదు. రేయిపూచి తెల్లవారునంతలో రాలిపోయే పారిజాతాలలా మన జీవితాలు....

మరల భేరి.

మహా: వెళ్ళిరానా?

శాంతి: [పలకదు]

మహా: పలకవేం?

శాంతి: పలుకు రాలేదు.

మహా: ఒక్కసారి నవ్వు.

శాంతి: వేదనతోటి నవ్వు వెలితిగా వుంటుంది.

మహా: నాకు అందం అగుపిస్తుంది.

శాంతి: నాకు ఆనందం లేదు.

మహా: పోనీ - నాకోసం నవ్వు.

శాంతి: నవ్వనా - [మరల భేరి] ఆ భేరీ వికటాట్టహాసం నన్ను నవ్వనిస్తేనా?

మహా: మూడుమార్లు మ్రోగింది కదూ?

శాంతి: అవును.

మహా: ఆలస్యమవుతుంది అమ్మా! వెళ్ళిరానా ——

నిరూ: చిరునవ్వుతో పంపు శాంతీ!

శాంతి: స్త్రీ చిరునవ్వుకన్న కన్నీటికే శక్తి అధికం.

మహా: వస్తా శాంతీ!

వెళ్తున్నాడు.

శాంతీ అన్న పిలుపుమాత్రం వినపడుతూంది. శాంతిమాత్రం నిలబడివుంది నిర్జీవ స్వర్ణప్రతిమలా.



# మూడవ రంగం

బౌద్ధ విహారం. కొందరు ఉన్నారు.

1: కళింగదేశంవారు వీరావేశంతో పోట్లాడుతున్నారట.

2: స్వతహాగా వాళ్ళు శౌర్యధనులు, స్వాతంత్ర్యప్రియులు.

3: ఊర్కే ఊరేగడమే కానీ మనవాళ్ళు జయించడం అవుతుందా పాడా!

2: ఇంటిపట్టున ఊర్కుండిపోక యీ యుద్ధం ఒకటి మన నెత్తిమీదికి.

3: శ్!

1: భయ మేమిరా?

3: చండగిరికుడు వాడి అనుచరులు నీడలా ఎప్పుడూ మన వెంటనే వుంటారు.

1: మహానుభావుల్ని, మంచి చెప్పినవారినే కొట్లో పెడుతూంటే మనకేనా వచ్చింది.

2: మరీ దౌర్జన్యమైపోతూంది. ఎన్నాళ్ళీ ప్రభుత్వం?

1: మనం చేతగాక చేతులు పిసుక్కుంటూన్నన్నాళ్ళు.

3: కొసకి కూటికి గుడ్డకి వాచిపోయే రోజులు ముందున్నాయ్.

1: కూటికి తరువాత, ఇప్పటి మాట?

4: మనలోనూ వుంది బుద్ధితక్కువ. ఇందరు పరుగు పరుగున యుద్ధానికి పోటం ఎందుకు?

1: కడుపు కాలి, పోతున్నారుగానీ. అభిమానం ఏడ్చా?

2: అవునుగానీ, ఈ బౌద్ధభిక్షువులను పిట్టలలా కొట్టుకపోతున్నా రెందువల్ల?

3: అహింస బోధిస్తారని.

2: వీళ్ళు బోధించేది ఏమన్నా సాగుతుందనా? వింటూంటే వీళ్ళ లోకం స్వర్గంగా వుంటుంది.

3: సాగకేం. అందరికీ అర్థమైతే - ఏకమైతే ఎందుక్కాదురా?

1: ఆఁ - అసలు రాజుకు హృదయం మారాలిరా! కాకుంటే ఈ కడుపుచేతపట్టుకున్న బడుగులవల్ల ఏమవుతుంది?

2: రాజుల హృదయం కరగదు. మన కీ స్వర్గం కలగానే వుంటుంది.

4: [మెల్లగా జారుకున్నాడు]

3: నరకం నరకమేనట.

1: చండగిరికుడి దౌర్జన్యం మరీ యిద్దైపోతూంది. కసాయి!

2: రాణిగారితో విన్నవించుకుంటే?

3: రహస్యంగా తెలిసింది రాణిగారికి - రాజుకు కాదట.

2: ఆమె ఏమంటుంది? యుద్ధం వద్దంటుందా?

1: మహాత్ములు వస్తున్నార్రా!

ప్రేమానందుడు వచ్చాడు.

ప్రేమా: ఆకాశం మెరుస్తూంది. అశనిపాతాలిక ముందున్నాయేమో!

1: అంత భాగ్యమా! కరువులో ఇంకా ఎందరు చావాలో!

ఒక యోధుడు వచ్చి సన్యాసి కాళ్ళమీద వాలాడు.

యోధు: రక్షించండి!

ప్రేమా: లే నాయనా లే!

యోధు: నన్ను చావునుంచి తప్పించండి, రక్షించండి!

ప్రేమా: ఏమైంది? ఎందుకంత భయం, చెప్పు.

యోధు: ప్రభుత్వం నాపైన పగతీసుకుంటుంది.

ప్రేమా: ఎందుకు?

యోధు: నమ్మకద్రోహం చేశానట.

ప్రేమా: ఏం చేశావు?

యోధు: యుద్ధంలో చేరాను. ఆ హింస చూడలేక సహించలేక తప్పించుకొచ్చాను.

ప్రేమా: అయితే?

యోధు: ప్రభుత్వం నన్ను క్షమించదు. నాకోసం భటులు వెతుకుతుంటారు.

1, 2, 3: పాపం!

యోధు: రక్షించరూ?

ప్రేమా: నేనా?

ప్రభుత్వం కోపగిస్తే యీ బడుగుసన్యాసి ఏం చేయగలడు నాయనా?

యోధు: మీరే రక్షించకుంటే ఇంకెవరున్నారు? మీ అహింసాతత్వం ఏమైంది? మీ భూతదయ, ప్రేమ ఏమైనవి? బుద్ధభగవానుడు మీకు ఆశ్రితరక్షణం నేర్ప లేదూ? మీవి వట్టి వుపన్యాసాలేనా?

ప్రేమా: ఆగు నాయనా? ఆవేశపడకు. నా అభ్యంతరం ఏమీలేదు, కానీ నిజం నీకు తెలీదు. నీకన్న నేనే మృత్యువుకు చాలా సమీపంలో వున్నాను. అనుక్షణం నన్ను నీ శత్రువులు వెంటాడుతుంటారు. నిన్ను నీ శత్రువుచేతి కతిత్వరగా

అందిచ్చినవాణ్ణి అప్పతానేమో నని నా భయం. నా ఆశ్రయంవల్ల నీకు భద్రత వుండదు.

చండ: ఏయ్! ఆగండి!

ప్రేమా: రా నాయనా! కూర్చో.

చండ: కూర్చోటానికి కాదు, కూర్చోబెట్టటానికే వచ్చాం. ఎవరైనా కదిలారా ప్రాణాలు దక్కవు. జాగ్రత్త. నిన్ను బంధిస్తున్నాం.

ప్రేమా: నన్నా!

చండ: అవును నిన్నే! బౌద్ధవిహారాధిపతివి నువ్వేనా?

ప్రేమా: అధిపతి, ఇదిగో యీాయన.

బుద్ధ విగ్రహం చూపుతాడు.

చండ: ఆయన చచ్చాడు. తరువాత?

ప్రేమా: నువ్వు చావనున్నావు.

చండ: అధికప్రసంగం. నువ్వేనా ప్రేమానందుడవు?

ప్రేమా: అవును.

చండ: సరి. నడు శ్రీకృష్ణజన్మస్థానానికి.

ప్రేమా: ఎందుకు?

చండ: రాజాజ్ఞ.

ప్రేమా: అది కారణం కాలేదు.

చండ: అంతకన్న నీ కవసరంలేదు. నడు.

ప్రేమా: నా కవసరముంది. కారణజ్ఞానం నా కవసరం. నేను రాజభృత్యుణ్ణి కానుగా.

చండ: [తతిమ్మావారితో] మిమ్మల్ని బంధిస్తున్నాను.

ప్రేమా: వాళ్ళ నెందుకు?

చండ: అది నీ కెందుకు?

ప్రేమా: వాళ్ళు నా అనుచరులు కారు.

చండ: అది మాకు తెలుసు.

ప్రేమా: మమ్మల్నెక్కడికి తీసుకెళ్తారు?

చండ: నిన్ను మహారాజుల దగ్గరకు.

ప్రేమా: నిజంగా!

చండ: నిన్ను మాత్రం తమ సమక్షానికి తెమ్మని ఆజ్ఞ.

ప్రేమా: యుద్ధరంగానికేనా?

చండ: అవును. ఏయ్! నువ్వు మరల యుద్ధానికి పోవాల్సిందే.

యోధు: బాబూ దయబెట్టండి! ఏం చేయమన్నా చేస్తాను. ఆ హింసను మాత్రం సహించలేను.

చండ: ఆఁ ——

ఫట్ ఫట్.

ప్రేమా: ఆగు నాయనా! ఆగు!

చండ: నడవండి - ఊఁ - నడవండి. కర్కోటకా! మిగిలిన బౌద్ధసన్యాసులను కనిపెడుతూండు.

1, 2, 3: కర్కోటకుడా వీడు!



# నాలుగవ రంగం

యుద్ధరంగం. రేయి. కారుచీకటి.
అశోకుని శిబిరం. మసక మసకగా ఒక కాగడా వెలుగుతూంది.
కాగడా ముందు అశోకుడున్నాడు. ద్వారంవద్ద భటుడు

సమరానందుడు వచ్చాడు.

సమ: అందరూ అప్రమత్తులుగా వున్నారు ప్రభూ!

అశో: అన్ని శిబిరాలు సురక్షితంగా వున్నాయా?

సమ: చిత్తం.

అశో: మహావీరుని కేలాగుంది?

సమ: బాధ అధికంగా వుంది.

లోనుంచి.

శాంతి! శాంతి! ఇంకెన్నాళ్ళకు శాంతి!

అశో: ఎవరది? బౌద్ధపిశాచం కాదుకదా?

సమ: కాదు మహావీరుని కంఠంలా వుంది.

మహావీరుడు వచ్చాడు.

అశో: ఏమది? మహావీరా! ఎవ రా శాంతి?

మహా: ప్రభూ! నా ప్రియురాలు.

అశో: నీ ప్రియురాలు! నిజం?

మహా: నిజం ప్రభూ!

అశో: సరి, వెళ్ళు.

మహా: [వెళ్తున్నాడు]

అశో: ఆఁ - ఇదిగో, ప్రియా! అని సంబోధించు.

మహా: ఏం ప్రభూ!

అశో: శాంతి శబ్దం సమరరంగంలో ఎవరి నోట రారాదు.

మహా: ప్రభూ!

బానిసత్వపు అధమస్థితిని ఆజ్ఞాపిస్తున్నారు. మానవజన్మనే అవమానిస్తున్నారు. ఇంతటి భయంకర, అసహ్య పర్యవసానం కలుగుతుందనుకోలేదు. ఈనాడు తెలుసుకున్నాను. మానసిక స్వేచ్ఛను అరికట్టడం ప్రభుత్వపు పని

కాదు. శారీరకంగా మానవుడు అమ్ముడుపోవడం భావదాస్యానికి దారితీస్తుంది ప్రభూ!

అశో: మహావీరా!

మహా: క్షమించండి. ప్రేమకు దయకు జాలికి స్థానం యీలేని యీ కొలువుతో నాకు పనిలేదు. నా జీవితాన్ని నా జీవశక్తిని నా సర్వస్వాన్ని అర్పించి ఈ పాపానికి రూపం యిచ్చి, ప్రాణంపోశాను. ఎంత వికారంగా కావాలో అంత వికారంగా తయారయింది. ఇక చూడలేను.

అశో: మహావీరా! రాజక్షేమాన్ని ఆశించి —

మహా: రాజు, రాజ్యం! శాంతి శబ్దానికే భయపడే రాజు, ఆ శబ్దస్పర్శ మాత్రాన నీరసించిపోయే యోధులు ఎందుకు? మీ హృదయం ఎంతటి కర్కశ శిలాఫలకమైందో చూడండి. ప్రియాంగనా నామస్మరణమాధుర్యాన్ని ఎరగలేని కటిక గుండె.

అశో: ఇది రాజాజ్ఞ!

మహా: ఇవి నన్ను బంధించవు. అజ్ఞానం విచ్ఛిన్నమైననాడు మీ ఆజ్ఞాబంధాలు తెగిపోతవి. ఇదిగో నా కరవాలం.

అశో: [1]అవసరపడుతున్నావు.

మహా: లేదు.

అశో: రాజధిక్కారము.

మహా: కావచ్చు.

అశో: శిక్షార్హుడవు.

మహా: ఆ అధికారం మీ కింక లేదు.

అశో: సమరానందా! బంధించు.

మహా: మహావీరుడింకా మీ బానిస కాడు.

అశో: బానిసకాడు, బందీ.

మహా: మహావీరుని ఉడుకురక్తం ఇంకా చల్లారలేదు. ఒక్క అణువు కూడా అవమానాన్ని సహించదు.

అశో: బంధించండి.

---

1. తొందరపడు అర్థంలో మాండలిక ప్రయోగం.

మహా: వీరోచితమైన కార్యం చేయండి. ఇన్నాళ్ళూ ఆత్మవంచన కీ కరవాలాన్ని వినియోగించాను. ఈనాడు శుభదినం. ఆత్మగౌరవసంరక్షణానికి వినియోగిస్తాను.

అశో: ఆఁ - సమరానంద్!

ఇరువురూ ఢీకొంటారు.

అశో: [గంట కొడతాడు. భటులు వస్తారు] బంధించండి.

భటులు మహావీరుని పట్టుకుంటారు.

మహా: సమరానంద్! ఇది శాశ్వతం కాదు. నీకూ సమానభాగం వుంది.

అశో: తీసుకెళ్ళండి.

వెళ్లాడు.

[లోనుంచి] దాహం! దాహం! అబ్బా! గొంతెండుకపోతూంది. ప్రభూ! సమ్రాట్! దాహం!

అశో: ఎవర్రా! నీళ్ళు!

భటు: లేవు ప్రభూ!

అశో: లేవూ. దాపున్నే మంచినీళ్ళ కొల నుంది. వెళ్ళు - త్వరగా ——

సమ: ఉపయోగంలేదు ప్రభూ! అంతా రక్తసిక్తమైపోయింది.

అశో: ఆఁ - పోనీ ఆ నీళ్ళే తెచ్చి యివ్వండి.

సమ: త్రాగనంటున్నాడు.

అశో: త్రాగనంటున్నాడూ?

సమ: అవును. మరణిస్తాడు.

అశో: మరణించకూడదు. ఇదో నీళ్ళు నా పానపాత్రలో వున్నాయి. తీసుకెళ్ళు. ఆ ఒక్కజీవిలో విజయాక్షరా లుండవచ్చు. ఎవ్వరినీ మరణించనీకూడదు.

చండగిరికుడు వచ్చాడు.

చండ: జయము మహారాజులవారికి!

అశో: చండగిరికా! ఏ మింతదూరం వచ్చావు?

చండ: ప్రభువుల ఆజ్ఞ శిరసావహించి.

అశో: కృతకృత్యుడ వయ్యావా?

చండ: తమ దీవన! దయ!

అశో: భేష్! ఏడీ ఆ బౌద్ధసన్యాసి?

చండ: వాకిట ఉన్నాడు.

అశో: ప్రవేశపెట్టు.

చండ: యుద్ధరంగంనుంచి పరుగెత్తి బౌద్ధుల నాశ్రయించిన యోధుడు కూడా వున్నాడు.

అశో: ముందతన్నే ప్రవేశపెట్టు.

చండ: చిత్తం!

వెళ్లాడు.

ఒక యోధుడు వచ్చాడు.

అశో: ఏమిరా?

యోధు: ప్రభూ! నావలన కాదు. ఈ హింసను నేను సహించలేకున్నాను.

అశో: సమరానందా! ఏమంటావు?

సమ: అందరూ ధీరులు కాలేరు ప్రభూ!

అశో: భీరువులు ప్రమాదకారకులు. ఇది మహావ్యాధి! అల్లుకొని అంతా ధ్వంసం చేస్తుంది. అయితే ఏమంటావురా!

యోధు: నన్ను వెళ్ళనీండి ప్రభూ! ఈ పాపపరిహారార్థం ప్రశాంత దేశాంతరాలైనా వెళ్ళనీండి.

అశో: పాపమని ఎవరు చెప్పారురా!

యోధు: ఇందర్ని అన్యాయంగా చంపుతున్నాను ప్రభూ! వీళ్ళంతా నాకు విరోధులా? వీళ్ళు ఏంచేశారని చంపాలి! వాళ్ళ ఆలుబిడ్డల వుసురు నాకు తగలదూ? నన్ను వెళ్ళనీండి ప్రభూ! నాకీ కొలువు వద్దు.

అశో: వీణ్ణి సజీవంగా దహించేయండి.

యోధు: బాబూ - బాబూ - బా ___

తీసుకెళ్లారు.

అశో: ఆ సన్యాసిని తీసుకరా! ఈ దాపున ఒక్కడూ వుండకూడదు.

నేపథ్యంలో

నగరం యథా పచ్చంతం
గుత్తం సన్తరబాహిరం

యేవం గోపేథ అత్తానం
ఖణోవేమా ఉపచ్చగా

ప్రేమానందుడు వచ్చాడు.

అశో: సమరానందా! నువ్వొ —

సమ: [వెళ్ళాడు]

ప్రేమా: ప్రభూ! చమురైపోయింది. కాగడా ఆరిపోతూంది. ఏదీ చమురు. [దాపున్నేవున్న చమురు తీసిపోస్తూ] ప్రతి ఒక్కరికీ ఒక కాగడా వుంది. కానీ వెలగటంలేదు. వెలిగితే ఇంత అంధకారం ఎందుకుంటుంది:

అశో: ఎవరు నువ్వు?

ప్రేమా: ప్రభూ! ప్రతి ఒక్కరికీ ఒక కాగడా వుందికదూ?

అశో: వుంది.

ప్రేమా: ఎందుకు వెలగటంలేదు?

అశో: యుద్ధకాలంలో అది ప్రమాదకరం!

ప్రేమా: అంధకారం వుంటేనేగాని హింస సాగదు. అవును.

అశో: ఎవరు నువ్వు?

ప్రేమా: అహింసోపాసకుణ్ణి, హింసోపాసకుల తోబుట్టువును.

అశో: ఇక్కడి కెందుకొచ్చావో తెలుసా?

ప్రేమా: చావనున్నవారి చెవుల్లో శాంతిశబ్దం వోయటానికి.

అశో: నువ్వెక్కడున్నావో తెలుసా?

ప్రేమా: ఎరగకేం? అమాయకులు, నిరపరాధులు ప్రతిఫలాపేక్షలేకనే బలి అయ్యే చోటు.

అశో: నేనెవరో ఎరుగుదువా?

ప్రేమా: బలితీసుకొంటూన్న దేవతవు.

అశో: ఆఁ, ఎంత నిర్భయత్వం!

ప్రేమా: సత్యానికి జన్మస్థానం అదే.

అశో: నువ్విప్పుడు బంధితుడవు.

ప్రేమా: నేను కాదు, మీరు. అజ్ఞానబద్ధులు. నేను మీ ఆజ్ఞాబద్ధుణ్ణి. ప్రథమం బాధాకరం. ద్వితీయం శోభాకరం.

అశో: మీ అనుచరులందరూ బంధితులు.

ప్రేమా: రత్నాలు కట్టుబడ్డప్పుడే ప్రకాశింపగలవు.

అశో: మీరు రాజద్రోహులు.

ప్రేమా: ప్రజాసేవకులం. రాజు ఒక్కడు. ప్రజలు పదుగురు.

అశో: రాజద్రోహానికి శిక్ష శిరశ్ఛేదం.

ప్రేమా: రాజసేవకూ ద్రోహానికీ ఒకటేనా శిక్ష ప్రభూ! ఈ యోధులందరూ రాజ సేవకులు. వీరి శిరాలు ఛేదింపబడుతున్నాయి. రాజభక్తులకు, ద్రోహిగా పరిగణింపబడే నాకు ఒకటేనా శిక్ష?

అశో: అధికప్రసంగం. శిక్షకు సంసిద్ధుడవేనా?

ప్రేమా: పుణ్యం అవమానాన్ని. హింసను సహిస్తుంది. పాపం ఎదురుతిరుగుతుంది.

అశో: తుదిగా నీవు చెప్పుకోవలసిం దేదైనా వుందా?

ప్రేమా: వుంది. ఒక్క అయిదునిముషాల వ్యవధి చాలు.

అశో: ఊఁ - కానీ —

ప్రేమా: సమ్రాట్! ఇదేమిటో ఎరుగుదువా?

అశో: కపాలం.

ప్రేమా: ఈ కపాలపు పూర్వపశ్చాచ్చరిత్రను ఒక్కసారి స్మరించుకోగలవా?

అశో: వృధాకాలయాపన! నీ కున్నది అయిదునిముషాలు మాత్రమే.

ప్రేమా: నిజం పలికావు. నాకేకాదు, ఈ మానవుల కందరికీ వున్న కాలం అతి స్వల్పం. విను.

ఈ కపాలం ఎన్నిరాజ్యాల నేలింది, ఎన్ని యుద్ధాలు చేసింది, ఎన్ని శత్రు శిరాలు భుజస్కంధాలనుండి దొర్లిపోగా చూచింది.

ఈ కపాలమే మానవజీవితం సౌందర్యమయం సుఖమయం కావాలని ఎన్ని పూదోటలు. ఎన్ని విలాసమందిరాలు, ఎన్ని హంసతూలికలు నిర్మించింది.

ఈ కపాలం మానవజీవితం విజ్ఞాననిలయం కావాలని ఎన్ని కావ్యాలు, శాస్త్రాలు, కళలు చేకూర్చింది. మానవజీవితాన్ని ఒకవంక కళాసీమగా, మరో వంక గొప్ప తపస్సుగా చేసింది. కానీ ఇప్పుడు దీని గతేమిటి?

అశో: నీకు రానున్నగతి.

ప్రేమా: మర్త్యుల కిందరికీ అదేగతి. కానీ ఇంత కృషి ఈ కపాలంచేత చేయించిం దేమిటి?

అశో: విధి.

ప్రేమా: కాదు. ఆశ. ఆనందానికి సుఖానికి తన జీవితంలో తన కార్యాల ఫలితం అనుభవించిందో లేదో - మన యీనాటి మంచిచెడ్డలకు యీ కపాలమే - ఈ నిర్జీవ కపాలమే కారణం.

అశో: అయితే నువ్వనే దేమిటి?

ప్రేమా: నీ చేతకు నీతో పోవు. నీ పాపపుణ్యాలకు నీకన్న ఇతరులే అధికంగా అనుభవిస్తారు. సత్కర్మ చేయటం మానవధర్మం. సమ్రాట్! పూర్వీకులు సాధింప దలచి, ప్రయత్నించిన దేవత్వానికి దగ్గరకుపోవటం సత్కర్మ. మారం పోవటం కాదు. యుగయుగాలుగా ఆ మహనీయులు ఆర్జించిన మానవత్వాన్ని దగ్ధం చేయటం కాదు. ప్రపంచకళ్యాణానికై వారు చేసిన యీ సేవను నిర్మూలించటం కాదు. రక్తస్నానం చేయటం కాదు.

అశో: ఆగు - [ద్వారం ముందెవరో పరుగెత్తినట్టుంది] ఎవరది - ఎవరా పరుగెత్తింది? బంధించు. - అయిపోయిందా?

ప్రేమా: మహారాజులకు మరింత విశదంగా చెప్పాల్సిన అవసరంలేదు కాబట్టి.

అశో: నీ మతం మార్చుకోగలవా?

ప్రేమా: మృగం కాలేను.

అశో: ఎవరది [ఒక స్త్రీని సేవకుడు తెచ్చాడు] ఎవరు నువ్వు?

ప్రేమా: ఆమె రాకకు కారణం నేను చెప్తాను సమ్రాట్! మీ సామ్రాజ్య కాంక్ష.

అశో: ఏమన్నావు?

ప్రేమా: నిజం పలికాను. మీ యుద్ధం ఆమె నీ దౌర్భాగ్యస్థితికి దింపింది. శీలాన్ని అమ్ముకుంటేగానీ జీవించలేని అధమస్థితి కల్పించింది. అమానుషజీవిని చేసింది. ఇప్పుడైనా ఆలోచించండి. ఎవరి సుఖాని కీ యుద్ధం?

అశో: భావి ప్రజాసుఖానికి.

ప్రేమా: భావిప్రజకు మీ కందివ్వబోయే రాజ్యసుఖం కన్న యీ పాపభారం అధికం. విరుగుటకన్న పెరుగుట అధికం ఈ పాపానికి.

అశో: ఎవరు నువ్వు?

ప్రేమా: ఎవరి రాజ్యం తల్లీ?

స్త్రీ: అశోక మహారాజులది.

ప్రేమా: నీ పేరు?

స్త్రీ: కాంత.

అశో: ఎందు కొచ్చావు?

కాంత: ..........

ప్రేమా: నీ భర్త లేడామ్మా?

కాంత: యుద్ధంలో చనిపోయారు. పిల్లలు కలవాన్ని. బ్రతుకులేదు. ఊరంతా కరువు, నాలా ఎందరో —

ప్రేమా: శాంతిశ్శాంతిః

అశో: ఎవరక్కడ - ఈ పిశాచాలను నరకంలో తోయండి.

కాంత: నరకంలోనా? నా బిడ్డలు, నా పసికూనలు ఏమౌతారు? వారికోసం నా జీవితాన్ని. నా శీలాన్ని ఆరోగ్యాన్ని నాశనం చేసుకున్నాను. మాతృత్వమైనా నిల్పండి. నన్నా అశోకసమ్రాట్టు దగ్గరకైనా పోనీండి. ఈ అధర్మాన్ని ఆయన అవునంటాడూ? ఎక్కడ సమ్రాట్టు ఎక్కడ చెప్పండి.

అశో: నేనే.

కాంత: ఆఁ - మీరా - మీరా! - సమ్రాట్! ఎంత రాక్షసత్వం? కోటానుకోట్ల అబలల హృదయాలలో రేగిన యీ అగ్ని నిన్ను నీ యీ అన్యాయాన్ని దహించేస్తుంది. తప్పదు. కానీండి. ఎన్నాళ్ళీ అన్యాయాన్ని సహిస్తారు మానవులు.

అశో: వీరిని నరకంలో తోయండి.

ప్రేమా: ఆగు! ఒక్కమాట. నువ్వెందుకు నన్ను బంధిస్తావు? కారణం ఎరగవు. చెప్తా విను. నేను నీకూ, నాకూ, ప్రపంచానికీ మంచి చెప్పాను. ఆ మంచి ఆ ఒక్క రాజుకు నచ్చలేదు. ఆ ఒక్క రాజుకోసం నువ్వు నన్ను బంధిస్తున్నావు. అంతేనా! నీ కో హృదయం ఎందుకు? నీ కీ తల ఎందుకు, తలలో ఈ మెద డెందుకు?

అశో: చూస్తావేం. తీసుకెళ్ళు ఆ కౌపీనభిక్షువును ముందు.

ప్రేమా: నిరాయుధులైన భిక్షువులంటే నీ కెందుకు నాయనా అంత భయం?



# అయిదవ రంగం

మహావీరుని మందిరం - శాంతి ఉంది.

శాంతి: కారుమేఘముల కటికచీకటుల
మెఱసిపోయినది నీ చూపే
దొరలిపోయినది నా బ్రతుకే

పొదలమాటున పూలపొన్నియల
చిలుకరించినది నీ వలపే
పులకరించినది నా తలపే

కలలుగన్న ఆ మలిజాములలో
పలుకరించినది నీ పిలుపే
పలవరించినది నా మనసే

ఇంతలోన నీ వెటకు పాతివో
అలుక కలిగెనా నా దేవా?
అలసి పిలిచెనే నీ దేవి!

నిరూప వచ్చింది.

నిరూ: లతిక విషయం విన్నావటే?

శాంతి: లతిక ఈలా అవుతుందని అనుకోలే దత్తా!

నిరూ: విధి తల్లీ!

శాంతి: విధి! ఎవరు విధించారు? దేవుడా? పాపం! చిన్నతనం నుంచి ఎరుగవూ లతికను?

నిరూ: ఎరక్కేం. చిలకాగోరువంకలలా ఎంత అన్యోన్యంగా వుండేవా రా దంపతులు. ఎంత పచ్చని యిల్లు!

శాంతి: నలుగురు పిల్లలతల్లి. ఈనాడు ఆమె శీలాన్ని అమ్ముకోవలసి వచ్చింది. నా కేడుపొస్తూందే.

నిరూ: ఛా! ఏడుస్తా వెందుకే?

శాంతి: అధర్మయుద్ధానికి పురుషులాహుతి అవుతూంటే ధర్మయుద్ధానికి స్త్రీలైనా మిగిలివుంటారని ఆశపడ్డాను. స్త్రీలోకం కూడా ఈలా క్షీణించిపోతూంది. ఆత్మ నశించిన యీ ఆడవాళ్ళు ఎలా వీరవనితలు కాగలరత్తా?

నిరూ: నీకు వెర్రెత్తుతూందే —

లోపలనుంచి శాంతీ! శాంతీ! అన్నపిలుపు.

శాంతి: ఎవరు? రాండి.

ప్రేమానందుడు అతని భటులు వచ్చారు.

శాంతి: దయచేయండి. మహాత్ములకి దాసురాలు ఎలా తెలుసు?

ప్రేమా: నీ భర్తవల్ల నమ్మా!

శాంతి: ఎక్కడున్నారు? ఎప్పుడు చూచారు?

ప్రేమా: యుద్ధరంగంలో - మొన్నరేయి చూచాను.

శాంతి: ఎలాగున్నారు?

ప్రేమా: ఇదిగో తల్లీ!

జాబిచ్చాడు.

శాంతి: [జాబు చదువుతుంది]

జాబులో.

శాంతీ! ప్రియా! బానిసత్వపు అధమస్వరూపం చూచాను. దౌర్జన్యపు వికారరూపం తిలకించాను. నీ నామజపం కూడా చేసుకోలేని దౌర్భాగ్యస్థితి కలిగింది. ఇది మానవజన్మకే అవమానం, అసహ్యం.

అన్యాయాన్ని అరికట్టి, అహింసను స్థాపించి, నీ సామ్రాజ్యాన్ని నెలకొల్పు. కంకణం పూను. ఆనాడే నా ఆత్మశాంతి.

ఆలాంటి సుదినం కలుగుతుందనే ఆశతోనే మరణిస్తున్నాను —

శాంతి: [నిర్జీవంలా నిలబడివుంది. జాబు జారిపోతుంది]

ప్రేమా: నీ పేరు ఉచ్చరించకూడదని రాజాజ్ఞ!

శాంతి: ఎందుకు?

ప్రేమా: అది అపాయకర మట! అపజయానికి పునాది అట!

శాంతి: అపజయం! యుద్ధం! ఎందుకీ యుద్ధం? ఎవరికోసం యీ మరణం?

ప్రేమా:- మహావీరు దా ఆజ్ఞకు ఎదురుతిరిగాడు. ఫలితం కారాగారం. కారాగారంలోనే మరణించాడు.

శాంతి: ఆఁ ___

ప్రేమా: తల్లీ! నిరంకుశత్వం మానవుని కనీసపు హక్కులను కూడా తుడిచేస్తుంది.

శాంతి: నావిష్ణుః పృథివీపతి అని శాస్త్రాలెందు కింకా ఘోషించాలి? ఈ అనంత అమాయకహింసే రాజధర్మమా?

ప్రేమా: తల్లీ!

శాంతి: కన్నీ రింకిపోయింది మహాత్మా!

ప్రేమా: నిప్పుకిరు కురుస్తుంది. కన్నీ రింకిపోయిన కళ్ళు ఏడిస్తే కాలదావానలం వెలువడుతుంది.

శాంతి: అన్యాయం, అశాంతి దహింపబడతాయా?

ప్రేమా: తప్పక! నారీలోకం నడుముకడితే అసాధ్యం అనేది వుండదు. స్త్రీ శక్తి స్వరూపిణి. మహిషాసురుని సంహరించిన మాత, మృత్యువును జయించిన మానిని, మార్తాండుని నిల్పిన మహిళ మనవారే. ప్రకృతి చెలరేగితే అంతా నాశనమవుతుంది.

శాంతి: మహాత్మా! నన్ను స్వప్నలోకాలకు లాక్కుపోతున్నారు.

ప్రేమా: లేదు తల్లీ! వాస్తవికలోకానికే తెస్తున్నాను. స్త్రీ తన్ను తా నెరిగినప్పుడే మానవలోకానికి కళ్యాణం. శాంతి, అభ్యుదయం!

శాంతి: నన్నేం చేయమంటారు? చెప్పండి!

ప్రేమా: ప్రశాంతంగా యోచన చేసుకో. ఈ అధర్మానికి కారణం ఊహించుకో! నీకే సులభంగా గోచరిస్తుంది నిర్మూలనమార్గం.

శాంతి: విప్లవం కావాలా?

ప్రేమా: విజ్ఞానం కావాలి!

శాంతి: ఎవరికి?

ప్రేమా: అజ్ఞాన ప్రజాబాహుళ్యానికి.

శాంతి: విప్లవం తప్పదేమో!

ప్రేమా: రావచ్చు. అందువల్ల అపాయంలేదు.

శాంతి: ఈ విప్లవాన్ని సహించుకోగలనా, మహాత్మా! ఈ పొంగివచ్చే వెలుగు ఒక్కసారిగా నా కళ్ళు కప్పేయదు కదా? అబలను కాను కదా? సుకుమారభావం నన్ను వెనక్కు లాగదు కదూ?

ప్రేమా: భయపడకు తల్లీ! ఈ నాలుగుగోడలు దాటి ఒక్కసారి విశాల ప్రపంచాన్ని వీక్షించు. ఈ రేగిన అగ్నికణం ఆరిపోకముందే ముందడుగు వేయి.

శాంతి: మీ ఆశీస్సు.

ప్రేమా: తల్లీ! ఒక్కమాట జ్ఞాపకముంచుకో! కష్ట మొకరిది, ఫలిత మింకొకరిది. ఇదే అన్ని అన్యాయాలకు మూలం. అనుక్షణం ఈ సూత్రాన్ని స్మరిస్తూండు.

శాంతి: నిజం మహాత్మా! అదే ఆది.

ప్రేమా: మరి సెలవు. నే నిక అగుపడను. రాజాజ్ఞ నన్ను నరకానికి లాగుతూంది. ఇదిగో అమాయకులైన ఆజ్ఞానిర్వాహకులు.

శాంతి: మీకు కారాగార నిర్బంధమా?

ప్రేమా: అవును తల్లీ! ఏం? ప్రశాంత తపోభూమి అది. కారాగార నిర్బంధితుల శబ్దంలేని శాపాలే అశనిపాతాలు. పాపం బ్రద్దలయ్యేముందు పొందే పరిపక్వ దశ యిది. విచారించకు.

శాంతి: మరి - మీరు ఎలా రాగలిగా రిక్కడికి?

ప్రేమా: బానిసలకు హృదయం సుషుప్తి అవస్థలో వుంటుంది. పాలకుల గుండెలు బండబారి వుంటవమ్మా! వీరి ఆకలి నన్ను బంధించినా, అంతర్వాణి సత్యంతో సహకరించమని బోధించింది. అందువల్లే యీ అవకాశం లభించింది.

శాంతి: [మోకరిల్లింది]

ప్రేమా: నీ సామ్రాజ్యం త్వరలో స్థాపింపబడుగాక!

శాంతి: గురూ!

ప్రేమా: తల్లీ!

శాంతి: క్షుధాగ్నిలో కుమిలిపోతూ, ఆత్మను హృదయాన్ని చంపుకొని నిర్వీర్యులై నీరసించిపోతూన్న యీ మానవులతో ఏం చేయగలను మహాత్మా?

ప్రేమా: సృష్టికారణం ఆకలి, స్థితికారణం ఆశ. వెఱ్ఱితల్లీ! ఆకలిమంటలలోంచి విప్లవాగ్ని వెలువడడం అతిసులభం. ఆకలి వున్నప్పుడే ఆవేశం. కడుపు నిండినప్పుడు మనసు శూన్యమవుతుంది. తెలిసిందా?

శాంతి: తెలిసింది.

ప్రేమా: ఆత్మవిశ్వాసాన్ని విడనాడకు. నీ కర్తవ్యం నిర్వర్తించు. బోధిసత్వుని ఆశీస్సు నీ కెల్లప్పుడూ వుంటుంది.

వెళ్ళాడు.



# ఆరవ రంగం

రాచనగరు ఉద్యానవనం. రాణి తిష్య ఉంది.

ఈ వీణలోనుండి యెన్నియో రాగాలు
ఈ గాలిలో కలిసె చల్లగా - మెల్లగా
వలపెల్ల మెలమెల్ల వెదజల్లు రాగమ్మె
ఈ మావిచివురాయె నెఱ్ఱగా - కమ్మగా
కలగాంచి పరువెత్తు సొబగు సంగీతమ్మె
ఈ లేడి చూపాయె నల్లగా - కొల్లగా -
మనసెల్ల బరువెక్కి వెడయి నీరాగమ్మె
ఈ ఊర్పు తరగాయె వేడిగా - వాడిగా
రాగాలవేగాన రేగు నా వేదనే
ఈ బాష్పకణమాయె ఏరుగా పారగా.

శాంతి వచ్చింది

శాంతి: జయము మహారాణికి!

తిష్య: ఎవరు నువ్వు?

శాంతి: మీలాంటి స్త్రీని.

తిష్య: ఎందు కొచ్చావు?

శాంతి: రాజభోగాలక్రింద, చీని చీనాంబరాలక్రింద అణిగిపోతూన్న మీ మాతృత్వాన్ని నిద్రలేపటానికి.

తిష్య: ఓహో! ఆ అవసరం నీ కిప్పు డెందుకు కలిగింది?

శాంతి: బిడ్డలు ఆ మాతృత్వానికై వాచిపోతూన్నారు. వారి రోదనలు అరణ్యాల పాలవుతూన్నవి.

తిష్య: తల్లికి బిడ్డలపై ప్రేమనేర్పటం సృష్టిలో యిదే మొదటిసారి. అందుకు ను వ్వవతరించావా?

శాంతి: తల్లి బిడ్డలను మరవటం యిదే మొదటిసారి. అట్టి తల్లులే అవతరించినప్పుడు యిట్టి బిడ్డలు పుట్టడం అసంభవం కాదు.

తిష్య: మా సామ్రాజ్య ప్రజవేనా నువ్వు?

శాంతి: అవును.

తిష్య: మగధసామ్రాజ్యం నిన్ను కన్నందుకు గర్విస్తుందిలే!

శాంతి: కానీ మగధసామ్రాజ్యంలో పుట్టినందుకు గర్వించాల్సిన అవసరం మాకు లేకుంది.

తిష్య: ఏమన్నావు?

శాంతి: తల్లీ! [మోకరిల్లింది]

తిష్య: లే - నీ పేరేమి?

శాంతి: శాంత.

తిష్య: శాంతి! ఎంత తియ్యటిపేరు. ఏం వచ్చిం దిప్పుడు?

శాంతి: ఇదో తల్లీ! నా మాంగల్యం - కళింగదేశ విజయానికై బలవంతంగా హరించబడ్డ నా మాంగల్యం.

తిష్య: నీ భర్త చనిపోయాడా?

శాంతి: చనిపోలేదు. అన్యాయంగా చంపేశారు.

తిష్య: ఎవరు?

శాంతి: మీరు.

తిష్య: నిజం తెలియక మాట్లాడుతున్నావు శాంతీ! ఎవరు? ఎందుకు చంపారు?

శాంతి: మీరే - మీరే చంపింది. మీ సామ్రాజ్యకాంక్షకు బలితీసుకున్నారు. నా భర్తలా కోటానుకోట్ల అమాయకుల రక్తంతో విజయాక్షరాలు వ్రాసుకున్నారు.

తిష్య: మా విజయం మీది కాదా శాంతీ!

శాంతి: కాదు. ఎందు కవుతుంది? అయితే ఇంత విచార మెందుకు?

తిష్య: ఎందు క్కాకూడదు?

శాంతి: మేము వాంఛించనిదే మా దెందుకవుతుంది? మాదని ఎలా అనుకుంటాం. అవసరంలేక, ఆశలేక మే మెందుకు ఇంత త్యాగం చేయాలి?

తిష్య: మీకు సామ్రాజ్యం వద్దూ?

శాంతి: మా క్కావలసిం దీ సామ్రాజ్యం కాదు.

తిష్య: మీరు వాంఛించే దేమిటి శాంతీ?

శాంతి: అహింసాసూత్రంమీద నిర్మింపబడి, ప్రేమతో ఏకమై బాధ, భేదం ఎరగని రాజ్యం; సత్యం స్వేచ్ఛగా తలయెత్తుకుని తిరుగగల సామ్రాజ్యం; మానవులు దేవతలు కాగల సామ్రాజ్యం రామరాజ్యం తల్లీ!

తిష్య: ఉద్రేకంలో ఆచరణ కసాధ్యాలు చెబుతున్నావు.

శాంతి: తల్లీ! నీలో స్త్రీత్వం లేదూ! స్త్రీ మాధుర్యమూర్తి, మాతృమూర్తి, సౌందర్య మూర్తి అన్న విషయం మరచిపోయావా? ఈ రాచనగరం నిన్నింత మోసం చేస్తూందా?

తిష్య: శాంతీ! కూర్చో. ఫరవాలేదు. నావలన నీ క్కావలసిందేముంది? చెప్పు.

శాంతి: తల్లినుండి బిడ్డలకేం కావాలి? అదే! ప్రేమ. ప్రేమకోసమే తపిస్తున్నాము.

తిష్య: అందుకు నేను చేయగల దేముంది? నా ప్రేమ అందరికీ అందుబాటులో వుంటుంది - వుంది కూడా!

శాంతి: మీరు యీ రాజ్యానికి రాణి. రాజ్యంలోని ప్రజలకు తల్లి.

తిష్య: కాదు శాంతీ! పొరబడుతున్నావు. నేను రాజుభార్యను అంతే!

శాంతి: మీరే అలా అంటే మే మేం చేయగలం? ఒక్కసారి మీ సామ్రాజ్య ప్రజ వంక చూడండి. రాణిగా కాకున్నా సామాన్య స్త్రీగా చూడండి. కరువు, కాటకం, యుద్ధజ్వాలలు! మానవజీవితం మృత్యుతాండవ రంగస్థలమైంది. బ్రతుకంటే భారం, బాధ అయింది. బ్రతకడమంటే భయపడుతున్నాడు మానవుడు.

తిష్య: ఎందుచేత?

శాంతి: ఈ హింస, దారిద్ర్యం.

తిష్య: మీ రూహించే సామ్రాజ్యంలో యివన్నీ వుండవంటారా?

శాంతి: అనటం కాదు, ఉండటాని కవకాశం లేదు.

తిష్య: వట్టి వెఱ్ఱివి శాంతీ! ఈ కరువు కాటకం ఉండాలని ఎవరు వాంఛిస్తారు? పాలకులు మాత్రం తమరాజ్యం ఇంత వికారంగా వుండాలని ఆశిస్తారా?

శాంతి: మరెందుకు తల్లీ యీలా వుంది!

తిష్య: శాంతీ! అవసరకార్యనిమగ్నులై సామ్రాజ్యాధిపతులు వీటివంక చూచి నివారింపలేకున్నారే కానీ, వారి పాలకధర్మాన్ని మరచికాదు. శాంతీ! కానీ, మీ సామ్రాజ్యం మాత్రం వట్టి గాలిమేడేమో!

శాంతి: అయితే యీ హింసకు అంతంలేదనే అంటారా?

తిష్య: అవును. మానవులు మానవులుగా పుట్టినంతకాలం ఇంతే. మానవులు దేవతలుగా పుడితే ఏమో చెప్పలేను.

శాంతి: ఎంత దట్టమైన అజ్ఞానం? ఎంత ఆత్మవంచన?

తిష్య: అనుకోటం వేరు, ఆచరణ వేరు శాంతీ! అనుకున్నవన్నీ ఆచరించ గలిగితే ప్రపంచం ఏనాడో అంతరించేది. శాంతీ! ఇంతటి మహాసామ్రాజ్య పాలనా భారం నువ్వెన్నడూ ఎరుగవు. ఊహించుకోలేవు కూడా! అహింస కేవలం ఆచరణ కసాధ్యమైన ఒక తియ్యని సిద్ధాంతం. అంతే!

శాంతి: ప్రజలు కోరుతున్నారు. ప్రజలు వద్దన్నదాన్ని ఆచరించటంకన్న కావాలన్న దాన్ని ఆచరించటమే కష్టమంటారా?

తిష్య: తమకు నిజంగా కావలసిందేదో నిర్ణయించుకోగల విజ్ఞానం ప్రజలలో లేదు శాంతీ! ఇవన్నీ తాత్కాలికమైన పొంగులు.

శాంతి: ప్రజాభిప్రాయాన్నే కాదంటారా?

తిష్య: అభిప్రాయాలు కుదుర్చుకోగల అర్హత ప్రజల కింకా రాలేదంటాను.

శాంతి: మీ పరిపాలనకే అది కళంకం కాదూ?

తిష్య: కావచ్చు.

శాంతి: అయితే మా ప్రార్థనలు, రోదనలు, నిష్ఫలాలా? ఈ ప్రజాభిప్రాయవిరుద్ధమైన ప్రభుత్వమే సాగుతుందా?

తిష్య: వేరే గత్యంతరం లేదు.

శాంతి: మాకోర్కె నిరాకరిస్తారా?

తిష్య: అంగీకరించి చేసే ఉపకారం లేక.

శాంతి: భ్రమపడ్డాను. మీరు చేసే ఉపకారం ఏమీ లేదు. స్వేచ్ఛ ఒకరిచ్చే దానం కాదు. ఆత్మబలంలేనివాళ్ళే యాచకు లవుతారు. బుద్ధభగవానుడు నింపిన ఆత్మ బలం ఉండగా మేము యాచకులం కాము.

తిష్య: బుద్ధభగవానుడు మీలో ఆత్మబలంకన్న వెఱ్ఱినే అధికంగా నింపాడు.

శాంతి: సరి! మా కామితానికై మేము భిక్షువులం కాము. మీముందు అంజలిఘటించి ప్రార్థించము. మా సామ్రాజ్యాన్ని స్థాపించుకోగలశక్తి మాలోనే వుంది. సెలవు.

తిష్య: శాంతీ! ఒక్కమాట!

శాంతి: మీతో మా కింక పనిలేదు.

వెళ్ళింది.

అశోకుడు వచ్చాడు.

అశో: తిష్యా!

తిష్య: ప్రభూ!

అశో: రేపే విజయోత్సవం.

తిష్య: ఎవరి విజయోత్సవం.

అశో: మన విజయోత్సవం!

తిష్య: మీ విజయోత్సవం అనండి.

అశో: నీది కాదూ?

తిష్య: నేను మీరాణి నైనందున నాదీ కావచ్చు.

అశో: పట్టణమంతా అలంకరింపబడుతూంది. ఇంటింట పచ్చని తోరణాలు - వీధివీధికి విజయధ్వజాలు.

తిష్య: ఆ పతాకాలు, పచ్చనితోరణాలు ప్రజలకు అర్థరహితాలు.

అశో: అబ్బ! ప్రజ! ప్రజ! ఈ పెనుభూతం రాచనగరును కూడా ఆక్రమించింది!

తిష్య: ప్రభూ!

అశో: ఏం తిష్యా!

తిష్య: సహధర్మచారిణిని. మంచిచెడ్డలలో సహభాగం పంచుకునే బాధ్యత కలదాన్ని. నా స్థానానికి గల గౌరవం చేతనైనా నా ప్రార్థన వినండి.

అశో: ఏమది చెప్పు!

తిష్య: ప్రభూ! బౌద్ధమతం ప్రజాహృదయాన్ని చూరగొన్నది. సుస్థిర శాంతికోసం తపిస్తున్నారు.

అశో: అయితే?

తిష్య: కళింగదేశ దండయాత్ర పట్టుపట్టి సాగించారు. నిరంకుశత్వం ప్రజాహృదయంలో విప్లవాన్ని రేపింది. ఏనాడో ఎందుకు? మనకళ్ళఎదుటే అది భయంకరంగా విరగబడుతుందేమోనని నా భయం ప్రభూ!

అశో: తిష్యా!

తిష్య: క్షమించండి. రాణిగా కాదు. సామాన్యస్త్రీగా మాట్లాడుతున్నాను.

అశో: నిన్నూ యీ బౌద్ధపిశాచం ఆవేశించింది.

తిష్య: న్యాయం, ధర్మం కాలం నిర్ణయిస్తుంది ప్రభూ! కళ్ళకు, చెవులకు బహుజనవాణిలో కాలం మనకు గోచరిస్తుంది. కాలానికి కట్టుబడిపోవడం కర్తవ్యం.

అశో: రాజ్యపాలన నెరుగని అజ్ఞానులు పలికేలా మాట్లాడుతున్నావు తిష్యా!

తిష్య: రాజ్యపాలన పుస్తకజ్ఞానాన్నిబట్టి కాదు. ప్రత్యక్ష పరిస్థితులబట్టి మారటం భావ్యం.

అశో: తిష్యా! నీ ఆవేదనను గమనించాను. కానీ, ఇటు చూడు, ప్రజలకన్న నా బాధ్యత అధికం. నువ్వే యోచనచేయి. నేను భూత, భవిష్యద్వర్త మానాలకు జవాబు చెప్పవలసిన బాధ్యత కలవాణ్ణి. అశోకుడు భారతదేశాన్ని అధోగతి పాలుచేశాడనే అపకీర్తి చరిత్రకారుడు శాశ్వతంగా వ్రాస్తాడు. అది నీకు మాత్రం యిష్టమా?

తిష్య: ప్రస్తుతాన్ని తృప్తిపరచటమే మన విధి. ప్రభూ! భవిష్యదర్థము ప్రజలకో, విధికో వదలండి.

అశో: తిష్యా! అశోకుడు 'దుష్టాశోకుడ'ని నిందలు పొందుతున్నాడు. కానీ, ఏం చేయను? ఈ రత్నగర్భను - ఈ మహాసామ్రాజ్యాన్ని - ఈ నా భారత దేశాన్ని తుత్తునియలుచేసి పరులపాలు చేయటాన్ని నేను సహించలేను —— ఊహించలేను తిష్యా!

తిష్య: ఆ భయం మీకెందుకు? కావాలన్న వారు కాపాడుకోలేరూ?

అశో: కాపాడుకుంటే సంతోషమే —— కానీ —— తిష్యా —— ఈపటడి[1] పండే గడ్డకై వాచి కాచుకున్నారు. అవకాశం కలిగితే సంపూర్ణ ప్రయోజనం కలుగ జేసుకుంటారు. ముక్కలుముక్కలైన జన్మభూమిని, భారతభూమిని చూచి నువ్వు - తిష్యా - నువ్వైనా ఓర్వగలవా? చెప్పు?

తిష్య: మనకళ్ళ ఎదుటే ఈ విప్లవాన్ని చూస్తామా?

అశో: అశోకుడు రాక్షసుడు, అశోకుడు నిరంకుశ పరిపాలకుడు, అశోకుడు హింసా స్వరూపం - కానీ - తిష్యా! అశోకుడు తనదేశాన్ని, జన్మభూమిని, తన దేశమాతను ప్రేమించాడు. చరిత్రకారుడిది మరుస్తాడంటావా?

తిష్య: క్షమించండి. మీ హృదయాన్ని నొప్పించాను.

అశో: చూచాయగా నాకూ కనపడుతూంది విప్లవం తిష్యా! నే నిప్పుడు సమ్రాట్టును కాను. అశోకుణ్ణి - నీ ప్రియుణ్ణి! అంతే - హృదయం నీకు విప్పి చెప్పే తీరిక లేకపోయింది. నా ప్రజ - నావారు - ఎందరు! అబ్బ!

తిష్య: ఆయాసపడకండి.

అశో: ఎందరు! ఎన్ని వేలమంది అనవసరమృతికి పాల్పడుతూవుంటే నాకుమాత్రం ఆనందమా? - కానీ -

వెళ్లాడు.

---

1. మాండలిక ప్రయోగం - సమృద్ధిగా అనే అర్థంలో కావచ్చు.

# ఏడవ రంగం

ఒక బయలు, అందులో ఒక సమాధి, కారుచీకటి. నడిరేయి. సమాధివద్ద మినుకుమినుకుమని ఒక ప్రమిద. అక్కడే ఓ వృద్ధ తల విరియబోసుకొని కూర్చుంది. ఆ ప్రమిదవెలుగులో ఆ కళ్ల, కన్నీటిజాలు మెరుస్తూంది.

ఈ శాంతిసమాధిలో
ఈ మృత్యుపేటికలో
ఏ పేద జీవితము నిదురపోయెనో!
రాలిపోవు యీ పారిజాతములు
ఏ కన్న కడుపులో నిండుటాసలో!
జాలువారు యీ మంచుబొట్లు
ఏ ప్రేయసిరాల్చెడి బాష్పాంజలియో!
మినుకు మినుకుమని మెరయుప్రమిద
ఏ మర్త్యుల కందని అమరసత్యమో!
సత్యమదేదో? శాంతి అదేదో?
పెనుభూతముగా పెరిగిన హింస
విలయతాండవము సలిపెడి జగతిని
సత్యమదేదో? శాంతి అదేదో?

అశోకుడు మారువేషంతో, రాధాగుప్తుడు వచ్చారు

**అశో:** ఎవరది? ఎవరు నువ్వు?

**వృద్ధ:** మాతను.

**అశో:** మాతవు!

**రాధా:** ఎవరి మాతవు?

**వృద్ధ:** లోకమాతను.

**రాధా:** మతికలిగే మాట్లాడుతున్నావా?

**వృద్ధ:** హృదయం ఎదిగేవరకే నాయనా మతితోపని.

**అశో:** ఈ నడిరాత్రిలో ఇక్కడేం చేస్తున్నావు?

**వృద్ధ:** తపస్సు.

అశో: తపస్సు!

రాధా: ఎందు కా తపస్సు?

వృద్ధ: ఈ చీకటిని చెదరగొట్టటానికి.

అశో: ఈ చీకటిని చెదరగొట్తావా?

వృద్ధ: అవును. అదిగో చూడు.

అశో: వట్టి చీకటి!

వృద్ధ: నీ కళ్ళ కా చీకటిని చీల్చుకపోయే శక్తి లేదు. హృదయంతోబాటు దృష్టి సంకుచిత మౌతుంది. ఈ చీకటి దాటిపోతే శాంతిభాను డున్నాడు.

అశో: శాంతి!

వృద్ధ: ప్రభాతం ఇంకెంతోకాలం లేదు. ఒక్క జాముందేమో! అంతే! ఈ అంధ కారం గాజుపెంకులా బ్రద్దలై పోతుంది.

రాధా: వృథాకాలయాపన! అది వెఱ్ఱిది!

వృద్ధ: [నవ్వుతుంది]

అశో: ఎందుకలా నవ్వేలావు?

వృద్ధ: ఏడ్చి ఏడ్చి అయింది. ఇక ఏడవలేను.

అశో: అశోకుని సామ్రాజ్యంలో ఏడవాల్సిన లవసరం లేదంటారు. ఎందు కా కన్నీరు?

వృద్ధ: అశోకుడు! సామ్రాజ్యం! అశోకుని సామ్రాజ్యంలో ఏడుపుకాక ఇంకేముంది? అశోకునికి ఏడ్పించటం కాక ఇంకేం తెలుసు?

అశో: ఎందు కలా అంటున్నావు?

వృద్ధ: ఇదో చూడు. ఈ మూడుకాళ్ళ ముదుసలిని - యీ ముడుతలుపడ్డ శరీరాన్ని. ఈ కళ్లు కాళ్లు లేనికాలంలో ఈ వృద్ధాప్యంలో పుత్రుడే దిక్కని నమ్ముకున్న నాలాంటి ఎందరి హృదయాలలో కార్చిచ్చు రేపాడు! ఎందరి రక్తం కన్నీరుగా త్రాగాడు. ఇంతకన్న ఏడుపు ఏం కావాలి?

అశో: నీ కొడుకు యుద్ధంలో పోయాడా?

వృద్ధ: ఒక్కగాని ఒక్కకొడుకు. ఎంత అల్లారుముద్దుగా పెంచాను - ఎంత నమ్ము కున్నాను! కడుపునపెట్టుకున్నాడే. ఆ కళింగదేశ విజయం, ఈ విజయోత్సవం ఇస్తుందా తల్లి కా ఆనందాన్ని? చెప్పు?

అశో: వీరమాతవైనందుకు గర్వించు.

వృద్ధ: గర్వించాలనుకున్నాను. కానీ, ఆ అశోకుడికి హృదయం లేదూ? - రాజ భక్తితో, రాజసేవతో అనాదిగా వృసితమైన వంశీయుణ్ణి - రాజభక్తితో ఎముకలు అరగదీసి పోసినవాణ్ణి - నా ఒకే కొడుకును, తన్ను ప్రేమిం చిన వాణ్ణి అన్యాయంగా అసహ్య మృత్యుగహ్వరంలో తోశాడే - కృతజ్ఞత లేదూ?

అశో: ఎవరు? మహావీరుడా? రాజాజ్ఞాతిరస్కారం శిక్షార్హం.

రాధా: అశోకా!

వృద్ధ: ఎవరు? అశోకసమ్రాట్టు! నువ్వేనా అశోకుడవు! రాజాజ్ఞ! నువ్వేనా రాజు! శాంతిశబ్దం నీ కంత భయకారణ మైందా? మగధసింహాసనా న్నింతటి భీరువు అధిష్ఠిస్తా డనుకోలేదు.

అశో: సామ్రాజ్యక్షేమాన్ని ఆశించి.

వృద్ధ: సామ్రాజ్యం! క్షేమం! దానిసత్వం అధమస్వరూపం అమాయకులను వీరు లను మ్రింగుతూంది. ఇందరి తల్లుల కడుపులు రగిలించి, ఇందరి మాంగ ల్యాలు బలవంతాన హరించి నిర్మించే సామ్రాజ్యసౌధంలో - సమ్రాట్! ఈ అభాగ్యుల పిశాచాలు తిరుగాడుతాయి! నీ సామ్రాజ్యకాంక్ష ఆ పిశాచాల రూపంలో నిన్ను వెంటాడుతుంది! స్వసంరక్షణకు తప్ప ఇతరులకు మృగాలు కూడా హాని చేయవే!

అశో: రాజధర్మం రాజ్యాలను జయించటం!

వృద్ధ: ప్రజలను పాలించటం కాదూ? సుఖపెట్టడం కాదూ?

అశో: సుఖం కష్టంయొక్క ఫలితం కాదు, కానేరదు.

అశో: అర్థంలేని మాట. ప్రకృతిలోనే హింస వుంది. బ్రతకటమే హింస.

రాధా: అశోకా! నీకు మతిపోతూంది. వృథాకాలయాపన.

అశో: కాదు పితా! ఇదేదో పెనుభూతం. ప్రజాహృదయ ప్రదీపంబంగా వుంది. ఈనాడే అటో ఇటో తేల్చుకోవాలి. ఈ భావసమరంలో ఎవరిదో చావు.

వృద్ధ: సమ్రాట్! ప్రతి భారతీయుని హృదయంలో రేగిన ఈ అహింసాజ్యోతికి చావులేదు. ప్రతి శారీరకమరణం దీనికి అఖండ ఆధ్యాత్మికశక్తిని చేకూరు స్తుంది.

అశో: మేము తల్చుకుంటే నిముషంలో నాశనం చేయగలం.

వృద్ధ: నాశనం కాగలరు.

రాధా: రాజదండం దయ నెరగదు తెలుసా?

వృద్ధ: ధర్మదండం భయమెరగదు. కలలు కంటున్నారు. ఇంటింట పూజ లందు కొంటూన్న ఈ బుద్ధభగవానుని నువ్వేమీ చేయలేవు. నీ కరవాలం ఏమీ చెయ్య లేదు సమ్రాట్! ఏనాడో అకస్మాత్తుగా ప్రభాతరేఖలలో సత్యం ఆగ్రహించి ఉగ్రరూపంతో నిన్ను నిద్రనుండి తట్టి లేపుతుంది. విస్తుపోయి చూస్తూన్న నీ కళ్ళముందే వికారస్వరూపంతో నీ అధర్మసింహాసనం నీటిబుడగలా రూప రహితమైపోతుంది.

అశో: ఆఁ —

వృద్ధ: చంపేస్తావా, చంపేయ్! నీ రాజ్యంలో ఎవరు బ్రతికి వున్నారు? బ్రతుకే లేని రాజ్యంలో చావుకు అర్థ మేముంది!

అశో: ఆఁ - ఈ అకుంఠిత ధైర్యం ఎక్కడినుంచి వచ్చింది?

వృద్ధ: వట్టి ధైర్యం కాదు. ఆత్మబలం! కానీ సమ్రాట్! ఒక్కొక్క నెత్తురుబొట్టు వేలకొలది ధర్మవీరులను సృష్టిస్తుంది.

అశో: పితా! ఏ మీ శక్తి! నా చేతులు వణుకుతున్నా యెందుకు?

రాధా: ఇది గారడీ! భారతభూమి దీనికి కొత్త కాదు.

అశో: కాదు పితా! ఒక్కస్త్రీ నా ప్రేవులను కదలించేస్తూంది. ఏ మీ శక్తి!

వృద్ధ: సమ్రాట్! ఈ నిద్రాముద్రిత నిశాసమయంలోనే ఒక్కసారి దర్శించు నీ రాజధానిని, ఎన్ని పీనుగకుప్పలపై నీ కళింగదేశ విజయం కట్ట బడిందో —

అశో: పితా! ఒక్కసారి నగరమంతా —

రాధా: అందువల్ల ప్రయోజనం లేదు అశోకా!

అశో: ప్రబలిపోతూన్న పరమతాన్ని ఉపేక్షించటం —

రాధా: అక్కడే దుర్బలత్వం ఏర్పడేది.

అశో: మాతా! నాకు దారి చూపుతావా?

వృద్ధ: చూడదలచుకొన్నవారికి చూపాల్సినవా రనవసరం.

అశో: మాతా నిజమనుకొని చేరబోతూన్నలోకాన్ని ఒక్క నిమిషంలో మాయ లోకంగా చేశావు. ఆ లోకం మెల్లమెల్లగా శూన్యంలోకి అంతరిస్తూంది. మాతా! ఏది నిజం? ఏది ధర్మం? ఎవరిది విజయం?

వృద్ధ: ధర్మానిది నాయనా!

అశో: అబ్బ! ఎంతతియ్యనిమాట! తల్లీ!

వృద్ధ: నాయనా!

రాధా: అశోకా! వట్టిమాయ. నీ మతి భ్రమిస్తూంది. నిన్ను ఇంద్రజాలంతో ఆడిస్తూంది. మరొక్క క్షణంలో నీ కిరీటాన్ని తన్నుకుపోతుంది.

అశో: నిజమా? మహాసమ్రాట్టును నీ బానిస చేసుకోవాలనుకొంటున్నావా? నీ కాళ్ళ ముందు మోకరిల్లి సమ్రాట్టుశిరంపై ధూళిపోసి హర్షించాలనుకుంటున్నావా?

వృద్ధ: సమ్రాట్!

అశో: పిశాచమా నన్నధోగతికి లాగకు!

వెళ్లారు



# ఎనిమిదవ రంగం

నరకం, అందులో రెండు గదులు, ఒక గదిలో ప్రేమానందుడు,

మరొక గదిలో మరెవ్వరో కొందరు.

ఒకగదిలో —

ప్రేమా: భగవాన్!

ఈ అజ్ఞానలోకాని కేనాటికి జ్ఞానభానూదయం?

ఈ ప్రజ ఏనాటికి పరస్పరానురాగ పరిపూర్ణభావంతో శాంతియుతులై బ్రతుకుతారు.

ఏనాడు సమత్వసూత్రంమీద నిర్మింపబడుతుంది ఈ సంఘం.

చండగిరికుడు వచ్చాడు

చండ: ఏయ్! ఆపు నీ జంగంబుట్టి!

ప్రేమా: మండుతూన్న నిప్పుకు చల్లని నీళ్లుతాకితే అరుస్తుంది. నా పాట నీ చెవులకు ఈటెపోటుగా వుందా నాయనా!

చండ: గర్వం. మహా మహాత్ముడవు! ఏదీ నాలుగ్గోడల్లో ఇమిడిపోయిందే అంత మహాత్మ్యం?

ప్రేమా: నేను వట్టి మానవుణ్ణి నాయనా! మీరూ మానవులు కావాలని కోరుతున్నాను.

చండ: ఆఁ - [ఫట్ ఫట్]

ప్రేమా: అలసిపోయావా?

చండ: ఆఁ - [ఫట్ ఫట్]

ఒక భటుడు పరుగెత్తుకొచ్చాడు

భటు: ప్రమాదం! ప్రమాదం! ప్రజలు శాంతి వెంబడి పిచ్చెత్తినట్లు పరుగెత్తుతున్నారు. శాంతి మహారుద్రునిలా, చండికలా, కాళికామాతలా, ఆ కోల కళ్ళల్లోంచి నిప్పుకలు కురిపిస్తూ వస్తూంది. ఆ ఆవేశం ఆశ్చర్యకరం! ప్రళయం వస్తుందేమో!

చండ: శాంతి! ఎవ రా శాంతి?

భటు: మహావీరుని భార్య.

**ప్రేమా:** కాదు నాయనా! శాంతి అశోకసమ్రాట్టుకు. సామ్రాజ్యానికే శాంతి ప్రదాయిని.

**చండ:** ఆఁ ___

నేపథ్యంలో బృందగీతి

రగిలిందీ! రగిలిందీ!
ప్రజాహృదయము రగిలిందీ!
విదళితమానవలోకమ్మంతా
ధర్మము నిలుపగ కదిలిందీ!
పేదలగుండెల పేరిచికట్టిన
అధర్మలోకం అదిరిందీ!

మరొక గదిలో

1: కళింగదేశ దండయాత్ర ముగిసిందేమో!

2: విజయోత్సవం.

3: విజయోత్సవ మయితే ఆ అల్లకల్లోలం ఎందుకు?

2: ఉత్సాహోత్పన్నం!

3: అవేమి టా అరుపులు?

1: ఎవ రా శాంతి?

2: ఆఁ - యుద్ధానంతరం ఎప్పుడూ అగుపడే నాలుగునాళ్ళ శాంతి!

3: కాదు! కాదు. అదిగో మహావీరునిభార్య శాంతి.

1: ఆమె ముందు నడుస్తూంది.

2: ప్రజ లామెను వెంబడిస్తున్నారు.

3: స్త్రీలు, పురుషులు, వృద్ధులు, ఆబాలగోపాలం.

1: తినతిండిలేక శల్యావశిష్టమైన యీ ప్రజల్లో ఇంతటిశక్తి. ఆవేశం ఎలా కలిగింది?

2: ఏమో! చూడండి ఆ రౌద్రమూర్తిని.

1: మహిషాసురమర్దిని.

3: నాగుబాములా ఆ విగ్రహం ఎంతసాగింది!

1: ఆ చేతుల్లోని నరనరం మనకూ్కడా అగుపడుతూంది. ఎంత ఉద్రేకం!

2: ఇక్కడి భూమి అదురుతూంది.

3: వచ్చేసింది — అదో —

జైజై మహదేవ్! జైజై మహదేవ్!
లేవండోయ్!
లేవండోయ్! ఇక రారండోయ్!
శాక్యమహాముని సత్యామృతమున
సర్వసమత్వము వెలసిందీ!
కత్తులు వలదోయ్! నెత్తురు వలదోయ్!
భేరీ ఢంకా మూలనువేసి
శాంతి అహింసా సమరములోన
సత్యాగ్రహులై కదలండీ!

ప్రజలు వచ్చిపడ్డారు

చండ: ఆగండి! ఆగండి! మీ ప్రాణాలు మీకు దక్కవు.

ప్రజ: మా ప్రాణాలతో మాకు పనిలేదు.

చండ: పో! త్వరగా పో! మహారాజులకు విన్నవించు. సైన్యాన్ని తీసుకురా! కత్తిని చూస్తే వాళ్ళకు బుద్ధి చెప్తారు వీళ్లు!

ప్రజ: సైన్యం! ఇంకా ఎక్కడి సైన్యం! ప్రజేసైన్యం, ప్రజలదే సైన్యం. రాజు సైన్యం పోయింది.

చండ: ఆ —

ప్రజ: ఎందుకా 'ఆ'. ప్రజలంటే ఏమిటో నీకింకా బోధపడలేదు. ప్రజ్వరిల్లిన ప్రజాశక్తి ప్రతిభ నింకా నువ్వు తెలుసుకోలేదు. అడ్డంలే. నరకంలో ప్రజాసేవకులకు అమాయకులకు స్థానంలేదింక. ప్రజాద్రోహాలు, దోపిడి గాండ్రు, ఆ స్థానా న్నాక్రమించాల్సిందే.

చం: రాజభృత్యుణ్ణి నేను నా కంఠంలో ప్రాణాలుండగా ఆ పని జరగనీను.

ప్రజ: ప్రజాద్రోహివి.

చండ: రాజు దైవాంశసంభూతుడు. రాజద్రోహం దైవద్రోహం.

ప్రజ: ఆ నీతుల మత్తుమందులు మ్రింగేకాలం పోయింది.

చండ: అయితే మీ రేం చేస్తారు?

ప్రజ: అవసరమైతే ఏమన్నా చేస్తాం.

గదిలోంచి ప్రేమానందుడు

శాంతి! దౌర్జన్యంమాత్రం వద్దు. మనది శాంతిసమరం. శాంతి అధ్యక్షత క్రింద అహింస నశించడం శాంతిని వెక్కిరించడం.

ప్రజ: ఈ చవటబారిన తత్వం మాకు వద్దు. హింసకు హింసే మృత్యువు. తొలగు.

శాంతి: ఆగండి! నామాట వినండి.

ప్రజ: సద్దు! సద్దు![1]

శాంతి: ప్రేమానందులవారు మనకి చైతన్యాన్ని ప్రప్రధమంగా కలిగించిన మహాత్ములు. ఆయన మాటల అగాధంలో అమరమైన సత్యం వుంది. మీరు కొంత ఓపిక పట్టండి. చండగిరికా! ఈలా చూడు. నీలాంటి మానవులు, నీ బంధువులు, నీ సోదరులు, నీ చెల్లెళ్లు, నీ స్నేహితులు.!!! ఈలా చూడు! ఈ ఎండిన కడుపులు, ఈ ఇగిరిపోయిన కళ్లు, ఈ తేలిపోయే కాళ్లు, ఈ ఇల్లాలు! ఎముకల గూళ్లు!

ఈ క్షోభ, ఈ ఆకలి, ఈ అమాంగల్యం ఎవరి కోసం? యోచించి చూడు. వీరిని చూచి నిర్ణయించుకో నీ కర్తవ్యాన్ని. వీరు విడుదల కోరుతున్నారు.

దేశాన్ని, ప్రజలను కాదని ఒక్క రాజును - వీరివంక కన్నెత్తయినా చూడని రాజును సేవిస్తావా? దేశానికోసం త్యాగం చేస్తావా యీ అశాశ్వత రాజకటాక్షాన్ని? చెప్పు?

చండ: ........

శాంతి: పలకవేం?

ప్రజ: పలకడు. పలుకలేడు. పదండి, పగులగొట్టండి మహాత్ముణ్ణి విడిపించండి.

గదిలోంచి ప్రేమానందుడు

శాంతి! నాకోసం హింస ప్రారంభిస్తే నేను ప్రాయోపవేశం చేసుకుంటాను. వద్దు.

శాంతి: ఏం! చండగిరికా! నీది మాలాంటి హృదయంకాదా?

చండ: తల్లీ! నీ యిష్టం?

ప్రజ: జై శాంతిమాతకు జై! వీరశాంతికి జై! మహాత్మునికి జై!

1. 'నిశ్శబ్దం' అనే అర్థంలో నెల్లూరు మాండలికం.

ప్రేమా: నాయనలారా!
ప్రజ: నద్దు! నద్దు!
ప్రేమా: ఉద్రేకంలో ఉత్తమమైన మానవజన్మ ప్రసాదించిన సత్యం, శాంతి, అహింసలను మరచిపోవద్దు. మీ ఆత్మాభిమానం, మీ శక్తి, మీ అహింసా వ్రతదీక్ష ఈనాడు యీ కారాగార కుడ్యాలను కూలదోసింది. మాకు స్వేచ్ఛను ప్రసాదించింది.
శాంతీ! నువ్వు ధన్యవు!
శాంతి: తమ ఆశీస్సు!
ప్రేమా: మన శాంతిసమరం ఇంకా సంపూర్ణం కాలేదనుకుంటాను.
శాంతి: లేదు. మహారాజసందర్శనం మిగిలివుంది.
ప్రేమా: సరి, రాండి పోదాం.

త్యాగభూమిరా
భోగసీమరా!
చల్లనైన తల్లి మన భరతమాతరా!
ధర్మశీలరా!
కర్మభూమిరా!
అన్నపూర్ణమ్మ మన జన్మభూమిరా!
జై భారతావనీ! జై వీరజననీ!

ప్రజలు జైజైలతో వెళ్లారు
చండగిరికుడు ఆ ప్రజాప్రవాహాన్ని చూస్తూ రాతిబొమ్మలా నిలబడి వున్నాడు.



# తొమ్మిదవ రంగం

రాచనగరు. అశోకుడు ఉన్నాడు.

నేపథ్యగీతి

కలదోయీ! కలదోయీ!
కలదోయీ నీ కన్నుల కందని
ఆరని దీపపు వెలుగు!
లేదోయీ నీ లేత తలపులకు
దానిని చేరెడి పరుగు!
పీడవోయీ నీ నెత్తుటి కత్తుల
విజయమె నిజమను తలపు!
కనవోయీ నీ మానస మెరుగని
ధర్మపథానికి మలుపు!
హింసాజ్వాలల లోకమునంతా
కాల్చి జయించెడి బ్రతుకు -
ఏ క్షణముననో రూపరిపోవును
మృత్యువు వశమై తుదకు!
పరచి పరచి యీ రాజ్యాకాంక్షతో
పాపపు గుండెలు పగుల
ఏ ఎడారిలో రాలిపోయెదవో
ఆశాసౌధము రగుల

అశో: ఆపు — [వెఱ్ఱిగా అరిచాడు]

రాధా: [వేగంగా వచ్చి] అశోకా! ఏమిటా కేక?

అశో: గురూ! ఇటు చూడండి. పట్టినెత్తురు. అంతా నెత్తురు.

రాధా: విశ్రాంతి తీసుకో - కలవరపడుతున్నావు.

అశో: మీకు కనపడలేదూ?

రాధా: వట్టిభ్రమ! అంతే!

అశో: మరి ఆ మాత కేలా అగుపించింది? నాచేతులంతా రక్తమయంగా వుందని.

రాధా: అది నిన్ను మోసంచేసింది.

అశో: కాదు పితా!....నేను నిలుచున్న భూమి హఠాత్తుగా క్రుంగిపోతుందేమో .... లేకుంటే - ఎందుకీ -

ఒక భటుడు పరుగెత్తుకొచ్చాడు.

భటు: ప్రభూ!

అశో: ఏమిరా!

భటు: చండగిరికుడు -

అశో: ఏం?

భటు: ఆత్మహత్య చేసుకున్నారు.

అశో: ఆఁ ___

రాధా: ఎందుచేతరా?

భటు: ప్రజలందరూ ఒక్కపెట్టున వచ్చిపడ్డారు. కారాగారం తలుపులు విరగదోసి అందరినీ విడిపించారు.

రాధా: బౌద్ధభిక్షువులను కూడా?

భటు: చిత్తం.

అశో: ఆఁ - మూఢులు. సమరానందుని ___

భటు: చిత్తం!

అశో: చండగిరికునిది ఉక్కుగుండె. సామాన్యంగా జంకేవాడు కాడు.

బయట అల్లకల్లోలం

రాధా: ఏమిరా ఆ అల్లకల్లోలం?

భటు: ఊరంతా పొంగే ఏరులా వస్తున్నారు ప్రభూ!

అశో: విజయోత్సవం రేపని చాటించాము కదూ?

రాధా: విజయోత్సవం కాదేమో!

అశో: మరి?

రాధా: నాకు సందేహంగా వుంది.

అశో: ఏమి గురూ?

సమరానందుడు వచ్చాడు

అశో: సమరానందా!

సమ: ప్రభూ!

అశో: ఏమా హడావుడి?

సమ: ప్రభూ! ప్రజలు తిరగబడ్డారు. పట్టశక్యంకాకుంది.

అశో: ప్రజలు! ప్రజలు! సైన్యాన్ని రప్పించు. పట్టణమంతా నాశనమైనా సరే, యీ ప్రజా ఉద్యమం తలయెత్తకుండా చేయి! సమరానందా! సిగ్గు చేటు! ఇంతదూరం రానిచ్చావు! నీ కరవాలాన్ని నూతిలో పారేయలేక పోయావు!

సమ: క్షమించండి ప్రభూ! సైన్యబలం లేదు. ఆయుధాలన్నీ ప్రజలవశమైనాయి. ఒక్క యోధుడు కూడా మిగలలేదు. అదో ప్రభూ! అదో - కమల సంభవ యజ్ఞవిధ్వంసనాటోప వేగవతీనదీ ప్రవాహంలా, దాశరథీశరాసన విముక్త బ్రహ్మాస్త్రంలా - అదో ఆ ప్రజాప్రవాహం వచ్చేస్తూంది - వచ్చేసింది.

అశో: సమరానందా! ఏమా బెదురు? ఛీ! సైన్యాధ్యక్షుడు పిరికిపంద కావటం ఇదే మొదటిసారి.

సమ: సమ్రాట్! దేవరవారే చూడండి. ఆ వేగానికి హిమాద్రి కూడా ఆగదు. ప్రకృతంతా చెలరేగినట్లుంది. నగరు అదరిపోతూంది. చూడండి ప్రభూ!

అశో: **గురూ!** నిజం!

రాధా: నిజమా?

అశో: అవును.

రాధా: కర్తవ్యం?

శాంతిమాతకు జై అన్న కేకలు

అశో: ఎవరా శాంతి?

సమ: మహావీరుని సతి ప్రభూ!

అశో: ఆమె కెందుకా జైజైలు?

సమ: ఈ ప్రవాహాన్ని సృష్టించిం దామె! నడిపిస్తూన్నదామె! శాసిస్తూన్న దామె!

అశో: స్త్రీ!

సమ: అవును ప్రభూ! పాలబుగ్గల పసిది!

అశో: సిగ్గు! మన మానం పంకిలగత మవుతుంది! మహాసామ్రాజ్యాధిపతి ఒక్క ఆడుదాని శక్తికి - ఛీ! పచ్చి అవమానం!

రాధా: అశోకా!

అశో: గురూ!

రాధా: మన ప్రయాస వృథా!

అశో: గురూ! మీరూ! మీరూ అధైర్యపడుతున్నారా!

రగిలిందీ! రగిలిందీ!
ప్రజాహృదయము రగిలిందీ!
ప్రళయశంకరుని ఫాలనేత్రమటు
ప్రజాహృదయము రగిలిందీ
హింసావాదుల సమాధిమీద
శాంతిప్రపంచం లేచిందీ!
దాస్యవిమోచన దీక్షను బూనగ
కర్మవీరులను పిలిచిందీ!
ధర్మవీరులను పిలిచిందీ!
సప్తసముద్రా లెత్తివచ్చినటు
ప్రజాసేన యిది కదిలిందీ
రగిలిందీ! రగిలిందీ!

శాంతి, ప్రేమానందుడు, నిరూప, రథ గజ తురగ పద దళాల నాయకులు - వెంబడే ప్రజలు వచ్చారు.

ప్రజల అరపులకు భూనభోంతరాళాలు అదిరిపోతున్నవి. సమరానందునిలో ఏదో ఉత్సాహం, ఆనందాతిరేకతవల్ల అశ్రుకణాలు.

అశో: విజయా! నువ్వు వున్నావా? ఈ ప్రజాప్రవాహాన్ని చెదరగొట్టు!

విజ: అది కానిపని ప్రభూ!

అశో: అక్రమాన్ని శిక్షించవలసింది నీ విధి.

విజ: అక్రమాన్ని నిర్ణయించవలసింది యీ జనవాణి! క్షమించండి.

అశో: రాజాజ్ఞ.

విజ: ప్రజలు ఏర్పరచుకొని ప్రభువు కధికారం లేదు.

అశో: ఆం. విశ్వాస్! నువ్వు?

విజ: నన్ను పోషించే వీరిని నేనూ ఏమీ చేయలేను.

అశో: విజవీరా! నువ్వు?

విజ: నావారిని నేను చంపలేను.

అశో: భీరువు! జయానందా! నువ్వు?

జయా: ఒక్క ప్రభువుకోసం ఇందరిని బలి యివ్వలేను.

అశో: ప్రభువుకోసం కాదు, రాజ్యక్షేమానికి.

జయా: ఈ ప్రజే రాజ్యం. రాచనగరు కాదు. వారి మంచిని వారే నిర్ణయించుకొంటున్నారు. అది అధర్మం కాదు.

అశో: రాజద్రోహులు!

అందరు: జానిసలం. ఆత్మవంచకులం కాము.

అశో: సమరానందా! రాసి. వీరస్వర్గం ఆహ్వానిస్తూంది. ఇన్నాళ్ళు చేసింది యుద్ధం కాదు. నీ నామధేయం సార్థకం చేసుకో - గురూ! ఆశీర్వదించండి.

ప్రేమా: అశోకా!

అశో: ఎవరు! బౌద్ధపిశాచమా! వున్నావా! మొదట నువ్వు యీ కపటాలాని చెప కావాలి.

తిష్య: ఆగండి!

అశో: ఎవరు?

తిష్య: నేనే!

అశో: తిష్యా! నువ్వెందుకొచ్చావు?

ప్రజలు 'మాకీ పరిపాలన వద్దు' అని అరిచే గోల

తిష్య: సమ్రాట్! ఏం చేయబోతున్నారు? ఎందుకీకలహాలం?

అశో: తిష్యా! ఇది రాజ్యాంగ విషయం.

తిష్య: రాణినైనా నేనూ రాజ్యంలో ఒక ప్రజనే. రాజ్యాంగ విషయాలు తెలుసుకునే అర్హత నాకూ వుంది.

అశో: కాదు. ఈ అధర్మాన్ని ఎదిరించి వీరస్వర్గం పొందుతాను.

తిష్య: ఏది అధర్మం?

అశో: ఈ ప్రజావ్యవ్యమం.

తిష్య: వారి హక్కును వారడుగుతున్నారు. అది అధర్మమేలాగవుతుంది?

అశో: రాజ్యం రాజుది.

తిష్య: సమ్రాట్! నిన్నూ నన్నూ పోషించేది యీ ప్రజ. కష్టించి ఈ రాజ్యాన్ని కాపాడేది యీ ప్రజ! వీరందరూ లేకుంటే మీ రాచరికానికీ, నా పట్టమహిషి పదవికీ అర్థం లేదు: అసలు స్థానం లేదు.

ప్రజ: రాణిగారికి జై!

ప్రేమ: నాయనా! దౌర్జన్యంచేత, ఆయుధబలంచేత పాలించటం కానిపని. ప్రేమ, అహింస మానవకళ్యాణదాయకాలు.

శాంతి: సమ్రాట్! ఒక్కసారి సింహావలోకనం చేసుకో నీ జీవితాన్ని. అమాయక ప్రజను ఆకలిమంటలకు ఆహుతిచేసి కుట్రతో, కుతంత్రంతో ఎలా పాలించారో!

నిరూ: నాలా ఎందరి తల్లుల కడుపులు రగులుతున్నవి?

శాంతి: నాలా ఎందరు బలవంత వైధవ్యానికి గురి అయ్యారు?

కాం: నాలా ఎందరు మానాభిమానాల నమ్ముకున్నారు?

1: నాలా ఎందరు బిడ్డల్ని చేతులారా చంపుకున్నారు?

2: ఈ క్షోభ ఊరికే పోతుందా?

తిష్య: సమ్రాట్! ఇందరిని రక్తస్రవంతిలో ముంచి, మీరేమేలుకోబోతారు? ఇందరిని వ్యతిరేకించి పరిపాలించే రాజ్యంలో మీ కేం భద్రత వుంది?

అశోకుడు అలాగే వున్నాడు నిలబడి. చైతన్యం లేదు.

ప్రేమ: పశ్చాత్తాపం పాపాల్ని హరిస్తుంది నాయనా! అదిగో చూడు, ఆ ప్రేమ జ్యోతి - ఆ త్యాగమూర్తి!

అశోకుడు రాజాలంకారాలు ఒకటొకటిగా తీసేస్తున్నాడు

ఇదిగో నాయనా! రక్తసిక్త హస్తాలను బుద్ధ బోధామృతంతో పరిశుద్ధం చేసుకో! ఇదిగో నాయనా! ఆ మహానుభావుని ప్రసాదం.

కాషాయాంబరాలిచ్చాడు. అశోకు డందుకున్నాడు.

అశో: ప్రజలారా!

రాజ్యం మీది ప్రజాశక్తి ప్రతిభ ఈనాడు తెలుసుకున్నాను.

ఈ అజ్ఞానిని మన్నించండి నా ద్రోహాన్ని మరచిపొండి.

తల్లీ! ఆశీర్వదించు. నా రాజ్యంలో ఇంతటి వీరవనిత. ఇంతటి దేవత వుందని తెలియదు. ధన్యుణ్ణి.

ఈ పాపిని ఆశీర్వదించు.

జై అశోకసమ్రాట్టుకు జై!

సమ్రాట్టును కాను, సన్యాసిని. ప్రభువును కాను. ప్రజాసేవకుణ్ణి. సెలవు.

కలకలం – 'సన్యాసి కానక్కరలేదు' – అని

శాంతి: సమ్రాట్!

అశో: తల్లీ!

శాంతి: ప్రజాకంఠం సన్యాసాన్ని ఆమోదించటంలేదు.

అశో: మరింకేం చేయమంటారు? శిక్షించమంటున్నారా? సత్యం. శిక్షార్హుణ్ణే. పచ్చని సంసారాలను కూలదోసిన మహాపాపం కట్టి కుడిపించకపోదు. సంసిద్ధుణ్ణి. ప్రజలే నన్ను శిక్షించనీ. ధన్యుణ్ణి!

శాంతి: కాదు సమ్రాట్! ప్రజలకు మీపై వ్యక్తిగతద్వేషం ఏమాత్రం లేదు. పరిపాలన అసహ్యంగా వుంది. ఇంతటి విప్లవం కలిగింది. మీరు రాజ్యాధిపతులుగా వుండాలనే ప్రజలు కోరుతున్నారు.

అశో: ఇంకా యీ అమానుషకృత్యం నా కెందుకు తల్లీ! రాజుగా ఇంకా నరకాన్ననుభవించాలనే ప్రజల కోరికా! ఇదేనా నాకు వారి శిక్ష.

శాంతి: సమ్రాట్! పరిపాలనలో ప్రజలకు స్థానం వుండనివ్వండి. వారిమంచిని వారే నిర్ణయించుకుంటారు. అప్పుడు అమానుషం, నరకం రెండూ వుండవు.

ప్రేమా: ప్రేమ, అహింసలతో శాంతిని నెలకొల్పు నాయనా! అప్పుడు నీ సామ్రాజ్యం స్వర్గసీమ.

అశో: నేను రాజుగా వుండాలనే ప్రజలకోరికా!

అవును, అవును అని కేకలు

అశో: మీ ఆజ్ఞను శిరసావహిస్తాను.

జై అశోకసమ్రాట్టుకు జై!

అశో: శాంతీ! నీవు ధన్యవు. నీ జన్మ సార్థకం. భావిభారత దేశ నారీలోకానికి ఆదర్శప్రాయవు. నీ చరిత్ర అజరామరంగా స్మరణీయమవుతుంది.

నా ప్రజ! నా దేశప్రజ! నావారు! ఎంతటిశక్తి! ఎంతటి ఉత్సాహం! ఎంతటి ఆత్మబలం!

ఇందరి సేవకుణ్ణి! నా జన్మ ధన్యం!

సమాప్తం



# పరివర్తన

1945 లో రచించిన ఈ నాటకం ద్వారా ఆత్రేయ ప్రజానాట్య మండలికి పరిచయమయ్యారు. న్యూ థియేటర్స్ వారి 'హమ్‌రాహి' చిత్రం 'పరివర్తన'కు ఆధారం కాగా - ఈ నాటకం కన్నడంలోకి 'కలిపుంగవ' పేరుతో అనువదింపబడింది. ఆత్రేయ పరివర్తనను 'బళ్ళారి రాఘవకు' అంకిత మిచ్చారు.

# పరిచయం

బ్రిటిషు వాలనత్వం క్రింద ఆంధ్రదేశ ఆర్థికాభివృద్ధి కుంటుబడిపోయింది. చేతిపరిశ్రమలు కృశించిపోయాయి, వాటిస్థానే ఆధునిక యంత్రపరిశ్రమలు అభివృద్ధి చెందలేదు. దీని ఫలితంగా మన తెలుగు ప్రజలు నిరుద్యోగంతో దుర్భర దారిద్ర్యంలో మునిగి తేలుతున్నారు.

యువకులుగా ఎన్నో బంగారు కలలుకన్న మన తెలుగు కవులు, రచయితలు జీవితంలో ప్రవేశించేటప్పటికి కఠోర పరిస్థితులను ఎదుర్కోవలసి వస్తూంది. పిత్రార్జిత మైన కొలది ఆస్తి చదువు పూర్తయ్యేటప్పటికి చెల్లుబడి అయిపోయి వుంటుంది. పూర్వంవలె ఏ శృంగారకావ్యమో వ్రాస్తే యీనాములు, అగ్రహారాలు యిచ్చి పోషించే జమీందారీయుగం పోయింది. భావోద్రేకంలో వ్రాసిన రచనలు అచ్చు కావడమే కష్టం. ఒకవేళ తల తాకట్టుపెట్టి అచ్చువేయించుకోగలిగినా వచ్చే ఆదాయం స్వల్పం. రచయితకు తనువు గడపటమే కష్టమైపోయింది. అనేక బాధలు పడతాడు. తన బ్రతుకే తనకు భారమైపోయింది. చిన్ననాటి ఆశాజ్యోతి ఆరిపోతుంది. సమాజ మంటే ఏదో నిరూపించలేని ఏవగింపు. తనకంటే నికృష్టజీవితం అనుభవించుతున్న ప్రజాసామాన్యంలో ప్రవేశించలేడు.

అందుకు తాను పొందిన కృత్రిమ సంస్కారం అడ్డువస్తుంది. తాను నేర్చిన విద్యా, విజ్ఞానాలను కష్టజీవులలో చైతన్యం కలుగచేయడానికి వినియోగించడు. తనలో తానే క్రుంచుకపోతాడు. ఇలాంటి రచయితలు, కవులు, మేధావులు మన తెలుగునాట ఎందరో వున్నారు. అట్టివారికి ఈ 'పరివర్తన' నాటకం ఒక ఆదర్శం చూపుతోంది; ఒక సందేశం ఇస్తోంది.

పెట్టుబడిదారు పంచకుచేరి, పోషింపబడుతూ, యజమానికి స్టేటుమెంట్లు, ఉప న్యాసాలు వ్రాసి ఇవ్వడానికి తన మేధాశక్తిని వెచ్చించుతున్న కవిని ఈ నాటకం చక్కగా చిత్రించుతుంది. ఆ సిలుకు సంకెళ్లు త్రెంచుకుని, చెమటోడ్చి కష్టించే ప్రజల మధ్యకు పోతేగాని కవికి మోక్షంలేదని ఈ నాటకం నిరూపించుతుంది.

'పరివర్తన' నాటకం నాలుగవ ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభ సందర్భంలో మద్రాసులో ప్రదర్శించబడింది. పిన్నలు, పెద్దలు అందరి మన్ననలను పొందింది. అందుకు రచయితకు నా అభినందనలు.

రచయిత 'అచార్య ఆత్రేయ' గారు నటకుడు. వెంకటగిరి ఎమెచ్యూర్ ఆర్టిస్ట్స్ అసోసియేషన్‌లో వుండి, 'ఎదురీత' నాటకాన్ని జయప్రదంగా నిర్వహించి 13 వ ఆంధ్ర నాటక కళాపరిషత్తు జరిపిన పోటీ ప్రదర్శనాలలో ప్రథమ బహుమతిని సంపాదించారు. ప్రస్తుతం నాటక కళాపరిషత్తుకు సహాయ కార్యదర్శిగా పనిచేస్తున్నారు.

ఆత్రేయగారు మరికొన్ని నాటకాలు రచించారు. ఆంధ్ర ప్రజలు యీ నాటకాన్ని ఆదరించుతారని ఆశించుతాను. ఆంధ్ర ప్రజా జీవితాన్ని చిత్రించుతూ, ఆత్రేయగారు మరిన్ని నాటకాలు రచించాలని కోరుతాను. అట్టి నాటకాలకు ప్రాతిపదిక అవు ఆంధ్ర నాట్యరంగానికే 'పరివర్తన' వన్నెతెస్తుందని ఆశించుతాను.

— చంప్రం.

# నా మాట

ఈ నాటకం నా తొలిరచన కాకపోయినా వెలుగులోకి వచ్చిందిమాత్రం ఇదే. ఇందులో లోపాలు ఉండవచ్చు. ఆంధ్ర ప్రజానీకం నా యీ శాన్కను సహృదయంతో స్వీకరిస్తుందని ఆశిస్తున్నా.

ప్రజానాట్యమండలి పరిచయాన్ని నాకు గలుగజేసి యీ నాటకం ప్రదర్శింపబడటానికి మూలకారణమైన మిత్రుడు కోగంటి గోపాలకృష్ణయ్యకు నా కృతజ్ఞత. నా నాటకం జయప్రదం కావటానికి, పుస్తక రూపంగా వెలువడటానికి, అన్నివిధాల నాకు తోడ్పడిన మిత్రులు డాక్టరు జి. రాజారావుగారికి నా కృతజ్ఞతాభివందనాలు....

— ఆత్రేయ.

# నాటకంలో వచ్చేవారు

| | | | | |
|---|---|---|---|---|
| బాబు | : | మిల్లు యజమాని | .... | 40 |
| రఘు | : | కవి | .... | 30 |
| దాసు | : | బాబు గుమాస్తా | .... | 60 |
| చౌదరి | : | కార్మిక నాయకుడు | .... | 30 |
| కొండయ్య | : | ఆయిల్‌మన్ | .... | 30 |
| వీరయ్య | : | ఒక కార్మికుడు | .... | 50 |
| రంగడు | : | వీరయ్య కొడుకు | .... | 12 |
| శోభ | : | బాబు చెల్లెలు | .... | 20 |

కాలం : ఈనాడు

స్థలాలు : రెండు

ఒకటి బాబు యింట్లో కవి గది, రెండు వీరయ్య గుడిసె.

1, 2, 4 దృశ్యాలు కవి గదిలో జరుగుతవి.

3 వ దృశ్యం వీరయ్య గుడిసెలో జరుగుతుంది.

## నాటి నటవర్గం

తొలిసారి ఈ నాటకం మద్రాసులో
ఆంధ్ర అభ్యుదయ రచయితల చతుర్థ మహాసభ సందర్భమున

ఆంధ్ర ప్రజా నాట్యమండలి (రాష్ట్రదళం) వారిచే
వాణీమహల్లో 16—1—47 న ప్రదర్శింపబడినది.

| | | |
|---|---|---|
| బాబు | : | శ్రీ డా॥ జి. రాజారావు |
| కవి | : | శ్రీ ఆత్రేయ |
| వీరయ్య | : | శ్రీ నాజర్ |
| కొండయ్య | : | శ్రీ కోగంటి గోపాలకృష్ణయ్య |
| చౌదరి | : | శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి |
| దాసు | : | శ్రీ మాచినేని వెంకటేశ్వరరావు |
| రంగడు | : | మాస్టర్ వల్లం హనుమంతరావు |
| శోభ | : | శ్రీమతి కొమర్రాజు పద్మావతి |

సంగీతం :
శ్రీ సి. మోహన్‌దాసు

ఆర్కెస్ట్రా :
వెంకటగిరి ఎమెచ్యూర్ ఆర్టిస్ట్సు అసోసియేషన్

# మొదటి రంగం

వారి ఇంట్లో గది: కవిగారికిని ప్రత్యేకింపబడింది
గది. శోభ, రంగడు ఉన్నారు. రంగడు పాడుతున్నాడు.
శోభ వింటూ నేర్చుకొంటూంది పాట .

రంగడు: ఓ కవీ! ఓ కవీ!
స్వప్న వీధుల విహరించేవా?
వాస్తవ జగతికి దిగి రాలేవా?
బక్క డొక్కల ప్రజ్వరిల్లిన
బడబాగ్నులు నిను నిదుర లేపవా?
జగతి నడిపించేటి జ్ఞానజ్యోతివి నీవు
తెగువ కలిగించేటి దివ్యౌషధము నీవు
అలిగి పలికావంటె కలములే కత్తులై
అలిగి పలికానంటె మాటలే ఈటెలై
అన్యాయ లోకమ్ము అదిరిపోతోందోయి!

లోపల నుంచి "ఆపు" అని కేక, రంగడు పాట ఆపేశాడు.

శోభ: ఫర్వాలేదు పాడు. ఆ కవిగారికిలాంటి పాటంటే తలనొప్పి.

రంగడు మరల పాడుతున్నాడు.

పలుకవోయ్ పేదోళ్ళ బ్రతుకు తెలిసేటట్లు
వ్రాయవోయ్ కలవాళ్ళు వణికిపోయేటట్లు
గుడిసెలలో వెన్నెలలు కురిపించవోయ్!
వడిసెలలా నీ కవిత వర్షించవోయ్!

తెరచిన కలంతో, కాగితాలతో కవి చరచర వచ్చాడు.

కవి: ఆపమన్నది విన్నుకాదూ? చెవుల్లో చెట్లు మొలిచినయ్రా?
శోభ: నేను పాడమన్నాను.
కవి: నేను వద్దన్నాను.
శోభ: మీరు వద్దన్నది నేను విన్నాను, నేను పాడమన్నది రంగడు విన్నాడు.

కవి: శోభా! అవతల మనిషి పనిచేసుకుంటూన్నది గమనించాలి!

శోభ: ఓ! కవిగారు వ్రాసుకొంటున్నారా? ఆహా! ఎంత తెలివిమాలినదాన్ని నేను, ఎంత పాతకిని? సాహిత్య ప్రపంచమా! పోయింది! పోయింది!

రంగ: ఏంటమ్మగారూ! ఏం పోయింది?

శోభ: మూర్ఖా! ఆంధ్ర సాహిత్యానికొక అమూల్యమైన కానుక; ఒక్క ప్రణయగీతి పోయింది. కవి కలం హఠాత్తుగా ఆగిపోయింది. ఏ అప్సరస అందం చూస్తూనో, ఏ పంచమశ్రుతిలో ఆలపిస్తూనో, స్వర్గసీమలో కలలుగంటూ కవిగారి కలంలోకి దిగుతూన్న ఆ అమృతధారకు నీ వెధవపాట (వెధవపాట అన్నందుకు రంగడికి కోపం వచ్చింది కాని శోభమాటల వేగంలో కొట్టుక పోతున్నాడు) అడ్డుతగిలి ఆపివేసింది. ఆంధ్ర సాహిత్యానికొక అమూల్య అమోఘ, అద్వితీయ అద్భుత, అసహ్య—

కవి: శోభా!

శోభ: క్షమించండి

కవి: క్షమించాం లేండి.

శోభ: కవిగారికి కోపం వచ్చింది. రంగా! రా వెళ్దాం. (వెళుతున్నారు)

కవి: ఇదిగో —

శోభ: (తానూ తిరిగి చూచింది)

కవి: తమర్నికాదు. తమరు దయచేయొచ్చు.

శోభ: (చర్రున వెళ్ళింది.)

కవి: రంగా! ఇలారా! శోభ పాడమన్నదా నిన్నీపాట?

రంగ: అవునండి! పాడమని ఎదవపాటనటం ఆమె కేమీ బాగోలేదండి. ఇదివర కెప్పుడూ ఇలా అనలేదు. అసలింక పాడమంటే పాడతానేం? మా చౌదరి బాబంటాయనే ఈ పాటంటే చెవి కోసుకుంటారు. ఈమె కెదవ పాటయింది కానీ!

కవి: చౌదరి బాబెవరు? ఈ పాట వ్రాసిందాయనేనా?

రంగ: చౌదరిబాబు నెరగరాండీ? మా సంఘం పెద్దండి. ఈ పాట రాసింది ఆయన కాదండి!

శోభ: (మరల వచ్చింది ఏదో పుస్తకంకోసం అన్నట్లు)

రంగ: ఎవరో పెజా కవంట. మా గొప్పగా సెప్తారండి ఆయన్ను గూర్చి. మంచి మంచి పాటలన్నీ ఆయన రాసినయేనండి.

శోభ: ఆఁ. కవులకేం తక్కువ ఈ కాలంలో. ఏమీ పనితోచని వాళ్ళందరూ కవులై పోతున్నారు. భాష, ఛందస్సు, వ్యాకరణం, అలంకారాలు ఏవీ ఎరగని వాళ్ళందరూ ప్రజాకవులని బయల్దేరుతున్నారు. వాళ్ళు వ్రాసే ప్రతి చెత్తా ప్రజాసాహిత్య మవుతూంది. అందాకా వస్తే నేనూ కవినే; అసలు కవిత్వం అంటే ఏమిటో చెప్తా— విను —

కమ్మని నిద్దుర కల తెరచాటున
నవ్విపోతివే నా రాణీ!
చూచి పోతివే ప్రియురాలా!
పున్నమి వెన్నెల నీ నవ్వైతే
కలువకన్నె నా హృదయం కాదా!
నవ్విపోతివే నా హృదయానికి
చిమ్మచీకటులు కమ్మికొన్నవే!
పాటపాడి నా బ్రతుకు తోటలో
తేనెల సోనలు త్రిప్పరాదటే!
నేనే నీవే నీవే నేనే
లోకమంతా ప్రేమధామమే!

కవి: శోభా! వూరుకో—వూ?

శోభ: ఊరుకుంటానుగాని రంగడు పాడిన పాటను గురించి మీ అభిప్రాయ మేమిటండీ?

కవి: చాలా బాగుంది.

శోభ: అదిగో కవుల్లో కనుపించే మరో దుర్గుణం: ముఖప్రీతి కంటున్నారు.

కవి: ఆఁ. తమ ముఖప్రీతికే అంటున్నా!

శోభ: అయితే బాగుందంటారు.

కవి: బాగుందనే అన్నాను.

శోభ: ఆ పాటలో భావాన్ని అంగీకరిస్తారా?

కవి: ఏమిటీ ప్రాసులు?

శోభ: ప్రాసులనుకుంటే నా కెందుకొచ్చిన గొడవ. నమస్తే! (వెళ్ళింది)

కవి: రంగా!

రంగ: బాబుగారుంటే ఇట్లా మాట్లాడరండి. అన్నగారింట్లో లేకుంటే నన్ను కూడా పొద్దస్తమానం పాడమని చంపేస్తారు.

కవి: రంగా! మీ సంఘమేమిట్రా?

రంగ: కూలోళ్ళ సంగమండి. చౌదరయ్యగారా సంఘానికి పెద్ద. ఆయన మాకు మంచీ సెబ్బరా సెప్తుంటారండీ. అయితే బాబూ! తమరూ కవులే గద?

కవి: ఏం? ఎందుకూ?

రంగ: తమ రీలాంటి పాటల్రాయరేం బాబూ!

కవి: ఎవరు చెప్పారు? శోభ చెప్పిందా?

రంగ: అవునండి! లేకుంటే నాకెలా తెలుస్తుందండి?

కవి: ఏమని చెప్పింది?

రంగ: మీ పాటలన్నీ ఏంటో మాబోటోళ్ళకి తెలవ్వనీ. ఏమీ బాగుండవనీ, ఆడోళ్ళ అందాలను గూర్చే ఏంటో. ..రాస్తారనీ ...

కవి: ఎప్పుడన్నది?

రంగ: నేను పాడినప్పుడల్లా అంటూంటారండి.

కవి: ఊఁ. ఇంకా!

రంగ: బాబూ! అడక్కండి, కోప్పడతారు.

కవి: అడగనులే. ఇంకా ఏమన్నది చెప్పు?

రంగ: మీ కిలాంటి పాటలంటే తలనెప్పని.

కవి: ఊఁ. ఇంకా?

'రంగా' అని లోపలి నుంచి శోభ కేక

రంగ: అమ్మగారు పిలుస్తున్నారండి. ఎళ్ళొస్తా బాబూ! అమ్మగారి నడక్కండి.... మళ్ళా.... [వెళ్ళాడు]

దాసు వచ్చాడు

దాసు: ఏం బాబూ! ఉత్తరాలేవన్నా వున్నాయా?

కవి: లేవు దాసూ!....బాబుగారున్నారా?

దాసు: లేరు. ఎక్కడికో వెళ్ళారు.

కవి: ఎక్కడి కెళ్ళారు?

దాసు: ఆఁ ఎక్కడి కెళతారు? ఏవో మీటింగులని, ఉపన్యాసాలని ప్రొద్దస్తమానం తిరుగుతుంటారు. ఒక్క క్షణం తీరిక వుంటేనా? ఆఁ మొన్న నువ్వు

వ్రాసిచ్చిన ఉపన్యాసం చాలా బాగుందని అందరూ అంటున్నారు. బాబుగారు కూడా తడుముకోకుండా మహా మజాగా చదివేశారు. అది మరీ అందం తెచ్చింది నీ వ్రాతకు.

కవి: నేను వ్రాసిందని అందరికీ తెలుసా?

దాసు: వినేవారికెలా తెలుస్తుందిలే, చూచేవారికి తెలుస్తుంది కాని. అసలు బాబు తెలిసేటట్లు చదువుతాడా? నిజంగా బాబు చాలా తెలివైనవాడు. చిన్నతనం మనచి శోభమ్మ అచ్చం తల్లిపోలిక. పట్టి అమాయకురాలు. నేను వీళ్ళందరినీ ఎత్తుకు తిరిగేవాణ్ణి. నన్ను ఒక్కక్షణం వదలివుండేవారు కారు. ఇప్పుడుకదా బాబు వుపన్యాసాలు, సభలు, పదవులు. పెద్దవాడైనాడు. యజమాని గనక 'మీరు' అనాలిసొస్తూంది. అదిసరేగాని నాయనా. నువ్వెంతవరకు చదువు కున్నావు?

కవి: బి.ఏ. అఘోరించాను.

దాసు: ఎందుకు నాయనా అంత కష్టంగా అంటున్నావు?

కవి: ఏమీలేదు దాసూ!

దాసు: ఏమో! నీ తత్వమే ఏమిటో విచిత్రంగా వుంది.

కవి: విచిత్రంగా వుందా?

దాసు: కాదూమరి? బి.ఏ. చదివావు. కవిత్వం చెప్తావు. కుర్రాడివి. నీ వుపన్యాసాలను వింటూంటే అందరూ ఆశ్చర్యపోతున్నారు. బాబుగారి కెక్కడలేని పేరొస్తూంది. ఇంత తెలివిగలవాడివి.......నువ్వెందు కింత కష్టంగా మాట్లాడుతున్నావో....నీ హృదయంలో ఏదో బాధ వుంది. చెప్పుకోలేకున్నావు. చూడు నాయనా, దాసు దాపరికం అంటే ఏమిటో ఎరగడు. అందుచేత అనుకున్నది అనుకున్నట్టు అడిగేస్తాడు; మరేమనుకోకేం?

కవి: దాసూ! పాతిపెట్టిన దయ్యాన్ని మరల పైకి లాగుతున్నావు.

దాసు: నీ కంత కష్టం కలిగించేటట్లయితే నేనేం పలకను. నువ్వంటే వున్న అభిమానంకొద్దీ ఈ మాత్రమన్నా పలికాను కాని....

కవి: అదికాదు దాసూ! మీరు పుణ్యాత్ములు!

దాసు: పుణ్యాలు, పాపాలు మన కెందుకు నాయనా పేదోళ్ళకి!

కవి: నిజం దాసూ! మీరు పుణ్యాత్ములు కనుకనే బ్రతుకుతున్నారు. మీరు బ్రతకటమే కాదు, మిమ్మల్ని ఆశ్రయించుకున్నవారినీ బ్రతికిస్తున్నారు. కాని కవు లలా కాదు. కవులు దౌర్భాగ్య దామోదరులు. కవులు బ్రతకటానికి వీల్లేదు.

దాసు: కవులు కవులు అని పూర్కో అనటం దేనికి? అయితే నాయనా ఎందరో మనుష్యులు బ్రతుకుతున్నారే, కవులు మనుష్యులు కారా?

కవి: నీకు తెలీదు దాసూ! నిజంగా కవులు బ్రతకటంలేదు. కవులు బ్రతకటానికి పుట్టలేదు.

దాసు: ఎవ్వడూ బ్రతకటానికి కాదు పుట్టింది. ప్రతి ఒక్కడూ చావటానికే.

కవి: అదికాదు. అందరిలోకి నే నున్నానే, నేను....పరమ దౌర్భాగ్యుణ్ణి. అందుకే ప్రపంచం నన్ను చితకగొట్టేసింది. నన్నొక్కడినే కాదు, నన్నాశ్రయించు కున్న అమాయక జీవుల్ని తన రాతిచక్రాల క్రింద నలిపేసింది. వాళ్ళెందుకు నన్నాశ్రయించాలి? ఇంతకూ అది వాళ్ళ తప్పుకాదు. శిక్ష ననుభవించటానికి! నాదే తప్పు! అందుకు శిక్ష వాళ్ళుకూడా అనుభవించారు. కాకుంటే కవికి భార్యెందుకు? బిడ్డ లెందుకు?

దాసు: నెమ్మది చేసుకొని అసలు కథేంటో చెప్పు ఆవేశపడకు!

కవి: దాసూ! నే నెన్నాళ్ళనుంచి ఇక్కడుంటున్నానో నీకు తెలుసుగా?

దాసు: దాదాపు రెండేళ్ళ యింది.

కవి: అంతకు క్రితం గాథ యిది. పేద కుటుంబం నాది. ఉన్నది కాస్తా అమ్మి నాకు బి.ఏ. వరకు చదువు చెప్పించారు. వంశా న్నుద్ధరిస్తానని ఎన్నో ఆశలు పెట్టు కున్నారు తలితండ్రులు. చదువు పూర్తయింది. ఆస్తీ హరించిపోయింది. అప్పటికే నాకు కవిత్వంలో ప్రవేశం వుంది. ఉద్యోగప్రయత్నంలో కొన్ని సంవత్సరాలు గడిచినవి. దాసూ! కవి తత్వం నువ్వెరగవు! కవి వింత మనిషి. కవి గుమాస్తా కాలేడు. కవి చేయతగ్గ ఉద్యోగాలు చాలా తక్కువ వున్నాయి యీ సంఘంలో. అందుచేత ఏ వుద్యోగాన్నీ అంటిపెట్టుకొని వుండలేకపోయాను. అది నా తప్పే కావచ్చు. కానీ యీ ప్రపంచం నన్ను మోసం చేసింది. కవిగా పెద్ద భవిష్యత్తు కలదని కలలు రేపింది. కవిగా బ్రతగ్గలననే స్వప్నంలో నన్ను కూలదోసింది.

దాసు: ఇదిగో నా మాట విను. శ్రీనాథు డంతటివాడు "కవితన్ చెప్పిన పాడ నేర్చిన వృథా కష్టంబె" అని వాపోయాడు. కవిత్వం సరదాగా వుండొచ్చు గానీ, దానివల్లనే బ్రతకాలనుకోటం పొరబాటుకాదూ? అవన్నీ పోయాయి నాయనా, అది ఏ కృష్ణదేవరాయల యుగమో?

కవి: నిజం దాసూ! కవిత్వం కడుపునిండని గాలికూడైన కీర్తిని గడించటానికి మాత్రమే ఉపయోగపడింది. ఆ కీర్తిని జీర్ణించుకోలేక నా సంసారమంతా

మారణహోమమైంది. భార్య పోయింది. బిడ్డలు ఒకరి వెంబడి ఒకరు పోయారు. ఆకలికి, రోగాలకు ఆహుతి అయ్యారు. ఇంకేముంది దాసూ, నాకీ ప్రపంచంతో పని? నా కవిత్వాన్ని అభినందించి, ఆనందించి తెగ పొగడిన యీ ప్రపంచం నా భార్యాబిడ్డలకు ఇన్ని గంజినీళ్ళు పోయలేకపోయిందేం? మమ్మల్ని బ్రతకనిచ్చిందా? నా పెళ్ళాం మానరక్షణ కింత గుడ్డపీలిక ఇవ్వలేకపోయిందే? నాకేం పని దాసూ ఈ ప్రపంచంతో? ఈ ప్రపంచంలో ఎలా బ్రతకటం దాసూ?

దాసు: (నవ్వుతున్నాడు)

కవి: ఏమిటి దాసూ! అలా నవ్వుతున్నావు?

దాసు: బ్రతకటం అనేది ప్రపంచంలో రాకపోతే ఇంకెక్కడ వుంటుందా అని. ఇంకేం! సర్వసంగ పరిత్యాగివి. ఈ గది, యీ సోఫాలు, రాఫీలు, అన్నిటినీ మించి యీ సిగరెట్లు బూదిచేయటం ఎందుకూ? మానేయ్!

కవి: దాసూ! పరిహాసమాడుతున్నావ్?

దాసు: పరిహాసం కాదు! కవులందరూ యిలా కుబుర్లుపోగులుగా వయారపుతారేం? ఇదిగో యీ నొసట ముడతలు చూడు! ఈ ముసలి దేహం చూడు. ఈ దేహం ఎన్ని కష్టాలు పడింది? ఈ హృదయం ఎన్ని గాయాలు తిన్నది? ఈ కళ్ళు ఎన్నిరోజులు ఏకధారగా కన్నీరు కార్చినవి? కాని, నీలా పిరికిమందు తినలేదే నేను? నీలా ప్రపంచంనుండి పారిపోలేదే నేను? ప్రపంచంమీద అలిగి ఏం సాధిస్తావు? ఎవరిమీద నీ అలుక? అలిగి నీ స్వశక్తినీ, స్వతంత్రతనూ చంపుకొంటావా? చీకటికొట్టులో కూర్చొని కళ్ళు మూసుకొని కాలం గడిపేయాలను కొంటావా? సోమరిపోతులా బ్రతికిపోవాలను కొంటావా? ప్రపంచం నిన్ను పోషించాలీ? కవిగా బ్రతకలేకపోతే కూలీగా బ్రతుకు. అంతేకాని, యిలా ఒకరి పంచలో తల దాచుకొని....

కవి: దాసూ!

దాసు: మంచి చెబితే అందరికీ కోపం వస్తుంది. ఆలోచించేవాళ్ళే అరుదు. సరే! నా కెందుకొచ్చిన గొడవ గుమాస్తా ముండాకొడుక్కి! వెళ్ళొస్తా. [వెళ్ళాడు]

బాబు వచ్చాడు

కవి: నమస్తే!

బాబు: నమస్తే!

బాబు: చస్తున్నాం! ఈ సమాజాలతో, సభలతో వేగలేక అబ్బబ్బ! ఊర్కే మెహర్బానీ కేడపటమేకాని లేకుంటే ఎందుకొచ్చిన అవస్థ యిది? కొంచెం వుదార స్వభావం చూపించేసరికి ప్రతివాడూ పీక్కుతింటానికి మనపై పడతాడుకదా? ఎన్నిటికని అధ్యక్షులుగా వుంటాం. ఎన్నిటికని విరాళాలిస్తాం...ఇదిగో ఇదే మిటో చూడు. ఎవరో ఆంధ్ర సారస్వతాభివర్ధనీ సమాజమో ఏమిటో గొడవ. పేర్ల కేం తెగబారెడు; చేసేపని ఏమీ లేకున్నా .... అన్నట్లు మరచా. మొన్న సనాతన ధర్మోద్ధారక సమాజంవారు నన్ను అధ్యక్షులుగా ఎన్నుకున్నందుకు అంగీకారం తెలపార్సిందని వ్రాశారే, వాళ్ళకు ఉత్తరం వ్రాశామా?

కవి: వ్రాశామండి. (దాసు అకౌంటు పుస్తకాలు తెచ్చిపెట్టి వెళ్లాడు)

బాబు: మనతో ముందుగా చెప్పనూ చెప్పరు — తీరా అధ్యక్షులుగా ఎన్నుకున్నామని మాత్రం వ్రాస్తారు. చూస్తే యీ సమాజాలు చేసే పనేమీ వుండదు సరిగదా విరాళాలు పీక్కు తినటానికని మనల్ని ఆశ్రయిస్తారు గద్దలగుంపుల్లా, ఈ అధ్యక్ష పదవి లంచంగొట్టి! ఊఁ. ఇదిగో రఘూ వీళ్ళకూ్కడా ఓ వుత్తరం రాసిపెడుదూ నీకు పుణ్యముంటుంది. ఎక్కడని తీరిక చేసుకోను వీటికంతా ....

కవి: ఏమని వ్రాయమన్నారు?

బాబు: వాళ్ళేమని వ్రాశారు?

కవి: శ్రీ రావుబహదూర్ బాబురావు నాయుడుగారికి (చదువుతాడు)

బాబు: ఆఁ. ఆఁ. ఆ గొడవంతా నా కక్కర్లేదు - క్లుప్తంగా. విరాళమా? అధ్యక్ష పదవా?

కవి: ........విరాళమండీ!

బాబు: విరాళం! ఎక్కడ పోసి పెట్టుందని? అసలు ఈ సంఘం ఆఘోరించే దేమిటి? విరాళమట విరాళం! ఈ విరాళాలతో మనం దివాళా తీసేట్టున్నాం. పాడు సంఘాలు! పాడు విరాళాలు!

కవి: ఏం వ్రాయమన్నారు?

బాబు: ఊఁ మీ సంఘం ఎప్పుడు స్థాపించారు! ఎందుకు? ఇంతవరకు ఏం చేశారు? వ్రాస్తే మాకు సంతృప్తికరంగా వుంటే పంపుతామని వ్రాయి.

కవి: అది కాదండీ! తమరు క్రిందటిసారి అధ్యక్షత వహించినప్పుడు 1000 రూపాయలు వాగ్దానం చేశారటండీ!

బాబు: ఆc, వెయ్యిరూపాయలు వాగ్దానం చేశానూ? (డైరీ తెసి చూసి) ఆc అవును. జాన్యువరిలో, ఇప్పుడు డిసెంబరు కదూ! ఇంతలో ఏం మునిగిపోయింది? మేనర్సు తెలియని బ్రూట్సు! వాగ్దానం చేస్తే తప్పుతామా? ఉc—మీరొచ్చి తీసుకెళ్ళాల్సిందని వ్రాయి. అబ్బబ్బ! ఈలాంటి పనులేవో నువ్వు చేసిపెడు తున్నావు గనుక సరిపోతోంది దాసీ. లేకుంటే యీ సమాజాలలో సభలతో నాకీపాటికి మతిపోయి వుండేది.

కవి: అవునండి. నాకు జ్ఞాపకముందండి. ఈ సమావేశానికి అధ్యక్షోపన్యాసం కూడా వ్రాసిచ్చాను. ఆంధ్రసాహిత్యం మీద!

బాబు: ఆc. ఆc. అవున్లే —

దాసు వచ్చాడు కొన్ని పుస్తకాలతో

బాబు: ఏమిటది?

దాసు: పుస్తకాలండీ!

బాబు: ఎవరికి?

దాసు: మనకేనండి.

బాబు: ఎక్కడివి?

దాసు: పోస్టులో వచ్చాయండి.

బాబు: ఏం పుస్తకాలవి?

దాసు: నేను చదవలేదండీ!

కవి: నేను ఆర్డరిచ్చానులేండి కొన్ని పుస్తకాలకి. అవై వుంటాయి.

దాసు: ఆc అవునండి.

బాబు: ఓ! ఆలాగా! ఈ ఇంటిలో ఎవరో ఒకరుండి తీరుతారు ఇలా పుస్తకాలు కొని పడేయడానికి. మా తండ్రిగారికి పుస్తకాలంటే ఎంతో సరదా! ఆ పెద్ద లైబ్రరీ మా యింట్లో చూచావుగా—అదంతా మా తండ్రిగారు కొన్నదే! ఆయన బ్రతికి వున్నంతకాలం ఆ పుస్తకాలన్నీ చదవండిరా అని ఒకటే గోల! మా శోభ మాత్రం అన్నీ చదివేసింది. మన కెక్కడుంది తీరిక? ఎంత యింది.........

దాసు: పాతికరూపాయలండి!

బాబు: సరే. (రంగడు బ్రాంది సీసాలు తెచ్చిపెట్టి వెళ్లాడు.)

దాసు: (వెళ్ళాడు)

బాబు: కవిగారూ! కొత్తపుస్తక మేమన్నా వ్రాస్తున్నారా?

కవి: ఆలోచిస్తున్నా - కొత్తది మొదలుపెట్టాలని.

బాబు: ఏం వ్రాసి ఏం ప్రయోజనం? అలా మూల పడేసి వుంచటాని కెందుకూ వ్రాయటం; నీ తత్వమేమిటో నాకేం బోధపడటంలేదు. ఇన్నాళ్ళూ చూచాను - నువ్వుగా ఏమన్నా చెప్తావేమోనని. ఉపయోగం లేకపోయింది చూడు! అసలు అచ్చుపడి ప్రపంచంలో ప్రచారమై నలుగురూ చదువుకుందుకు కాకుంటే మరెందుకూ వ్రాయటం. . ఏమంటావ్? ఇప్పటి కేవో రెండు పుస్తకాలు పూర్తయినవన్నావు - అవి రెండూ ఇలా ఇవ్వు. నువ్వు అడక్కపోయినా నేనే అచ్చుకు పంపుతా.

కవి: అచ్చువేయిస్తారా? నా పుస్తకాలా?

బాబు: అవును. ఏం? అచ్చు వేయించుకునేవాడంతా మహా సీకిన్నా విగావ్చారేం? అసలు యీ కాలంలో ప్రెస్ లెక్కువైనకొద్దీ ప్రతి చెత్త పుస్తకమూ అచ్చు కావటమేగా? ఇంకో రహస్యం చెబుతాను విను. ఎప్పటికప్పుడు వ్రాసింది అచ్చుయిపోవటం చాలా మంచిది. ఎందుచేతంటే ఇంకా కొన్నాళ్ళకి ఏ కవికో ఇదే ఐడియా కలిగిందనుకో. వ్రాసి ప్రింట్ చేస్తాడనుకో, అప్పుడు మనదే మవుతుంది? తీరా కాపీ అనేస్తారా? కవిగా వుండి నీ కీ మాత్రం వ్యాపార రహస్యం తెలీలేదంటే చాలా శోచనీయమే! అచ్చయితే చాలురా భగవం తుడా అని అలమటిస్తున్న కవు లెందరు లేరంటావు? అవి రెండూ నవల లేనా?

కవి: కాదు ఒకటి పద్యకావ్యం! ఇంకోటి పాటల సంపుటి.

బాబు: పాటల సంపుటి! ఆఁ. అవును ప్రణయజ్వాల అనికదూ? చాలా బాగున్నాయి సుమా! ఒకటి రెండు శోభ పాడుతూంటే విన్నా. అలాంటివి బూజుపట్టి పోవడం నాకేమీ ఇష్టంలేదు. ఏం? ప్రెస్సుకు పంపమన్నావా?

కవి: క్షమించండి. నా పేరు వెల్లడికావటం నా కిష్టంలేదు. నాలో ఆరిపోయిన ఆశ లను మరల ఎందుకు రేపుతారు? ఇప్పుడిప్పుడే మానుకొంటున్న మనసులోని గాయాలను మరలా కెలక్కండి. నాకేమీ అక్కర్లేదు. ఇలా బ్రతికిపోతే చాలు!

బాబు: ఊఁ. నిన్ను మొట్టమొదటి రోజు నేను కలుసుకున్నప్పు డేలాగున్నావో ఇంకా అలాగే వున్నావు! ఏమో నీ యిష్టం. ఇదిగో రఘూ నీవు తెలివిగల వాడవనీ, అభివృద్ధిలోకి రావాల్సినవాడవనీ నిన్ను చూచినరోజే అనుకున్నా.

బాబు: ఆఁ, వెయ్యిరూపాయలు వాగ్దానం చేశానూ? (డైరీ తీసి చూసి) ఆఁ అవును. జాన్యువరిలో, ఇప్పుడు డిసెంబరు కదూ! ఇంతలో ఏం మునిగిపోయిందీ? మేనర్సు తెలియని బ్రూట్సు! వాగ్దానం చేస్తే తప్పుతామా? ఉఁ—మీరొచ్చి తీసుకెళ్ళాల్సిందని వ్రాయి. అబ్బబ్బ! ఈలాంటి పనులేవో నువ్వు చేసిపెడు తున్నావు గనుక సరిపోతోంది దాసీ. లేకుంటే యీ సమాజాలతో సభలతో నాకీపాటికి మతిపోయి వుండేది.

కవి: అవునండి. నాకు జ్ఞాపకముందండి. ఈ సమావేశానికి అధ్యక్షోపన్యాసం కూడా వ్రాసిచ్చాను. ఆంధ్రసాహిత్యం మీద!

బాబు: ఆఁ. ఆఁ. అవున్లే —

దాసు వచ్చాడు కొన్ని పుస్తకాలతో

బాబు: ఏమిటవి?

దాసు: పుస్తకాలండీ!

బాబు: ఎవరికి?

దాసు: మనకేనండి.

బాబు: ఎక్కడివి?

దాసు: పోస్టులో వచ్చాయండి.

బాబు: ఏం పుస్తకాలవి?

దాసు: నేను చదవలేదండీ!

కవి: నేను ఆర్డరిచ్చానులేండి కొన్ని పుస్తకాలకి. అవే వుంటాయి.

దాసు: ఆఁ అవునండి.

బాబు: ఓ! ఆలాగా! ఈ ఇంటిలో ఎవరో ఒకరుండి తీరుతారు యిలా పుస్తకాలు కొని పడేయడానికి. మా తండ్రిగారికి పుస్తకాలంటే ఎంతో సరదా! ఆ పెద్ద లైబ్రరీ మా యింట్లో చూచావుగా—అదంతా మా తండ్రిగారు కొన్నదే! ఆయన బ్రతికి వున్నంతకాలం ఆ పుస్తకాలన్నీ చదవండిరా అని ఒకటే గోల! మా శోభ మాత్రం అన్నీ చదివేసింది. మన కెక్కడుంది తీరిక? ఎంత యిండి.........

దాసు: పాతికరూపాయలండి!

బాబు: సరే. (రంగడు బ్రాంది సీసాలు తెచ్చిపెట్టి వెళ్లాడు.)

దాసు: (వెళ్ళాడు)

దాసు: అవికావండి ఏవో!

బాబు: దాసూ! మహా తెలిసినట్లు మాట్లాడకు. వాడుసరే, నీకూ ముసలితనంలో మతి పోయిందేం?

దాసు: ఈ కాలంలో వయసువాళ్ళకే పోతూందండి.

బాబు: (ఉరిమి చూచాడు)

దాసు: (వెళ్ళాడు)

బాబు: O! 4 O' Clock!

కొండయ్య రొప్పుకుంటూ పరుగెత్తుకొచ్చాడు

కొండ: బాబూ, బాబూ! పెమాదం! పెమాదం! పెమాదం జరిగింది!

బాబు: (ఆదుర్దాగా) ఏం జరిగింది?

కొండ: ఈరడి శెయ్యి మెసిన్లో సిక్కొని ఇరిగిపోయిందండి. రకతం ఎల్లువలై పారిపోతుంటాది. సుహ తప్పిపోయి పడుండాడు బాబయ్యా!

బాబు: (తాపీగా కూర్చొని పొగవదుల్తూ) తప్పెవరిది?

కవి: (బాబు ప్రశ్న కవిని కలవరపరిచింది)

కొండ: తప్పెవరిదైతే ఏం బాబయ్యా! ఆడి శెయ్యి ఇరిగిపోయింది. ఆడి పెల్లాం బిడ్డలు గోడు గోడున ఏడ్చి పోతుండారు. తమరొకసారి దయశెయ్యండి బాబయ్యా! అసుపత్తిరికూ్కెవా మోసుకెల్లలా; పడేసుంచారు! ఎంత పెమాదమో ఏమో!

బాబు: మెషన్లలో ఏమీ లోపం లేదుగదా?

కొండ: అయన్నీ సూసుకోలేదండి; ఆడుపడ్డాడు. పాక్టరీ పాక్టరీ ఒక్కసారి కెవ్వుమన్నది. నా మతోయింది. తమకాడికి పరుగెత్తుకొచ్చా.

బాబు: ఫ్యాక్టరీ పని మొదలెట్టే పూర్వం మెషన్లన్నీ సరిచూశారా?

కొండ: సూశారండి. అప్పుడన్నీ బాగుండాయి.

బాబు: మరి ప్రమాదం ఎలా జరిగింది?

కొండ: ఆడి కర్మ! నన్నడితే నేనేం సెప్పను?

బాబు: ఆయిల్‌మేన్‌గా వుండి ఆ మాత్రం మెషిన్ల బాగోగులు తెలియవూ? సరే! నువ్వెళ్ళు. నేనొస్తా

కొండ: శిత్తం బాబూ! (వెళ్లాడు)

బాబు: (త్రాగి) త్రాగుబోతు వెధవలు! తప్ప త్రాగివచ్చి దేహంమీద ప్రజ్ఞలేకుండా పనిచేస్తూంటారు. చెయ్యి తెగిందంటే యెందుకు తెగదూ? చచ్చిపోతారు వెధవలు.

కవి: త్వరగా వెళ్ళండి పాపం! ఎంత ప్రమాదమో ఏమో!

బాబు: ఆఁ ఫ్యాక్టరీ అంటే యిలాంటి ప్రమాదాలు జరుగుతుంటాయిలే! (వెళ్లాడు)

దాసు: [అకౌంటు పుస్తకాలు తీసుకెళ్ళటానికి వచ్చాడు.] ఏం బాబూ అలా చూస్తున్నావు?

కవి: ఫ్యాక్టరీలో ప్రమాదం జరిగిందట దాసూ!

దాసు: మన ఫ్యాక్టరీలోనే?

కవి: అవును దాసూ!

దాసు: మనకేం ప్రమాదాలు రావే?

కవి: ఎవరో వీరయ్యట, కూలీ! చెయ్యి విరిగిపోయిందట; బాబుగారుకూడా వెళ్ళారు.

దాసు: బాబు వెళ్ళిమాత్రం ఏం చేస్తారులెండి? విరిగినచెయ్యి అతుకుతారా? తప్పెవరిదో విచారించు కొస్తారు అంతేగా!

కవి. అంతేనా దాసూ?

దాసు: అంతేకదా నాయనా! చెయ్యి విరగటమంటే వూర్కే విరుగుతుందా? తప్పెవరిదో వుండాలి కదూ? యజమానులు విచారించాల్సిన మొదటివిషయమే అది! అయినా మనకెందుకులే! (వెళ్లాడు)

రంగ: (గ్లాసులు పట్టుకెళ్ళటానికి వచ్చాడు) బాబుగారెళ్లారాండి?

కవి: ఫ్యాక్టరీ కెళ్లారు రంగా! ప్రమాదం జరిగిందట!

రంగ: ఏంటి బాబూ! ఫాక్టరీ తగలడ్డదా?

కవి: కాదు రంగా!

రంగ: కారు డానయిందేం!

కవి: కాదు రంగా! మెషిన్లో చిక్కుపడి ఒక కూలీ చెయ్యి తెగిపోయిందట!

రంగ: నిజంగానా?

కవి: అవును రంగా! ఎవరో వీరయ్యట పాపం!

రంగ: ఈరయ్యే! (గ్లాసులు క్రింద జారిపోయినవి) మానాన్నే! మా నాన్నే! మా నాన్నే! (పరుగెత్తుతాడు)

తెరపడుతుంది.



# రెండవ రంగం

బాబు ఇంట్లో గది. పైప్ తాగుతూ ఇటటు పచార్లు
చేస్తున్నాడు. కొండయ్య ఒకవైపు నిల్చున్నాడు.

బాబు: ఊఁ అయితే ఏమంటావురా?

కొండయ్య: అనేదేముంది బాబయ్యా తమకు తెలవంది?

బాబు: అదే! అదే! మాకు తెలియందేమీ లేదనీ మీరు తెలుసుకున్నారా అని ఇప్పటికైనా?

కొండ: తమరు సెప్పాలా బాబూ? ఏనాడో తెల్సుకున్నాం.

బాబు: ఒరే! ఇదిగో, మీ నాయన పోయేటప్పటికి నువ్వు చాలా చిన్నవాడివి. మీ నాయన మా దగ్గర పనిచేసి ఎంతో అభిమానం, నమ్మకం సంపాదించుకున్నాడు. నువ్వూ ఆ అభిమానం సంపాదించుకో. మనిషన్న తర్వాత కృతజ్ఞత వుండాలిరా! ఏమంటావ్?

కొండ: శిత్తంబాబూ! మాలో వుంది అదొక్కటే అనుకుంటా దొరా!

బాబు: సరేలే! వీరడి కొచ్చిన ప్రమాదం నాకూ ఎంతో కష్టంగా ఉందిరా! వాడికి శాశ్వతంగా సహాయం చేయాలని వుందిరా!

కొండ: శిత్తం దొరా! పిల్లాజల్లా కలోడు. తమరు దయసూడకుండా వుంటే ఇంకెవరు సూత్తారు బాబూ!

బాబు: కొండయ్యా! దేనికెవరు కారణంరా యీ లోకంలో? మనం వూర్కే అనుకోవటమేగానీ మనం అనుకోకుండానే ఎన్నో జరుగుతుంటాయి. వీరడి చెయ్యి విరిగిపోయిందా, తప్పెవరిదైతేనేం? విరిగిపోయింది. ఇకముందు విషయం ఆలోచించాలిగాని, దీనిని గురించి 'నువ్వు నువ్వు' అని మనం పీకులాడితే ఏమి లాభం చెప్పు? యీ విషయం వూరికే పొక్కించుకోవటం వల్ల మీకు వచ్చే లాభం ఏమీ వుండదు. మీ వాళ్ళతో చెప్పి ఇది ఇలా సర్దేయండి. అవసరమైతే మిమ్మల్ని ఆదుకోవాల్సిన బాధ్యత మాకుందిరా; సరేనా?

కొండ: మన్నించండి దొరా! మా సంగంతో మాట్లాడిగాని ఏదీ సెప్పలేను.

బాబు: ఈ సంఘాలేరా మీ కడుపు కొట్టేస్తున్నవి. కూచున్న కొమ్మని నరికేసే బాపతురా మీది.

కొండ: ఏం బాపతో బాబు; ఏ బాపతైతే ఏం? మా నాయన. మా నాయన నాయన అందరూ మీ పాదాలకాడ పనిచేసి బతికినోళ్ళు. నేనూ పని సేత్తుంటా. ఇన్ని తరాలు గడిసినై. ఇందరం పనిచేశాం; కాని ఒక్కడన్నా ఒక్కరోజన్నా హాయిగా కడుపునిండా తిన్న పాపానపోలేదు. అదేం కర్మో? మా పాలెం సంసారాలన్నీ ఇట్టాగే తగలడతాండయి. ఇక నా బిడ్డలు, నా బిడ్డల బిడ్డలు కూడా ఇట్టాగే సగం కడుపుకి తిని సావాల్సిందేనా దొరా మా ఏమన్న!

బాబు: మేం మాత్రం ఏమయ్యాంరా? మేమేదో బంగారం తింటున్నామని కదూ మీ అభిప్రాయం.

కొండ: బంగారం తింటంలా దొర; మా పాణం తింటున్నారు; మా రకతం మాంసం తింటున్నారు.

బాబు: (పెద్దగా నవ్వి) పిచ్చివాడా! మే మామాత్రం పుండబట్టే కదూ? మిమ్మల్ని అయ్యో పాపం అనగలుగుతున్నాం. అదంతా ఎందుకులే; ఇదిగో తీసుకో.

కొండ: డబ్బా బాబు?

బాబు: అవునురా. మీకు కాకుంటే ఇంకెవరి కిస్తాం తీసుకో. (నోట్లు యిస్తాడు.)

కొండ: లంచం ఇస్తారా బాబు లంచం; మమ్మలింకా అణగదొక్కడానికి. మమ్మల్నింకా కుక్కల్లాగా ఆడించటానికి, మా సంగాన్ని పడగొట్టటానికి లంచం. మాకేం అక్కర్లేదు మీకాడే వుంచుకోండి! (వెళ్లాడు)

బాబు: (తాగి) వెధవలు.

కవి: (వచ్చాడు) ఏం జరిగింది?

బాబు: ఆఁ ఏం జరిగింది? చెయ్యి విరిగిపోయింది! అతుకుతుందంటున్నాడు డాక్టరు. కట్టుకట్టి ఇంటికి చేర్పించాను. ఎంత చేస్తేనేం! కృతజ్ఞతలేని వెధవలు; బిఖారీలు! వీళ్ళు లేకపోతే లోకం ఆగిపోతుందనుకుంటారు.

కవి: ఇప్పుడేమైంది?

బాబు: ఆ వీరడు ఆలుబిడ్డలతో సహా అన్నమో రామచంద్రా అని అల్లాడుతూంటే ఆదరించి, చేరదీసి ఫ్యాక్టరీలో పని ఇప్పించి, పని నేర్పించి ఇంతవాణ్ణి చేశానా? ఈరోజు వాడికీ ఆపద కలిగిందంటే నాకులేని అభిమానం వీడికి పొడుచుకు వచ్చిందా? ఆ చౌదరిగాడు ఈ కూలీకుంకలను కొర్రెక్కిస్తున్నాడు.

కవి: చౌదరి ఎవరు? కార్మికనాయకుడేనా?

బాబు: ఆఁ నాయకుడే! పనికిమాలిన ప్రతి ఒకడూ నాయకుడైపోతున్నాడు. ధనిక వర్గం, చైతన్యం, దోపిడి - అని నాలుగు ఎంగిలి ముక్కలు నేర్చుకొని:

అసలు యీ వెధవలకు ఎక్కడికి పోయిందంటా తెలివి? వీళ్ళ కుండక్క ర్లేదూ కృతజ్ఞత? నేను ఈ రోజు గెంటేస్తే వాడు పెడతాడా తిండి?

కవి: పాపం దయతలచండి!

బాబు: ఆ మాత్రం నాకు తెలియదూ! ఆ వీరడి పెద్దకొడుక్కి, పెళ్ళానికి ఫ్యాక్టరీలో పని యిస్తానన్నానా! పెద్దకూతుర్ని మన యింటిపనికి పంపమన్నానా! ఇంత కన్నా ఎవరు ఏం చేస్తారు? అసలు యీ మాత్రమన్నా చెయ్యాలని ఎక్కడుంది గనక!

కవి: మరి వాళ్ళేం కోరారు?

బాబు: కోరుతారు. కోర్కెలకేం? నేనూ కోరుతా కొండమీది కోతి కావాలని. హద్దూ పద్దూ వుండొద్దూ? అసలు అర్హత వుండొద్దూ? వెధవలు నష్టపరిహారం కట్టి యివ్వాలట. తప్పతాగి వచ్చి ప్రమాదం తెచ్చిపెట్టినందుకు నేను నష్టపరిహారం యివ్వాలట. ఫాక్టరీ రూల్సనీ, వంకాయలనీ ఈ చౌదరిగా డిదంతా చేస్తున్నాడు. చేయనీ వెధవలు! ఏం చేస్తారో చేయనీ! నన్ను బెదిరిస్తారూ? మల మల వాళ్ళే మాడి చస్తారు! చావనీ వెధవలు! (వెళ్ళాడు, చౌదరి వచ్చాడు.)

చౌద: నమస్తే.

కవి: నమస్తే!

చౌద: బాబుగారున్నారా?

కవి: లోపలున్నారు. మీ రెవరు?

చౌద: చౌదరి అంటారు.

కవి: కార్మికనాయకులా?

చౌద: అవును, తమరు?

కవి: నేను....కూర్చోండి....రఘు అంటారు.

చౌద: కవిగారు మీరేనా?

కవి: మీకెలా తెలుసు?

చౌద: విన్నాను.

కవి: ఎవరు చెప్పారు?

చౌద: శోభ.

కవి: శోభా! ..బాబుగారితో మాట్లాడాలా?

చౌద: అవును. మీతోకూడా!

కవి: నాతోనా?

చౌద: ఆ ఫ్యాక్టరీలో జరిగిన ప్రమాదం విషయం విన్నారా?
కవి: విన్నాను.
చౌద: మీ అభిప్రాయం?
కవి: నా కంతా అగమ్యగోచరంగా వుంది. నా కభిప్రాయాలే లేవు.
చౌద మీ అవస్థ నా కర్థమైంది. మిమ్మల్ని చూ స్తే జాలేస్తూంది.
కవి: నన్ను చూ స్తేనా? ఎందుకు?
చౌద: మీ అమాయకత్వానికి, కాదు - అజ్ఞానానికి.
కవి: మీరు మర్యాదగా మాట్లాడ్డం నేర్చుకోవాలి.
చౌద: క్షమించండి, మీరు కవులు!
కవి: నేను కవిని కాను.
చౌద: కానన్నా మీరు కవులే!
కవి: ఏమిటీ బలవంతం? నేను కవిని కానంటే వినరేం? నేను కవిగా బ్రతకటం లేదు; నాకు తెలుసు కవిననుకొన్న రోజులలో చావు పొలిమేరల కొచ్చాను. అలా అనుకోటం మానేశాను. బ్రతగ్గలుగుతున్నాను.
చౌద: పోనీ మీరు పు స్తకాలు వ్రా స్తున్నారా?
కవి: వ్రా స్తే?
చౌద: ఎవరికోసం వ్రా స్తున్నారు?
కవి: కేవలం నా కోసం - అంతే!
చౌద: ప్రపంచంతో మీ కేలాంటి సంబంధం లేదంటారా?
కవి: లేదు, లేదు. లేదు!
చౌద: ప్రపంచానికి మీతో సంబంధం వుంది.
కవి: అది నా తప్పుకాదు.
చౌద: మీరే యిలా మాట్లాడితే నేనేం చెప్పను? మీ రీ నాలుగ్గోడలలో, ఈ హంస తూలికాతల్పాలలో హాయిగా కూర్చొని మదిరాపానం, ముదితా ధ్యానంతో ఉమ్మర్ ఖయ్యాంలాగా —
కవి: ఓ అవి నావికావు.
చౌద: క్షమించండి....ప్రపంచంతో మీకు సంబంధం లేదనుకుంటే తీరిపోతుందా? మీ చుట్టూ చీకటిని మరింత దట్టం చేసుకొంటున్నారు. మీ చేతికి సంకెళ్ళను మీరే వేసుకొంటున్నారు. ఒక్కసారి వెలుగులోకి రాండి, అర్థమవుతుంది.

కవి: మీరు కాంగ్రెస్సా?

చౌద: కాను.

కవి: కమ్యూనిస్టులా?

చౌద: కాను.

కవి: అభ్యుదయ రచయితల సంఘసభ్యులా?

చౌద: అదీ కాను.

కవి: చెప్పటానికి జడుస్తున్నారు మీరు.

చౌద: మీరన్నవేవీ అంత సిగ్గుపడాల్సిన సంస్థలు కావు, కానీ నేను కేవలం ఒక ప్రజాసేవకుని దృష్టితోనే మీతో మాట్లాడుతున్నాను.

కవి: ప్రజ, సేవ! అర్థంలేని మాటలంటూంటారు మీరందరూ!

చౌద: కవిగారూ! అజ్ఞాన ప్రజాబాహుళ్యానికి మార్గదర్శకులు కావాల్సినవారు కవులు. దేశంయొక్క సంస్కృతి స్వాతంత్ర్యం, సౌభాగ్యం సర్వస్వం మీమీద ఆధారపడింది. ప్రజలు మీకలం గీచినబాటల ననుసరిస్తారు. మానవజీవితంలో అమరవాహిని కవి. కవి చిరంజీవి. ఈనాటి విజ్ఞానానికి కారకులు మీరు. మీనుండి ప్రజలు వెలుగును ఆశిస్తారు.

కవి: ఆఁ - ఆశిస్తారు ఆనందిస్తారు! కవిని కడుపుమాడ్చి చంపుతారు.

చౌద: పొరపాటు! మీరు ఎండమావుల నాశ్రయించుకొని, పాముపడగ నీడలలో తలదాచుకొని మీ వినాశనాన్ని మీరే తెచ్చుకొంటున్నారు. ప్రజలకు కావలసింది వ్రాయండి. మీ సాహిత్యాన్ని ప్రజాభ్యుదయానికి వుపయోగించండి. ప్రపంచ జీవశక్తి అయిన ప్రజాబాహుళ్యానికి చేదోడు వాదోడుగా నిలవండి. అప్పుడు ప్రజాబలమంతా మీదే. ప్రజలే మిమ్మల్ని పోషిస్తారు.

కవి: ప్రజ, దేశం, సంఘం, ఇవన్నీ పెద్ద పెద్ద వ్యర్థపదాలు, నాకు తెలుసు. వీటితో నన్ను భ్రమపెట్టకండి.

చౌద: సరే. మీ ఇష్టం! వాస్తవానికి దూరమైపోవాలనుకున్నవారితో వాదించి ప్రయోజనంలేదు. అయినా ఇది సమయమూ కాదు, స్థలమూ కాదు, వీలుంటే మరల కలుసుకుంటా. తప్పకుండా తమ అభిప్రాయాన్ని మార్చుకోగలరు. కానీ ఒక్కమాట. మీ కవితాశక్తిని దుర్వినియోగం చేయకండి ప్రజల కపకారం కలిగేలా వినియోగించకండి. అది చాలు!

కవి: అంటే?

చౌద: ధనికుల దౌష్ట్యాలకు తాళం వేయకండి. ఇప్పటికిచాలు ఏనాటికైనా —

వాబు వచ్చాడు.



చౌద: నమస్తే.

బాబు: ఎందుకొచ్చినట్లు?

చౌద: తమతో సంప్రదిద్దామని.

బాబు: సంప్రదింపుల కేముంది? మీ సంకల్పం ఏమిటో సాగించండి. అవకాశం దొరికింది. వినియోగించుకోండి!

అంటూ వెళుతున్నాడు. చౌదరి అతన్ని అనుసరించాడు.

కవి: (తలగట్టిగా పట్టుకుని కూలబడ్డాడు)

శోభ: (పచ్చి కాఫీ తెచ్చి టేబిల్ మీద పెట్టింది. కవి తలఎత్తి చూశాడు.) కాఫీ త్రాగండి, చల్లారిపోతూంది.

కవి: నా కక్కర్లేదు. శోభా!

శోభ: కాఫీ పడకుంటే కవిత్వం రాదేమో? అన్నట్టు జ్ఞాపకమొచ్చింది. నా క్లాసుమేట్ ఒకడుండేవాడు; కప్పుకాఫీ, కారాకిళ్ళీ, ప్యాకెట్టు సిగిరెట్లు ఇస్తే చాలు — గడగడా పేజీలతరబడి కవిత్వం వ్రాసేవాడు. అవునుగాని కాఫీకి కవిత్వానికి ఎందుకండీ అంత అవినాభావ సంబంధం?

కవి: శోభా - దయచేసి —

శోభ: వెళ్ళనా? మీ కంతకష్టంగా వున్నప్పుడు నేనెందుకుండాలి? వెళతానుగానీ, ఆ కాఫీ త్రాగండి.

కవి: నా కక్కర్లేదు

శోభ: తలనొప్పిగా వుందా?

కవి: అవును తల బ్రద్దలైపోతోంది. దయచేసి నన్నిలా ఒంటరిగా వదిలేయి యీరోజు.

శోభ: అబ్బ! నిజంగా కాలిపోతూందే! కాఫీ త్రాగండీ —

కవి: (తాగేశాడు.)

శోభ: విశ్రాంతి తీసుకోండి — ఆఁ — ఫ్యాక్టరీలో ప్రమాదం జరిగింది విన్నారా?

కవి: జరిగిందట!

శోభ: మీకిదివరకే తెలుసా?

కవి: తెలిసింది!

శోభ: పాపం రంగడు ఏడుస్తుంటే నాగుండె బ్రద్దలైపోయింది!

కవి: అతనికి ఏలాగుంది?

శోభ: ప్రాణభయం లేదట. అయినా అతనింక బ్రతికుండి ఏంచేయను? ఆ చితికి పోయిన సంసారానికి మరింతభారం! అతనొక్కడు గడించి అందరికీ అర్ధ కడుపు అంబలైనా పోస్తుండేవాడు. ఇంక ఆ సంసారం సంగతి ఏంకావాలి?

కవి: ఏం కావాలి?

శోభ: ఏంకావాలి? రైల్వేప్లాటుఫారంమీద అడుక్కుతినాలి! అంతగాక యింకేముంది? రెక్కలకష్టం పడేవాళ్ళ గతి ఇంకేమౌతుంది? శరీరం బాగున్నవరకే తిండి! చెమటోడ్చి కండలు తరిగిపోసి కష్టంచేస్తే గంజినీళ్ళప్రాప్తి! లేకుంటే అదీలేదు. ఆ సంసారం ఏంకావాలి? మీరు కవులు! ఒక్కసారి వూహించుకో గలరా? వ్రాయగలరా?

కవి: నువ్వు వాళ్ళను చూచి జాలిపడుతున్నావా?

శోభ: ఏం? నేను మనిషినికానూ? నాకు హృదయం లేదనుకున్నారా?

కవి: అయితే మీ అన్నయ్య?

శోభ: ఏమన్నారు?

కవి: ఏమన్నాను? నాకు మతిపోతూంది - పోయింది. నేనేం మాట్లాడుతున్నానో నే నెరుగను. ఈ రోజు ఒక్క గంటగా నాలో ఏదో బాధ! నాకే తెలియని బాధ ఎందుకో చెలరేగింది!

శోభ: అలా చల్లగాలికి వెళ్ళొద్దాం వస్తారా?

కవి: కారులోనా?

శోభ: నడిచే వెళదాం.

కవి: నేను రాను.

శోభ: కార్లో వెళదాం.

కవి: నేను రాను

శోభ: అవును మీరెందుకొస్తారు? ఎప్పుడు అలవాటు లేందే.

కవి: అవును నేను కూపస్థమండూకాన్ని.

శోభ: ఊఁ తర్వాత?

కవి: నేను చీకటికొట్టులో కూర్చొని ప్రపంచం అంటే ఏమో ఎరగని అజ్ఞానిని.

శోభ: నే నన్నానా?

కవి: నువ్వనాలా అందరిచేతా అనిపిస్తావు!

శోభ: ఎవరిచేత?

కవి: ఎవరిచేత? నీకు తెలీదూ? చౌదరితో నన్నుగూర్చి ఏమిటేమిటో చెప్పలేదూ నువ్వు?

శోభ: ఏమని చెప్పాను?

కవి: నేను అజ్ఞానినని, ప్రపంచజ్ఞానం లేనివాణ్ణని.

శోభ: చెప్పాను.

కవి: నిన్నెవరు చెప్పమన్నారు? నువ్వెలా చెప్పావు?

శోభ: దానికీ మీ అనుజ్ఞ కావాలేం? నేను మీ భార్యను కాను మీ అడుపాజల్లో వుంటానికి.

కవి: అవును, నువ్వు యీ యింటి యజమానురాలివి! నీవు ధనికుల యింటి బిడ్డవు. నేను మీ యింట్లో తిండికి పడివున్న ఒక దౌర్భాగ్యుడిని. నువ్వు నన్ను పోషిస్తున్నావు; నీకు నన్ను గురించి ఏమన్నా ఎవరితోనన్నా చెప్పటానికి అధికారముంది! అంతేనా?

ఈ మాటలు విన్నకొద్దీ శోభకు దుఃఖం కోపం అధికమయ్యాయి. కళ్లల్లో నీళ్లు తిరిగినాయి. ఏమేమో చెప్పాలనుకొంది. కాని చెప్పలేక పోయింది. చివరికి తనకే తెలియక 'అవును' అని మాత్రం అనగలిగింది నిష్ఠూరంగా.

కవి: అవును, నేనంటే నీకెందుకు లక్ష్యముండాలి? నేను బికార్ని. నువ్వు లక్షాధికారిణివి. నేను నీ కాలిక్రిందపడే పురుగుతో సమానం! కనుకనే బల్లలు తుడిచే రంగడి దగ్గరకూడా నన్ను విమర్శించావు.

శోభ: నేనా?

కవి: అవును. నువ్వే! నా పాటలు పాటలు కావనీ, నా కవిత్వం కవిత్వం కాదనీ, నా వ్రాతలన్నీ చెత్తనీ —

శోభకు ఒక్కసారిగా దుఃఖం పొంగి వచ్చింది. సోఫాలో కూలబడింది....

కవి: (కొంచెం కలవరపడ్డాడు) నాకు మతిపోయింది. నేనేం మాట్లాడుతున్నానో నాకు తెలీదు. రెండు సంవత్సరాలయింది నేను మాట్లాడి. మరల యీ రోజు మాట్లాడుతున్నా....ఎందుకేడుస్తావ్?

శోభ: (చటుక్కున లేచింది) ఏడవటంలేదు. నేను ధనికుల ఇంటి బిడ్డను! నేను యీ యింటి యజమానురాలిని! మీరు నా యింట్లోపడి వున్న ఒక దౌర్భా

గ్యులు! అనండి! అనండి! కొద్దికాలానికైనా శోభ అంటే మీకర్థం కాక పోదు (వెళ్తుంది)

కవి: శోభా!

తెరలో

బాబు: ఖచ్చితంగా చెప్తున్నాను. ఈలాంటివాళ్ళు లక్షమంది. మహా మహా ఎం.ఏలు. బి. ఏలు కాపలా కాస్తున్నారు వాకిట్లో! నువ్వెంత, నీ కూలీలెంత, నిన్ను నీ కూలీల్ని నేననుకుంటే ఒక్కనిమిషంలో నాశనం చేయగలను తెలిసిందా? హక్కులు! ఎవడబ్బ సొమ్ము! నీ తాత గడించి పెట్టాడా?

చౌద: మాటలు జాగ్రత్తగా రానీ ——

బాబు: గెట్ అవుట్. ఫస్టు ఆఫ్ ఆల్ యు గెట్ అవుట్!

కవి బుర్ర యీ సంభాషణతో మరీ తిరిగిపోయింది.
వెళ్తున్న శోభ యీ కేకలు విని ఆగింది........

శోభ: (మెల్లగా కవిని సమీపిస్తూ) ఏమిటా కేకలు? ఎవరిమీద?

కవి: చౌదరిమీద.

శోభ: ఎందుకూ?

కవి: రాయబారం వచ్చినందుకు! కూలీలు నష్టపరిహారం కావాలన్నారట వీరయ్యకు. ఫ్యాక్టరీ రూల్సుప్రకారం ఇవ్వాల్సింది యివ్వమని చౌదరి రాయబారం వచ్చాడు. మెడ గెంటింపులు తీసుపోతున్నాడు!

శోభ: ..........

బాబు ఉగ్రుడై వచ్చాడు

బాబు: Damn these beggars! nothing doing —— అక్షరం మార్చను! ఏం చేస్తారో చేయనీ!

కవి: రాయబార మేమైంది?

బాబు: రాయబారం లేదు ఏమీలేదు. మదించిపోయారు వెధవలు! నాలుగు రోజులు మాడితేగాని దారికి రారు. రఘూ ప్రెస్‌కో స్టేట్‌మెంట్ వ్రాసిపెట్టు.

కవి: స్టేట్‌మెంటా? ఏమని?

శోభ: అన్నయ్యా! మరొక్కసారి ఆలోచించు.

బాబు: ఆలోచించేదేమీ లేదు. బాగా ఆలోచించాం. ఇక మనం చేయగలదేమీ లేదు!

శోభ: ఏమీలేదూ?

బాబు: ఏమీలేదు లేదని చెప్పేశాను కూడా!

శోభ: అయితే వాళ్ళు చేయగలిగింది చాలావుంది!

బాబు: చేయనీ! ఏం చేస్తారో చేయనీ! ఏం సాధిస్తారో సాధించనీ! నన్ను బెదిరిస్తారా? చేయనీ!

శోభ: అనుకున్నవన్నీ సాధించగలరు అన్నయ్యా! వాళ్లు ఒకటంటారే మనం చేయగలదేమీలేదు. మన బ్రతుకు వారి కష్టంమీద ఆధారపడింది. మనం పని చేయలేం. తిని కూర్చోగలం. అంతే!

బాబు: శోభా! మూయ్ నోరు!

శోభ: అన్నయ్యా, నా మాట విను. బీదాబిక్కీని కనికరించక ఇంకెన్నాళ్ళు బెదిరిస్తావు? ఒక్కసారి ఒక్క కలెక్టరుకో, గవర్నరుకో చేసే టీపార్టీ అంత వుండదే వారు కోరేది! వాళ్ళేం చేస్తారు! పాపం! ఆ సంసారమంతా ఆ ఒక్క జీవిమీద ఆధారపడింది. వాడు, వాడి బిడ్డలు నీ కెంత శక్తిని ధారపోశారు? నీ కెంత లాభాలు సంపాదించి పెట్టారు? నీది కేవలం జీవంలేని డబ్బు మాత్రమే! వాళ్లు జీవశక్తి! ప్రాణశక్తుల్ని ధారపోశారు. అతను నీ సేవలో అరిగిపోయాడు. కాలిపోయాడు! ఇప్పుడు వాళ్ళేమవుతారు?

బాబు: వాడు చస్తే ఏమవుతారు?

శోభ: నువ్వూ నేనూ చస్తే ___

బాబు: షటప్ - (ఈ మాటలతోపాటు చెయ్యి కూడా కదిలింది కాని ఆగింది.)

శోభ: కొట్టలేక పొయ్యావేం?

బాబు: (ఆ కోపమంతా బల్లమీద చూపుతూ) ఇదిగో తక్షణం స్టేట్‌మెంటు వ్రాసి పెట్టు. ఈ వెధవలు ఏం చేస్తారో చూస్తా ఫ్యాక్టరీ మిషన్ల లోపల ఏమీలేదు తనిఖీ చేయించాం. వాడు త్రాగివచ్చి ఒళ్ళు తెలీకుండా ప్రమాదం తెచ్చుకున్నాడు. నష్టపరిహారం కట్టివ్వాల్సిన బాధ్యత యజమానికేమాత్రంలేదు. చౌదరి పార్టీ బలం చేకూర్చుకొనేందుకు యీ అవకాశాన్ని బాగా వుపయోగించుకొంటున్నాడు. మనకు ___ వాళ్ళకు జరిగిన రాయబార విషయం కూడా వ్రాయి. తక్షణం వ్రాసిపెట్టు. పేపరుకు పంపాలి.

శోభ: బాగా యోచనచేసే వ్రాయండి. తొందరేంలేదు.

బాబు: శోభా నువ్వెళ్ళు! ఎప్పుడు వ్రాసిస్తావు రఘూ?

కవి: నా కీ రోజేం బాగోలేదు. వీలైనంత త్వరలో రాసిస్తాను.

బాబు: తపాలు వేళకు పూర్తిచేయటానికి చూడు. (వెళ్ళాడు)

శోభ: ఏం? వ్రాస్తారా?

కవి: ఏమిటి?

శోభ: స్టేట్‌మెంట్.

కవి: ఏమని?

శోభ: తప్పంతా బీదవారిదేనని.

కవి: ఏమో నేనేమీ వినలేదు! కాదు. నాకేదీ వినపడలేదు?

శోభ: మీకు వినపడలేదూ?

కవి: లేదు. ఉండు శోభా! ఇప్పుడే వస్తా. (వెళ్ళాడు)

దాసు: (వస్తూ) సరస్వతీ నమస్తుభ్యం. వరదే కామరూపిణీ! కావ్యారంభం కరిష్యామి, సిద్ధిర్భవతుమే సదా!

శోభ: ఏమిటి దాసూ. అలా మంత్రాలు చదువుతున్నావు?

దాసు: కూర్చో తల్లీ, కూర్చో. నీకు కథలు చెప్పి చాలా కాలమైంది. చిన్నతనంలో తాతా తాతా అంటూ కథలు చెప్పమని చంపుకుతినేదానివి. ఇప్పుడు పెద్దదానివైనావు కదూ?

శోభ: లేదులే దాసూ? నాకూ ఏమీ తోచటంలేదు. ఒక కథ చెప్పవూ?

దాసు: చెప్తానులే తల్లీ! కథలకేం? కావాల్సినన్ని! రాత్రినాకొక కలవచ్చింది. కలలో సరస్వతి అగుపించి 'కుమారా! ఒక కావ్యం వ్రాసి నా పాదాలలో పడవేయ కూడదా?' అంది! నేను 'అమ్మా! నేను ఏమీ తెలియనివాణ్ణి, మూఢుణ్ణి. కాటికి కాళ్లు చాచుకున్న నేనేం కావ్యం వ్రాయగలను?' అన్నాను. అప్పుడామె 'భక్తుడా! భయపడకు. యీ కాలంలో నీలాంటి వాళ్ళందరూ కావ్యకర్తలౌతున్నారు. కవి కావటానికి చిన్న రహస్యం చెబుతాను విను' అని ఒక రహస్యం చెప్పింది. అమాంతం నేను కవినైపోయాను! నాకు కవిత్వం వచ్చేస్తూంది విను —

ఉ॥ రంగులు దిద్ది కమ్మని పరాగము చల్లి మరంద బిందువుల్
పొంగులువారజేసి నునుబుగ్గల రేకులతీర్చి వాసనల్
కొంగునబోసి శిల్పకళ కూర్చిన వెన్నెల పూలబాలికల్
కృంగి, కృశించి ధూళిపడి కూయిడ ఎట్లు సహింపనేర్తువో.

శోభ: దాసూ! నువ్వు వ్రాసిందేనా యీ పద్యం? ఎక్కడో చదివినట్లు జ్ఞాపకం.

దాసు: ఏం నేను వ్రాసిందే కావాలా? పిచ్చి తల్లీ! ఇంకొకరి పుస్తకం నుంచి

కాజేసి నాదనేవారూ. అమాంతం పుస్తకం పుస్తకం కొట్టేసి తన పేరిట అచ్చు వేయించుకొని కవులనిపించుకొనేవారూ వున్నారు! అందులో నేను ఒకణ్ణి! నేను కవినే!

శోభ: దాసూ! అలాంటి నీచులు కూడా వున్నారంటావా?

దాసు: తిట్టకు తల్లీ తిట్టకు! నీ అన్నయ్యను నీవే తిడుతున్నావు!

శోభ: నా అన్నయ్యను తిట్టడమేమిటి దాసూ!

దాసు: పిచ్చి తల్లీ! పట్టి అమాయకురాలివి. అచ్చం తల్లి పోలిక! ఇంట్లో జరుగుతూన్నది ఏమిటో కూడా తెలుసుకోలేని పిచ్చితల్లి వి! ఆ కవీ అలాంటివాడే! తన పుస్తకాలు ఏమౌతున్నాయో తనకక్కర్లేదు. అందుకే అవి అలా పేరు మారి అచ్చుపడినవి.

శోభ: ఏమిటి దాసూ నువ్వన్నది?

దాసు: దాసు దాపరికం అంటే ఏమిటో ఎరుగడు. అందుచేత అనుకున్నది అనుకున్నట్లు అడిగేస్తాడు. మరేం అనుకోకేం? బాబు యిలా చేస్తాడని నేనూ అనుకోలేదు. కవిగారి పుస్తకాలు తనపేరిట అచ్చువేయించుకుంటాడని కలగన్నామా?

శోభ: దాసూ! వృధాగా అన్నయ్యను తూలనాడుతున్నావు. వ్యాసాలు, వుపన్యాసాలు వ్రాయించుకుంటున్నాడని యింత నీచమైన పని కూడా చేస్తాడంటావా?

దాసు: సరేలే తల్లీ నీ కెందుకు కోపం? నాది సత్యమైతే రుజువు చేసుకుంటాగా! ఇన్నాళ్ళకు నీవు యీ ముసలి దాసుని నమ్మనంటున్నావు.... మంచిదే! (వెళ్లాడు.)

శోభ: (ఇటటు పచారు చేస్తూంది)

రంగ: (వచ్చాడు)

శోభ: రంగా ఏమిలా వచ్చావు?

రంగ: మీ దగ్గిరికే.

శోభ: నాన్న కెలావుంది?

రంగ: అలాగే వుందండి!

శోభ: ఎక్కడనుంచి నువ్వు రావటం?

రంగ: ఇంటి దగ్గర్నుంచేనండి.

శోభ: కవిగారు రాలేదూ అక్కడికి?

రంగ: రాలేదండి.

శోభ: నీకు దారిలోకూడా కనిపించలేదూ?

రంగ: లేదండి.

శోభ: చౌదరిబాబుకూడా రాలేదు కదూ?

రంగ: అవునండి.

శోభ: ఏం పనిగా వచ్చావు? నాన్నను వదిలెందుకొచ్చావు?

రంగ: మీతో చెప్పి జీతం తీసుకెళ్దామని వచ్చాను. బాబుగారు లేరాండి!

శోభ: లేరు .....రంగా! యిదిగో ___

రంగ: పదాండి? ఇంకా రెండివ్వాలి.

శోభ: ఇది జీతంకాదు రంగా! వుంచుకో ___ అయితే పని మానేస్తావా?

రంగ: మానేయాలండి. నాన్నదగ్గరుండొద్దాండి ఒకరు?

శోభ: అవును నువ్వెళ్ళు; నాన్న జాగ్రత రంగా! డబ్బు అవసరమైతే నన్ను కలుసుకో ఏం?

రంగ: అలాగేనండి.

శోభ: సరే వెళ్ళు; నాన్న నీకోసం చూస్తూంటాడు.

శోభ: ఎళ్ళొస్తానండి. (కాని వెళ్ళలేక ఏడుస్తున్నాడు; శోభ అతన్ని దగ్గరకు తీసుకొని) ఊర్కో రంగా! ఎందుకేడుస్తావ్! అప్పుడప్పుడు నేనొచ్చి చూస్తూంటాగా నిన్ను, వెళ్ళు.

రంగ: (వెళ్ళలేక వెళ్ళాడు)

తెర పడుతుంది.



# మూడవ రంగం

వీరయ్య పూరిగుడిసె; పక్కనులక మంచంమీద వీరయ్య చెయ్యికి కట్టు కట్టుకొని పడుకొని వున్నాడు. కొండయ్య ఇటటు తిరుగుతున్నాడు చుట్ట చుట్టుకొంటూ. రంగడు వీరయ్య మంచం ప్రక్కన నిలుచొని వున్నాడు. ఒక్క క్షణం నిశ్శబ్దం. ఇంతవరకూ ఊరుకున్న రంగడు ఉన్నట్లుండి భోరుమని ఏడుస్తున్నాడు.

కొండ: ఏంట్రా అది?

రంగ: నువ్వా మెసిన్ల జోలికెందు కెళ్లాల్నన్నా! (ఏడుపుతో కలిసివచ్చినవీ మాటలు)

కొండ: ఊం కావాలని సెయ్యేట్టాడ్రా. మెసిన్లో, తెగిపోవాలని! మారాజుల దయ గదంట్రా ఇదంతా? ఎంత సేపూ బండతాకిడి సేయించుకొని లాభాలు లెక్కెట్టుకోటంతో సరి గానీ. మెసిన్ల మంచీ సెబ్బరతో ఆళ్ళకేం పని? నాకు తెలుసు - ఎప్పుడో యీ పెమాదం జరుగుతుందని.

వీర: సౌదరిబాబు ఎక్కడరా?

కొండ: ఆ మారాజువాడి కెళ్ళారు మాటాట్టానికి. ఈయన పిచ్చిగానీ. మారాజు లింటారా మన గోడు? అచ్చరం ఇంటాడనా? నాకేం నమ్మకంలా!

వీర: ఈ రోజుకు శిట్టెడు నూకల్లేవురా యింటో!

కొండ: లేకుంటే యేం? ఆ మారాజుసురికి అందరం యేకంగా సత్తాం! సంతో పిత్తాడు. అందరిళ్ళకాడా అట్టాగే వుంది. ఈ రోజేగా జీతాల్రోజు. పెట్టో కొట్టినా పైసా వుండదొక్కడికావా!

వీర: ఎల్లి ఆ నాయకాసులు పట్టుకొచ్చుకోండిరా!

కొండ: ఆగు! బలే శెప్పావుగానీ! ఇదేదో అటోయిటో తేలిపోవాల. అందాకా జీతాలక్కర్లా నాతాలక్కర్లా!

వీర: మా రాజులతో మనకెందుకొచ్చిందిరా! ఆళ్ళేం సేసినా సాగుతుంది. మనం మాడి సావాల్సిందే? నామూలాన మీ రందరూ కట్టపట్టం దేనికి? సెప్పు! కొండయ్యా! నా మాట యిని ఎల్లండి. ఆ నూకల్తెచ్చుకొని పిల్లలకంత అంబలి పోయండిరా! నా వుసురికి పిల్లాజెల్లా అల్లాట్టం దేనికి?

కొండ: ఊర్కో మావా! నీకు తెలవనూ తెలవదు, సెప్తే యిననూ యినవు! సౌదరయ్య గారికి తెలవందా? ఆయనన్నీ సూసుకుంటారు. ఆయనెట్టా సెప్తే అట్టా

శేత్తాం. రూల్సు పెకారం యియ్యాల్సిందాన్నే ఎగ్గొట్టాలని సూత్తుండాదే ఆ మారాజు -

రంగ: అయ్యా! ఇదుగో పదిరూపాయలు.

వీర: పది రూపాయలే!

కొండ: నీ జీత మంట్రా?

రంగ: కాదు మాఁవా!

కొండ: మరి?

రంగ: మరి సోబమ్మ సాలామంచిది మాఁవా! (యీ మాటకు ముందే శోభ వచ్చింది. యీ మాట విని చటుక్కున బయటికి వెళ్ళింది. ఎవ్వరూ చూడలేదు శోభను)

కొండ: ఆఁ! అదే మంచిలెద్దూ, గుడ్డిలో మెల్ల! ఒరే! మారాజుల్లో కూడా మంచోళ్ళుంటారంటె నమ్మకు!

రంగ: లేదు మాఁవా! నీకుతెలవదు. సోబమ్మ ఎంతో మంచామె. నాన్నను సూట్టాని కొచ్చింది. పావం, ఎంతో కట్టమేసిందామెకు నాన్ననుసూసి. పదిరూపాయ లిచ్చింది మాఁవా!

కొండ: ఇచ్చిందీ? శించి ఆడనే యిసిరికొట్టక పోయినా! ఎదవ యిచ్చిందట యిచ్చింది! నాతో శెప్పక యీ కబుర్లన్నీ. అంత మంచిమనుసేగనకైతే తన సొంత అన్నేగద. సెప్పి ఒప్పించ లేకపోయింది! దయంట దయ! రకతంతో పాటు తాగేసి, లచ్చలు లచ్చలు మూటగుతూంటే, పదిరూపాయలిసిరేత్తారు. అదంటరా దయ; ఆళ్ళేసే పాత సెప్పుల యిలువుండవు యీ పదిరూపాయలు! ఆమెకా కార్లు, సోకులు, కోకలు, ఎక్కడనుండి వచ్చినయంటా. మన శెమట గాకుంటే! మానుకోమనగూడదూ అయన్నీ? మానుకొని మనల్ని బతికించ గూడదూ ఇట్టానంపకపోతే! బిచ్చమి త్తుందంటారా - సిగ్గులే, నేనైతే ఇసిరి గొట్టేవాడిని ఆ బిచ్చాన్ని! దయంట దయ! ఇయన్నీ మనల్ని బొత్తా గొట్టించ టానికేసే ఏసకాలు! నాయప్పెకారం - ఇయ్యాల్సింది యీకుండా ఎగేసి, దానాలు శేస్తారు, దానాలు!

యీ మాటలంటూండగా ఇంతవరకూ వింటూ బయవుటన్న శోభ వచ్చింది...

శోభ: ఆపు!

రంగ: అమ్మగారు!

వీర: అమ్మగారే!

కొండ: అ-మ్మ-గా-రు!

ఒక్కక్షణం నిశ్శబ్దం

శోభ ముఖంలో ఒకవింత కాంతి వుందిప్పుడు. క్రొత్త అందం అగుపిస్తూవుంది ఆమెలో. కాని నిలుచోలేకుంది. మూర్ఛవచ్చి పడిపోయే మనిషిలావుంది ఒక్కక్షణకాలం. ఆ తరువాత తెప్పరిల్లింది, కళ్లకొనలలో రెండు కన్నీటి బొట్లు నిలచి వున్నవి.

శోభ: రంగా! ఆ రూపాయలిలా యీ!

రంగ: (ఇచ్చాడు)

శోభ: ఇదుగో తీసుకో - తీసుకో (కొండయ్య కిస్తూంది)

కొండ: (జంకుతున్నాడు)

శోభ: తీసుకో పరవాలేదు; నేను నీకు దానం ఇవ్వటంలేదు. కనికరించీ యివ్వటం లేదు. తీసుకో.

వీర: మన్నించడమ్మా! తెలివిమాలిన ఎదవ ఏదో పేలాడు.

శోభ: (వినిపించుకోలేదు) తీసుకోబాబు! ఇది మీ కష్టార్జితం. మీ సొమ్ము. నాదికాదు. నిజం పలికావు; నీ మాటల్లో నాకు దివ్యప్రబోధం అందిచ్చావు. నీలో దేవుడు మాట్లాడినాడు. నన్ను గురించి యింత విశదంగా నా కెప్పుడూ తెలియదు. ఇంతవరకూ నేనెంతో మంచిదాన్ననే భావిస్తున్నాను. గర్విస్తున్నాను కూడా! కాని మంచితనమంటే ఏమిటో నేర్పావు నువ్వు. నేను మీకు దానం చెయ్యటంలేదు; మీసొమ్ము మీకు చేరుస్తున్నా. అంతే!

కొండయ్య ప్రతిమలా ఆ రూపాయ లందుకున్నాడు.

నువ్వన్నట్లు యీ షోకులు, యీ కార్లు యీ భోగాలే నన్ను దోపిడికి తరుముతున్నాయి. వీటినాశించే మిమ్మల్ని మేము పీడించటం. వీటిని నీ సందేశానుసారం యీ క్షణమే త్యజిస్తా!

అందరికళ్లల్లో నీళ్లు తిరిగినవి. కొండయ్యకుకూడా. శోభ కళ్ళల్లో నిలిచివున్న ఆ రెండు కన్నీటిబొట్లు నేలరాలిపోయినవి. వెళ్ళటాని కిటుతిరిగింది శోభ. వీరయ్య అగుపించాడు. అతని దగ్గరకెళ్ళి ఎంతో ఆప్యాయంగా ఆ విరిగిన చెయ్యి నిమిరింది. వీరయ్య వివశుడయ్యాడు....శోభ వెళ్తూ

శోభ: కవిగారొచ్చారా?

కొండ: లే...

శోభ: చౌదరిబాబు?

రంగ: ఆయన కూడా రాలేదు.

కొండ: దాసు తమకోసం వచ్చెళ్లాడమ్మా!

శోభ: వచ్చి వెళ్లాడా? కవిగారొస్తే వెంటనే యింటికి రమ్మను; చాలా అవసరమైన పనుంది. తప్పకుండా రమ్మన్నానని చెప్పు (వెళ్ళింది.)

వీర: సుట్టుపట్టూసూసి మాట్టాడొద్దంటరా ఎదవా? నోటికొచ్చినట్లు వాయటమేనా?

కొండ: ఊఁ ఏం మునిగిపోలా!

వీర: మునిగిపోలా (చాలా కోపం వచ్చింది. తన్నేవాడిలా లేచి చెయ్యెత్తబోయాడు, బాధవల్ల పడుకున్నాడు)

రంగ: నే చెపితే ఇన్నావా మాఁవా? సూశావా ఎంత మంచామో?

కొండ: ఏమోలే, ఎవరు సూశారు!

వీర: ఎదవ! ఒట్టిబండ యెదవవి!

కొండ: ఒరే, జాగర్తగా సూత్తూండు. ఇప్పుడే వస్తా (కొండయ్య వెళ్లాడు)

చౌదరి, అతని వెంట కవి వచ్చారు.

వీర: కవిగారే! దయశెయ్యండి బాబు! దయశెయ్యండి (నమస్కారం చేయటానికి చెయ్యెత్తుతాడు. ఒక్క చేయే వస్తుంది. తనకింకొక చెయ్యి పోయింది; అప్పుడే జ్ఞాపకం వచ్చినట్లు పసిపిల్లవానిలా ఏడుస్తాడు) దండంపెట్టటానికైనా చెయ్యిలేకుండా పోయింది బాబయ్య!

కవి వీరయ్య మంచం దగ్గర నిలబడ్డాడు వారికే చూస్తూ.

వీర: అరే! రంగా ఆ మంచం అట్టా వాలవరా! మా బాలోళ్ళ కట్టాలెంత బాగా రాశారండీ తమరు! మామీద దయసూపే వాళ్లు మీరొక్కరే బాబూ. నల్లని ఏళప్పుడు తల్చుకుంటుంటాం మిమ్మల్ని. మీరెంత రాత్తే మాత్రం ఏం? మా గతింతగానే వుందీనాటివరకు. మా రాజుల మనసు మారదు. మా రంగడు మీ పాటలన్నీ ఎంతో బాగా పాడతాడు. ఆ పాటలంటే మా పాణం మా పల్లె పల్లెకు. ఒరే రంగా పాడి వినిపించరా?

రంగ: ఆ పాటలన్నీ ఈరివికావు నాన్నా.

వీర: మన పాటలు రాసిన కవిగారు కాదంటరా? కవి .... (కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. మంచంలో కూలబడ్డాడు. 'పట్టుకోండి నాయాళ్లు; పారిపోతున్నారు' అని కేక కొండయ్య నెత్తిమీద దెబ్బతో నెత్తురు కారుకుంటూ వచ్చాడు)

కొండ: పారిపొయ్యారు ఎదవలు; ఎదట బడుంటే బుర్ర రామకీర్తన పాడించేవోణ్ణి.
చౌద: కొండయ్యా! ఏమిటది?
కొం: (దొంగపోటు పొడవటానికొచ్చారు మొనగాళ్లు. నిలుసుంటే తెలిసేది కొండయ్య తడాఖా.
శోభ: రంగా! నీళ్లు పట్టుకురా! (పంచ చించి కట్టుకట్టి మిగిలిన పంచె తడిపి ముఖం తుడుస్తున్నాడు)
వీర: ఎవర్రా పెద్దోడా! ఆ మొనగాళ్ళు? నాటు మాటుండి సాదించే వస్తాదులు!
చౌద: ఇంకెవళ్లున్నారు? బాబుగారి బంట్లు. కలవాళ్లు బీదలని సాధించే చివరి ఉపాయం యిదే. ఇంకా మనలోనూ కొందిరున్నారు. కనుకనే మనగతిలా వుంది!
కొండ: ఏం సాదిస్తారులే బాబూ!.. అయితే ఏమైనట్టు బాబూ ఎళ్ళిన పని?
చౌద: ఏమీ కాలేదు.
కొండ; ఎందుకవుతుంది? నాకు తెలుసు! నే నప్పుడే అన్నా. ఇట్టా బీదోళ్ళ కడుపులు కొడితేకదా బాబులు మారాజులయ్యేది. ఆయనెందుకు ఒప్పు కుంటాడు? ఇన్నావా మామా! ఏమీ కాలేదంట! నే సెప్తెయిన్నా?
వీర: ఇనకపోతే మనం ఏం జేత్తాంరా? ఆళ్ళదయ!
కొండ: ఇనరు! ఎందుకింటారూ? మనం ఇట్టున్నంత కాలం ఇనరు. ఎయ్యాలేదు గియ్యాలేదు! ఆల్లదయ మనకక్కర్లేదు అసలు!
వీర: అక్కర్లేకుండా ఏంజేత్తావేం? మనం లేకుంటే ఆళ్ళకు సాగుంది కాని....
కొండ: ఆఁ.......సాగుతుంది! సాగకేం? అట్టనుకునే మనం యీ కాడికొచ్చింది. కష్టపడేవాళ్ళం మనంలేకుంటే కార్లలో తిరిగేవాళ్ళేమౌతారు? ఒక్కరోజు వాళ్ళొచ్చి పనిచేసుకోగలరూ? సాగుతుందట! ఎర్రిముఖాల్లా కాళ్ళ బేరానికెల్తే యిసిరికొడ్తారు. ఎప్పుడూ మన గతింతే!
వీర: నువ్వూర్కో పెద్దోడా! నీకు తెలవదు. మంచీ చెడ్డా తెలీకుండా మాట్లాడవాక.
కొండ: వూరుకో - ఏంటి మామా వూర్కో! కడుపు రగిలిపోతావుంటే? ఎన్ని రోజులు పడివస్తామిట్టా? బతికినన్ని రోజులూ ఈ బండతాకిరేనా? మండే కడు పేనా? ఒక్కసారన్నా సెప్పు ఆయన మనకు మంచి సేసింది? మంచి సేయక పోతే పోయింది. మంచిగా నన్నా మాట్లాడింది. దరలు యిపరీతంగా పెరిగి పోయి సత్తావుంటే కూలి ఒక్క కాసన్నా ఎక్కువ చేశాడూ ఆ మారాజు? ఇదిగో అదిగో అంటూ నెట్టేశాడా యిన్ని రోజులు? ఇప్పుడేమంటే, యుద్ధమై

పోయిందంటాడూ? నూకలు దొరక్క సత్తావుంటే పుట్లు పుట్లు పెట్టుకొని దొడ్డిదారిని దొంగతనంగా అమ్ముకున్నాడే! ఒక్క గింజన్నా యిదిల్చాడా మనకు? సగం కడుపుకైనా తినీ తినక పెళ్ళాం బిడ్డలు యిన్నిటికి తలొగ్గి బండ శాకిరీ శేత్తుంటే యీ రోజేం చేశాడు? ఇక సరిపడదులే మాఁవా! నీకు తెలపదు.

వీర: ఆఁ, సరిపడకేం జేస్తాంరా ఎర్రెదవా!

కొండ: బతకలేకపోలేం! రెక్కలు సల్లగుండాలెగానీ బొక్కెడు కూటికెక్కడా కరువుండదులే! నీకు సెయ్యిరిపోయి రకతం ఎల్లపలై పోయి పడుంటావని ఎల్లి మొరెట్టుకుంటే మాట్టాడినంతసేపూ తప్పెవరిదని దబాయించాడు. కాని ఆ మారాజు 'అయ్యోపాపం' అన్నాడూ? మనిషి సత్తావుంటే తప్పెవరిదంట — తప్పెవరిది!

కవి: తప్పు మీదేనట!

కొండ: ఎవరు శెప్పింది?

కవి: ఆయనే! మీరు త్రాగివచ్చి ప్రమాదం తెచ్చుకున్నారట!

కొండ: అన్నాడూ!

వీర: అదొకటా బాబూ, మా పేదబతుక్కి!

కొండ: అన్నాడాంట? నాతో అనమను శెపుతా. తాగినారంట! తానూ తాగింది. బాందీ పేసాయి నేనుసూడలా? తప్పుమాదేనంట. ఆయాక్సిల్ అరిగిపోయిందని ఆయన కెన్నాళ్ళనుంచి శెప్తున్నామో అడగండి! యినిపెంచుకున్నాడా? నెత్తిన నోరెట్టుకుని శెప్పానే? పెమాదం జరిగితే మా తప్పా?

కవి: నిజంగానా? నువ్వు నిజమే చెప్పుతున్నావా?

కొండ: అడగండి. నా యెదుట గనక ఆ మాటనుంటే శెప్పే వాడిని. యెగెయ్యటాని కిదొక దారి ఆలోచించుకొన్నట్టుంది. సూశావా? యింతా మూసుకుని పడుంటావాఁ? తేలిపోయిందింకేం? మనం సేయతగిందేమో శేసిసూపిత్తాం. అంతే. (కవి రాతిబొమ్మలా కూర్చున్నాడు)

వీర: కవిగారూ? మీకన్నా తెలియదా మా పేదోళ్ళ బతుకు. మీరన్నా శెప్పకూడదా నాయం!

చౌద: న్యాయం! ఎక్కడుందోయ్ న్యాయం. అసలు న్యాయమనేదే ప్రపంచంలో వుంటే కవులందరూ యిలా ఎందుకు మాడిచావాలి? కవి మన తరపున మాట్లాడాలి? మీ కష్టసుఖాలు వ్రాయాలి? ఒక్కరోజు పోషించగలరా కవిని! పూట

కూటికి తిన్నగాలేని మీరేం చేయగలరోయ్ కవికి? భోజునిలా భోజనం పెట్ట గలరా? రాయలలా రత్నాలు కురిపించగలరా?

వీర: కడుపులో పేగులతో గూడా మాడి సచ్చేవాళ్ళం మేమేం సేయగలం బాబు?

కొండ: కలవాళ్ళదేనా ప్రపంచమంతా?

వీర: బీదోళ్ళను దయసూశే వాళ్ళేలేరా బాబు?

చౌద: అవును. బాబు ఆయన్ని పోషిస్తున్నారు. చితికిపోయిన ఆయన్ని వుద్ధరించి ఆయన కవిత్వాన్ని పాలుపోసి పెంచి ఆ కవితా పుష్పాలను స్వార్థ రహితంగా ప్రపంచంమీద వెదజల్లుతున్నారు. ఆంధ్ర సాహిత్యానికి అమోఘంగా సేవ చేస్తున్నారు. మీరేం చేయగలరు? మీలాగ పూరిగుడిసెల్లో ముగ్గనివ్వగలరు! మీలా పస్తులతో పరుండ బెట్టగలరు! హుఁ. అసలు మీ చెమటకంపుకు కవిత్వం కూడానా? (కవి తలెత్తి చూచాడు) మీకు కాదు? యీ కూలి ఠంక లకు చెప్తున్నా. కవికి ప్రపంచంతో సంబంధంలేదు, కవిది కేవలం వూహా సామ్రాజ్యం. ఆ వూహా సామ్రాజ్యంలో కలలు. ఆ కలల్లో ప్రేమగీతాలు, ఆ ప్రేమగీతాల్లో 'ఓం సత్యం, శివం, సుందరం!'

కవి: చౌదరీ ___

చౌద: కోపం వచ్చిందా? అంతా అగమ్యగోచరంగా వున్నవాళ్ళకు యింత ఆగ్రహం ఎందుకండీ? ఓ! నేను మర్యాదగా మాట్లాడటం నేర్చుకోవాలి. అయినా యీ ప్రపంచంలో నాకింకేం మర్యాదవుంది లేండి! ఈ ప్రజ, యీ సంఘం, దేశంతప్ప, ఈ పెద్దపెద్ద వ్యర్థపదాలు తప్ప నాకింకేం తెలుసు? మీరు కవులు. ఓ! మరచాను. మీరు కవులు కారుగా?

కవి: చౌదరీ నన్నెందుకు చంపుతావు?

చౌద: చంపుతున్నానా? అజ్ఞానంలో, అమాయకత్వంలో, ఆకలిమంటల్లో, అలమ టిస్తున్న ఈ అస్థిపంజరాలు మీకు కనపడుతున్నాయా? వారి రోదనలు మీకు విన పడుతున్నాయా? వీళ్ళందరూ మనుష్యులు, ఈ మనుష్యులే దేశం, సంఘం, అన్నది మరవకండి! కవిగారూ! ఆలోచించండి. ఇప్పటికైనా మీ కవిత్వాన్ని ఈ కష్టజీవులకొరకు వినియోగిస్తారా? లేక, ధనికుల ఆశ్రయమే స్వర్గధామ మనుకొని వారి కాముకత్వానికి చక్కిలిగింతలు పెట్టి రేకెత్తించే ప్రణయ గీతాలు వ్రాస్తారా? నిర్ణయించుకోండి. దేశదేశాలు మారినా మనం మారం. మన సాహిత్యానికి ఆదినుంచీ ఈ బానిసత్వం తప్పలేదు. అన్ని దేశాలలో

కష్టం ప్రజలకోసం బతుకుతున్నారు. మనదేశానికే ఈ దౌర్భాగ్యం కవిగారూ! ఒక్కసారి కళ్ళువిప్పి చూడండి.

కవి: చౌదరీ! (అమాంతం చౌదర్ని కౌగిలించుకున్నాడు)

చౌదరి కంగారుపడ్డాడు. కవి వీపుమీద తడుతున్నాడు. కవి కళ్లనుండి ధారగా కన్నీరు కారిపోతూంది............

కవి: ఎన్ని పవిత్రదేవాలయాలు! ఎందరు దేవుళ్ళు! ఈనాడు చూశాను; తెలుసుకున్నాను తరించింది నా జన్మ. చౌదరీ? నాకు పునర్జన్మను ప్రసాదించావు నన్నొక పాపకూపంనుంచి పైకిలాగావు! రక్షించావు!

చౌద: కూర్చో — కూర్చో.

కవి: గంటగా నన్ను కలవరపరచిన తుఫాను ఆగిపోయింది. నాలో చెలరేగిన బాధ నివారింప బడింది. అబ్బ! ఈరోజు శుభదినం. గౌతముడు రాజభోగాలు పరిత్యజించిన పుణ్యదినం.

చౌద: విశ్రాంతి తీసుకో: సావధానంగా ఆలోచించు కర్తవ్యం.

కవి: నేనెంతటి నరకంలో నివసిస్తున్నానో, ఏ పాము పడగనీడలో విశ్రాంతి తీసుకుంటున్నానో, కళ్ళకు కట్టింది. ఇక అక్కడుండలేను. ఒకక్షణం ఆ, మోసంలో ఆ నరకంలో నిలవలేను. తక్షణం —

కొండ: తమర్ని ఎంటనే ఇంటికిరమ్మని శోబమ్మగారు శెప్పెళ్లారండి. తప్పకుండా రమ్మన్నారు.

కవి: శోభా! ఎందుకూ?

కొండ: చాలా అవసరమైన పనుందన్నారు. దాసుకూడా వచ్చి శెప్పారండి.

కవి: సరే! తుదివందనా లర్పించి వస్తా!

చౌద: ఆగు. నువ్వనుకున్నంత సులభం కాదది.

కవి: ఏం?

చౌద: పిచ్చివాడా? యిన్నిరోజులు నిన్ను పోషించినవాడు నిన్నింత సులభంగా శత్రు సైన్యంలో చేరనిస్తాడా చూస్తూ చూస్తూ.

కవి: నేను స్వతంత్రుణ్ణి!

చౌద: అది ఒక్కటి మాత్రం నీవు పోగొట్టుకొన్నావన్నది ఇప్పుడు గ్రహిస్తావు. నిన్నతడు పోనివ్వడు.

కవి: ఏం జేస్తాడు.

చౌద: ఏమన్నా చేస్తాడు.

కవి: . ...............

కొండ: ఏంజేస్తాడు బాబు? చూద్దాం. ఇందరముండగా ఈగ వాలనిస్తామా ఆయన మీద. మా గొంతులో ప్రాణాలుండగా ఆయనకేం భయంలా!

కవి: తమ్ముడూ! నేనింతవరకూ మీకుచేసిన ద్రోహానికి నాకు మీ ప్రాణాలిస్తారా? నా గుండెలు బద్దలై పోతున్నవి. ఏదీ! ఒక్కసారి .... తమ్ముడూ (కౌగలించుకున్నాడు) రంగా ఓలారా! పాడవోయ్. ఒకపాట పాడు (రంగడు పాడుతున్నాడు. చౌదరికూడా కలిశాడు. కొండయ్య గొణుక్కొంటున్నాడు. వీరయ్య మెల్లగా లేచి కూర్చున్నాడు పాడుతూ.)

మేలుకో! మేలుకో!
పీడిత ప్రజలకు ఆశాజ్యోతి
నేడగుపించిందోయ్! నేడగుపించిందోయ్!
ఎండిన గుండెలు మండే కడుపులు
ఏకమైతే ఎదురు తిరిగితే
లోకాలన్నీ వూగిపోవా!
శోకాలన్నీ ఆగిపోవా! ॥మేలుకో॥

అదిగోనోయ్! అదిగోనోయ్!
తూరుపు కొండలు జేవురించినవి!
నరసింహాలై వురకండోయ్!
పరశురాములై పోరండోయ్! ॥మేలుకో॥

రేపటి లోకము మాదేనోయ్!
మాపటి చీకటి మాసిందోయ్!
గణగణగణగణ ఘంటారావం
ఢణఢణఢణఢణ విజయదుందుభి
మ్రోగించండోయ్! సాగించండోయ్! ॥మేలుకో॥

తెరపడుతుంది



# నాలుగవ రంగం

బాబు యింట్లో గది. మొదటి రంగంలాగే.

శోభ: (ఇటూ అటూ పచారుచేస్తుంది)

దాసు: (తొందరగా వచ్చాడు) నీకోసం అక్కడికి వెళ్ళాను తల్లీ.

శోభ: అన్నయ్య యింట్లో వున్నాడా?

దాసు: లేడు.

శోభ: వెళ్ళిన పని ఏమైంది?

దాసు: దాసు వెళితే పని కాకుండా వుంటుందా? కానీ అబ్బ! ఎంత అవస్థపడ్డానో తెలుసా? సాధించేది ఒక ఎత్తయితే సాధించిన సామాగ్రి జాగ్రత్త చేయటం బ్రహ్మ ప్రయత్నమైంది. నా ప్రాణం ఇంతవరకు నాలో లేదంటే నమ్మ. భగవంతుడున్నాడు! ఎక్కడ బాబుకు తెలిసిపోతుందో అని దీనిని దాపాడ టంతో నా తలప్రాణం తోకకు వచ్చింది.

శోభ: ఇంకొక్క అరగంట దాసూ! అంతవరకూ ఎవ్వరికీ తెలియనీయకుంటే చాలు. వాళ్ళతో జాగ్రత్త అని చెప్పావా కొంపతీసి —

దాసు: అవన్నీ నేను భద్రం చేశానులే తల్లీ! ఇంత వయస్సై ఆమాత్రం వ్యవహారం తెలియదూ నాకు? ఇంతకూ ఆ కవిగారొస్తారో రారో?

శోభ: నేను చెప్పివచ్చాను! తప్పకుండా వస్తారు.

దాసు: నేనూ చెప్పే వచ్చాను.

శోభ: ఏవీ?

దాసు: (మెల్లిగా పైపంచలో చుట్టుకున్న పుస్తకాలు తీసి యిస్తాడు) దాచుతల్లీ భద్రంగా దాచు. జాగ్రత్త! దాసుపడ్డ శ్రమంతా వృధా అవుతుంది. కథ అడ్డం తిరిగిపోతుంది. జాగ్రత్త!

శోభ! దాసూ! మరింకో విషయం; ఏం చేశావు?

దాసు: అన్నీ ఏర్పాటుచేశాగా! కవిగారు రావల్సిందొకటే ఆలస్యం! యింతకూ ఆయన ఎక్కడికి వెళ్ళినట్లో? అక్కడికి రాకుంటే?

శోభ: తప్పకుండా అక్కడికే వెళ్తుంటారు, చౌదరిగారిని కలుసుకొని. ఏం భయంలేదు. ఇప్పుడే రమ్మన్నావా — వాళ్ళనుకూడా?

దాసు: ఆఁ కొంచెం ముందుగానే రమ్మన్నాలే ఎందుకైనా మంచిదని.

'దాసూ!' అని కేక

దాసు: దాసు. దాసు. వచ్చేశాడు.

శోభ పుస్తకాలను డ్రాయర్లో దాచింది. బాబు వెళ్లాడట. శోభ ఇటు వెళ్ళింది. ఒక్క క్షణం నిశ్శబ్దం; గడియారం మాత్రం టక్ టక్ మంటుంది. శోభ కులాసాగా ఏదో పాడుకుంటూ వచ్చింది .

కలకల లాడిందీ - మా -
తెలుగు నందనం
కిలకిల నవ్వింది! ||కల||

క్రొత్త క్రొత్తగా
తేట తేటగా
పాటలు పాడిందీ...మా
తెలుగు కోయిల
బాటలు తీర్చింది! ||కల||

పూవు పుణికితే పొంగే తేనెలు
కొమ్మ కదిపితే 'కూ కూ' స్వరములు
పచ్చని వెచ్చని పచ్చిక బయళ్ళు
రాయలనాటి రంగు తివాసీలు ||కల||

కొంతసేపటికి బాబు, అతనివెంట దాసు వచ్చారు.

బాబు: శోభా ఎక్కడికెళ్ళావు షికారు?

శోభ: పార్కు కన్నయ్యా!

బాబు: దాసూ! నీకు తెలియంది కాదుగా? మన శోభ ఎన్నడన్నా అబద్ధమాడిందా? అమ్మ దాన్నలా పెంచింది. నాకు తెలుసు. ఏకపోయే విషయమైనా శోభ అబద్ధం చెప్పదు! కానీ అదేమిటో యీనాడు (—) గంటలకు అమాంతంగా మా శోభ సత్యసంధురాలైన మా శోభ అమోఘంగా అబద్ధం చెప్పేసింది. ఏమిటి చెప్మా కారణం? సముద్రాలన్నీ ఏకమైనవా? సూర్యుడు పడమట వుదయించాడా? ఏమిటి దాసూ కారణం?

దాసు: నాకామె అబద్ధం చెప్పిందని అసలు తెలీదండీ!

బాబు: దాసుకు సత్యం అసత్యంకూడా తెలియకుండా వచ్చింది. ఇది పరో విషయం! ఏమిటప్పా యీరోజు చాలా వింతగా వుంది?

దాసు: నాకూ అలాగే వుందండి.

శోభ: ఇంతకూ ఏమిటన్నయ్యా అబద్ధం?

బాబు: నీవు పార్కుకు వెళ్ళింది వచ్చి అబద్ధం. నేను ఇప్పుడేగా అక్కడనుంచి రావటం.

దాసు: అంతమాత్రాన అది అబద్ధ మౌతుందాండి? ఆమెని మీరు చూచి వుండక పోవచ్చు.

బాబు: అవును. అదీ జరగవచ్చుగా? పోనీ—కవిగారెక్కడ శోభా?

శోభ! ఇంట్లో లేరూ!

బాబు: లేరే! ఆయనకూడా బయటికి వెళ్ళారు. అబ్బ! యీరోజు కవిగారు గడప దాటినందుకు పెద్దడిన్నరు చేయబోతున్నా! ఇంతకూ - ఆయన ఎక్కడి కెళ్లారు?

శోభ: ఏమో! ఎక్కడి కెళ్లారో?

బాబు: ఎక్కడికెళ్లార నే నిన్నడగటం?

శోభ: నాకేం తెలుసు.

బాబు: ఊఁ చెప్పు, కవిగారెక్కడికి వెళ్ళారు?

శోభ: ఏమిటా తీవ్రం?

బాబు: రఘు ఎక్కడి కెళ్లాడు?

శోభ: నాకేం తెలుసు?

బాబు: నీకు తెలుసు.

శోభ: నాకు తెలీదు.

బాబు: తెలీదూ? దాసూ! కవి ఎక్కడ? ఎక్కడికి వెళ్ళాడు?

దాసు: ఎక్కడికీ వెళ్ళేపాటి మనిషి కాదండి ఆయన! ఈ గది, పుస్తకాలు, తమరు తప్ప వేరే ఎరుగడే ఆయన?

బాబు: దాసూ! నిజం చెప్పు.

దాసు: ఈ వృద్ధాప్యంలో యింత బ్రతుకు బ్రతికి అబద్ధంకూడా చెప్తానా?

బాబు: ఎవ్వరికీ తెలీదు. ఎవ్వరికీ తెలియకుండా ఎలా వెళ్ళాడు? ఇంట్లో కూర్చుని ఏం చేస్తున్నట్లు?

దాసు: బాబుగారికాలం నుంచి లెక్కలు వ్రాయటం ఒక్కపని చేస్తున్నాను. గుమాస్తా, అంటే మనుషులకు కాపలా వుండాలని తెలీదు.

బాబు: ఏమిటి?

వాసు: బాబూ మాట జారవిడుచుకోకు!

బాబు పొరపాటని గ్రహించాడు

వాసు: ఎత్తిపెంచిన అభిమానంకొద్దీ ఊరుకొన్నా. అదే మాట నువ్వు కేవలం యజమానిగా అనిపించే — (వెళ్లాడు.)

రంగడు వచ్చాడు.

బాబు: రంగా! కవిగారు రాలేదూ?

శోభ: (సైగ చేసింది చెప్పొద్దని)

రంగ: లేదండి.

బాబు: భోజనానికి కూడా రారూ? అక్కడే ఉండిపోతారేం?

రంగ: ఏమోనండి.

బాబు: నీతో చెప్పలేదూ?

రంగ: నాతో ఎలా చెప్తారండి?

బాబు: రంగా! ఇదిగో పదిరూపాయలు ఉంచుకో.

రంగ: జీతం పన్నెండనుకున్నామండి. ఇంకా రెండు రావాలి.

బాబు: జీతంకాదు. బహుమానం!

రంగ: జీతం ఇస్తే బహుమాన మిచ్చినంత పున్నెమేనండి.

బాబు: జీతం, బహుమానం అన్నీ ఇస్తా, కవిగారెక్కడున్నారు చెప్పు?

రం: ఏమోనండి; ఎప్పుడన్నా బయటకు వెళ్ళే అలవాటున్నా ఫర్వాలా. వుదామరిగ్గా చెప్పొచ్చు. ఎట్ట చెప్పనండి?

శోభ: లైబ్రరీవైపు వెళ్ళుంటారేమో?

రంగ: ఆఁ - అవునండి వెళ్లుండొచ్చు.

బాబు: నా చిట్టితండ్రి! ఎంత బాగా ఆడావురా అబద్ధం? ఊఁ ఇంకొకసారి, ఎక్కడున్నారు?

శోభ: స్కూల్లో ఏదో మీటింగుందేమో యీ రోజు!

బాబు: శోభా! నువ్వూరుకో! నిజం చెప్పు ఎక్కడున్నారు? అరె! శోభ ముఖంలో ఏముందిరా కోతులు! అడుగుతూంటే శోభ ముఖం చూస్తావేం! ఊఁ - చెప్పు! చెప్తావా లేదా? (గద్దించాడు.)

రంగ: మా యింటి కొచ్చారండి.

శోభ: వెళ్లారా?

బాబు: ఆఁ వెళ్ళారు. వెళ్ళకేం? ఇప్పుడెక్కడ?

రంగ: చౌదరిబాబుతో వత్తున్నారండి.

బాబు: ఏం జేశారు అక్కడకొచ్చి?

రంగ: మా నాన్నని చూశారండి.

బాబు: ఇంకా?

రంగ: మాకొక సమ్మెపాట రాసిచ్చారండి.

శోభ: వ్రాసిచ్చారా?

బాబు: ఆఁ వ్రాసిచ్చారు! శోభ కూడా వచ్చింది? దాసు కూడా ఏం? అవునా?

రంగ: అవునండి.

బాబు: అవును. అందరూ దొంగలు! అందరూ దగుల్బాజీలు! అందరూ నా యింట్లో నా సొమ్ము తిని నాకే ఎసరుపెడుతున్నారు. అందరూ నా పంచనీడలో బ్రతికి నాకే ద్రోహం చేస్తున్నారు. నా గొంతు కోయడానికి ప్రయత్నిస్తున్నారు. ద్రోహులు! నీచుల్ని చేరదీస్తే ఏం జేస్తారు?

శోభ: అన్నయ్యా!

బాబు: ఏం? ఎందుకూ రోషం? చేయాల్సిన పనేదో చేసి ఇంకా రోషం ఎందుకూ?

శోభ: రోషపడకుండా వుండటానికి నేనేమంత నీచమైన పని చేయలేదు.

బాబు: చేయలేదూ? ఇంతకన్నా ఏం చేయాలి? ఆ కూలికుంకల పాకలకు పోయొచ్చావు. అంతకన్నా ఇంకేం చేయాలి?

శోభ: వెళ్ళాను; నా యిష్టం!

బాబు: నీ యిష్టం? నీ యిష్టంకాదు తెలుసా. వంశానికి పేరూ ప్రతిష్ఠా అంటూ వున్నయ్. నీ యిష్టం వచ్చినట్లు నువ్వు పోలేవు; పోకూడదు కూడా! నువ్వెందుకు వెళ్ళావో నాకు తెలుసు. మహాదయగలదాన వనిపించుకోవాలని వెళ్లావు. గడించి పోస్తుంటే అందరూ దయగలవాళ్ళు కావచ్చు. నీ కార్లు, నీ భోగాలూ, దానాలూ, ఎక్కడినుంచి వస్తున్నాయనుకున్నావు. ఆకాశాన్నుంచి వూడిపట్టంలేదు. నీలాగే నేనూ మహాదయగలవాడిలా వుండొచ్చు. మరునటి రోజున నీ గతి ఏమౌతుందో తెలుసా? వెళ్ళిందట వెళ్ళింది! నీ యిష్టం!

శోభ: ఇదంతా నాకోసమే చేస్తున్నావా?

బాబు: మిమ్మల్నందరిని పోషించటానికాక యింకెందుకు? నేను ఒక్కణ్ణే నెత్తిన వేసుకుపోతున్నానా? ఆ చౌదరిగాడే ఇంతా చేస్తున్నాడు. నీకే విషం పోసింది కూడా వాడే. (నయంగా) శోభా? మనం ఎంత తగ్గిపోయినవాళ్ళల్లో కలవా లనుకున్నా వాళ్ళు మనల్ని దూరంచేసి పెడరారు. వాళ్ళూ మనం ఏకం కావటం ఏనాడూ జరగదు. నువ్వు యీ పిచ్చి పిచ్చి సిద్ధాంతాలన్నీ మానేయ్; మన కొక తాహతు వుంది. దాహతుకు తగ్గ ప్రవర్తన లేకుంటే లోకం మనల్నే నవ్విపోస్తుంది. నీ వుదార స్వభావాన్ని అర్థం చేసుకోను. ప్రపం చాన్ని నువ్వు మరామత్తు చేయలేవు. ఆ చౌదరి యిచ్చిన పుస్తకాలు చదివి నువ్వీ వెర్రిలో పడుతున్నా వంటే?

శోభ: అన్నయ్యా? ధనంచేత కల్పింపబడ్డ యీ తాహతులన్నీ క్షణికాలు. హృదయా నికి సంబంధించిన మానవధర్మాలు మాత్రమే శాశ్వతం. ఆ ధర్మాల ననుస రించినవారికి ఏనాటికీ లోపంరాదు. ఇది తెలుసుకో అన్నయ్యా!

బాబు: అయితే నీ ఆటలు మానవంటావు. ఈ ద్రోహం జరిగిస్తూనే వుంటానంటావు. నిన్ను యిన్నాళ్ళు పెంచి పెద్దచేసిన అన్నయ్యకంటె ఆ కాలికుంకలే అధిక మయ్యారంటావు. ఆ కవినీ నువ్వే తీసుకువెళ్ళివుంటావు. రానీ రానీ - ఆ కవిని. ఆ సమాచారం కూడా ఏమిటో తేల్చుకుంటా!

కవి వచ్చాడు.

బాబు: ఓ! కవిగారా? దయచేయండి! ఎక్కడికెళ్లారు?

**కవి:** ఎక్కడికో?

**బాబు:** ఊఁ. తమకే తెలియదన్నమాట! పోనీ - స్టేటుమెంటు వ్రాశారా?

కవి: లేదు.

**బాబు:** లేదూ? వెంటనే వ్రాసిపెట్టండి. చాలా అవసరం.

కవి: నేను వ్రాయలేను.

**బాబు:** అంటే?

కవి: నావల్ల కాదని.

**బాబు:** నీ చేతకాదనేనా?

కవి: కాదు, నా అంతరాత్మ విరుద్ధమైన పని నేను చేయలేను.

**బాబు:** గంటకు పూర్వంలేని అంతరాత్మ యిప్పుడు ఎక్కడనుంచి ఊడిపడిందా అని? చౌదరి అంతరాత్మలు తయారుచేసి అమ్ముతున్నాడేం?

కవి: గంటకు ముందువరకూడా నాలోనే వుంది. ఎక్కడనుంచీ ఊడిపడలేదు. కానీ ఇన్నాళ్ళనుంచీ నాకు తెలియదు. ఇప్పుడు తెలుసుకున్నాను.

బాబు: ఏమని? అంతరాత్మ వుందనేనా?

కవి: కాదు మీది అన్యాయం; దౌర్జన్యమని?

బాబు: ఏమన్నావ్?

కవి: మీది అన్యాయం; దౌర్జన్యం!

బాబు: అన్యాయమే. వీధులంబడి ముష్టెత్తుకు బ్రతకాల్సిన నిన్ను కనికరించి. ఆశ్రయమిచ్చి. తిండి పెట్టింది అన్యాయం! చావనున్న నిన్ను తీసుకొచ్చి రాజభోగాలిచ్చి బ్రతకనిచ్చింది అన్యాయం? కట్టుగుడ్డలు కూడ లేని నిన్ను నా యింట్లో, నా తమ్ముడిలా పెరగనిచ్చింది అన్యాయం? నా సొమ్ము తిని, నా పంచలో బ్రతికి, నన్నే ఆక్షేపించటం అన్యాయం కాదు! నాకు ద్రోహంచేయ తలపెట్టడం అన్యాయం కానే కాదు! ఛీ సిగ్గులేదూ నీ బ్రతుక్కి?

కవి: ముయ్ నోరు.

బాబు: ఆఁ.

కవి: ఏంటీ నీ బెదిరింపు? నువ్వేం తేరకు పెట్టలేదు. నాచేత వుపన్యాసాలూ, వ్యాసాలూ వ్రాయించుకొని వప్పజెప్పి పేరుప్రతిష్ఠలు సంపాదించుకున్నావు. నీ కీర్తికోసం నన్నవసరమైనప్పుడెల్లా వినియోగించుకున్నావు. నా వ్రాతల మూలంగా వూర్లో పెద్ద పెద్ద పదవులన్నీ ఆక్రమించావు? ప్రజల్ని పీక్కు తింటున్నావు. నేను మోసపోయాను. ప్రజల్ని మోసపుచ్చటానికి నీకు సహాయపడ్డాను. నా కవిత్వాన్ని నీకు అమ్మాను. ప్రజల్ని దోపిడిచేసేందుకు నీకు అండగా నిల్చాను. అక్షరం మాట్లాట్టానికి చేతగాని నువ్వు నా మూలంగా మహావక్త వనిపించుకొన్నావు. నీకా నాకా సిగ్గులేంది? ఇక నీ ఆశ్రయం నాకక్కరలేదు. నీకో నమస్కారం, నీ పోషణకో నమస్కారం.

బాబు: ఆగు. ఎక్కడి కెళ్తావు?

కవి: ఎక్కడికో - నీ కెందుకు?

బాబు: నువ్వెళ్ళటానికి వీల్లేదు.

కవి: ఆజ్ఞాపిస్తున్నావా?

బాబు: అవును.

కవి: నేను నీ సేవకుణ్ణి కాను, జాగ్రత! ఇంతవరకూ నీ బ్రతుకు రహస్యం ఎవరికీ తెలియదు, నీ యింటివారికి తప్ప. అది కాస్తా నలుగురిలోకి తెచ్చుకోకు.

నిన్నింతటితో మరచిపోతాను. అనవసరంగా పెంచుకున్నావు! సరిగదా నీ ముఖాన వుమ్మి అవకాశం కోరి తెచ్చుకుంటావు.

బాబు: నువ్వు వెళ్ళటానికి వీల్లేదు. (బిగ్గరగా అరిచాడు)

కవి: నువ్వు నన్ను ఆజ్ఞాపించటానికి అసలే వీల్లేదు. (అంత బిగ్గరగానే అరిచాడు)

బాబు: ఉంది. నా కధికారముంది! నువ్విక్కడనుంచి కదలటానికి వీల్లేదు. నీ ఖాతా చెల్లించి మరీ కదులు.

కవి: నా ఖాతా యేమిటి?

బాబు: నీ ఖాతా యేమిటా? నీ బాబుగారి సొమ్మనుకున్నావా, యిన్నాళ్ళు ఖర్చు పెట్టింది? ఎవడబ్బ సొమ్ము? పుస్తకాలేవో అఘోరించి అమ్ముకొని చెల్లించి తీరుతావని యిచ్చాను. కాని నేల గిక్కడ పోసిపెట్టుందని, నీకంటే పుణ్యాత్ముడు దొరకలేదని యివ్వలేదు. తిండిపెట్టాను ధర్మంగా. అది చాలదూ? ఆ వెయ్యి చెల్లించి మరీ కదులు.

కవి: వెయ్యి రూపాయలే!

బాబు: ఆఁ వెయ్యి రూపాయలు, మర్యాదగా చెల్లించు. కాదన్నావా యిప్పుడే పోలీసుల్ని పిలిపిస్తా. నే ననుకుంటే నిన్నేమైనా చేయగలను. తెలిసిందా? వెళ్తావ్! ఎక్కడికి వెళ్తావ్? ఎవరి బలం చూసుకొని వెళ్తున్నావో వాళ్ళేమయ్యా రిప్పుడు? చెల్లించలేరూ? కానీ ఎవ డాదుకొంటాడో చూస్తా!

కవి నిర్ఘాంతపోయి నిల్చున్నాడు. కొండయ్య లోనికి ఉరికాడు.

కొండ- ఆగు! బలే దబాయిస్తుందావే! నోర్లేనాయననేనా నీ దబాయింపు! వెయ్యి రూపాయలియ్యాలీ నీకు! ఇత్తాం ఇత్తాం బీదోళ్ళని దోచుకుని, కడుపుకొట్టి గడించి ఇనప్పెట్టెల్లో దాపెట్టుకుని బలిసిపోయిన నీ కెయ్యిరూపాయిలియ్యాలీ? ఇత్తాం.

బాబు: ఏయ్!

కొండ: ఏంటి నీ బెదిరింపు. ఏంటి నీ దబాయింపు ఏంజేస్తావ్! పానాలు తీశేత్తావ్. జైల్లో పడేత్తావ్. అంతేగా? పోతాం; సత్తాం; యీ వచ్చేది అక్కడే సత్తాం!

బాబు: ఏయ్! Beggar Rascal !

కొండ: రాస్కెలంట్రా. (పైకి పోయాడు.)

కవి: కొండయ్యా — (ఆపాడు.)

[కొండయ్య కట్టేసిన సింహంలా వగరుస్తున్నాడు.]

కవి: ఊరుకో! నీకు తెలీదు నా మాట విను.

కొండ: చిత్తం బాబు.

శోభ: అయితే కవిగారూ! మీరు నిశ్చయంగా యిక్కడనుంచి వెళ్ళాలను కున్నారా?

కవి: అవును; ఇంకొక క్షణం వుండలేను యీ నరకంలో.

శోభ: ధనికుల ఆశ్రయం లేకపోతే ఎలా బ్రతకగలరు?

కవి: ప్రజా సేవలో బ్రతుకుతా; ప్రజాబలమంతా నాదే.

శోభ: కవిగారూ! అవసరమైనంత వరకూ ధనికుల నాశ్రయించి, ఆశ్రయించి వున్నంతవరకూ వారి కనుకూలంగా వ్రాసి, అవసరమైనప్పుడు, ఇంకొక ఆశ్రయం లభించి నప్పుడు వారిని తిరస్కరించి, తిట్టిపోయటమేనా మీ నీతి?

బాబు: అడుగు. అలా అడుగు! బాగా సిగ్గువచ్చేలా అడుగు!

కవి: శోభా! నువ్వా యిలా మాట్లాడుతున్నావా?

శోభ: అయితే యిప్పుడేమంటారు?

కవి: ...................

బాబు: ఏం పలకవేం? పలుకలేడు. ఎలా పలుకుతాడు. వెళ్ళాట్ట (వికటాట్టహాసం చేస్తున్నాడు. దాసు వచ్చాడు)

శోభ: అన్నయ్యా! ఆపు!

బాబు: ....................

శోభ: కవిని వెళ్ళనీ.

బాబు: ఆహా! మహారాజులాగా వెళ్ళనీ నా డబ్బు చెల్లించి.

శోభ: మళ్ళా చెప్తున్నా. వెళ్ళనీ.

బాబు: వెళ్ళటానికి వీల్లేదు.

శోభ: మళ్ళీ చెప్తున్నా. వెళ్ళనిస్తావా? లేదా?

బాబు: శోభా! వీల్లేదు.

శోభ: అన్నయ్యా! నా మాట విను. నీ గోయి నువ్వే త్రవ్వుకుంటున్నావు. కవిని వెళ్ళనీ.

బాబు: నన్ను బెదిరించక్కర్లేదు. నాకు తెలుసు.

శోభ: అంతేనా?

బాబు: అంతే.

శోభ: అయితే, వెంటనే పోలీసులకు రిపోర్టుచేసి నిన్నీ క్షణంలో Prosecute చేయించగలను. ఏమంటావ్?

బాబు: నీకు మతిపోయింది. నన్నుకాదు. ఆ కవిని. ఆ కవిని అప్పగించాల్సింది.

శోభ: కాదు. నిన్నే. శ్రీ రావుబహద్దూర్ బాబురావ్ నాయుడుగార్నే.

బాబు: ఆఁ!

శోభ: అవును. అతను వ్రాసిన పుస్తకాలన్నీ నీ పేరట అచ్చువేయించుకున్నావ్. నీ పరువు తియాలంటే నా చేతుల్లోవుంది. అమాయకుడైన ఆ కవి కి విషయం తెలియదు. అతని ఉపన్యాసాలు, వ్యాసాలు ఉపయోగించుకోడమేమే సిగ్గు! లది చాలక పుస్తకాలుకూడా అచ్చు వేయించుకున్నావ్! దొంగిలించావ్! అతన్ని మోసంచేశావ్. ఏమంటావ్!

కవి: నిజంగానా?

బాబు: అవి అబద్ధాలు! శుద్ధ అబద్ధం! శోభా ——

శోభ: ఇంకా ఎందుకు పెనుగులాడతావ్? ఇంకా మోసం చెయ్యాలని ఎందుకు యత్నిస్తావ్. నీచేతులారా నువ్వే యింత రభస తెచ్చుకున్నావ్. ఇవిగో అచ్చుపుస్తకాలు, యివిగో వ్రాతప్రతులు. ఏం? ఇంకా అబద్ధమేనా?

బాబు: ...వెళ్ళండి. వెళ్ళండి, అందరూ వెళ్ళండి. యీ క్షణం వెళ్ళండి. నువ్వూ వెళ్ళు. నువ్వూ, నువ్వూ అందరూ వెళ్ళండి (అంటూ తానే వెళ్ళాడు.)

కవి: శోభా! ఇప్పుడర్థమైంది నువ్వంటే ఏమిటో.

దాసు: నేను చెప్పలేదూ అచ్చం తల్లిపోలికని.

రంగ: నేనూ శెప్పాను, శోబమ్మ సాలా మంచిదని.

శోభ: ఏంటి రంగా, అలా పైకప్పుకేసి చూస్తున్నావ్?

రంగ: ఇంత కేకలికి పైకప్పింకా నిలిసుందా అని!

శోభ: రంగని పాటలే యింతకూ కారణం. నాలో యింత మార్పు తెచ్చినవా పాటలే. ఏది రంగా! పాడు.

రంగ: మధ్య 'అపు! అపమన్నది నిన్ను కాదూ? చెవుల్లో చెట్లు మొలిచినయ్రటా' అని ఒక కవిగారు విరుచుకుపడతారేమో?

శోభ: ఫర్వా లేదులే, పాడు.

రంగ: పాడమని ఎదవ పాటంటే మాత్రం నే నొప్పుకోను.

కవి: ఛీ! లేదులే, పాడు.

రంగడు పాడుతున్నాడు.

పలుకవోయ్ పేదోళ్ళ బ్రతుకు తెలిసేటట్లు
వ్రాయవోయ్ కలవాళ్ళు వణికిపోయేటట్లు
గుడిసెలలో వెన్నెలలు కురిపించవోయ్
వడిసెలలా నీ కవిత వర్షించవోయ్
ఓ కవీ! ఓ కవీ!

[రంగడు పాడుతూ వెళ్తున్నాడు. కవి, శోభ, కొండయ్య అతన్ని వెంబడిస్తున్నారు. దాసు దీవిస్తున్నాడు చిరునవ్వుతో.]

తె ర ప డు తుం ది.



# వాస్తవం

పూర్తిగా రాజకీయపరమైన ఇతివృత్తంతో సాగిన 'వాస్తవం' రచనాకాలం 1946. ఆత్రేయకు కాంగ్రెసు సంస్థతోగల పరిచయం ఈ రచనకు స్ఫూర్తి. ప్రచురణకర్తల పొరపాటువలన ఇది పూర్వ ముద్రణలలో నాటికల సంపుటిలో చేర్చబడింది.

# పాత్రలు

| | | |
|---|---|---|
| రామయ్య | : | —— —— |
| సుబ్బన్న | : | రామయ్యకు రసికుడైన కుడిభుజం. |
| కోటిగాడు | : | రామయ్యకు బాడీగార్డు. |
| ఆనందరావు | : | ఈనాటి మంత్రి. |
| సత్యం | : | —— —— |
| చెవిటివాడు | : | రామయ్య ఇంట్లో చాకిరిగాడు. |
| వెంకటాద్రి | : | —— —— |
| మోహన్ | : | రామయ్య చిన్నకొడుకు. |
| రాముడు | : | —— —— |
| చిన్నయ్య | : | —— —— |

ఇంకా మరికొందరు ప్రవేశిస్తారు.

కాలం : ఈనాడు.

స్థలాలు: రెండు. 1. రామయ్య ఇల్లు. 2. కార్మికుల గూడెం.
1, 3. దృశ్యాలు రామయ్య ఇంట్లో. 2. 4. గూడెంలో.

# మొదటి రంగం

రామయ్య ఇల్లు: ఒక హాలు. బాగా అలంకరింపబడి వుంది. హాలులో బల్లలు తుడుస్తూ ఒకడున్నాడు. వాడిపేరేమిటో ఎవ్వరికీ తెలియదు. చెవిటి వాడు గనుక 'చెవిటిగా'డంటా రందరు.

చెవిటివాడు: (బల్లలు తుడుస్తూ)

అన్నమైతేనేమిరా - మరి
సున్నమైతేనేమిరా - యీ
పాడు పొట్టకు ఆకలైగె అన్నమే వేతామురా,
కాంగ్రసైతే నేమిరా - మరి
కమ్యూనిష్టయితే నేమిరా
బువ్వపెట్టి గుడ్డయిస్తే
ఎవ్వడైనా ఒకటెరా,
ఎర్రపెట్టె అని యేమిరా - మరి
పసుపు పెట్టె అని యేమిరా
మాటతప్పని మంతిరైతే
ఓటు ఆయన కివ్వరా!

పాడుతున్నాడు

సుబ్బన్న వచ్చాడు. కళ్లద్దాలు, చేతికర్ర, పైపంచ అతని ఆత్మబంధువులు.

సుబ్బ: ఏమిట్రా! మహా యిదిగా పాడేస్తున్నావు సంగీతం?

చెవి: అయ్యగారాండి - వుండారు దొరా (వెళ్లాడు)

కోటిగాడు వచ్చాడు. కోరమీసాలు, కోరచూపులు, అతని ఆభరణాలు..

సుబ్బ: కోటిగా. కోటిగా. మేడమీద జండా కట్టారా?

కోటి: కట్టాం.

సుబ్బ: అయ్యగా రేంచేస్తున్నారు?

కోటి: ఏమోనండి.

సుబ్బ: హారాలవీ కారులో పెట్టారా?

కోటి. ఊఁ - పెట్టాం.

సుబ్బ: ఆ సత్యాన్ని యీరోజు కాస్త గమనిస్తున్నావా?
కోటి: ఆయన్ని, అయ్యగారితో శెప్పాను లేండి.
సుబ్బ: ఏమిట్రా అడుగుతుంటే అంత ఇదిగా జవాబిస్తావ్?
కోటి: ఏంలేదు.
సుబ్బ: సరేగాని - కోటిగా!
కోటి: అదే - ఆ మాటే అనొద్దన్నాను.
సుబ్బ: ఏ మాటరా?
కోటి: కాకుంటే కోటిగా యేంటి? కోటయ్యా అనలేరు? ఏమంత తీసేసున్నాము గనుక?
సుబ్బ: ఓ - ఒరే యీమధ్య యిదంతా చూస్తే కమ్యూనిష్టయినట్టున్నావే?
కోటి: కాంగ్రెస్‌లో అట్టా అనమని వుందాయేం?
చెవిటి: (వచ్చాడు) కోటిగా!
కోటి: గూబ పగలదన్నాను. చూడు. (విసురుగా వెళ్లాడు)
చెవిటి: అయ్యగారొస్తుందా రండి.

వెంకటాద్రి వచ్చాడు. జన్మవల్ల వాపడు. కానీ చూట్టాని కలావుండడు. వయస్సు 30 ఆప్రాంతమే గానీ ఏ అరవైయేళ్ల మనిషిలా వుంటాడు. సంస్కార మెరుగని జుట్టు, గడ్డం. చాకలి యిల్లు యెరుగని బట్టలు, గుండీలు లేని చొక్కాలోనుంచి ఎండిపోయిన గుండెలు కనిపిస్తూ వుంటాయి. ముఖం అతి తీక్షణంగా వుంటుంది, మడతలు పడి. ఇతన్ని కొందరు పరోక్షంలో "శల్యుడు" అంటారు. ఆ పేరు యెందుకొచ్చిందో గానీ, అతని సమక్షంలో ఆ మాటంటే ఫలితం యెలా వుంటుందో అనుభవంమీద తెలియాలి. యెప్పుడూ ఒక లావాటి పుస్తకం మోస్తూవుంటాడు. ఆ పుస్తకాన్ని మోయగలడా అని పిస్తుంది చూస్తే. యింతకన్నా వివరాలు యిప్పటికి తెలియవు....

వెంకయ్య వచ్చి సుబ్బన్న ప్రక్కనున్న కుర్చీలాగి కొంత దూరంలో వేసుకొని కూర్చున్నాడు పలకకుండా .......

సుబ్బ: (కాస్సేపట్టే ఆ వ్యక్తివంక చూశాడు) అయ్యగారి కోసం వచ్చారా?
వెంక: కాదు. నా కోసమే! (తెగ్గొట్టినట్లుంది జవాబు)

సుబ్బన్న ఒక్కక్షణం ఏం మాట్లాడాలో తెలియక వూరొక్కన్నాడు. క్షణకాలం నిశ్శబ్దం. ఆ నిశ్శబ్దతను చీల్చుకొని బూట్లచప్పుడు వినిపించింది. సుబ్బన్న పై పంచ, కళ్ళద్దాలు కాస్త సర్దుకొని ఆదుర్దాగా అటువైపు చూస్తున్నాడు. వెంకటాద్రి ఇవేవీ పట్టించుకోలేదు . . .

రామయ్య వచ్చాడు. గడియారం 5 కొట్టింది. రామయ్య అంత ముదురుమనిషి కాడు. 40 ప్రాంతం వుంటుంది. అంతా తెల్లటి దుస్తులు....ఖద్దరు, కారణం ఏమోగానీ ఆ దుస్తులతో నడుస్తూన్నప్పుడు కొంచెం తడబడుతూంటాడు ఏదో కొత్తగా ఉన్నట్లు . . .

సుబ్బ: నమస్కారం.

రామయ్య అందుకొన్నాడు; వెంకయ్య ఊర్కే తలెత్తి చూచాడు. మరలా వంచేశాడు....

రామ: సరీగ్గా 6 గంటలకు వస్తారంటావా? సుబ్బన్నా!

సుబ్బ: వస్తారనే - వచ్చినా రాకున్నా మనం అక్కడ హాజరు కావాలనుకుంటా.

రామ: అవును మరి! మన ఆనందయ్య అయినా మంత్రి అయిన తర్వాత మర్యాద వేరే అంటావు?

సుబ్బ: అందుకే "తానబలిమికాని తనబలిమి కాదయా" అన్నాడు వేమన.

రామ: బలే! బలేగా అన్నావు (పెద్దగా నవ్వాడు. ఎందుకు నవ్వినాడో వెంకటాద్రికి గానీ, చెవిటయ్యకిగానీ చివరికి సుబ్బన్నకు, రామయ్యకైనాగానీ అర్థంకాలేదు, తెలియదు. వెంకటాద్రి, చెవిటయ్య ఊర్కే చూచారు. సుబ్బన్న చేతులు నలిపి వెకిలిగా నవ్వినాడు) సుబ్బన్నా!

సుబ్బ: అయ్యా!

రామ: చూడు - అదెందుచేతనో ఆ వేమన పద్యాలు చదువుతూంటే నాకు నిజంగా అంతకంటే మించిన కవిత్వం ఇంకేముందా యీ ప్రపంచంలో అనిపిస్తుంది. చూచావూ? అబ్బ! మానవ ప్రకృతిలో ఎన్ని ఎగుడుదిగుళ్ళు వున్నాయో - ఎంత చక్కగా చిత్రించాడోయ్! కేవలం అచ్చు గుద్దినట్లే కదూ? ఏమన్నా తేడా వుందంటావా?

సుబ్బ: అబ్బే! ఎవడంటాడండీ? అంత ఇదిగా రాసిన కవి మరి మన తెనుగు సాహిత్యంలోనే లేడంటారు తెలిసినవాళ్ళు.

రామ: (వెంకటాద్రిని ఇప్పటికి రెండు సార్లు చూచాడు కానీ పలకరించలేదు. ఏమనుకున్నాడో) ఆఁ - అయితే వెంకటాద్రీ! ఏ మలా మూల కూచున్నావు? ఈ రోజు మరీ హుషారుగా వుండవలసినవాడివి?

వెంక: ఎందుకూ హుషారు?

సుబ్బ: ఈ రోజు మీకంతా ఇదిగదాండి?

వెంక: ఆఁ - ఇదే! - (ముఖం త్రిప్పేసినాడు)

రామ: ఫలహారం చేశావా?

వెంక: ఫోంచేయలేదు.

రామ: అరరె! అంత తీరికలేని పనిమీద ఉన్నావా యేం?

సుబ్బ: భోజనం మానుకొని ఐనా చేయాల్సిన ఇది ఏమిటంటా?

వెంక: ఇదీ లేదు అదీ లేదు!

రామ: ఈ మధ్య మీ తండ్రిగారు చనిపోయారని విన్నాను —

వెంక: నేను జైల్లో వుండగానే పోయారు.

సుబ్బ: అవునండి. దాంతో మరీ ఇదైపోయినారు పాపం!

రామ: పాపం! సుబ్బన్నా! నువ్వెరగవుకానీ వెంకటాద్రి లాంటి వర్కర్ లేడంటే నమ్మ. అరరె! పాపం! సత్యాగ్రహంలో సర్వం ధారబోశాడు. త్యాగం చేశాడు. ఒకనాడు - నాకు బాగా జ్ఞాపకం. మన ఇంటిముందు కూర్చున్నాడు- పీఠం వేసుకొని. ఇంటిమీది జండా కట్టమని, సీమగుడ్డలు కాల్చేయాలని, సత్యాగ్రహం. ఆ రోజుల్లో కొన్ని దినాల పర్యంతం నిరశనదీక్ష పట్టేవాడు ఘట్టి శరీరం గనక. కదు వెంకటాద్రీ!

వెంక: ఈ రోజుల్లో కూడా! ఆకలి అలవాటయిందిలేండి!

రామ: ఇంతకూ వెంకటాద్రీ! చూచావా మన ఇంటిమీద జెండా ఎలా ఎగురుతుందో!

వెంక: జెండా చూడలేదుగానీ మన ఇంటి కాంపౌండులోనే వున్న కాపలావాని గుడిసె మాత్రం చూచాను. కాస్సేపు ఆ చిరుగుల నీడలో పడుకున్నాను కూడా!

రామ: (కొద్దిగా నవ్వి) కవిత్వం మాట్టాడుతావోయ్ ఎప్పుడూ వెంకటాద్రీ! అదొక ధోరణి. ఏమంటావ్?

సుబ్బ: ఆ, ఇది కొందరికే జన్మతో వస్తుందండీ; వేమన వున్నాడే వేమన —

రామ: మరచా - రాస్త ఫలహారం తీసుకుంటావా మా ఇంట్లో?

వెంక: అక్కర్లేదు.

రామ: ఆనందయ్యతోపాటు ఇక్కడే భోంచేద్దువులే!

వెంక: ఆయనతోపాటు కాకుంటే ఆయన కయిన తర్వాత తింటే పోయే దేముంది గనక?

రామ: స్టేషన్‌కు రావూ?

వెంక: నడవలేను.

రామ: కార్లో రా —

వెంక: ఎందుకులేండి - ఆయన వచ్చేవరకు నే నిక్కడే వుంటాను.

రామ: దానికేం అలాగే వుండు. అది సరేగానీ - వెంకటాద్రీ! ఆ శంకరం కమ్యూనిస్టులతో కలసిపోతున్నాడని విన్నాను. ఏ మాత్రం నిజం?

వెంక: కాంగ్రెస్ అతన్ని కొన్నదా ఏం?

రామ: నిజమేకదూ? కమ్యూనిస్టులైతే జీతాలు - బత్తాలు యిచ్చి కొనగలరు. కాంగ్రెస్‌లో అంతా స్వంత ఆముదమేగా?

వెంక: తమరు కాంగ్రెసు అభిమాను లెప్పుడయ్యారండీ?

రామ: సుబ్బన్నా! విన్నావటోయ్ వెంకటాద్రి ప్రశ్న?

సుబ్బ: విన్నానండి.

రామ: నే నొకప్పుడు కాంగ్రెసు కానట్లు, ఇప్పుడేదో అయినట్లు భావిస్తున్నాడు. పాపం? వెంకటాద్రికి యీ వుక్రోషం యీ యింటిమీద ఎప్పుడూ వున్నదేలే! వెంకటాద్రీ! నేను కాంగ్రెసు నౌనో కానో నా అంతరాత్మకే తెలుసు. కాకుంటే ఏదో వ్యాపారం సాపారం చేసుకునేవాణ్ణి కనుక మీలాగు తెగించి బయట పడలేదు సరేనా? మీ ఆనందయ్యనే అడగరాదూ మొన్న ఎలెక్షన్లో ఎంతపని చేశానో ——

వెంక: నాకు తెలీదూ! ఆయన్నడగట మెందుకు? ఇదిగో - ఈ గ్రంథం చూచారూ? చిత్రగుప్తుని లెక్క. ఇందులో కాంగ్రెసు, కాంగ్రెసుకు సంబంధించిన అందరి చరిత్ర వుంది. సింహాసనా లెక్కవలసినవాళ్లు, చీకొట్టించుకోవలసిన వాళ్ళు అందరి జాబితా వుంది. ఈ జాబితా అమలుపెట్టేకాలం మాత్రం ఇంకా రాలేదు.

రామ: అదేమిటోయ్ కాంగ్రెసు ప్రభుత్వం వచ్చికూడా కాలం రాలేదంటావు!

వెంక: అవును, రాలేదు, ఇప్పట్లో రాదు.

రామ: సుబ్బన్నా! ఎందుకో యీ రోజు వెంకటాద్రి వుడుకులో వున్నాడు.

సుబ్బ: అవునండి, మాట్లాడితే మరీ ఇదవుతున్నారు.

వెంక: మీకు టైమయినట్లుందే!

రామ: అవునవును. సుబ్బన్నా! బయల్దేరుదామా!

సుబ్బ: ఆహా! ఆక్షేపణ లేకుండా.

వెంక: నే నిక్కడే ఉండటానికి అనుమతించినట్లేనా!

రామ: నిరభ్యంతరంగా వుండు. దానికేం (లేచి రెండడుగులు వేశాడు. ద్వారం దగ్గరకు వెళ్ళాడు. తటాలని ఆగాడు, పామో, పులో - కనపడ్డట్టు ఒక్క

క్షణం. చరచర ఇంట్లోకి వెళ్ళాడు. ఎందుకో ఎవ్వరికీ తెలియదు. సుబ్బన్నకు మాత్రం అర్థమైంది. మెల్లగా తల వంచుకొని కుర్చీ దగ్గర కొచ్చాడు.)

సత్యం వచ్చాడు. వెంకటాద్రి ప్రక్కన కుర్చీ వుంది కానీ కూర్చోలేదు.

వెంక: ఓ! నువ్వెదురు పడ్డావటోయ్! అదా సంగతి! మరీ ఇంత పాడు శకునం అయితే పాదం ఎలా బయటపెడతారు! రా! రా!

సత్యం: అయితే—నే నెదురొచ్చానని ఆయన వెనక్కి వెళ్ళారంటావు?

వెంక: అనటంలేదు. అనుకున్నా, అంతే!

సుబ్బ: (ఎక్కడో ఆలోచిస్తూన్నవాడు, తటాలని మేల్కొని) కూర్చోండి! ఏదో పనిగా వెళ్ళారు లోనికి....వస్తారు కూర్చోండి.

సత్యం కూర్చున్నాడు

చెవిటి: (వచ్చాడు) అయ్యగారు పిలుస్తుందారు.

త్యం, సుబ్బన్న యిద్దరూ లేచారు.

వెంక: మిమ్మల్ని కాదండి, కూర్చోండి, అంత తేలిగ్గా ప్రవేశార్హత లభిస్తుందనుకోటానికి ఎంత వెర్రివాడవు నువ్వు?

చెవి: (సుబ్బన్నతో) పిలుస్తుండారయ్యా.

సత్యం కూలబడ్డాడు. సుబ్బన్న పైపంచ, కళ్ళద్దాలు సర్దుకొని వెళ్లాడు.
చెవిటయ్య కొంచెం ఆగి

చెవి: దండాలండి!

సత్యం తిరిగి నమస్కారం చేశాడు.

చెవి: అయితే ఏమనుకున్నారండీ ఆ-ఇసయం. అటోఇటో తేల్చుకుంటే పోలా— ఎన్నాళ్ళని పడిసత్తా రిట్టా కూడులేకుండా! (ఇంకా ఏదో మాట్లాడబోతున్నాడు)

సత్యం: శ్! (సైగతో "ఊర్కో" అన్నాడు.)

చెవి: ఏందోలే దొరా - ఆళ్ళు ఆళ్ళే - ఈళ్ళు ఈళ్ళే! (అంటూ ద్వారంవద్ద కూలబడ్డాడు. అలవాటు ప్రకారం పంకా త్రాడు చేతికొచ్చింది; లాగుతున్నాడు.)

వెంక: పంకా లాగి మమ్మల్నెందుకు చంపుతావురా బాబూ! వూర్కో!

సత్యం: లాగించుకోరాదట్రా! చల్లగా వుంటుంది.

వెంక: కడుపులోమాత్రం మండుతుంది. అవునుగానీ - ఈ మధ్య వీరి కందరికి నాయకుడై నట్లున్నావే!

సత్యం: అవునురా! వచ్చేసారన్నా మంత్రిపదవి లభిస్తుందేమోనని.
వెంక: అప్పుడు సెక్రటరీ పదవైనా నా ముఖాన పారేస్తావా?
సత్యం: ఈసారి అవుతుంటే నీకిద్దామనుకున్నాను. వచ్చేసారికి ఆలోచిద్దాం.
వెంక: అరె ఆ విషయం ముందుగా చెప్పవుంటే నీకు Canvass చేసే వాడినే!
వచ్చేసారైనా చెప్పు.
సత్యం: వచ్చేసారిగూడా ఎలెక్షన్లు ఇంత ఒళ్ళుగానే జరుగుతాయంటావు?
వెంక: ప్రపంచం త్వరలోనే ఏదో గొప్పగా మారుతుందని నీకేదో వేధావళ
వున్నట్లుందే!
సత్యం: మారకుండా అలాగే వుంటే ప్రాణం లేదన్న మాట లోకంలో.
వెంక: విప్లవం రాబోతూందని గట్టిగా నమ్ముతావు.
సత్యం: తప్పక.
వెంక: అందుకే నిన్ను ''కమ్యూనిష్టు మిత్ర'' అంటారు.
సత్యం: ఎవరు - కాంగ్రెసు గోత్రీకులా?

కోటిగాడు వచ్చాడు

కోటి: అయ్యగారు చాలా తొందర పనిగా వెళ్తున్నారు. మంత్రిగారొస్తారు, తర్వాత
మాట్లాడొచ్చని చెప్పమన్నారు.
సత్యం: వెళ్ళారా?
కోటి: ఆc.
సత్యం: ఎటు వెళ్ళారు?
వెంక: ఓరి పిచ్చివాడా! అంతపనికి మాలిగ్రా మహరాజు లిళ్ళల్లో ఇన్ని దర్వాజాలు
పెట్టి వుండడం! అన్ని ద్వారాలే లేకుంటే నీబోటివాళ్ళనుండి, దానాలు ధర్మాల
కొచ్చే వాళ్ళనుండి తప్పించుకొని వూపిరితో బైటపడగలరా చెప్పు?
కోటి: ఏంటండీ?
వెంక: నీతో కాదు.-(కోటిగాడు ఈ మాటలతో వెళ్తాడనుకున్నాడు కానీ వాడింకా
వుండటంచూచి) ఆనందయ్య వచ్చేవరకు ఇక్కడే వుండటానికి అయ్యగారి
వుత్తరువు తీసుకున్నాం.

కోటిగాడు మీసంమీద చేయివేసి వెళ్లాడు

సత్యం: హుc-! ఛీ,ఛీ! డబ్బున్న మాత్రాన సరేనా;
వెంక: అట్లా అనుకొని నువ్వూ నేనూ గర్వపడాల్సిందే!

సత్యం: నన్నుచూస్తే ఎందుకురా అలా గాబరా పడిపోతాడు?

వెంక: గాబరా పడికాదు – నువ్వు కమ్యూనిస్టువని.

సత్యం: అయితే?

వెంక: కమ్యూనిస్టుల గాలి సోకేంత దూరంలో వుండవద్దన్నారు.

సత్యం: అంతమాత్రానికి ఈయన మహా కాంగ్రెసు అయిపోతాడనేనా?

వెంక: అంతేగా? కమ్యూనిస్టులను తిట్టిన వెంటనే కాంగ్రెసవుతారు.

సత్యం: నీ అభిప్రాయం కూడా అదే నంటావు:

వెంక: మహాప్రభో! నీ కొక దండం! నువ్వు నన్ను మాత్రం రాజకీయాల్లోకి లాగొద్దు. ఇంకేదైనా మాట్లాడు. నాగయ్య సంగీతాన్ని గురించి, రామయ్యర్ కాఫీని గూర్చి, కోమటమ్మ ఇడ్లీలను గురించి. ఏదన్నా మాట్లాడు. సరేనా?

సత్యం: అదేమిట్రా నువ్వు రాచకీయాలకంత పెద్ద నమస్కారం కొడుతున్నావు?

వెంక: నువ్వూ నమస్కారం అనే కాలం వస్తుంది. అప్పుడు కారణం నీకే తెలుస్తుందిలే, తొందరెందుకూ?

సత్యం: డెఫీటిసమ్‌లో పడ్డావన్నమాట!

వెంక: బాబూ! మీ ఇజాలతో చచ్చిపోతున్నాం!

సత్యం: మీరంతా పిరికిపందల్రా!

వెంక: అవును పిరికిపందలమే! అంతే! వూర్కో! నువ్వూర్కో! అరె! వూర్కో మంచే! ఆపే!

సత్యం: అంత వుద్రేకం ఎందుకొస్తుందిరా?

వెంక: ఎందుకొస్తుందా? చల్లగా తిని కూర్చోలేక! (అమాంతం లేచాడు) ఈ ఎండిపోయిన గుండె నడుగు చెప్తుంది ఎందుకొస్తుందో అంత ఉద్రేకం! (చొక్కా చీల్చి గుండెమీద ఒక్కవేలితో టపటప కొట్టుకున్నాడు. ప్రేక్షకులకు వినపడ్డదో లేదోకానీ, దగ్గరవున్న ఎవ్వరికైనా ఒక విధమైన సహింపరాని ఓటి శబ్దం వినిపించింది) నలుగుర్ని వెంటేసుకొని నాయకు డనిపించుకోటంకాదు. రాజకీయ తంత్రాలతో వాళ్ళను వీళ్ళను రెచ్చగొట్టి ప్రజాసేవ అనిపించటం కాదు! ముందుగా అన్ని ఏర్పాట్లు చేసుకొని పూలమాలలు వేసుకొని 'ఎ' క్లాసులో పోయి కూర్చోటం కాదు. జైళ్ళకు పోయివచ్చామనే క్వాలిఫికేషన్‌తో పదవులకు ప్రాకులాట్టం కాదు! 'ఎ' క్లాసులో హాయిగా కూర్చుంటే 'సి' క్లాసులో మురిగి చచ్చింది మేము! కలిగినవాళ్ళు జైళ్ళకు పోయినా కాపు

రాలు జరిగినవి! మాకు? మింగ మెతుకులు లేక మాడి చచ్చాం! పున్న కుండ బొచ్చెలతో సహా ఆంగ్ల సామ్రాజ్యాధిపతుల ఆగ్రహానికి ఆహుతి చేశాం! సత్యాగ్రహాలు చేశాం! లాఠీదెబ్బలు తిన్నాం! బూడ్సుకాళ్ళ తన్నులు రుచి చూచాం! క్షయవ్యాధికి బలి అయ్యాం! (కొంచెం ఆగాడు, ఊపిరి పీల్చు కున్నాడు. ఉద్రేకం కొంత అణిగింది) ఎందుకోయ్ నన్ను రెచ్చగొడతావ్! (కూర్చున్నాడు) రాజకీయాలట రాజకీయాలు! మాకు కాదు. మంత్రులు కావా లనుకున్నవారికి (తనలో తాను గొణుక్కున్నాడు).

సత్యం: వెంకటాద్రీ! ఇదంతా కేవలం ఓర్వలేనితనంవల్ల వుడుకుమోతుతనంతో అనటం తప్ప వేరేమీ కాదు.

వెంక: ఏమన్నావ్! (ఠపీమని సత్యం చెంప మ్రోగింది. మాట ముందో దెబ్బ ముందో చెప్పలేం).

సత్యం అలాగే నిల్చున్నాడు శిలాప్రతిమలాగు. కళ్ళవెంట నీళ్లు జారినవి. కాని దెబ్బకు కాదు. వెంకయ్య ఒక్కక్షణం తల వంచాడు; కూలబడ్డాడు. మొక్క సారి సత్యం వంక తలెత్తి చూశాడు.

సత్యం: క్షమించు వెంకటాద్రీ!

వెంక: (వెంటనే లేచి సత్యం చేతు లందుకున్నాడు) కాదు నన్నే క్షమించు, తొందరపడ్డాను. (గద్గదం మాత్రం వుంది, కళ్ళ నీళ్ళు రాలేదు) ఈ కళ్ళల్లో తడి కూడా లేదు నా పశ్చాత్తాపాన్ని ప్రదర్శించటానికి. క్షమిస్తావా? నేను........

సత్యం: నువ్వుకాదు నన్ను కొట్టింది. దేశస్వాతంత్ర్య సమరంలో ప్రాణా లర్పించిన కోటానుకోట్ల త్యాగమూర్తుల అంతరాత్మలు నన్ను కొట్టినవి. కాంగ్రెస్ మహాసంస్థయొక్క మహత్తర ఆదర్శం. నన్ను నిద్ర నుండి లేపటానికి లెంప పెట్టించింది; నువ్వు కాదు. కాని - వెంకటాద్రీ!

వెంక: నన్ను వెళ్ళనీ - (ముఖం తిప్పేసినాడు)

సత్యం: ఎందుకూ? నేను నీతో చాలా మాట్లాడాలి, కూర్చో.

వెంక: నేను మాట్లాడలేను.

సత్యం: పోట్లాడగలవటోయ్: ఛీ! నువ్వేమీ తప్పు చేయలేదు. కూర్చో.

వెంక. అదికాదు....... నువ్వు........

సత్యం: నేను? ఏం? అడుగూ?

వెంక: కమ్యూనిష్టువు కావూ?

సత్యం: ఎందుకు?

వెంక: అదికాదు. ఏదో అహింసాజ్యోతి నా పీక నొక్కేస్తూంది. నీ ముఖం చూడలే కున్నాను. ఆ ఒక్కక్షణం - ఆ దెబ్బకొట్టిన తర్వాత, నిన్ను చూచాను.... గాంధీమహాత్ముడు నీలో అగుపడ్డాడు.

సత్యం: కవిత్వం మాట్లాడురావే నువ్వు? పౌరాణిక నాటకాల పద్ధతులు తెస్తున్నా వేం?

వెంక: కాదోయ్! ఇది హృదయానికి సంబంధించినది. నన్ను నువ్వు సరిగా అర్థం చేసుకోలేదు. ఇంత సహనం ఎలా వచ్చిందోయ్ నీకు!

సత్యం: కమ్యూనిస్టులకు సహనం వుండకూడదేం! ఇంతకూ నేను కమ్యూనిష్టని ఎవరు చెప్పారు?

వెంక: వూళ్లో అంటున్నారు.

సత్యం: సరే అననీ! మెల్లగా అదీ అర్థమవుతుంది నీకు.

మోహన్ వచ్చాడు చిన్న కారులో బొంయ్ అనుకుంటూ. షికారుకు బయలు దేరాడేమో, వెంకటాద్రిని చూచి ఆగాడు.

మోహ: నాన్నగా రింట్లో లేరు.

సత్యం: ఈలారా బాబూ!

మోహన్ కారు దిగి వచ్చాడు.

సత్యం: నీ పేరేంటి?

మోహ: మోహన్.

సత్యం: ఎక్కడ కొన్నా వీ కారు?

మోహ: మద్రాసులో.

సత్యం: ఎంత?

మోహ: ఇన్ని రూపాయలు (చేతులు చూపాడు).

సత్యం: ఏం చదువుతున్నావు?

మోహ: నాలుగో క్లాసు, నాకు పద్యాలు కూడా వచ్చు.

సత్యం: ఆఁ హాఁ ఏదీ ఒకటి చెప్పు చూద్దాం.

మోహన్ కాస్త ఆలోచించి

అధరము కదలియు, కదలక
మధురములగు మాట లుడిగి మౌనవ్రతుడై
అధికార రోగపూరిత
బధిరాంధక శవము జూడ పాపము సుమతీ॥

సాధారణమైన బడిపిల్లల వప్పగింత రాగంలో చదివినాడు. వాకిట్లో కారు హారన్ శబ్దం, కొన్ని కాళ్ల నడిచిన చప్పుడు.

మోహ. నాన్నొచ్చాడు. (అంటూ పరుగెత్తుకెళ్ళాడు )

వెంక: మనమూ వెళ్దాం. మొట్టమొదటే ఎదురుపడటం దేనికి.

సత్యం: ఏం? మంత్రిగారు కూడా గాభరా పడతారంటావా?

వెంక: కాదు. సుమతీశతక పద్యం విన్నాంగదా; పాపమేమోనని! (వెళ్ళారు).

ఆనందయ్య, రామయ్య, సుబ్బన్న మోహన్‌ని ఎత్తుకొని వచ్చారు. ఆనందయ్య పేరుకు తగ్గట్టు వున్నాడు.

ఆనం: (మోహన్ బుగ్గ తాకి) ఆహా! పద్యాలు కూడా వచ్చున్న మాట! (కూర్చు న్నాడు) ఏదీ! ఒకటి చెప్పు చూద్దాం. (అందరూ నిలబడి వున్నారు. కారు డ్రైవరు కాబోలు పూలమాలలు ఒక మోపు తెచ్చి, టేబుల్‌మీద పెట్టి వెళ్ళాడు.)

మోహన్ సుబ్బన్న వాహనం చాలించి దిగి ఆనందయ్య దగ్గర నిలబడి

దగ్గఱ కొండెము జెప్పెడి
ప్రెగ్గడ పలుకులకురాజు ప్రియుడై మఱి తా
నెగ్గు ప్రజ కాచరించుట
బొగ్గులకై కల్పతరువు బొందుట సుమతీ॥

ఈ పద్యం చెప్తాంటే ఎవరి ముఖాలూ అంత బాగాలేవు. ఆనందయ్య లేని నవ్వును తెచ్చుకొని "భేష్" అన్నాడు.

సుబ్బ: "మంత్రిగలవాని రాజ్యము" పద్యం చెప్పు బాబు!

మోహ: అది నాకు రాలేదు.

రామ: పోనీలే! వెళ్ళి ఆడుకో బాబూ! ఒరే తీసుకెళ్ళు!

ఈ పాటికి కోటిగాడు, చెవిటయ్య రెండువైపులా ఆజ్ఞలకోసం ఎదురుచూస్తూ నిలబడి వున్నారు. కోటిగాడు చిన్నబాబును కారులో కూర్చోబెడదామని దగ్గర కెళాడు. చిన్నబాబు కెవ్వుమన్నాడు.

మోహ: అమ్మ! నేను రాను! నాకు భయం! కోటిగాడొద్దు!

అందరూ నవ్వారు.

రామ: నీ మీసాలు చూస్తే జడుసుకోడూ మరి!

ఇంతలో చెవిటయ్యకు అర్థమైంది. చినబాబును తీసుకెళ్ళాడు.

రామ: కాళ్ళు చేతులు కడుక్కోండి. కాస్త కాఫీ తీసుకొని విశ్రాంతి తీసుకుందురు.

ఆనందయ్య టైం చూచుకొని ఒక్కసారి ఫస్టుక్లాసులో ప్రయాణం చేసిన బడలికంతా విదుల్చుకొని లేచాడు ..... .. . ....

రామ: కోటిగా! బాత్‌రూమ్‌కు - (తానూ ఆనందయ్యతోపాటు ద్వారం వరకు వెళ్ళి తిరిగి వచ్చాడు.)

సుబ్బ: ఇక్కడ ప్రోగ్రాం ఎంతవరకండీ?

రామ: వుంటాడు లేవోయ్ రెండు రోజులపాటు.

సుబ్బ: మరి - ఆ విషయం ___

రామ: ఏ విషయం?

సుబ్బ: అదే! ఆ వుద్యోగం.

రామ: చెప్తాలే! తొందరపడకు!

సుబ్బ: ఆనందయ్యకు తమ మాటంటే ఇదేనండీ!

రామ: ఇదిగాక మరేమవుతుందోయ్? ఎలక్షన్ రోజుల్లో పెట్రోలుకు, కార్లకు మనం లేకుంటే ఏమయ్యేవాళ్ళు? అసలంతకు పూర్వం మాత్రం వీళ్ళంతా మన ల్నాశ్రయించుకొని జరుపుకున్న వాళ్ళేకదూ? మొన్న ఎలక్షన్లలో మాత్రం వీళ్ళు ప్రజాబలంమీదే గెలిచారంటావా? తనంతట తానువచ్చి ఓటువేసిన వెధవ ఒక్కడులేడు. ఏదో మన పలుకుబడి, మన అధికారం వుపయోగించుకొని వుట్టెక్కారు. ఇప్పుడు కాదని పోతారా?

సుబ్బ: అంతే కదండీ - మరి మన బ్లాక్‌మార్కెట్ - మన బ్లాక్‌మార్కెట్ కేసు విషయంకూడా ___

రామ: సరేలే! అరుస్తావేం? బుద్ధిలేదూ?

సుబ్బ: చిత్తం!

రామ: సుబ్బన్నా!

సుబ్బ: అయ్యా!

రామ: ఈ హాలీల, రైతుల గొడవుండే దీన్నికూడా ఇప్పుడే —

సుబ్బ: అవునండి, ఏదో తేల్చేయాలండి.

రామ: తేల్చేదేముంది వాళ్ళతాడు.

సుబ్బ: అంతేనండి, ఊర్కో తుపాకులు పెట్టి పేల్చేయాలండి.

రామ: చివరికంతేలే! చూస్తారుగా వెధవలు! నీలుగుతున్నారు మహా!

సుబ్బ: నీలిగితే నీలిగినట్టే అవుతారు. మనతోనా ఆటలు!

రామ: సుబ్బన్నా!

సుబ్బ: అయ్యా!

రామ: మనం అనుకున్నామే —

సుబ్బ: అవునండి!

రామ: అ సత్యం విషయం - ఏమంటావ్?

సుబ్బన్నకు ఆ విషయం తెలియదు. అందుచేత ఏమనాలో తెలియక అవస్థ పడుతున్నాడు....

రామ: ఏమంటావురా!

సుబ్బ: ఏ విషయమండీ!

రామ: (తిరిగిచూచి) అరె! నువ్వా! కోటిగా డెక్కడ?

సుబ్బ: ఆనందయ్యతోబాటు వెళ్ళాడండి.

రామ: నే నిప్పు డేమన్నాను?

సుబ్బ: ఆ సత్యం విషయం —

రామ: ఏమీలేదు సుబ్బన్నా ఏమీ లేదులే!

సుబ్బ: సరేనండి!

ఇంతలో కోటిగాడు కాఫీ ఫలహారం తెచ్చిపెట్టాడు. అనందయ్య ఖద్దరు టవల్‌తో చేతులు తుడుచుకుంటూ వచ్చి

ఆనం: ఇంట్లో అంతా ఖద్దరే వాడుతున్నారే!

రామ: ఆఁ ఏదో వుడుతాభక్తి! ఆడవాళ్ళు మాత్రం ఖద్దరు కట్టాలంటే కష్ట పడతారు. అసలు —

ఆనం: బయట అప్పుడే గుంపుచేరినట్లున్నారు?

బయట జనసందడి

రామ: సుబ్బన్నా! అటు చూడు!

ఆనం: (ఫలహారం తీసుకొంటున్నాడు, రామయ్య కూడా కూర్చున్నాడు) ఊఁ ఏమిటి విశేషాలు వూళ్ళో!

రామ: ఆఁ ఏముంది విశేషాలకు! అంతా బాగానే వుంది! ... మొత్తంమీద నాకు తోచేదేమిటంటే మానవ ప్రకృతే మారిపోయిందండి! అబ్బ! ఎంత మోసం. ఎంత కుళ్ళు! అసలు మోసం చేయకుండా వుండాలనుకున్నా కాలం అలా బతకనివ్వదే! గాంధీగారు ...... (సుబ్బన్న వచ్చాడు) ఏమిటి సుబ్బన్నా!

సుబ్బ: ఆఁ, ఎవరో అలబరి జనం!

రామ: ఏమిటి?

సుబ్బ: ఆఁ, వాళ్ళబొంద!

ఆనం: ఏదో అడిగి రారాదూ?

సుబ్బ: చిత్తం! తిండి చాలటంలేదట. మనవిచేసుకోటానికి....

ఆనం: (అప్పుడే నోట్లోకూరిన స్వీటును సర్దుతూ) అయితే ఏం చేయమంటారని!

రామ: ఆఁ. చేసేదేముంది? మీరేం బియ్యంమూటలు వేసుకొచ్చారు గనుకనా వెంట! ఈ కాలంలో ఎవరికి మాత్రం చాలుతూందని! అందరూ అర్ధకడుపే తింటు న్నారు! మాబోటివాళ్ళకు మరి....

బయట మళ్ళా ఏదో గోల

రామ: ఏమిటా గోల? వెధవలు! వూర్కోమను. వెళ్ళు — చెప్పవయ్యా! నీతి పాతిలేని వెధవలు! సమయం సందర్భం లేదూ? ఇప్పుడే రైలు దిగి వచ్చేరో లేదో ఇంతలో వీళ్ళపోరా! శాస్త విశ్రాంతి అయినా తీసుకో నివ్వరే! మీరేమన్నా అనండి! అసలు ఈ డెమొక్రసీలో వచ్చే పేచీనే మదండి! మన మంత్రి, మనవాడు, మనం పంపామని ప్రతి వెధవా ఆఁ వూఁ అంటే మంత్రి దగ్గరకు పరుగెత్తడమే! అదే ఆ ఇంగ్లీషువాడుండగా ఒక్కడికైనా దమ్ములుండినవా దగ్గరకు రావటానికి?

సుబ్బన్న అసహ్యంతో కళ్ళుమూసుకొని వచ్చాడు

సుబ్బ: ఛీ! ఛీ! పాడుమూక!

రామ: ఏమిటి సుబ్బన్నా!

సుబ్బ: ఆడవాళ్ళంతా ఆల్మోస్టు దిగంబరంగా నిలబడి వున్నారు. వెధవమూక! సిగ్గు లేదు — బిడియంలేదు!

ఆనం: అదేమిటి!

సుబ్బ: గుడ్డలు లేవట. చూపించుకోటానికి వచ్చారు.

ఆనం: అలాగా! (లేచాడు; లేచి జారిన పైపంచ పైనవేసుకున్నాడు.

రామ: మీ రెలా వెళ్తారు! కూర్చోండి!

ఆనం: మరి వాళ్ళలా వాకిట్లో గోలపెడుతూంటే!

రామ: నేను పంపించేస్తాగా వాళ్ళను. .ఇదిగో చూచారా! సత్రంవద్ద 8 గంటలకు వుపన్యాసం ఏర్పాటుచేశాం. నోటీసులుకూడా వేయించాం. ..ఎలాగుంది! మీటింగులో అన్ని సందేహాలు. కష్టాలు చెప్పుకోవచ్చుగా!

ఆనం: అవును. మంచిపనే చేశారు.

రామ: సుబ్బన్నా! ఈ నోటీసులు వాళ్ళకివ్వారా! మొగ్గిపే చాలు యీ మొరటు ప్రజను! నెత్తినెక్కి స్వారిచేస్తారు. అలాగని నేను ప్రజా వ్యతిరేకి ననుకోకండేం! దేనికిగానీ హద్దూ సమయం వుండాలి. మన ప్రభుత్వం వచ్చిందికదా అని నిల్చున్నపాటునే ఏలాకుదురుతుంది!

సుబ్బ: (మండిపడుతూ వచ్చాడు) పొగరుబోతు మందావాళ్ళు! వాళ్ళ పిసగ్గొట్ట వాళ్ల లేక! ___

రామ: ఏమిటి సుబ్బన్నా!

సుబ్బ: వాళ్ళ శ్రాద్ధం! చెప్పను చెప్పను తలకెక్కుతున్నారు! నోటీసులి స్తే "మాకు సదువేం వచ్చుబాబూ! ఇవి యిస్తే మేమేం చేసుకోను" అన్నారు. మీటింగుందని, అక్కడికి రమ్మని చెప్పాను. మాకు మీటింగులు వుప న్యాసాలు అక్కర్లేదు. తిండీ ___ గుడ్డా కావాలని గోల. వెధవమూక! ఎప్పుడూ తిండీ - గుడ్డే!

ఆనం: సుబ్బన్నా! నా మాట విను.

సుబ్బ: వింటానండి.

ఆనం: ఆడవాళ్ళ నందరినీ అటు వెళ్ళమను. వాళ్ళుండగా నేను రావడం బాగుండదని నచ్చచెప్పు. నేను ఆ మేడ మీదికొస్తాను. మిగిలిన మగజనంతో మాట్లాడు తాను.

రామ: అది మంచిపని!

సుబ్బ: చిత్తం (వెళ్లాడు)

ఆనం: ఏదో నాలుగుముక్కలు చెప్పి పంపేయాలి. విజ్ఞానంలేని మూకను విదిలించి ప్రయోజనంలేదు.

సుబ్బ: (వచ్చాడు) వెళ్లారండీ ఆడవాళ్లు!
ఆనం: ఇళ్ళకు వెళ్లారా!
సుబ్బ: ప్రక్కకు తొలిగివున్నారు.
ఆనం: సరే - రాండి పోదాం!

ఇద్దరూ మేడమీదికి వెళ్తున్నారు

రామ: ఆ సత్యం కమ్యూనిష్టుయి ఇదంతా చేయిస్తున్నాడు.
ఆనం: (ఒక్క క్షణం ఆగి, తల పంకించి) అలాగా! — (వెళ్లారు)

సుబ్బన్న వాకిట్లోకి వెళ్తున్నాడు

వెంక:
సత్యం: (ఎదురుగా వచ్చారు) ఎప్పుడూ తిండీ - గుడ్డ! వెధవ మూక!

సుబ్బన్న సర్రని వెళ్లాడు

వెంక: నాటకం జరుగుతూంది.
సత్యం: చూస్తున్నాగా!
వెంక: ఈ నాటకం చూస్తేగాని నీకు మనుష్యుల తత్వం తెలిసిరాదు.
సత్యం: ఈలాంటి నాటకా లెన్నో చూచానులే!
వెంక: వాటికీ దీనికీ ఏ తేడా అగుపించటంలేదూ!
సత్యం: ఊఁ హుఁ!
వెంక: చివరిదాకా చూడు. తెలుస్తుంది. (బయటనుండి)
మహాప్పెబో! ఆకలి! మాడిసత్తుండాం! పిల్లా జల్లా మలమల మాడుతుండాం!
(లోపల)
వెంక: అదిగో మొదలుపెట్టింది! (బయట)
దయసూడండి బాబయ్యా! మీరూ పిల్లలుగలోళ్లు!
సూడండి బాబయ్యా యీ అనాదల్ని! (లోపల)
సత్యం: మంత్రిగారి మాటలు మనకు వినిపించవు!
వెంక: అవును. ఆయనిప్పుడు పైకెక్కినారుగా!
సత్యం: ఇంకా కొద్దికాలానికైనా దిగిరావాలిగా! (బయట)

1. మాకు కావాల్సింది తిండీ గుడ్డ!
2. దొంగ మార్కెటు అంతరించాలి!
3. ఎలెక్షనులో ఎన్నిమాటలు చెప్పారు! మరిచిపోయారా! (లోపల)

సత్యం: అసలు వీళ్ళెందుకు మాట్లాడాలి?
వెంక: ఎవరు? కమ్యూనిష్టులా?
సత్యం: కాదు. కడుపు మాడినవారికోసం కష్టపడేవారు.

ఎయట

మానం కాచుకోటానికి గుడ్డపాత లేదు దొరా! అర్ధకడుపంబలి దొరకటం లేదు దొరా! డబ్బున్నా గింజల క్కరువైంది పెబో! మా మురికిగుంట లొక సారి చూసిపోండి. తెలత్తది! (రెండు నిమిషాలు మాటలే వినబడవు.)

వెంక: మంత్రిగారు మాట్లాడుతున్నారు కాబోలు! (అకస్మాత్తుగా బయట) ఇయన్నీ మా కక్కర్లేదు. కబుర్లతో కడుపు నిండదు. రాండశే రాండి! సూడండి! మా పెల్లాంబిడ్డల్ని!

అని ఒకటే గోల — లోపల.

వెంక: శ్రుతి మించింది!
సత్యం: కడుపు రగిలింది!
వెంక: ఇంకా ఆనందయ్య గుండెలు పగలకున్నాయా?
సుబ్బ: (విసురుగా వచ్చాడు) ఛీ! ఛీ! ఛీ! మరీ తెగబడి వచ్చారు. విప్పేసి వీధుల పడి వచ్చారు. పాడుజనం!

ఆనందయ్య, రామయ్య చరచర వచ్చారు, ఆనందయ్య సత్యాన్ని చూచి వుగ్రుడయ్యాడు. సత్యం నమస్తే అన్నాడు........

ఆనం: నువ్వు నువ్వే! యీ అరాచకానికి కారణం! (అని కళ్ళురిమి పెద్దగా అరిచాడు).

తెర జారుతుంది.



# రెండవ రంగం

కృషీవలుల చిరుగు గుడిసె ఉండే ప్రదేశం. ఊరి వెలుపల. దగ్గరనే స్మశానం, మురికి కాలువలు, వూరిలోని చెత్తంతా తెచ్చి పేర్చిన కుప్ప, ఒక చిన్న మురికి గుంట వున్నవి. ఒకచోట ప్రకృతి ఏర్పరచిన రచ్చలాంటి రాతి తిన్నె వుంది. దాని దగ్గర ముసలిచెట్టు అంతాపోయి ఎముకలు మాత్రం వున్న దరిద్రునిలా నిలబడివుంది. కొద్ది దూరంలో నరికిన తాటిచెట్టుమొదలు, పడిపోయిన కొబ్బరిచెట్టు వున్నవి. ఒక బొడ్డులేని బావి. బావిచుట్టూ మురికినీరు. అక్కడక్కడ బక్కచిక్కిన కుక్కలు తిరుగుతున్నవి. మాదిగ యింటక వుపయోగ పడే పశువులు రెండు పడివున్నవి ప్రాణావశిష్టంగా. ఇదీ ఆ సుందరప్రకృతి దృశ్యం! తిన్నెమీద ఒంటరిగా వెంకటాద్రి కూర్చున్నాడు, తపస్సు చేస్తున్నట్లు. సమయం రాత్రి. చీకటి, దూరంలో స్మశానంలో నక్కల కూతలు, అక్కడి నుంచే నాల్కలు చాచుకొన్న కాటిచితి మంటలు కొద్దిగా అగుపిస్తున్నవి. అప్పుడప్పుడు తంబూర మీటిన శబ్దం నక్కల అరపులను తప్పించుకొని వినిపిస్తుంది. అలా కొన్ని క్షణాలు మెల్లగా పాట వినిపిస్తుంది. వెంకటాద్రి మాత్రం చలించలేదు, పాటకు.

"చిలక" పాట పాడుతున్నా డెవడో.

వెంక: (పాట పైస్థాయి అందుకున్నప్పుడు విసుగ్గా) కడుపు మాడి చస్తూండే వెధవలకు సంగీతం ఎందుకో! (ప్రక్కవున్న ఒక చిన్న రాయితీసి ఆ కోపంలో విసిరికొట్టాడు. అది ఒక కుక్కకు తగిలింది. అరవలేక అరుస్తూ కుంటుకొంటూ పరుగెత్తింది. ఆ అరుపు విని గుడెసెలో నుంచి రాముడు వచ్చాడు. వెంకటాద్రిని సమీపించి).

రాము: ఎవరయ్యా ఆడ కూర్చున్నది?

వెంకయ్య పలకలేదు

రాము: అడగతుంటే అట్టా కూకున్నా వేమయ్యా! నిన్నేకదూ?

వెంక: సరేలే నీ దారిని నువ్వు పో!

రాము: ఏందయ్యో! చీకటిలో ముసుగెట్టుకొని కూకొని అడగతుంటే మా బిరుసుగా జవాబిస్తూండావే?

వెంక: సరేలేవోయ్! నేనేం దొంగను కాను దొరనూ కాను. ఏం భయంలేదు. వెళ్ళు!

రాము: అయితే ఓరికోసం వచ్చినట్టని:

వెంక: నా కోసమే!

రాము: పిచ్చి బాగా ఎగదట్టినట్టుంది పాపం! (వెళ్తున్నాడు)

వెంక: అవునులే! ఈలాగా, నీ పేరేమిటి?

రాము: రాముడు.

వెంక: గూడెంలో ఎవరూ లేరూ?

రాము: లేరయ్యా! అందరూ బైటికెళ్ళారు.

వెంక: ఎక్కడికి కెళ్ళారు?

రాము: మంతిరయ్యగారు మీటింగు శేస్తారంట. ఇనటానికెళ్ళారు!

వెంక: నువ్వు మాత్రం వున్నావేం?

రాము: కాపలా వుండానండి గూడానికి. ఎట్టుంటి ఎట్టొస్తదో అని!

వెంక: అంత భయమెందుకూ? మీ గుడిసెలలో ఏమున్నాయి దోచుకోటానికి!

రాము: దొంగల బియం కాదండి - దొరల బియమే. కూలి రవంత పెంచమండని అడుగుతుండామని దొరలు, కలోళ్ళు మండిపడి పోతూండారు. ఆళ్ళను కుంచే ఎంత పనన్నా శేయిస్తారు! వక్యూరులో పాకలు కాల్పించేసారు గదండీ!

వెంక: దౌర్భాగ్యులు! - ఆ పాడుతూన్న దౌర్భాగ్యుడెవడు. వాడికి కడుపు నిండినట్టుందే!

రాము: లేదండి! చావుబతుకుల్లో ఆడిపెళ్ళాం మంచంమీద పడుండాది. మందూ మాకూ లేదు. ఇంకాస్సేపట్లో సత్తాదేమో తత్వాలు ఇనిపిస్తుండాడు దానికి!

వెంక: పాపం చచ్చయినా స్వర్గానికి పోతుందని వెధవాశ కమూ వాడికి! కళ్ళ నీళ్ళు కారుస్తూ పాడుతున్నాడు!

రాము: ఇంతకూ తమరెవరు బాబూ! సోములోర్లా!

వెంక: అవును. సత్యం ఇక్కడికొస్తాడా ఇప్పుడు?

రాము: వత్తారండి! అయితే తమరు సత్యంగా ర్నెరుగుదురాండి - వత్తారండి!

వెంక: సత్యం రాత్రిళ్ళు ఇక్కడే పడుకుంటాడా?

రాము: అవునండి. ఆయనకేరే పాకుంది. అదిగో శిన్నదీపం కనిపిత్తుండదే అదేనండి. తమరెల్లి ఆడ కూకోవచ్చునండి ఆయనొచ్చేదాకా! రాండి - బాబు సూపిత్తా!

వెంక: అక్కర్లేదులే! ఆ సత్యాన్ని మీ రిక్కడెందుకు వుండనిస్తున్నారు?

రాము: ఏదో మాతోబాటు తిని, మాలోవాడుగా వుంటుండారండి. మా కోసం అట్టా అయ్యారండి, లేకుంటే హాయిగా —

వెంక: మీరు వట్టి తెలివిమాలినవాళ్ళు! మీ కందరికీ చెవుడూ గుడ్డీ!

రాము: ఏంటండీ?

వెంక: మీలో లక్ష్మి అనే పడుచుపిల్ల వుందా?

రాము: ఆఁ వుందండి - వుంటే!

వెంక: వట్టి మూర్ఖులు! లోకం ఏమనుకుంటుందో వినలేనంత చెవుడు మీకు.

రాము: ఏమిటండీ!

వెంక: సత్యం మాంసం తింటాడు.

రాము: ఓరూ శెప్పిందీ?

వెంక: సత్యానికి మీరు తలా పావలా ఇస్తారు నెలకు!

రాము: పావలాకాదు పాణాలిస్తాం.

వెంక: సత్యానికి పెళ్ళాం బిడ్డలు లేరు తెలుసా?

రాము: అవును. మా కోసమే పెళ్ళి మానుకున్నారు.

వెంక: మీ కోసం కాదు, మీ లక్ష్మికోసం! (తీక్షణంగా అన్నాడు.)

రాము: ఆఁ (కర్ర పైకెత్తాడు)

వెంకయ్య పెద్దగా నవ్వాడు.

రాము: (కర్ర దింపేసి) సాములోరన్నావుగనక బతికిపోయావు. లేకుంటే యీ పాటికి తల పగిలుండేది!

వెంక: మీ సత్యం తలే పగుల్తుందేమో! తొందరపడకు! పిచ్చివాడా! ఇలా దగ్గరకు రా! (అంటూ తనే అతన్ని సమీపించి భుజంమీద చేయివేసి) వెర్రివాడా! మీ సత్యాన్ని గురించి మీ రనుకునేంత గొప్పగా లోకం అనుకోటం లేదు. లోకం ఎన్నెన్నో అంటూంది. నే నన్నవన్నీ లోకం అనేవే, తెలిసిందా?

రాము: ఓరండీ అనేది? ఇట్టా రమ్మను శెప్తా ఎముకలు పొడిశేసి చూపిస్తా!

వెంక: తొందరపడకు! సత్యాన్ని మాటలనుండి కాదు ఇంకా గొప్ప ఆపత్తునుండి కాపాడాల్సిన సమయం వస్తుంది.

రాము: ఏంటండి! సెప్పండి బాబు! పాణాలైనా యిత్తాం!

వెంక: చెప్తా! సత్యాన్ని కూడా రానీ! - తొందర లేదులే! - ఆ కనపడే వెల్తు రేమిటి?

రాము: మనోశ్వేసామీ! వత్తుండారు సత్తెంగారు!

వెంక: రాముడూ! నే నన్నపేవీ సత్యంతో నువ్వనవద్దు! నేనే సమయం వచ్చి నప్పుడు అడుగుతాను వాణ్ణి! ఏం?

రాము: అలాగేనండి!

వెంక: లక్ష్మితో కూడా అనొద్దు. సరేనా? లక్ష్మిని నా కొకసారి చూపిస్తావా?

రాము: అట్టాగేనండి! నా కూతురేనండి లచ్చి.

వెంక: అయితే అక్కర్లేదు. లక్ష్మిమీద నా సందేహాలన్నీ పోయినవి. నువ్వాలాంటి కూతుర్ని కనవు....కన్నా చూస్తూ....

రాము: బతకనివ్వను.

చీకట్లో కొన్ని నీడలు గుడిసెలలో దూరినవి. ఏవో మాట్లాడుకొంటూ ఒక చిన్న లాంతరుతో సత్యం, ఇంకా ఒకరిద్దరు రచ్చవైపు వచ్చారు.

సత్యం: ఎవరక్కడ? రాముడూ?

రాము: అయ్యా!

సత్యం: ఆ రెండో మనిషి?

రాము: ఎవరో స్వాములోరంట! తమకోసం వచ్చారు!

సత్యం: నా కోసం స్వాములవారా? (దీపంపెట్టి చూసి) ఓ నువ్వటోయ్!

వెంక: అవునుగానీ....ఆ కట్టేమిటి తలకు? నెత్తురు కూడా! నే ననుకున్నది అప్పుడే జరిగిపోయిందా ఏం?

సత్యం: నువ్వనుకొన్న దేమిటి?

రాము: ఏదో ఆపద తమ కొస్తుందని అప్పటినుంచీ శెపుతుండా రండి!

సత్యం: నీ కెలా తెలిసింది వెంకటాద్రీ?

వెంక: రామయ్య ఇంటివేపునుండి వాసన కొట్టింది.

సత్యం: అవును. ఆ కోటిగాడు, నా మీద కత్తి విసిరాడు. కొంచెంలో తప్పింది. ఎంతకు పాల్పడ్డాడోయ్ రామయ్యా!

వెంక: విచిత్రమేముంది. మంత్రి నడ్డుపెట్టుకొని ఎన్నో ఆటలు ఆడినాడు. ఆడ బోతాడు. చివరికి ప్రాణస్నేహితుడైన సుబ్బన్నకూడా టోపీ వేశాడు.

సత్యం: అదేమిటి?

వెంక: ఏదో వుద్యోగం వాడి తమ్ముని కిప్పిస్తానని చెప్పి మంత్రిగారికి సమర్పించాల్సినకాన్క అంటూ వెయ్యిదాగా కాజేసాడు.

సత్యం: మంత్రిగారే చేతులు పట్టలేదుకదా?

వెంక: అంతదాకా రాలేదు. అయినా లోకాపవాదంమాత్రం మంత్రిమీదుగా కాంగ్రెస్ మహాసంస్థకే తగులుతుంది.

సత్యం: ఈ చీకటిలో ఎందు కొచ్చావు?

వెంక: ఈ ఆపద విషయం నీకు ముందుగా చెప్పి తప్పిద్దామని. కానీ ఆ అవసరం లేకపోయింది.

సత్యం: వెంకటాద్రీ! - నేను కమ్యూనిస్టుని కదా! నామీద నీ కెందు కీ అభిమానం?

వెంక: నేను కాంగ్రెసు గనక! కాంగ్రెసు పేరిట బురకావాలాలు చేస్తున్న దౌర్జన్యాలను అరికట్టడం నా పని. నా కాంగ్రెసుకు కళంకం రానీయకూడదు. అసలు గాంధీగారు మాకు నేర్పిందే దౌర్జన్యరాహిత్యతత్వం.

సత్యం: ఈ బలహీన దేహంలో ఎంతటి సత్యబలాన్ని ఇమిడ్చుకొన్నావోయ్? (కూర్చున్నాడు) కూర్చో! చిన్నయ్యా! కాసిని మంచినీళ్ళు పట్రా!.... మీ రందరూ వెళ్ళండి. పడుకోండి. వెంకటాద్రీ! నీతో చాలా చాలా మాట్లాడాలని వుంది కానీ ___

వెంక: కానీ మాట్లాడలేకున్నావు అంతేనా?

సత్యం: అవును. నేను ఒంటరిగాడినని నువ్వెరుగుదువుగా!

వెంక: అంటే పెళ్ళాం బిడ్డలు లేరనా?

సత్యం: ఆ చింత లేదులే!

వెంక: అవును మరి లక్ష్మి వుందిగా!

సత్యం: ఏమన్నావు? లక్ష్మి, ఎవరాలక్ష్మి?

వెంక: రాముడి కూతురు.

సత్యం: వుంటే?

వెంక: పెళ్ళాం చింత ఎందుకూ?

సత్యం: వెంకటాద్రీ! అదా సంగతి! పోనీలే! ఆ అర్థంలోకాదు నే నొంటరిగాడి నన్నది.

వెంక: లక్ష్మి విషయం ఒప్పుకుంటావా?

సత్యం: అది నీ అభిప్రాయమేనా? అయితే కొంత నచ్చచెప్పటానికి ప్రయత్నిస్తాను. లేక లోకాపవాదంగా వుంటే మరిచిపోతాను.

వెంక: నీ సహనంతో చంపేస్తున్నావు సత్యం! కేవలం లోకాపవాదమే!

చిన్నయ్య ముంతతో నీళ్ళు తెచ్చి పెట్టాడు
వెంకయ్య ఒక్కసారి ముంతను ఎత్తి చూచాడు

సత్యం: మట్టిముంత అని చూస్తున్నావా!....రెండు పళ్లు తీసుకో. .

వెంక: భోంచేయవూ?

సత్యం: రాత్రిళ్లు ఇదే భోజనం. అదిపోనీ - వెంకటాద్రీ! నే నొంటరిగాణ్ణి. ఈ అమాయకులు నన్ను నమ్ముకున్నారు, పరిస్థితులు చూస్తే ఏ క్షణాన ఏమవుతుందో చెప్పలేం! ఈ సమయంలో నీ పోటీవాడు...

వెంక: సత్యం! ఎవరో ఇటువస్తున్నారు!

సత్యం: ఎక్కడ?

వెంక: అదిగో టార్చిలైటు!

సత్యం: అవును, ఎవరది?

టార్చిలైటు మనిషి దగ్గర కొచ్చాడు

సత్యం: ఓ మీరా! ఏం ఈలా వచ్చారు?

సబ్: You are under arrest!

సత్యం: అరెస్ట్! ఎందుకూ?

సబ్: కొత్త ఆర్డినెన్సు ప్రకారం కారణం చెప్పాల్సిన అవసరం లేదు.

వెంక: విచారణ అసలే అనవసరం!

సబ్: అవును. ప్రజాశాంతికి భంగం కలిగించే ఎవరినైనా ఎప్పుడైనా అరెస్టు చేయవచ్చు.

సత్యం: బ్రిటిష్‌వారి దగ్గర నేర్చుకున్న పాఠాలు కాంగ్రెసు మరలా వప్పజెప్తూంది.

వెంక: అప్పుడు కాంగ్రెసు చేసిన ప్రతిఘటనే మనమూ వర్తిస్తుందిగా!

సబ్: మరి కదలండి!

సత్యం: ఈ అరటిపళ్ళు తిని నీళ్ళు తాగి వస్తాను.

సబ్: అలాగే కానీండి.

చిన్నయ్య వెళ్ళి చెప్పాడేమో కొన్ని నీడలు పరుగెత్తుకొచ్చి గుంపులు చేరినవి.

సత్యం: వెంకటాద్రీ! నేను వెళ్తున్నాను, ఎప్పుడొస్తానో నాకు తెలీదు, ఈ అనాధుల్ని నీకు వప్పజెప్పి పోవచ్చా?

వెంక: (కొంచెం తటపటాయించి) అభ్యంతరంలేదు కానీ. ..వాళ్ళంతా కమ్యూనిష్టులుగా తయారయ్యారేమో!

సత్యం: కమ్యూనిష్టులతో కలిసి పని చేయలేవా?

వెంక: కాంగ్రెసును వదులుకోలేను.

సత్యం: కాంగ్రెసు ఇంత ప్రజావ్యతిరేకమైనప్పటికి కూడా?

వెంక: అవును.

సత్యం: అది కేవలం మౌఢ్యం!

వెంక: మౌఢ్యంకాదు. నా జీవరక్తంలో ప్రతి అణువూ ఆ సంస్థకు ధారబోసాను. నాలాగు కోటానుకోట్ల త్యాగమూర్తులు తమ రక్తంతో దాన్ని పెంచారు. పెద్ద చేశారు. ఎన్నో బంగారు కలలు కంటూ ఎందరో చచ్చారు. ఎంతో పవిత్రంగా, ఉన్నంతంగా పెంచుకొచ్చిన సంస్థను, చేతులారా యీనాడు కూలదోయలేం! కుళ్ళు వుంటే కడుగుకొంటాం! కుళ్ళిన భాగాన్ని కోసైనా పారేస్తాం. అంతే!

సత్యం: కమ్యూనిష్టులు దేశభక్తులు కారంటావా?

వెంక: అనటానికి సాహసించను, కానీ వాళ్ళు మాతృదేశం కంటే రష్యా నధికంగా ఆరాధిస్తారు. వాళ్ళ కది వేదభూమి.

సత్యం: పోనీ - నీ మతాన్నే నచ్చజెప్పి వాళ్ళను నీవైపు తిప్పుకో.

వెంక: అది నా యిష్టం. నా కవసరమని తోస్తే చేస్తా.

సత్యం: పోనీ వెంకటాద్రీ! వాదమెందుకు? ఎవరికోసం ఈ రాచకీయాలు, సత్యాగ్రహాలు, పార్టీలు వచ్చాయో ఆ ప్రజే కళ్ళ ఎదుట వుండగా కమ్యూనిష్టు కాంగ్రెసులనే వాదనెందుకు? వెంకటాద్రీ! నిన్ను నేను కోరేదేమీలేదు. ఈ పూరిగుడిసెలలో గాంధీమహాత్ముని నిర్మాణ కార్యక్రమం కొనసాగించు. అక్షరజ్ఞానం లేని యీ సోదరులకు చదువు, శుచి నేర్పించు. వీళ్ళను మానవులను చేయి. అంతే చాలు! దానికీ పార్టీవిభేదా లడ్డుపడతాయా? చెప్పు? ఏం?

వెంక: ....................

సత్యం: పోనీ! నీకు కాంగ్రెసు అంటే భక్తి వుందా?

వెంక: తప్పక.

సత్యం: కాంగ్రెసు జెండాకు తల వంచుతావా?

వెంక: తప్పక.

సత్యం: కాంగ్రెసుజెండానీడలో పని చేస్తావా?

వెంక: తప్పక.

సత్యం: ప్రమాణం చేస్తావా?

వెంక: చేస్తాను.

సత్యం: అయితే కాస్త ఆగు! (సబ్‌తో) కాస్త మీ టార్చిలైటు ఎలా యివ్వండి. (తీసుకొని) వెంకటాద్రీ! అదిగో చూడు....(చెట్టు చివరకు టార్చివేసి చూపుతూ) ఏ పతాకానికి నీవు జీవరక్తం ధారబోశావో, ఏ పతాక ఈ దీనుల పాలిటి కల్పతరువవుతుందని కల కన్నావో, ఏ పతాకకు తల ఒగ్గుతానన్నావో, ఆ కాంగ్రెసు పతాకం! అదిగో చూడు - నీ ప్రమాణాన్ని కోరుతూంది. నిన్ను కార్యరంగంలోకి పురికొల్పుతూంది. అది యీనాడు కోరేది పదవు లలంక రించగల పెద్దలను కాదు. ప్రజాసేవకులను.

వెంక: (నిర్విణ్ణుడయ్యాడు) సత్యం! (మెల్లిగా సత్యాన్ని సమీపించి చేతులు పట్టుకొని) సత్యం! క్షమిస్తావా?

సత్యం: పిచ్చివాడా! ఎందుకు....ఇదిగో - ఈ ఒక్కచిక్కిన నిరుపేదలను నీ చేతుల్లో పెట్టి పోతున్నాను. నీ యిష్టం, నువ్వూ ఒకనాటికి నాలాగు ఈ సంకెళ్ళ ఆతిథ్యం అందుకోవాలేమో! సిద్ధంగా వుండు. కాంగ్రెస్‌ను కాంగ్రెస్సే అణిచే కాలం వచ్చింది. ఆర్డినెన్సు అంత విశాలంగా అవత రించింది. రాముడూ! చిన్నయ్యా! నేను జైలుకు వెళ్తున్నాను. మీకేం భయం లేదు. వెంకటాద్రి వున్నాడు నాకు బదులు. నా పూరిపాక అతని కివ్వండి. ఏం? వెంకటాద్రీ వుంటావా?

వెంక: నేను కాంగ్రెసునైతే వుంటాను.

సత్యం: ఈ మట్టిముంత నా ఆస్తి. తీసుకో - (సబ్‌తో) నేను సిద్ధంగా వున్నాను.

సబ్: (సంకెళ్ళు వేశాడు).

అందరూ ఒక్కసారిగా వాళ్ళకే తెలియక "అన్యాయం, అన్యాయం" అన్నారు....

వెంక: దౌర్జన్యం!

1. మంత్రిగారొచ్చి చేసిం దేంటయ్యా మనకు?

2. ఈ మాత్రానికి మన మంత్రు లనుకోవటం దేనికంటా?

3. ఇంగ్లీసోడికన్నా ఏం తక్కువ జేశారని?

సత్యం: ఊర్కోండి. అరిచి లాభంలేదు. ఉద్రేకంమీద దేనికంటే దానికి తెగబడ కండి. అందువల్ల ప్రయోజనం లేదు. నేను త్వరలోనే తిరిగివస్తాను.

సత్ సత్యాన్ని తీసుకెళ్తూ టార్చిలైటు ఒక్కొక్కరి ముఖాన వేస్తున్నాడు. ఎందుకో ప్రేక్షకుల కా వెల్తురులో వాళ్ళ ముఖాలలోని దైన్యం బాగా అగు పిస్తూంది. చివరకు వెళ్ళి వెంకటాద్రిమీద వేశాడు. అతని కళ్ళవెంట నీరు కారు తూంది. దూరంగా నక్కల అరుపు. భగ్గుమని గాలికి ఒక్క విసురు విసిరింది శ్మశానంలోని మంట.

తంబురవాడు వచ్చాడు . . . . .

వెంక: తత్వాలు పాడి వినిపించటమేుందా పెళ్ళానికి? (కఠినంగా అన్నాడు.)

తంబు: చచ్చిపోయిందండి!

వెంక: ఆ తంబుర నిలా యిా చెప్తా! (తీక్షణంగా)

తంబు: ఎందుకు బాబూ!

వెంక: పగలేస్తాను ఇక తత్వాలు పాడకుండా. (కోపంగా అన్నాడు.)

సత్యం: (దూరంనుంచే) వెంకటాద్రీ! అతనికి తత్వాలే కావు వుడికించే పాటలు కూడా వచ్చు! పాడు! గోపీ! పాడు!

గోపీ తంబురమీద పాడుతున్నాడు. అందరు కలిపారు గొంతులు. నక్కల అరుపులు శ్రుతి కలిపినవి. మంట పెద్దదయింది.

తె ర జా రు తు ం ది.



## మూడవ రంగం

రామయ్య ఇల్లు. మొదటిరంగంలోని హాలు. రామయ్య వున్నాడు. కోటిగాడు ఒక ప్రక్కగా నిలబడి వున్నాడు.

మోహన్ కుర్చీమీద కూర్చొని చదువుతున్నాడు.

బలవంతుడ నా కేమని
పలువురతో నిగ్రహించి పలుకుటమేలా?
బలవంతమైన సర్పము
చలిచీమలచేతజిక్కి చావదె సుమతీ!

తలనుండు విషము ఫణికిని
వెలయంగా తోకనుండు వృశ్చికమునకున్
తలతోకయనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ!

రామ: బాబూ! వెళ్ళు! లోపలికి వెళ్ళి చదువుకో!

మో: నాన్నా! నాన్నా! ఈ పద్యానికి అర్థం చెప్పు నాన్నా?

రామ: ఏమిటి బాబూ అది?

మో:
వేసరపు జాతికానీ
వీసము దాజేయనట్టి వెంగలిగానీ
దాసి కొడుకైన గానీ
కాసులు గలవాడెరాజు గదరా సుమతీ!

అంటే ఏమిటి నాన్నా! చెప్పవూ?

రామయ్య అర్థం చెప్పాడు.

మో: అయితే ఎవరైనా డబ్బుంటే రాజేనా నాన్నా?

రామ: అంతేగా! నీతినియమం లేనివాళ్ళందరూ డబ్బున్నంత మాత్రాన పెద్దవాళ్ళ అందరిచేత గౌరవింపబడుతూంటారు. అదే రాజు కావటం అంటే!

మో: మరి మీరెందుకు రాజు కాలేదు నాన్నా! ఇంత డబ్బుంది కదా?

రామ: వెళ్ళు లోపలికి (లెంపమీద వేశాడు).

మోహనరావు ఏడుస్తూ వెళ్ళాడు.

రామ: ఊం....కోటిగా!

కోటి: పొరబాటయిపోయిందండి.

రామ: ఆనందయ్య వుండగానే ఆ పని కాస్తా జరిగిపోయివుంటే ఎంతో బాగుండేది. ఆ రాముడి నెత్తిన నెట్టేసి వుంచొచ్చు! పోనీలే ఎక్కడికి పోతాడు తప్పించుకొని.

కోటి: జైలుకు వెళ్ళాడు కదండీ?

రామ: అదీ కొంత నయమే - కొంతకాలమైనా వాడి పోరు తప్పుతుంది. సరేగానీ - కోటిగా - వాడి మనుష్యులు నిన్ను గుర్తుపట్టలేదుగదా?

కోటి: ఆళ్ళబొంద. ఆళ్ళకేం తెలస్తదండి ఎదవలు? తెలిసినా ఏం చేయగలుగుతారు లేండి! అట్టాంటి బయం ఏమీలేదు ఈడికి.

రామ: కోటిగా? ఈరోజు తప్పక ఏదో అల్లరి జరిగి తీరుతుంది. నువ్వు జాగ్రత్తగా వుండాలి. వాళ్ళను తయారుచేసి వుంచావా? ఎప్పుడేం చేయాల్సిందీ చెప్పావా!

కోటి: అన్నీ రెడీచేసి వుంచానండి. ఆళ్ళ ఖర్చుకు డబ్బు —

రామ: ఇదిగో తీసుకో - నూరు రూపాయలకు పోయించు....ఇదిగో కోటిగా! ఇంకో విషయం. ఇప్పుడు మన వూళ్ళో ప్రొహిబిషన్ వుంది, తెలుసా?

కోటి: అవునండి.

రామ: అది మరీ కలిసొస్తుంది మనకు....దొంగతనంగా ఆ గూడెంలో కల్లు తయారు చేస్తున్నారని పోలీసులకు వాసన పట్టిస్తే చాలు....కావాలంటే ఇదిగో ఇంకా కొంచెం కల్లు ఆ దగ్గరే ఎక్కడన్నా పూడ్చిపెట్టు! ఏం?

కోటి: భేషుగ్గా వుందండి ఎత్తు. దీంతో గూడెం ఖాళీ అవుతుందండి.

రామ: మళ్ళా ఒక్కసారి చెప్పు - ఎవరిమీద రాళ్ళు కొట్టాల్సింది!

కోటి: పోలీసోళ్ళమీదండి.

రామ: ఎక్కడినుంచి!

కోటి: ఆళ్ళతోపాటుండి కొట్టాలండి.

రామ: భేష్! లాఠీచార్జి చేస్తే —

కోటి: అందాకా వుంటామండీ? ఎప్పుడో వురికి రామూ!

రామ: తుపాకులు పేలిస్తే?

కోటి: అందాకా వస్తుందాండీ?

రామ: ఏమో ఎవరు చూచారు!

కోటి: అప్పటికేదో సూత్తాంలెండి!

రామ: సరే జాగ్రత్త! వెళ్ళిరా! ఏం! మళ్ళా ఎప్పుడగుపిస్తావు?

కోటి: ఎప్పటికప్పుడు అంచెలమీద సమాచారం తెస్తుంటాగా!

సుబ్బ: (వచ్చాడు) అబ్బ! ఎండలు మరీ ఇదిగా వున్నాయండి అప్పుడే మండిపో తున్నాయి!

రామ: అవును సుబ్బన్నా! కాలం మారిపోయింది. నా చిన్నతనంలో ఈ నెలలో ఈ పాటికి యింత మిడిమేలపు ఎండలు ఎరగను. ప్రపంచంలో ఎప్పుడు అన్యాయం, అక్రమం, అధర్మం అధికమై పోయిందో, అప్పుడే అన్నీ తల క్రిందులవుతాయి. మానవ ప్రకృతి ఎప్పుడు మారిందో, దానితోపాటు మిగతా నేచర్ అంతా కూడా మారిపోతుంది.

సుబ్బ: అంతేకదండీ! అన్యాయకాలం కాకుంటే మనం, మన పూర్వీకులు ఎప్పు డన్నా ఎరుగుదురా జట్కాబండ్లు, రిక్షాబండ్లు Strike చేయటం! ఒక్క బండి దొరకలేదు కదండీ. మరీ ఇదిగా వుంది. అంతదూరం నాళ్ళీడ్చు కొచ్చాను.

రామ: ఎందుకూ Strike?

సుబ్బ: ఆ సత్యాన్నేమో అరెస్టు చేశారట!

రామ: అదెప్పుడూ?

సుబ్బ: రాత్రి మీటింగైన తర్వాతట. వాడు వీళ్ళకందరికీ పాకీవాళ్ళకు సహా నాయకు డయ్యాడుగా!

రామ: ఇంత అకస్మాత్తుగా ఎట్లా జరిగింది అరెస్టు?

సుబ్బ: రాత్రి మీటింగులో గలభా రెచ్చగొట్టాడని అన్నారు. మనకేం తెలుసు?

రామ: అంతేలే! కోటిగా వెళ్ళు! ఆ పని త్వరగా ముగించుకురా! వెళ్ళు.

సుబ్బ: ఆయనింకా నిద్ర లేవలేదాండీ?

రామ: రాత్రంతా పాపం వ్రాయటం, చదవటం, వచ్చినవాళ్ళతో మాట్లాడ్డంతో సరి పోయింది. తెల్లవారుజామున కళ్ళు మూశాడు. పాపం!

సుబ్బ: ఆ ఇది హెచ్చరించారా?

రామ: చెప్పానులేవోయ్! నీ కెందుకు?....అఁ....ఆ మిగతా సొమ్ము.

సుబ్బ: చిత్తం. ఇప్పుడు తెచ్చాను. (నోట్లు లెక్కపెట్టి ఇస్తూ) అయిదువందలు, చూసుకోండి.

రాము: ఆఁ నేను చూసుకొనేదేమిటి. ఇచ్చిందిచ్చినట్లే ఆయనకు వప్పగించటానికి. ఇదుగో బయట పొక్కనిచ్చేవు సుమా! నీ విషయం నా విషయం కాదు. పెద్దమనుష్యులతో వ్యాపారం! సరేనా?

సుబ్బ: అమ్మా! ఆ మాత్రం తెలీదాండి! తమరింత ఇదిగా చెప్పాలా?

చెవిటయ్య వచ్చాడు.

చెవి: అయ్యగోరు నిద్దర లేశారండి.

సుబ్బ: మా కెవరికీ చెవుడులేదు లేవోయ్ అంత ఇదిగా అరవటానికి!

చెవి: ముకం కడుక్కుంటున్నారండి.

రాము: వెధవ చెవిటి ముండమోపి! (అంటూ లోనికి వెళ్ళాడు)

చెవి: (రామయ్య ఇంటిలోపలికి వెళ్ళాడో లేదో చూచి సుబ్బన్నను సమీపించి). సోమీ!

సుబ్బ: ఆఁ —

చెవి: అయిరే సత్తెంగారిని జైల్లో యేశారంట నిజమేనా?

సుబ్బ: ఆఁ —

చెవి: ఎందుకండి? అర్ధరాత్రి ఏళ ఎల్లి పట్టుకొచ్చారంటనే - ఏం చేశారని!

సుబ్బ: ఏమో! నాకేం తెలుసు?

చెవి: ఏందో అన్నాయకాలం! అన్నీ అగసాట్లు మా మీదుగనే నడిచిపోతున్నాయి!

సుబ్బ: ఒరే! మీ వాళ్ళంతా సమ్మె చేశార్రా!

చెవి: అట్టాగా సోమీ! మా వాళ్ల నాతో శెప్పనన్నా శెప్పలేదే?

సుబ్బ: నువ్వూ - నువ్వూ చేస్తావట్రా?

చెవి: నలుగురితోపాటు నారాయణకద సోమీ!

సుబ్బ: ఆఁ హాఁ! ముసలిపీనుగను కూడా వుసికొట్టి పెట్టారే!

వెంకటాద్రి వచ్చాడు.

సుబ్బ: ఓ! నమస్కారం. రాండి. కూర్చోండి!

వెంక: మంత్రిగా రున్నారా?

సుబ్బ: ఇప్పుడే లేచారు. వస్తారు కూచోండి.

వెంకటాద్రి కూర్చున్నాడు. రామయ్య వచ్చాడు.

రామ: ఏం! వెంకటాద్రీ! రాత్రి కనిపించలేదే!
వెంక: పనేముంది గనక?
రామ: భోజనానికి కూడా రాలేదు?
వెంక: అర్హత లేదనుకొని రాలేదులెండి! ఆనందయ్యగారు ఉన్నారా?
రామ: ఉండ కెక్కడ కెళ్తారు?
వెంక: ఊరీ వెళ్తారని విన్నాను.
రామ: రేపు. నీ కెవరు చెప్పారు?
వెంక: ఆఁ ఏదో విజయనగరం మహారాజీవారి అతిథులుగా వేసవి గాలియాపనకు వెళ్తారని వార్త!
రామ: అవును. మహారాజీవారు స్వయంగా ఆహ్వానించారు.
వెంక: వీరు కూడా స్వయంగానే వెళ్తున్నారుగా!
రామ: ఎండ లిప్పటికే మండిపోతున్నాయి వెంకటాద్రీ! ఏమంటావ్?
వెంక: సత్యం! సత్యం పలికారు! ఇంతకుముందే నేనూ సుబ్బన్నతో అదే అన్నాను. కలికాలం భారతంలో ___
సుబ్బ: తిక్కన భారతంలో ___
రామ: అవును. ఆ మహానుభావుడు ముందుగానే తెలుసుకున్నారిదంతా - అన్నారు గదా ___
ఆనం: (వస్తూ) ఏం వెంకటాద్రీ! మళ్ళా కనుపించలేదే!
వెంక: ఇప్పుడు కనిపిస్తున్నాగా!
ఆనం: ఆఁ - ఏం విశేషం!
వెంక: తమతో మాట్లాడాలని వచ్చాను.
ఆనం: ఏం! ప్రైవేటా!
వెంక: కాంగ్రెస్‌లో చేరిన మొదటిరోజే Private అన్నది మాయమయింది.
ఆనం: అవునులే అసలు విషయం ఏంటి!
వెంక: సత్యాన్ని ఎందుకు అరెస్టుచేశారో తెలుసుకోవచ్చా!
ఆనం: ఆహా! అరెస్టుచేసిన పోలీసువాళ్ళ నడిగి తెలుసుకోవచ్చు!
వెంక: చేయించినవాళ్ళ నడిగితే కూడా తెలుస్తుంది.
ఆనం: వెంకటాద్రీ, తెలిసీ తెలియకుండా మాట్లాడకు.
రామ: ఎప్పుడూ వెంకటాద్రి తొందరపడ్తాడు.
వెంక: నాకుతెలుసు. తమరు చెప్పాల్సిన దనవసరం.

ఆనం: వెంకటాద్రీ! గౌరవం ఇచ్చి తీసుకోవాలి. తెలిసిందా!

రామ: వెంకటాద్రికి తెలియం దేముందిలేండి!

వెంక: అవును. నాకు చాలా చాలా తెలుసు. తెలిసినవన్నీ వెళ్లడిచేసేకాలం ఇంకా రాలేదు. వస్తుంది త్వరలో వస్తుంది.

ఆనం: వెంకటాద్రీ! నేనే సత్యాన్ని అరెస్టు చేయించాననుకున్నా కారణం చెప్పాల్సిన అగత్యంలేదు.

వెంక: ఎందుకుంటుంది. కొత్త ఆర్డినెన్సు మీ కాలాంటి అధికారం ఇచ్చింది. కానీ మీరు ఆర్డినెన్సుల బలంమీద కాదు ఇంతకాలం బతికింది. ప్రజాబలంమీద. ఆ ప్రజ ఇంకా ప్రపంచంలోవున్నారన్నది మరచిపోకండి.

ఆనం: మేము మరచినా అప్పుడప్పుడు జ్ఞాపకం చేయటానికి నిన్ను నియమించు కొంటాంలే!

వెంక: అక్కర్లేదు. తలతగిల్తే మీకే తెలిసొస్తుంది.

ఆనం: ఇంతకూ నువ్వనే దేమిటి?

వెంక: సత్యాన్ని విడుదలచేయాలి?

ఆనం: చేస్తాం.

రామ: చెయ్యక ఎన్నాళ్ళని వుంచుకుంటారు? గవర్నమెంటు కేం ఇల్లరికమా సత్యం?

వెంక: వెంటనే విడుదలచేయండి!

ఆనం: చేయకుంటే?

వెంక: అనుభవిస్తారు పర్యవసానం!

ఆనం: శపిస్తున్నావా? బెదిరిస్తున్నావా? వెంకటాద్రీ! ప్రజాశాంతికి భంగం కలిగించే ఎవరినైనాసరే క్షమించం. శిక్షించటానికి వెనుదీయం. ప్రజాప్రభుత్వం వచ్చిందికదా అని అనవసరంగా అరాచకాన్ని రెచ్చగొట్టటానికి ప్రయత్నించే రౌడీమూకను అణిచివేస్తాం, తప్పదు. నువ్వనవసరంగా జోక్యం కలుగజేసు కున్నావా విచారించాల్సి వస్తుంది.

వెంక: ఆహాహా! ఎంతటి ప్రజాశాంతిరక్షణదీక్ష!

ఆనం: వెంకటాద్రీ! Shut up!

వెంక: సరే! వెళ్ళొస్తాను. రాజకీయాలకేనాడో నమస్కారం అన్నాను. కానీ కాంగ్రెసు కుళ్ళునుచూచి సహించలేక మరల కార్యరంగంలోకి రావాల్సి వస్తుంది.

ఆనం: తమ 'శల్యసారధ్యం' లేదని కాంగ్రెసు కన్నీరు కార్చడంలేదు.

వెంక: ఏమన్నావ్? (చంకనున్న పుస్తకం విసురుగా బల్లమీద కొట్టాడు.) శల్య సారథ్యం! అవును. చూస్తావులే శల్యసారథ్యం! నేను శల్యుడిని. ఈ శల్య రూపం ఎందుకొచ్చిందో తెలుసా? మీ రిప్పుడు హాయిగా కూర్చొని మొన గాళ్ళలా మీసాలు త్రిప్పుతున్నారే ఆ పదవులకు రక్తమాంసాలర్పించి యిలా శల్యుడినయ్యాను. తెలిసిందా? ఆనందయ్యా! నన్ను మోసం చేయలేవు. నాకు తెలుసు. నువ్వెప్పుడు కాంగ్రెస్‌లో చేరావో, ఎందుకు చేరావో, ఎలా పైకొచ్చావో సర్వం నాకు తెలుసు. పదవుల మత్తులో కళ్ళు నెత్తికిపోయి మరచిపోయావేమో నువ్వు! మహారాజుల, మహారాణీల పరిచయ భాగ్యాల కోసం బుజాలెగరేస్తూ పరిగెత్తే రకంకాదు నేను. జాగ్రత్త! ఏనాటికో ఒక నాటికి తెలిసొస్తుంది. రామయ్యా! నువ్వూ జాగ్రత్తగావుండు. నీ గుట్టు రచ్చ కెక్కించక మానను. అప్పుడే ఆనందయ్య కళ్ళు తెరుస్తాడు........

ఆనం: వెంకటాద్రీ! (బిలగుద్ది లేచి "Get out" అన్నట్లు వాకిలివైపు చేయి చూపించాడు)

వెంకటాద్రికి ఉద్రేకం తగ్గిపోయింది. ప్రశాంతంగా వెళ్లాడు.

రామ: ఒట్టి నోటిదురుకు వెధవ!

ఆనం: పైకి వెళ్ళొస్తాను. (వెళ్లాడు)

సుబ్బ: చనువీను యీను మరీ ఇదైనా డండీ!

రామ: సుబ్బన్నా!

సుబ్బ: అయ్యా!

రామ: ఎదిరింట్లో -

సుబ్బ: చిత్తం........

రామ: ఆ అమ్మాయిని....తెలుసుకదూ?

సుబ్బ: మనకు తెలియకేమండీ.

రామ: ఆనందయ్య కన్నుపడ్డదోయ్! అందుకే ఎప్పుడూ ఆ మేడమీద వరండాలోనే వుంటాడు. ఆ అమ్మాయి కూడా అదేపనిగా....ఏమంటావ్?

సుబ్బ: అదెంత ఇదండీ? మనం తలుచుకుంటే....మీకు తెలిసిందేగా!

రామ: నేనవతల పోతాను. సమయంచూచి కదిలించు....ఏం?

సుబ్బ: చిత్తం! తమరుమాత్రం ఆ ఇది!

రామ: చెప్తానులే!....

ఆనందయ్య వచ్చాడు.

రామ: రాండి! కూర్చోండి! ఏదో దారినపోయే కుక్క అన్నదని మీరంతగా feel కానక్కర్లేదు. అతని స్వభావమే అంతేలేండి! మీకు తెలియం దేముంది?

ఆనందయ్య మౌనంగా కూర్చున్నాడు.

రామ: సుబ్బన్నను గురించి మీకింకొక విషయం చెప్పాల్సివుంది.

ఆనం: ఆఁ - ఏమిటది?

రామ: సుబ్బన్న కేవలం మనవాడే - మీకు తెలిసిందేగా!

ఆనం: ఆఁ....

రామ: ఇన్ని రోజులుగా మనకు బలంగావుండి పేపరుద్వారా ఎంతో పనిచేశాడు. ఎలెక్షన్ రోజుల్లో సుబ్బన్న పేపరు 'అబ్బ' అనిపించింది. అదంతా మీకు తెలిసిందేగా! ఇంటిగుట్టు ఎంతో వుంది పాపం! ఎట్లా అయితేనేం ఎన్నో కష్టాలుపడి ఎందరినో ఆశ్రయించి ఆ పేపరును వారపత్రికగా ఈ నాటికి నిలబెట్ట గలిగాడు. ఇప్పుడు దాన్నే దినపత్రికచేస్తే బాగుంటుందని నేనే చెప్పానులేండి సుబ్బన్నకు. ఆ విషయమై ఏదో అతనికి కాస్త సహాయం చేస్తే___

ఆనం: అలాగే చూద్దాం.

రామ: సుబ్బన్నా! డిక్లెరేషన్‌కు అర్జీ పెట్టావా?

సుబ్బ: పెట్టానండి!

రామ: సరే! త్వరలో అయిపోతుందిలే....ఇప్పుడే వస్తా. (వెళ్ళాడు)

ఒక క్షణం అందరూ మౌనం.

ఆనం: సుబ్బన్నా!

సుబ్బ: చిత్తం.

ఆనం: ఎదిరింట్లో ఎవరోయ్ ఉండటం?

సుబ్బ: మనకు తెలిసినవాళ్ళేనండి.

ఆనం: ఒక అమ్మాయి వుంది!

సుబ్బ: వుందండి.

ఆనం: వచ్చినప్పటినుంచీ చూస్తున్నా.

సుబ్బ: చిత్తం.

ఆనం: ఏలాంటి దంటాపు?
సుబ్బ: ఆఁ దానికేమండి? కావలిస్తే యీ రాత్రికే—
ఆనం: Shut up!
సుబ్బ: చిత్తం! చిత్తం!
ఆనం: ఇదేనా నీ పెద్దమనిషితరహా! Scoundrel ! నీ తార్పుడుగుణం నా దగ్గరా చూపెడుతున్నావు? వెధవమూక!

సుబ్బన్న ఏమీతోచక దెబ్బతిని నిలబడ్డాడు. రామయ్య యీ కేకలు విని వచ్చాడు.

రామ: ఏమిటండీ? ఏమిటండీ?
ఆనం: ఏమో పెద్దమనిషి అనుకున్నా. తార్పుడు గాడనుకోలేదు.
రామ: ఏంటి సుబ్బన్నా అది?
సుబ్బ: (కొంచెం తటపటాయించి గుటకలు మింగి) అయ్యగారు....
రామ: ఆఁ అయ్యగారు?
సుబ్బ: ఎదిరింటి అమ్మాయి విషయం అడిగారు....
ఆనం: ఎవరా ఆ అమ్మాయి అని అడిగితే తార్పమని అర్థమా? అదికాదండీ....నేను వచ్చినప్పటి నుంచి చూస్తున్నా - ఆ ఎదురింటి అమ్మాయి అదేపనిగా కిటికీ తెరుచుకొని నావంకే చూస్తూండటం. ఎవరా ఏమిటా అని అడిగాను. ఆ మాత్రానికే నిజగుణంతో బైటపడ్డాడు.
రామ: పొరబాటులేండి. సుబ్బన్న అలాంటివాడు కాడు. ఇంక మీతో ఏమీ చెప్పలేక అలా అని వుంటాడు. అంతే! సుబ్బన్నా! మంచిపని చేశావోయ్! ఆ మధ్య స్పీకరెవరో ఆడోళ్ళు ఇద్దరిని వెంటేసుకొని బీచ్‌కి పోయి తన్నులు తిన్నాడట, ఆ గతి పట్టించాలనుకొన్నావేం ఆనందయ్యకూ!
ఆనం: ఎవరో నీచుడు మొగ్గితే అందరూ అంతేనా?
సుబ్బ: క్షమించండి! బుద్ధి గడ్డితిన్నది? మన్నించండి!
ఆనం: సరేలే వెళ్ళు!

సుబ్బన్న బతికి బైటపడ్డాంరా అని వెళ్ళాడు. చెవిటయ్య వచ్చి ఒకప్రక్క నిల్చున్నాడు. రామయ్య 'ఏమిట'ని సైగతో అడిగాడు,

చెవి: మరండీ!

రామయ్య మళ్ళా అదేలాగు అన్నాడు.

చెవి: ఈ రోజు నౌకరికి రాలేనండి.

రామ: ఏం? ఏమొచ్చిందిరా? బాగున్నావే?

చెవి: ఏమీ రాలేదు దొరా ఇంకా! బాగానేవుండా!

రామ: మరింకేం?

చెవి: మా వోళ్ళందరూ సమ్మె శేత్తుండారండి.

రామ: ఆఁ ___

చెవి: సమ్మె శేత్తుండారండి.

రామ: అయితే ఏమంటావు?

చెవి: నలుగురితోపాటు నారాయణాగదంటి నానుకూడా!

రామ: నువ్వూ సమ్మె చేస్తావట్రా?

చెవి: మరి సంగం కట్టుబాటు కదండి?

ఆనం: ఎందుకురా సమ్మె!

చెవి: సత్యంగోరిని అన్నాయంగా శెరలో ఏసారండీ! అందుకని!

ఆనం: సత్యంను వేస్తే మీకేమిరా?

చెవి: అయ్యోబాబూ! అట్టా వూర్కోగలమా? మా కోసం ఆయన తిండీ తిప్పల్లేక, ఎండావాననక పనిశేత్తుండారే! మా కోసం ఇల్లూ వాకిలి వదిలొచ్చి మాతో బాటు పూరిపాకల్లో పడుండాడే మారాజు! దేవుడుగదండీ సత్యంగారు! ఇదేం విపరీత రాజ్జెమో ఇట్టా వచ్చింది! ఇంగిలీసోడేల్తుండాడేం బాబూ ఇంకా! మనోళ్ళొచ్చారు. మనోళ్ళు మంతురులయ్యారంటారే వట్టిదేనాండి? మనోళ్ళే మనల్నిట్టా శేత్తారంటారా? సత్తెంగారు ఏంజేశారని? పేదోళ్ళకి మాకు తిండీ గుడ్డ ఇమ్మన్నాడనా బాబూ! మాకు నాలుగచ్చరాలు శెప్పించాడే! తాగుడు మాన్పించాడే మారాజు! ఆయన్నిట్టా, ఆ దేవుణ్ణిట్టా శెరలో బెట్టినోళ్ళు ఏం సల్లగుంటారు?

రామ: సరేలేవోయ్ మళ్ళా నువ్వీ యింట్లో అడుగుపెట్టటానికి వీల్లేదు, సరేనా?

చెవి: తమశిత్తమండి!

రామ: బాగా ఆలోచించావా?

చెవి: శిత్తమండి.

రామ: సరే - మూటాముల్లెతో కదులు.... వెళ్ళు.... వెళ్ళవోయ్!

చెవి: శిత్తం....

రామ: మళ్ళా సత్యం మెతుకు పెట్టలేదు.

దేవి: ఎవరూ పుత్తినే పెట్టరంపే రెపటోడిత్తేనే! (వెళ్ళాడు).

ఆనందయ్య బయట పచారు చేస్తున్నాడు.

రామ: బుద్ధిలేని మూక! గొర్రెలమంద!

బయట కలకలం; మొదట సన్నగా.. రాను రాను గట్టిగా పాట వినిపిస్తుంది.

పదవుల మత్తులో ప్రపంచమంతా
మరచిపోయిన మంత్రుల్లారా!
కాంగ్రెసు కుళ్ళిన కంపు పుట్టినది
కన్నులు తెరచి గమనించండీ!

మధ్య మధ్య నినాదాలు.

రామ: ఊరేగింపు బయల్దేరినట్టున్నారు.

(బయట నుంచి —)

సత్యాగ్రహపు సమరమునాటి
శపథాలన్నీ మరచారా?
ఎన్నికలప్పటి వాగ్దానాలు
ఇంతలోనే మరచారా?

రామ: వీళ్ళతాడు! ఏడపలేకపోయారూ వెధవలు! వీళ్ళకు తగ్గట్టు కవులు కూడా చేరుతారు పాటలు వ్రాసివ్వటానికి.

(బయట నుంచి —)

కుళ్ళినచోటు కోసేత్తేనే
ముందుబ్రతుకు మీకుంటుందీ!
నిర్లక్ష్యంగా నిద్దురపోతే
సంస్థకు సుత్తి పెట్టొస్తుంది!

రామ: ఏమిటి అంత తీక్షణంగా ఆలోచిస్తున్నారు ఈ చిన్న విషయాన్ని గురించి?

ఆనం: ఏమీలేదు!

రామ: ఏమిటో కలికాలం! అంతా తల్లక్రిందులైంది. అన్యాయం పెరిగిపోతూంది. తిన్నయింటికి వాసాలెంచే తత్వం అధికమవుతూంది. పెట్టి పోషించేవాడికే

గుంట తవ్వడం మొదలెట్టారు. చూచారా? వచ్చింది....ఆ శాస్త్రాల్లో చెప్పారే ఆ ప్రళయం - అంతా వినాశనంచేసే ప్రళయం - అది దాపురించింది....భగవద్గీతలో అన్నట్లు ''యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారతా! అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం'' అని....భగవంతుడు ఎక్కడో ఎప్పుడో అవతరించాడు అధర్మాన్ని నిర్మూలించటానికి! తప్పదు! (రాళ్ళు కిటికీలకు తగిలిన శబ్దం) కోటిగా! సుబ్బన్నా! చూడండి! రాళ్ళు రువ్వుతున్నట్టున్నారు! చూడండిరా! (మళ్ళా అదే శబ్దం).

ఆనం: నే నిక్కడ వున్నందువల్ల ఇదంతా.... నేనే వెళ్తాను.

రామ: ఆఁ . ఆఁ - ఆఁ - అక్కర్లేదు. మీరు వెళ్ళటం దేనికి. .పోలీసులు లేరటండీ! ఇదంతా ఆ కమ్యూనిస్టుల గల్లంతే!

ఆనం: . - పో - - లీ - - సు - - లు - -

మోహన్ కెవ్వుమని కేక వేశాడు.

రామ: కోటిగా! కోటిగా!

సుబ్బ: (పరుగెత్తుకొచ్చాడు) అయ్యా! అయ్యా! చినబాబు! ..

రామ: ఏమిటి? ఏమిటి సుబ్బన్నా!

సుబ్బ: రాయితగిలి పడిపోయారండీ!

రామ: ఆఁ
ఆనం: ఆఁ (రెండడుగులు ముందుకు వేశారు.)

కోటిగాడు మోహన్‌ను చేతులమీద తెచ్చాడు.

రామ: మోహన్! బాబూ! ....దౌర్భాగ్యుడా! వెళ్ళు! డాక్టరును తీసుకు రారా! వెళ్ళు! ఇటు వెళ్ళు దొడ్డివారిని! (మోహన్‌ను Table మీద పడుకోబెట్టాడు) చూశారా! ఈ రౌడీ మూక దౌర్జన్యం! ....పసిబిడ్డను కొట్టటానికి ఎట్లా చేతులాడాయో!

ఆనం: రామయ్యగారూ? Circle కు కబురు చేయండి.

రామ: సుబ్బన్నా! వెళ్ళి Circle తో ఆనందయ్య రమ్మంటున్నారని చెప్పు. వెళ్ళ.... త్వరగా ఇటు దొడ్డిదారిని! (మోహన్‌ను లోపలికి తీసుకెళ్ళాడు).

ఆనం: ...... (ఇటూ అటూ పచారు చేస్తున్నారు).

రామ: (మళ్ళా వచ్చాడు) నా బిడ్డకు దెబ్బతగిలిందని మీరు వాళ్ళమీద సీరియస్ చర్య తీసుకోకండి. ఏదో అజ్ఞానులు. వాళ్ళ పాపాన వాళ్ళు పోతారు. అంతే! పోలీసులతో కూడా ఏదో మంచిమాటలతో గుంపును వెళ్ళగొట్టమని చెప్పండి.

వాళ్ళనిప్పుడు లాఠీచార్జి చేసినా, తుపాకులు పెట్టి కాల్చినా వచ్చేదేముంది! పోనీ మూర్ఖులు!

ఆనం: మోహన్ ఎక్కడ వుండినాడు?

రామ: లోపలే వుండినాడండి. ఎప్పుడు వెళ్ళాడో వెళ్ళాడు - బయట ఏదో పూరే గంపు జరుగుతూందని. నాకు మాత్రం ఏం తెలుసు, ఇంత జరుగుతుందని, వాణ్ణి జాగ్రత్త పెట్టడానికి?

ఆనం: . ........

కోటి: (వచ్చాడు) డాక్టరుగా రొచ్చారండి.

సుబ్బ: (వచ్చాడు) సర్కిల్ వచ్చారండి.

ఆనం: మేడమీద వుండమను వస్తున్నా.

రామయ్య, ఆనందయ్య, కోటిగాడు, సుబ్బన్న వెళ్ళారు. ఒక్కక్షణంలో సుబ్బన్న వచ్చాడు. ఇటటు పచారు చేస్తున్నాడు. వాకిట్లో కావోలు చిప్పిగాడు "నమ్మిన వారిని మోసము చేయుట న్యాయముకాదుర రఘునాథా!" అని పాడుతున్నాడు. రామయ్య, ఆనందయ్య వచ్చారు.

ఆనం: ఫర్వాలేదులెండి. డాక్టరును ఇక్కడే వుండమన్నాంగా! నేను సర్కిల్‌తో మాట్లాడి వస్తాను.

రామ: మీరేం తొందర పడకండి. వాళ్ళ పాపాన వాళ్ళే పోతారు.

ఆనం: .... (వెళ్ళాడు)

సుబ్బ: వీధులంతా ఒకటే గోలండి. ఒక్కవారునూ పోనివ్వటం లేదు. అందరూ పోలీస్‌స్టేషన్‌కు చేరుకున్నారు.

రామ: ఊఁ - (పచారు చేస్తున్నాడు)

సుబ్బ: మరి నా ఇది!

రామ: ఏంటయ్యా! ఒకవైపు తగులబడి పోతూంటే చుట్ట ముట్టించుకోవాలనే వాడివిగా వున్నావే? ఏంటి నీ ఇది?

సుబ్బ: అదేనండీ ఆ ఉద్యోగం!

రామ: చెప్పానుగదయ్యా! వెంటనే నీ చేతుల్లో ఆర్డరు పెట్టలేదనేనా నీ ఏడుపు?

కోటి: (వచ్చాడు) చిన్నబాబుగారికి జ్వరం వచ్చిందండి.

రామ: ఆఁ - (వెళ్ళాడు)

మల్లా చిప్పగాని పాట

సుబ్బ: వెళ్ళవోయ్! వెళ్ళు! ఎవరికి నీ హితబోధ! నమ్మిన వారిని మోసం చేయక పోతే మేడలెట్లా కడతాం! (పచారు)

రామయ్య వచ్చాడు

సుబ్బ: అది కాదండీ?

రామ: అబ్బబ్బ! నాతాడు తెంచుతున్నావే! ఏది కాదు?

సుబ్బ: అడిగితే అంత ఇదయిపోతే ఎట్టాగండీ!

రామ: అడగటానికి సమయం సందర్భంలేదూ?

సుబ్బ: సమయం దాటిపోయిందండీ!

కోటి: చినబాబుగారు పిచ్చిపిచ్చిగా కలవరిస్తున్నారండి.

రామ: ఏమని?

కోటి: సదువుకున్న పద్యాలండి!

రామయ్య కూలపడ్డాడు

సుబ్బ: ఆ వుద్యోగం -

రామ: ఆఁ -

సుబ్బ: అయిపోయిందండీ!

రామ: అయిపోతే ఆ బంగాళాఖాతంలో పడు. ఆ సెక్రటరేట్ గోడకేసి తల పగులగొట్టుకో!

సుబ్బ: అంతేనాండీ?

రామ: అంతగాక నన్నేం చావమంటావా? ఎవరికయింది? ఎవరు చెప్పారు?

సుబ్బ: సర్కిల్ కొడుక్కి అయిందటండీ. డ్యూటీలో కూడా చేరాడట. ఇప్పుడే చెప్పారు.

రామ: నీ కర్మకు ఏడు కూర్చుని.

సుబ్బ: వెయ్యి రూపాయలూ జేబులో వేసుకొని ఆయన నవ్వుతుంటారు కదండీ!

రామ: అవునండీ!

సుబ్బ: ఏంటీ యీ దౌర్జన్యం - యీ మోసం?

రామ: ఎవరిది! ఎవరిదంటా?

సుబ్బ: ఎవరైతే ఏమండీ! వెయ్యి రూపాయలకు వెయ్యో క్షవరంచేసి, వుద్యోగానికి వుద్యోగం సున్నజుట్టి అడిగితే ఇదాండి జవాబు?

రామ: మరి చేతులు కట్టుకొని జవాబు చెప్పా లంటావు?

సుబ్బి: చేతులు పూసుకొంటూనే చెప్పండి. ఏం ఫర్వాలేదు.

రామ: జవాబు చెప్పాలా నీకు. ఎందుకూ?

సుబ్బి: వెయ్యి రూపాయలు గుటకాయస్వాహా చేసినందుకు. అట్టా చేయలేని ఆయన ముందుగానే చెప్పేస్తేపోలా? ఎందుకూ యీ వెధవ కక్కుర్తి! కాంగ్రెసువాళ్ళే ఇట్టా లంచాలకు కక్కుర్తి పడితే ఇంకేముందండి! మంత్రి గారుకదా మనవాడుకదా అని నమ్మినందుకేనా ఫలితం?

కోటి: చినబాబుగారు మంచంమీద నిలవటం లేదండి. ఊర్కే ఏడుస్తున్నారు.

రామ: ఆఁ —

సుబ్బి: ఆ వెయ్యీ కక్కిస్తారా కక్కించండి. లేదా మంత్రి అయితే తర్వాత చూద్దాం. ముందు నడివీధిలో మానం కడిగేస్తాను. లంచాలు తినే కాంగ్రెసు మంత్రులు యున్నారని ప్రపంచానికంతా చాటేస్తా. ఏమనుకున్నారో! రౌడీకి రౌడీని - మంచికి మంచి! అంతే!

రామ: లంచం తీసుకున్న ఆనందయ్యనే అడగవోయ్! (పెద్దగా అరిచి పోబోయాడు. ఆనందయ్య ఎదురొచ్చాడు. రామయ్య ముఖంలో నెత్తురుచుక్క లేదు. ఆనందయ్య గమనించాడు. తల వంచుకొని వెళ్లాడు.)

తెరజారింది



# నాలుగవ రంగం

రెండవ రంగంలోని దృశ్యమే. వెంకటాద్రి రాతి తిన్నెమీద కూర్చున్నాడు. చేతిలో ఒక దుడ్డుకర్ర పట్టుకొని రాముడు ప్రక్కనే నేలమీద కూర్చున్నాడు. మౌనంగా. తెర లేచిన కొంతసేపు నిశ్శబ్దం. వెంకటాద్రి రాముడి ముఖంవైపు చూచాడు. రాముడు కళ్ళనీళ్ళు తుడుచుకొంటున్నాడు.

వెంక: (గమనించి) రాముడూ!

రాము: అయ్యా!

వెంక: ఎందుకు ఏడుస్తున్నావు?

రాము: ఏం లేదులెండి!

వెంక: చెప్పు! ఫర్వాలేదులే చెప్పు. నాతో చెప్పటానిక్కూడా జంకా!

రాము: మన్నించండయ్యా! మనసేదో మాదిరవుతుందండి సత్తెంగారిని తల్చుకుంటే!

వెంక: సత్యాన్ని గురించి అంత చింతించాల్సిన పనిలేదు. వాడికేం భయం లేదు; మనం చేయాల్సిన ప్రయత్నం చేస్తున్నాం. త్వరలోనే విడుదలై వస్తాడు.

రాము: అదికాదండి. తమరేమీ అనుకోకుంటే చెప్తానండి.

వెంక: చెప్పు రాముడూ! ఎందుకా భయం!

రాము: సత్తెంగారి కాడకూడా మేమిట్టాగే అనుకున్న దనుకున్నట్లు చెప్పేసే వోళ్ళం. ఆయనెన్నడూ కోప్పడి ఎరగడు! తప్పంటే నవ్వుతా చెప్పేవారు మాకు బుద్ధి. మంచిదైతే ఒప్పుకొనేవోరు.

వెంక: నేను మాత్రం సత్యంలాంటి వాడినికానూ? నాకూ సత్యానికీ చాలా తేడా అగుపిస్తుందా మీకు?

రాము: అవునండి. ఏరే యిదంగా అనుకోకండి. సత్యంగారైతే యీ పాటికిట్టా ఇక్కడ కూకుండేవాడా! అన్నం పున్నం ఎరగని మమ్ముల్నిట్టా నడియీదుల్లో వదిలేసి చెట్టుకింద కూకునేవాడా? నాకు బాగా గవనం. మాతోబాటు ఆనాడాయన తిరగటం, పోలీసుల్రావటం లారీవిసరటం - ఆయనందరికన్నా ముందెళ్లటం - తల్చుకుంటే గుండెలు నీరై పోతుండాయి. కళ్ళు మూసి తెరిశాం.... నెత్తురు కారుతూ పడుండారు! ఆ ఛనంలో కూడా "మీపని సూడండిరా! నా కోసం వెనక్కు రాకండి" అన్నారా మారాజు. ఏడుండారో! ఎట్లుండారో! (అంత

పెద్దవాడు వెక్కి వెక్కి ఏడవటం మొదలెట్టాడు. వెంకటాద్రికి కళ్ళనీళ్ళు వచ్చినవి. తుడుచుకొని రాముడిని తడుతూ)

వెంక: రాముడూ! ఇలా చూడు! నా మాట విను. నేను వాళ్ళనంతా అక్కడ పోలీసుల దౌర్జన్యాలకు గురిగా వదిలేసి ఇక్కడ చల్లగా ప్రాణభీతితో, హాయిగా తప్పించుకొని వచ్చున్నానని కదూ నువ్వనటం! రాముడూ! వెంకటాద్రిని తెలుసుకోవటం అంత సులభం కాదోయ్ పిచ్చివాడా!

సుబ్బన్న వెనక్కు, ఇటూ అటూ తిరిగి
చూసుకొంటూ ఒంగుతూ వచ్చాడు.

వెంక: (దూరంనుండే గమనించి) ఓ! పత్రికాధిపతులా! రండి! రండి! ఏమిలా దయచేశారు యీ పాపకూపంలోకి?

సుబ్బ: (కొంచెం చివుక్కుమన్నది కాని లేనినవ్వు తెచ్చుకొని) స్వర్గానికి స్మశానం నుండే పోవాలి అంటారుగదండీ! అదీ తమబోటివారున్నప్పుడు ఇది పాపకూపం ఎలా అవుతుంది?

వెంక: ఇది రామయ్య భవంతి కాదండీ! రంగుమార్చుకొల్లేము! ఆఁ - ఇంతకూ పూరకరారు మహాత్ములు - ఏదా? ఏం విశేషం?

సుబ్బ: ఏమున్నాయి? మీకు తెలియందీ? చూస్తున్నారుగా జరుగుతున్న నాటకమంతా?

వెంక: సూత్రధారు డెవరో కనపడలేదే?

సుబ్బ: అదే! ఆ ఇదే తమతో మనవి చేసుకుందామని వచ్చాను. చూశారూ? ప్రపంచంలో సత్యం చెప్పేవారు చాలా తక్కువ. ఏ ఒకరిద్దరు సత్యం చెప్పాలనుకున్నా విని నమ్మేవాళ్ళు అసలే లేరండి! ఏమంటారు?

వెంక: రామయ్యగారి దగ్గర నేర్చుకున్న నీతిపాఠాలు నా దగ్గరెందుకు చెప్పజెపుతారు? రానీండి!

సుబ్బ: మంత్రి వచ్చినప్పటినుండి చాలాచాలా అన్యాయాలు మహా ఇదిగా జరిగినవండి.. (ఇటూ అటూ చూచి) లంచాలకు ఒడిగట్టడంకూడా జరిగిందండీ! అన్నిటికీ నా దగ్గర వివరా లున్నవి... అవి కాస్త మనబోటివాళ్ళమైనా బైట పెట్టకపోతే - ఇది?

వెంక: అవునుమరి, అన్యాయాన్ని అరికట్టాల్సినవారు పత్రికాధిపతులు.

సుబ్బ: అదెంతపనండీ. పేపర్లో ఇది చెయ్యాలంటే చేయవచ్చు. ముందుగా మీబోటి పెద్దమనుష్యుల ఎదుట పెట్టుకొని ముఖంమీద అడిగేస్తే ఇదిగా వుంటుందని.

వెంక: ఓహో! అందుకోసం దయచేశారా?

సుబ్బ: చిత్తం! తమరొకసారి దయచేస్తే—

వెంక: (చేతికర్ర తీసి తిన్నెమీద బాదినాడు. ఆ శబ్దానికి సుబ్బన్న అదిరిపడ్డాడు. వెంకటాద్రిలేచి నుంచున్నాడు. సుబ్బన్న విస్తుపోయి అలా చూస్తున్నాడు. అప్పుడు వెంకటాద్రిని చూస్తే సగం వామనావతారం, సగం నరసింహావతారం అనిపిస్తుంది) పాతాళానికి అణిచేస్తాను. జాగ్రత్త! మూతులునాకే కుక్కా! నా దగ్గరకు పరుగెత్తావూ ఇప్పుడు? అక్కడ పాకం చెడేటప్పటికి ఆ వెయ్యి రూపాయలూ రాబట్టుకోటానికి యీ ఎత్తు వేశావూ? పో - వెళ్ళు - యీ పొలిమేరల్లోకి రాకు. ఎముకలు విరగబొడుస్తాను పో!

సుబ్బ: ....అదికాదండీ. ..యథార్థం వెల్లడిచేయాలి గదండీ!

వెంక: పోవోయ్ డాఫర్! యథార్థం నీబోటి కుంకలవల్ల వుతుందా వెల్లడిచేయటానికి? యథార్థం తనంతట అదే బయటపడుతుంది! నీ స్వార్థానికి, నీ వెయ్యి రూపాయలకోసం బయటపెడతావూ? ఒరే! వీడు వెంకటాద్రి! వీడి వెంట్రుకను కూడా మోసం చేయలేవు. వెళ్ళు ప్రాణాలతో బతికి పో - పో! - - -

సుబ్బన్న లేచి కొంతదూరంలో నిలబడి వున్నాడు.

వెంక: (ఒకపెద్ద రాయితీసి) పోతావా? లేదా?

సుబ్బన్న పరుగెత్తాడు.

వెంక: (ఆ రాయి దగ్గరే పారేస్తూ) డాఫర్ వెధవ! నాకు టోపీ వేద్దామని వచ్చాడు.... చూశావా! రాముడూ!

రాము: పెపంచకం మరీ విపరీతమవుతుందాదండి!

చిన్నయ్య రొప్పుకుంటూ పరుగెత్తుకొచ్చాడు.

వెంక: చిన్నయ్యా! ఏమిటి?

చిన్న: పోలీసోళ్ళొచ్చారండి.

వెంక: రిజర్వేనా?

చిన్న: అవునండి.

వెంక: వాళ్ళమీద రాళ్ళుపడ్డాయి అవునా?

చిన్న: అవునండి. మనోళ్ళెవరు కాలండి కొట్టింది.

వెంక: నాకుతెలుసు. తర్వాత లాఠీచార్జీ మొదలెట్టారు అంతేనా?

చిన్న: అవునండి.

వెంక: మనవాళ్ళేం చేస్తున్నారు?

చిన్న: నిలబడి ఉన్నారండి.

రాము: నిలబడి వుండారు. తలబవగిలి సత్తారు. ఎల్లాజల్లా పలపల రాలిపోతారు. మీరిక్కడే కూకోండి. సల్లగా శెట్టుకింద కూకోండి. సత్తారు నాయాళ్ళు (కడుపుమంటతో అన్నాడు.)

వెంక: రాముడూ!...(వీపుమీద తడుతూ) రాముడూ .... (చేతికర్ర రెండుమూడు సార్లు రాతితిన్నెమీదకొట్టాడు) ఊఁ - సరే వెళ్తాను. రాముడూ నీ సందేహాన్ని తీర్చే అవకాశం వస్తుందో రాదో! నేను స్వయంగా నీకు వచ్చుచెప్పేకాలం రాకపోవచ్చు. కానీ వెంకటాద్రి ఆలోచన, వ్యూహం, సరిగ్గా జరిగితే ఇంతవరకు జరుగుతున్నట్లు జరిగితే త్వరలో నీకే అర్థమవుతుంది యీ వెంకటాద్రి ఎందు కిక్కడ వుండినది. సరేనా?....వస్తా! జాగ్రత్త! ఏమైనాసరే! చావునుమాత్రం కోరి తెచ్చుకోవద్దు! అలాగని పిరికిపంద కావద్దు! రా! చిన్నయ్యా!

చిన్నయ్య, వెంకటాద్రి పరుగుమీద వెళ్ళారు. రాముడు వాళ్ల కనుచూపు దాటేవరకు అలా చూస్తున్నాడు. ఒకటి రెండు నిముషాలు అటూ ఇటూ పచారుచేశాడు; తిన్నెమీద కూర్చోబోతున్నాడు.

సబ్: (వచ్చి) ఎవర్రా అది?

రాము: (ఉలిక్కిపడి) నేనే!

సబ్: నే నంటే? నీ పేరు?

రాము: రాముడంటారు?

సబ్: గూడెంలో ఇంకా ఎవరున్నారు?

రాము: ఓరులేరండి.

సబ్: ఆడవాళ్ళు?

రాము: లేరండి.

సబ్: ఎక్కడికి కెళ్ళారు?

రాము: అదేమోనండి.

సబ్: ఊఁ - ఇట్టా చెప్తావా నువ్వు, ఇచ్చేదిస్తే చెప్తావు!

రాము: ఆడోళ్ళతో మీ కేం పనండీ.

సబ్: మీకేం పనో మాకూ అదే.

రాము: మర్యాదగా మాట్టాడండి- మీకూ ఆడోళ్ళుండారు.

సబ్: ఆఁ - (కత్తి ఎత్తి) ఇప్పుడు రాదులే! మీ గూడెంలో కల్లు పూడ్చిపెట్టి వున్నారు ఎక్కడ? చూపించు!

రాము: మా గూడెంలో కల్లాండి?

సబ్: అవును. తెలుగు అర్థం కావటంలేదేం! చూపించవోయ్!

రాము: నాకు తెలీదండీ! అసలెక్కడ వుంటే కదండీ చూపటానికి.

సబ్: లేదూ!

రాము: లేదు.

సబ్: లేదూ?

రాము: లేదనికాకేంటి చెప్పడం?

సబ్: లేదూ? (చెంపమీద దెబ్బవేశాడు.)

రాముడు కత్తి ఎత్తాడు; సబ్ఇన్‌స్పెక్టర్ పిస్టల్ తీశాడు. రాముడు కత్తి దింపేశాడు. కళ్ళ నీళ్ళు వస్తున్నవి.

సబ్: ఏడుస్తున్నావేటోయ్ మొనగాడా?

రాము: మొనగాడు వాడకూడదు ఏడవటం. ఈ జనమలో ఇంత అగుమానం ఓర్చుకోలా! నీ పిస్తోలు చూసికాదు కత్తి దింపింది. సత్తెంగారు చెప్పినమాటే ఎంకటాద్రయ్యగారు చెప్పివెళ్ళారు "సావును కోరి తెచ్చుకోవద్ద"ని. ఆళ్ళకు జవాబు చెప్పాల! నీ అంత వేలిగ్గా నేను సావటానికి వీల్లేదు. తెలిసిందా? లేకుంటే ఈ పాటికి నీ పెద్దోళ్ళను చేరుకునే వోడివి!

సబ్: పదవోయ్! పద!....ఊఁ - (మెడబట్టి గెంటుతాడు. కొంతదూరం అట్లా నెట్టుకొనిపోయి ఒకచోట ఆగి) ఆ కత్తితో యీ మన్నును మెల్లగా తీసే! ఊఁ - (రాముడు అట్లా చేశాడు) ఆ కుండను పైకి లాగు. ఊఁ - లాగవోయ్! చూస్తావేం! లేదట లేదు. ఏమిటిది? కల్లుకాదూ! దొంగ వెధవలు!___

రాము: మోసం!

సబ్: ఆఁ హాఁ - మోసమేనా?

రాము: అన్నాయం!

సబ్: అంతేనా?

రాము: అవును అంతే!

సబ్: ఇంకో చెంప మిగిలుంది తెలుసునా?

రాము: నా కింకో చెంప! మీది తలే మిగిలుంది.

సబ్: ఆఁ - (ఒక దెబ్బ కొట్టాడు) తీసుకోవోయ్ ఆ కిల్లీ! నెత్తిన పెట్టుకో - నడు ___

రాము: ఏడికి?

సబ్: అత్తగారింటికి! ఊఁ - (ఇద్దరూ నడుస్తున్నారు.)

ఒక కుక్క పూర్తిగా మొరుగుతూంది. మొరిగి మొరిగి అలిసిపోయి పడుకుని వుంది. ఒక్కక్షణం మళ్ళా మొరుగుతూంది; చిన్నయ్య "రాముడూ రాముడూ" అంటూ పరుగెత్తుకొచ్చాడు. గూడెమంతా పడుకున్నారు అలిస్తూ. ఆగని పిలుపుకు కుక్క మొరుగుతూ జవాబిస్తుంది. ఆ భాష వాడి కర్థం కాలేదు.

చిన్న: (చివరిసారి) రాముడూ! తుపాకులు కాలుస్తుంటార్రా! లచ్మి - రాముడూ - లచ్మి - (దిగులుగా ఏడుస్తూ వెళ్ళాడు.)

మరొక క్షణం మళ్ళా కుక్క మొరుగుతూంది. చెవిటయ్య నెత్తురు కారుతుంటూ వచ్చాడు. పడుతూ లేస్తూ, "చిన్నయ్యా, చిన్నయ్యా!" అంటూ అరిచాడు. కుక్కే బదులు చెప్పింది మళ్ళా. "చిన్నయ్యా! పోలీసులు కాల్చేశార్రా! కాల్చేస్తుంటార్రా" అంటూ పడిపోయాడు. కుక్క అలిసిపోయి మూలుగుతూంది. సుబ్బన్న తొందర తొందరగా వచ్చాడు. కుక్క మొరగలేదు, మూలుగుతూంది.

సుబ్బ: వెంకటాద్రీ! వెంకటాద్రీ! (ఇటు అటు చూశాడు! చెవిటయ్య అగుపించాడు. దగ్గరకెళ్ళి చూచి) చెవిటిగా! చెవిటీగా!

చెవి: (కదిలాడు)

సుబ్బ: నెత్తురు! అరె!

చెవి: (పోతున్నానని సైగచేసి) ఏమిటి? (అని అడిగాడు)

సుబ్బ: వెంకటాద్రి ఎక్కడ?

చెవి: (అక్కడ అని సైగచేసి) పోలీసులు. తుపాకులు (అన్నాడు మెల్లిగా.)

సుబ్బ: రామయ్య గుట్టంతా ఆనందయ్యకు చెప్పేశాడు. వెంకటాద్రి రావాలి.

చెవిటయ్య తల వాల్చేశాడు.

సుబ్బ: పోయాడు……. ….(వెళ్ళాడు.)

మరొక నిమిషం దూరంగా హాహాకారాలు. మెల్లమెల్లగా దగ్గరగా వినిపిస్తున్నవి. కొన్ని అస్థిపంజరాలు ఒక మంచంమీద వెంకటాద్రిని మోసుకొచ్చినవి. కుక్క లేని ఓపికతో లేచి వాళ్ళ కాళ్ళచుట్టూ తిరిగి పడిపోయింది. మంచాన్ని తిన్నెమీద పెట్టారు. చిన్నయ్య వెంకటాద్రిని తాకి చూచి తల వంచేశాడు. దూరంలో కారు హారన్ చప్పుడు. అందరూ అటు చూశారు.

1. అదిగో మంత్రి గారు!
2. పదండి! ఆపండి! అడ్డం పడండి!
3. పారిపోతుందాడు! పట్టుకోండి!
(దూరంనుంచి) ఆగండి! ఆగండి!
1. సత్యం!
2. సత్యంగారే! —

సత్యం: (వచ్చాడు) ఆగండి! మీరు మంత్రికోసం వెళ్ళి ప్రయోజనం లేదు. వెంకటాద్రి ఎక్కడ? (అందరి ముఖాలు దీనంగా మంచంవైపు తిరిగాయి. ఆఁ — వెంకటాద్రి! (దగ్గర కెళ్ళి తాకి చూచి) వెంకటాద్రీ! — (తల వంచేశాడు) చిన్నయ్యా! నా పాకలో వున్న జెండా పట్టుకురా! (చిన్నయ్య వెళ్ళాడు.)

ఇదిగో — ఆనందయ్య నాకు వ్రాసిపంపిన జాబు! మీ రందరూ వినవచ్చు:

సత్యానికి —

చెప్పుడు మాటలు విని కొన్ని చేశాను, స్వయంకృతాలు కొన్ని. అన్నీ పొరబాట్లే. తొందర పనిమీద వెళ్తున్నాను. మళ్ళీ వచ్చి అన్నీ విచారిస్తాను. క్షమించాలి. వెంకటాద్రికి నా నమస్కారాలు!

— ఆ నం దం.

ఆ జాబు వెంకటాద్రి కాళ్ళ దగ్గర పెట్టాడు. చిన్నయ్య తెచ్చిన జెండా తలవైపు పెట్టాడు. పైనున్న వంచె వెంకటాద్రికి కప్పినాడు.

పదవులు, పార్టీలు ఎరగని నిర్మల ప్రజాసేవకుడు!
మనకు ధ్రువతార!
మనల్ని విడిపోయాడు!

అందరూ అతని పాదాలు కళ్ళకద్దుకొని వెళ్తున్నారు. సత్యంకూడా.

కేవలం నిశ్శబ్దం, ప్రశాంతత.

తె ర వ్రా లు తుం ది.



# ఈనాడు

స్వాతంత్ర్యం సిద్ధించిన 1947 లో రగుల్కొన్న మత కల్లోలానికి స్పందించి రాసిన నాటకం 'ఈనాడు'. ప్రేరణ 'ది బాన్ ఫయిర్' అనే చిన్న కథ. మతసామరస్యం కోసం ఆత్మబలిదానం చేసిన మన 'బాపూజీ' కి ఆత్రేయ ఈ నాటకాన్ని అంకితమిచ్చారు.

# పరిచయం

ఆగస్టు 15 వ తేదీతో 'స్వరాజ్యం' వచ్చిందని భారత ప్రజలు సంబరపడ్డారు. భారతభూమిని చీల్చి, బ్రిటిషువారు పెట్టిపోయిన మత కలహాల చిచ్చును మన ప్రజలు ఆపలేకపోయారు.

ఒకే ఇంట్లో ఇరుగుపొరుగున వుంటున్న పురుషోత్తం, అక్బరు కుటుంబాలు కూడా ఆగస్టు 15 ను జాతీయ పండుగగా జరిపాయి. పురుషోత్తం, అక్బరులు మతాలు వేరైనా చిన్ననాటినుంచీ మిత్రులు. వారి కుమార్తెలైన రామ్, రహీము లిద్దరికీ నసీం అక్కవంటిది.

అన్యోన్యంగా పెనవేసుకుపోయిన ఆ కుటుంబాలమధ్య ఇద్దరికీ ఆప్తునివలె నటించే నరుమంత్రపు డాక్టరు అనుమానాలు సృష్టించుతాడు. ఒకే ఇంట్లో రెండు భాగాల మధ్య వున్న తలుపు బంధించ బడుతుంది.

అక్బరు ఒక హిందూ పిల్లతల్లికి తన యింట్లో ఆశ్రయ మిస్తాడు. పురుషోత్తం ఒక ముస్లింకాందిశీకునికి నీడ యిస్తాడు. మతకలహాలచిచ్చుతో ఉన్మాదులైన గ్రామస్తులకు యిది గిట్టదు. రామ్ రహీములకు వురెక్కిస్తారు. వారి ద్వేషాగ్నికి ఆ రెండు కుటుంబాలు బలి అయిపోతాయి.

ఈ ఇతివృత్తాన్ని ఆత్రేయగారు చక్కని నాటకంగా ఈనాడులో చిత్రించారు. గత జనవరిలో జరిగిన ఆంధ్ర నాట్య కళాపరిష్యత్తులో ''యీనాడు'' ప్రదర్శనకు ప్రథమ బహుమతి రావడమే యిందుకు నిదర్శనం.

'ఈ నాడు'లో ఆగష్టు 15 న రామ్ నసీమ్‌కు బహుమతిగా యిచ్చిన 'గాంధీజీ' పటాన్ని మతకలహాలు రేగాక ఒక హిందూ మత దురహంకారి విసరిన బాకు బ్రద్దలు చేస్తుంది. ఈ సన్నివేశాన్ని గాంధీజీ హత్యకు పూర్వం కొన్ని నెలలకుముందే వూహించగలిగిన రచయితకు నా ధన్యవాదాలు.

ఆంధ్రప్రజలు 'ఈనాడు' నాటకాన్ని ఆదరించుతారని ఆశించుతున్నాను. ఆత్రేయగారు ఆంధ్ర ప్రజాజీవితాన్ని చిత్రించే నాటకాలను రచించి ఆంధ్రనాటక రంగానికి యితోధిక సేవ చేస్తారని విశ్వసించుతున్నాను.

విజయవాడ
23-2-48

మద్దుకూరి చంద్రశేఖరరావు.
['ప్రజాశక్తి' సంపాదకులు]

# నా మాట

ఆంధ్రనాటక కళాసరస్వతికి నే సమర్పిస్తున్న ద్వితీయ పుష్పం యీ 'ఈనాడు'. ఈ నాటకం బెజవాడలో జరిగిన 11 వ ఆంధ్ర నాటకకళా పరిషత్సమా వేశాలలో వెంకటగిరి అమెచ్యూర్ ఆర్టిస్ట్సు అసోసియేషన్ వారిచే ప్రదర్శింప బడింది. వారి కృషి ఫలితంగా ప్రదర్శనకు ప్రథమ బహుమానం పొందారు. వెంకటగిరి సమాజం నాదే అయినా వారికి నేను కృతజ్ఞతాపూర్వక అభివందనా లర్పిస్తున్నాను.

ఈ నాడు భారతదేశాన్ని కల్లోలపరుస్తూ అన్ని విధాలా అభ్యుదయాన్ని అరికడుతూ, స్వతంత్ర భారతదేశ పునాదులను అదరగొడుతూ మన బాపూజీ ప్రాణాలను కూడా చివరికి బలిగొన్న మతావేశ పిశాచి వికటాట్టహాసం యొక్క ప్రతిబింబం యీ 'ఈనాడు' ఇతివృత్తం. మహాత్ముని మత సామరస్య సిద్ధాంతంలో సంపూర్ణ విశ్వాసంతో రచింపబడ్డ ఈ నాటకం గ్రామగ్రామాన ప్రదర్శింపబడి, ఆయన ఆదర్శ ప్రచారం జరిగి, ఈ మతావేశాన్ని కాస్తయినా చల్లార్చ గలిగిననాడే నా 'ఈనాడు' రచన సార్థకమై, ఫలితం దక్కుతుంది. నేనూ ధన్యుణ్ణవుతాను. ఈ నాటకం ఆ విధంగా ప్రచారం కావటానికి నాటకకళ ద్వారా ఇప్పటికే ఎంతో ప్రజా సేవ చేసి ఆంధ్ర నాటక రంగాభ్యుదయానికి తోడ్పడి, నా బోటి రచయితలకు క్రొత్త ఉత్సాహాన్ని కలిగిస్తున్న ఆంధ్ర ప్రజానాట్యమండలివారు పూనుకుంటారనే ఆశతో వారికి దీన్ని అర్పిస్తున్నాను.

ఈ నాటకం బాపూజీ అస్తమయానికి ముందు వ్రాయబడింది.

నాటకం చదివినవారు, కొందరు రంగాలంకారాలు చాలా కష్టమని, గ్రామాదు లలో ప్రదర్శించటానికి వీలుండదేమోనని సందేహం వెలిబుచ్చారు. అలాంటి కష్టం ఏమీలేదు. నాటకంలో ముఖ్యం అభినయమూ, సంభాషణలు, సన్నివేశాలేకాని, అలంకారాలు దీపాలు కావని, నా అభిమతం. స్థూలదృష్టికి అవి చాలా ప్రధానమైనట్టు కనుపించవచ్చును. కానీ వాటిని వినా కూడా నాటకం రక్తి కట్టగలదనే నా నమ్మకం. వీలులేని ఒకటి రెండు సన్నివేశాలలో మార్పులుకూడా సూచించి వున్నాను. తలుపులు మూయడం మొదలైనవి రెండు చెక్కల శబ్దాలతో సూచించవచ్చు. ప్రదర్శించే సమాజాలు స్వశక్తిమీద ఆధారపడి అనుకూలాలు కలిగించుకోవాలని ప్రార్థన.

8-6-47 తేది వెలువడిన పీపుల్స్ఏజ్ పత్రికలో హజ్రాబేగం రచించిన "The Bone fire" అను చిన్నకథ ఈ నాటక రచనకు ప్రోత్సాహం కలుగజేసింది. అందుకు నే నామెకు కృతజ్ఞుణ్ణి.

మత సామరస్య సాధనకు నా యీ రచన కించిత్ దోహదం చేయగలిగితే నేను ధన్యుణ్ణి. ఆ దృష్టితో ఆంధ్ర ప్రజానీకం యీ కృతిని ఆదరిస్తుందని ఆశిస్తున్నాను.

— ఆత్రేయ

# ఇందులో పాత్రలు

| | | | |
|---|---|---|---|
| అక్బరు | : | ఒక ముస్లిం వృద్ధుడు | ఇరుగు |
| పురుషోత్తం | : | ఒక హిందూ వృద్ధుడు | పొరుగు |
| రహీం | : | అక్బరు కొడుకు | |
| నసీం | : | అక్బరు కూతురు | |
| రాం | : | పురుషోత్తం కొడుకు | |
| వత్సల | : | నసీం స్నేహితురాలు | |

గులాం, గూండా

....ఇంకా మరి కొందరు....

కాలం : ఈనాడే

స్థలం : ఒకచోట; అక్బరు ఇల్లు

రంగాలు : మూడు

# తొలిసారి
# ఈ నాటకం

విజయవాడలో జరిగిన ఆంధ్ర నాటక కళాపరిషత్ సమావేశాలలో
'వెంకటగిరి ఎమెచ్యూర్ ఆర్టిస్ట్ అసోసియేషన్'
వారిచే ప్రదర్శింపబడింది.

ఆనాటి నటవర్గం:

| | | |
|---|---|---|
| అక్బర్ | : | డాక్టరు టి. దామోదరం |
| పురుషోత్తం | : | శ్రీ జగన్నాధ ప్రసాద్ |
| రాం | : | ,, ఈశ్వరదాస్ |
| రహీం | : | ,, ఆత్రేయ |
| డాక్టరు | : | ,, సి. జయరాం నాయుడు |
| గులాం | : | ,, డి. జగన్నాధ్ |
| గూండా | : | ,, కబీరు |
| నసీం | : | ,, శ్రీమతి సురభి బాలసరస్వతి |
| వత్సల | : | ,, రాజేశ్వరి |

సంగీతం: జగన్నాధ్

# మొదటి రంగం

అక్బర్ ఇల్లు: ఒక హాలు.

ఎదురుగా కనిపించే గోడలో ఒక పెద్ద కిటికీ వుంది. ఆ కిటికీకి అద్దాల తలుపులూ, చెక్క తలుపులూ వున్నవి. ఆ కిటికీ తెరిస్తే వీధి కనిపిస్తుంది. కిటికీకి నేరుగా ఒక ఎలక్ట్రిక్ దీప స్తంభం వుంది. హాలు కుడిచేతివైపు రెండు ద్వారాలు, ఎడమచేతివైపు రెండు ద్వారాలు వున్నవి. ఎడమచేతివైపు ముందు ద్వారం ప్రక్క యింటిలోకి వెళ్లేది. వెనుకద్వారం వంట యిల్లు. హాలు లోకి ఒక పెద్ద పురాతనమైన కొయ్యపెట్టె వుంది. దాని ప్రక్కనే ఒక తోలు పెట్టె వుంది. ఎడమచేతివైపు రెండు ద్వారాలకు మధ్య కోట్ స్టాండ్ వుంది. కిటికీ ప్రక్కనే ఒక పెద్ద క్యాలండరుంది. హాలులో ఒక మంచం; ఒక పడక కుర్చీ వున్నవి.

## ఆగస్టు 14

సమయం: నడిరేయి.

ఇంటిద్వారాల కన్నిటికీ పచ్చటి తోరణాలు, త్రివర్ణపతాక తోరణాలు వున్నవి. ఇల్లంతా దీపావళి నాడువలె దీపాలు వెలిగించి వున్నాయి. కిటికీ తెరచి వుంది. కిటికీలోనుంచి ఒక త్రివర్ణ స్వతంత్ర భారత పతాకం అగుపిస్తూంది. దానిపైన ఒక ఎలక్ట్రిక్ దీపం. నసీం పాడుతూ దీపాలు వెలిగిస్తూంది.

చుట్టుప్రక్కల ఇళ్ళవాళ్లు కూడా పాడుతున్నారు. వాకిట స్వాతంత్ర్యోత్సవం జరుపుతూన్న హడావిడి అంతా వుంది. ఊరేగింపులో పాడుతూన్న పాటకూడా వినిపిస్తూంది. ఒకవైపు గుడిగంట గంభీరంగా పాట తాళానికి లయకుదురుతూ మ్రోగుతూంది. మధ్య మధ్య శంఖారావం.

స్వాతంత్ర్య ధ్వజమెత్తరా!
జయభేరి మ్రోగించరా!
మూడువందల యేళ్ళ
ముదిదాస్య బంధాల
క్రుంగిపోయిన జాతి
కోలుకొని తలలెత్తి!...

కోట్లకొలది వీరవితతి
కురిపించిన రక్తధార
అసంఖ్యాక ప్రజానీక
మర్పించిన అశ్రుజలం
నిర్జించిన దీ దాస్యం!
ఆర్జించిన దీ ముక్తి!...

రహీం గదిలోనుంచి వచ్చాడు. కొత్త గుడ్డలు తొడుక్కొని వున్నాడు. ఇవన్నీ జరిగేటప్పటికి ఉదయమయింది .......

రహీం: నసీం! స్వాతంత్ర్యోత్సవం హడావిడిలో అన్నం వండటం మరిచిపోయేవు సుమా!

నసీం: స్వాతంత్ర్యం వచ్చింతర్వాత కూడా అన్నం కావాలా బాయ్?

రహీం: అందుకే నువ్వూ నేనూ చెప్పక్కర్లేకుండానే రేషన్ ఇంకా తగ్గించేస్తున్నార్లే! .........ఇంతకూ తమ్ముడు రామెక్కడ?

నసీం: ఏమో ఎక్కడ తిరుగుతున్నాడో! ఈ రోజంతా అగుపించాడా అసలు? స్వాతంత్ర్యోత్సవమంతా తమ్ముడి నెత్తిన్నే వున్నట్లుంది.

రహీం: (కిటికీలోంచి చూసి) నసీం! ఇట్లూరా! ఇట్లూరా!

నసీం: ఏం?

రహీం: చూడు నసీం! చూడు! ఎంత అందంగావుంది వూరు! అబ్బ! ఎన్ని దీపాలు! ఎంత ఆనందం! ఎంత అలంకారం! ఊరంతా ఉత్సాహంతో పొంగిపోతూంది! బీదాబిక్కీ, ముసలీముతక, పెద్దాచిన్నా, - అందరూ ఎంత ఆనందంగా ఉన్నారు. మనం అదృష్టవంతులం నసీం నిజంగా! మన భారతమాత, మన దేశమాత దాస్యశృంఖలాల నుండి విడివడే శుభ ముహూర్తం, ఆ అమృతక్షణం మనం చూడగలిగాం! ('స్వతంత్రభారత్‌కు' అని కేక)

నసీం: రహీం: 'జై'

నేపథ్యంలో బృందగీతి, రహీం, నసీం కూడా పాడుతున్నారు.

సత్యాగ్రహమ్ములో
విప్లవోద్యమములో

అనువులొసగిన వీర
యోధులకు జోహార్లు!...

పాట సన్నగిలిపోయింది. కుడిచేతివైపు నుంచి అక్బరు, పురుషోత్తం వచ్చారు.
నసీం క్యాలెండరు తేదీ 15 కు మార్చింది.

అక్బ: అన్ని వీధులకంటె మనవీధే చాలా బాగుంది. ఏమంటావ్?

పురు: బజార్లో బలే అలంకారం చేశారు. చూశావా?

అక్బ: ఆఁ. దానికేంలే! డబ్బుగలవాళ్లు చేశారు. అదీ ఒక గొప్పేనా?

పురు: ఆ విధంగా ఆలోచిస్తే హరిజనవాడలో చేసిన అలంకారం అన్నిటికంటే ఉత్తమం అంటాను. రహీం! నువ్వు చూశావా?

రహీం: చూడకేం? నిజంగా చాలా బాగుంది, బాబా! ఈ నాడందరూ కొత్తగుడ్డలు వేసారే?

అక్బ: నువ్వు కొనివ్వకపోతేనా రాం నన్ను మరచిపోలేదులే! వాడు తీసిచ్చాడు ఈనాడు కానుకగా!

పురు: నాకు రహీం కొనిచ్చాడీ బట్టలు తెలుసా?

రహీం: ఇంతకూ నసీందే అదృష్టం! మీ రిద్దరూ కొనిచ్చారట కదూ!

పురు: అరే! నువ్విచ్చావా అక్బర్? నాకు తెలియదే!

అక్బర్: అసలు నువ్వు తీసిచ్చావని నాకు తెలుసా?

నసీం కలకల నవ్వింది. వాకిట రాం పెద్దగా, నిండుగా నవ్వుతున్న శబ్దం.

రాం: (వాకిటే ఎవరితోనో) రేపు తప్పకుండా విందు! ఏం?

అక్బర్: అడుగో రాం!

పురు: అసలీ రోజు వాడికి తీరికే వున్నట్లు లేదు.

నసీం: ఉదయం వెళ్ళినవాడు ఇదే రావడం?

రాం వచ్చాడు.

రహీం: రాం! అయిందా స్వాతంత్ర్యోత్సవమంతా?

రాం: బలేవాడివే రహీం నువ్వు! నాతో వస్తూన్నట్లే వుండి తటాలున మాయమై పోయావే! నీ కోసం ఎంతసేపు వెతికాను? ఎక్కడికెళ్ళావు?

రహీం: నీ కోసం నేనూ వెతికాను. ఎక్కడ కనిపిస్తావా గుంపులో! కొంగులు కొంగులు ముడేసుకున్నా ఆ జనం తోపిడి ఆగేటట్లుందా?

అక్క: పురుషోత్తం! ఇంత ఇంత పిల్లలు కూడా 'స్వతంత్ర భారత్‌కి జై' అంటూ ఒళ్ళు తెలియని ఆనందంతో అరుస్తూంటే నా వళ్ళు పులకరించి పోయిందోయ్!

పురు: పిల్లలేమిటి -! కూలీలు - రైతులు - ఎండిపోయిన ఎముకల గూళ్ళల్లో నుంచి ఎంత ఉత్సాహం పొంగి పొరలింది?

అక్క: అన్నిటినీ మరిపించే ఇంతటి ఆనందంతో ఈ దేశం నిండిపోతుందని నేనెన్నడూ అనుకోలేదు నిజంగా!

రాం: అన్నీ బాగానే వున్నాయి కానీ ——

పురు: కానీ ఏమిటి?

రాం: ఈనాడు జండాలను కూడా బ్లాక్‌మార్కెట్ చేసారు. అందుకే నా హృదయం చివుక్కుమన్నది.

పురు: నిజమే! అది చాల అవమానపడాల్సిన విషయమే!

రహీం: అబ్బ! పోనిద్దురూ ఇప్పు డెందుకా గొడవ!

రాం: నసీం! నీ కొక ప్రెజెంటు తెచ్చాను.

నసీం: ఏమిటది?

రాం: (బాపూజీ పటం ఇచ్చాడు)

నసీం: (తీసుకొని) బాపూజీ!

నేపథ్యంలో 'మహాత్మాగాంధీకి జై' అని కేక. అందరూ 'జై' అన్నారు. 'స్వతంత్ర భారత్‌కు జై' అందరూ కిటికీవైపు తిరిగి పాడుతున్నారు....

కటిక దారిద్ర్యాన
కమిలిపోయిన గుండె
చెఱసాల చీకట్ల
చివికిపోయిన బ్రతుకు
చిగురించి వికసించి
చిరునవ్వు చిందగా
పగలేని వగలేని
జగతి సృష్టించగా!...

వెలుతురు మెల్లగా తగ్గిస్తూ రావాలి. పాట అయిపోయేటప్పటికి రంగస్థలం అంతా చీకటి అయిపోవాలి.

ఒక్క క్షణం:

క్యాలెండరులో తేదీ మార్చి లైట్లు వేసి సీను జరపవచ్చు. ఈ దీపాల అను కూలం లేనివాళ్ళు తెర దింపి తేదీ మార్చి మరల తెర తీయటం మంచిది.

## ఆగస్టు 18

### సమయం: పగలు

ఆగస్టు 15 కట్టిన తోరణాలింకా వున్నవి. దీపాలు మాత్రం లేవు. రాము నసీము కిచ్చిన గాంధీపటం గోడకు తగిలించి వుంది. నసీం ఒకవైపుగా కూర్చొని ఎర్రగడ్డలు ఒలుగుతూంది. కొంతసేపటికి గదిలో నుంచి అక్బరు వచ్చాడు.

అక్బ: నసీం!

నసీం: బాబా!

అక్బ: పురుషోత్తంబాబు కెలా గుందమ్మా?

నసీం: ఇప్పుడే వెళ్ళి చూచివచ్చాను. కొంచెం నెమ్మదిగానే వుంది బాబా!

అక్బ: అల్లాహో అక్బర్!

నసీం: స్వతంత్రోత్సవానికి విందులు బలంగా పడ్డట్టుంది. అందుకే జాస్తి సుస్తీ చేసింది.

అక్బ: ఆఁ - నాకు తెలియని విందులేమున్నాయి. మేమిద్దరం ఒకటిగానేగా వెళ్ళాం అన్ని విందులకు? ఇంకా చూస్తే డాక్టరింటి విందు నా కొకటి ఎక్కువ.

నసీం: పురుషోత్తంబాబు కూడా వెళ్ళారటగా?

అక్బ: ఆదెప్పుడు? ఆ రోజు నాతో రాలేదే?

నసీం: ఆ రోజు డాక్టరాయన్ను పిలవలేదట. మరునటిరోజు హిందువు లందరికీ విందు చేస్తున్నానని పిలిచారట.

అక్బ: అలాగా! ఆ డాక్టరెప్పుడూ అంతే! మా యిద్దరికీ సంబంధించిన విషయం మాట్లాడాల్సి వచ్చినా వేరే వేరే పిలిచి మాట్లాడటం అతని అలవాటు. అందుకే విందులు కూడా వేరు చేసాడు.

నసీం: మీరేమన్నా అనండి బాబా! అతని మాటంటే నాకు మహామంట.

అక్బ: పోనీలే తల్లీ! ఏదో పరాయిదేశంవాడు....త్వరలో మూటాముల్లెతో వాళ్ళ దేశం వెళ్తున్నాడు. ఇంకెందుకు చెప్పు లేనిపోని గొడవలు?....ఉండమ్మా! ఉత్తంబాబును చూచిరావాలి!

నసీం: మీ రింటికొచ్చిన వెంటనే చెప్పమన్నారు రమ్మని.

అశ్ర: అవును పాపం! రోజూ కాస్సేపు బాతాఖానీ వేస్తేగానీ ముద్దదిగదు. చిన్న తనం నుంచి అట్లా అలవాటుపడ్డాం. నాకు ఒకసారి జబ్బుచేస్తే ఇరవైనాలుగు గంటలూ నా పక్కనే వుండేవాడు తిండీ తిప్పలు మానేసి. వట్టి వెర్రివాడు పాపం! (ఎడమచేతివైపు ద్వారంగుండా వెళ్ళాడు).

కుడిచేతివైపు ద్వారంగుండా వీధినుంచి రహీం వచ్చాడు.

రహీం: నసీం! బాబా ఎక్కడ?

నసీం: ఆ యింటి కెళ్ళారు.

రహీం: ఉత్తం బాబింటి కేనా?

నసీం: అవును. ఏం?

రహీం: ఏమీలేదు. (అటూ ఇటూ తిరుగుతుంటాడు)

నసీం: ఎందుకట్లా కాలుకాలిన పిల్లిలా తిరగటం?

రహీం: ఏమీలేదు...బాబా కెంత చెప్పినా తెలియటంలేదు.

నసీం: ఏమిటది?

రహీం: తీరా నెత్తిమీదకొస్తే అప్పుడేడుస్తారు.

నసీం: ఇప్పుడేం కొంప మునిగింది?

రహీం: కొంప అదే ఎందుకు మునుగుతుంది? మనం ముంచుకుంటాం గానీ ——

నసీం: ఏమిటో నీ మాటలు నా కేమీ అర్థంకావడం లేదు.

రహీం: అర్థంకావాల్సిన వారికే కాలేదు! నీ కెందుకవుతుంది? బాబాకు పూర్తిగా మతి పోయింది. నెత్తిన నోరు పెట్టుకొని చెప్తున్నాను. ఇప్పుడు నా మాట లాయన కెక్కడంలేదు. అనుభవానికొచ్చినప్పు డవస్థపడేది ఆయనొక్కడే అయితే ఫర్వాలేదు. కాలానికి కట్టుబడిపోవడం బుద్ధిమంతుల లక్షణం!

నసీం: బాగానే వుంది వుపన్యాసం! ఇంతకూ అసలు విషయం?

రహీం: విషయాని కేముంది? అందరికీ తెలిసిందే!

నసీం: అదేమిటో చెప్పరాదూ?

రహీం: నేను చెప్పటం ఎందుకు? ఇదిగో - నువ్వే చదువుకో - (పేపరొకటి విసిరి వేసాడు).

నసీం: (కొంతసేపు ఆ పేపరు చదివి, ఆలోచించి) అదా సంగతి?

రహీం: అదేగానీ నువ్వన్నంత తేలికమాత్రం కాదు.

నసీం: అయితే ఏం చేయమంటావు?

రహీం: ఆ దర్వాజాను వెంటనే బంద్ చేయమంటాను?

నసీం: ఆ దర్వాజా ఏం చేసిం దిప్పుడు?

రహీం: ఆ దర్వాజాయే మన కొంప ముంచబోయేది. దాన్ని మూసేస్తేనేగానీ నువ్వూ నేనూ ప్రాణాల్తో వుండటమంటూ జరగదు.

నసీం: భాయ్! ఉత్తంబాబునే అనుమానిస్తున్నావా!

రహీం: కాదు నసీం!

నసీం: మరి?

రహీం: మరి - మరి! - నసీం! చూస్కో? నా మాట వింటావా? బాబుకు నే నంటే పసిపిల్లవాడి కింద జమ. నీ మాటంటే కొంచెం ఖాతిరీ వుంది. నువ్వైనా బాబాతో చెప్పు. ప్రస్తుతానికి రాస్త భ్రప్రపతాం ద్వేషాలు పెంచుకోమని చెప్పటంలేదు నేను! కానీ ——

నసీం: రాముతో మాట్లాదావా యీ విషయం?

రహీం: మనం మాట్లాడేవరకు వాళ్ళు కాచుక్కూచోలేదు. నే నెన్నడూ కలలో కూడా అనుకోలేదు! రాంలో ఇంత మార్పు కలుగుతుందని. రాం ఎట్లా ప్రవర్తించాడో తెలుసా?

నసీం: ఏం చేశాడు?

రహీం: నేను బజార్లో వున్నాను. రాం నా ప్రక్కనే వెళ్లాడు. నన్ను చూడనుకూడా చూచాడు. కానీ నాతో ఒక్కపలుకు పలకలేదు. ఈ మార్పుక్కారణం ఏమిటంటావు?

నసీం: పొరబాటు! భాయ్!

రహీం: పొరబాటు! పోనీ పొరబాటే అనుకుందాము. మనం జాగ్రత్తపడితే కలిగే నష్టమేముంది చెప్పు. నే నిప్పుడేం కత్తులు నూరమని చెప్పటం లేదుగా?

రాం చరచర వీధిలోనుంచి చేతిలో ఒక మందుసీసాతో వచ్చాడు....

నసీం: రాం! ఏమంత హడావిడిగా వెళ్తున్నావ్?

రాం: ఇదిగో యీ మందు నాన్నకిచ్చి వస్తా. (వెళ్ళాడు)

రహీం: ఇకనయినా యీ రహదారిని మాన్పించేయాలి.

నసీం: ఈ రోజు కొత్తకాదుగా?

రహీం: కొత్తో పాతో! ఆ యింటికి వేరేదారివుండగా వాళ్ళు దాన్ని ఉపయోగించుకోవటం మంచిదంటాను. పరిస్థితులనుబట్టి మారటం అవసరం. లేకుంటే గోటితోపోయేది గొడ్డలి కావాలిసొస్తుంది. నసీం! మన క్షేమాన్నాశించి బాబాతో నువ్వయినా చెప్పాలి. లేదా—(వెళ్ళాడు)

నసీం అట్లాగే నిలబడింది కాస్సేపు. ఒక నిట్టూర్పువదలి ఇటు తిరిగింది.

రాం వచ్చాడు.

రాం: రహీం ఎక్కడ?

నసీం: ఇప్పుడే వెళ్ళాడు.

రాం: (ఒక్కక్షణం అట్లా నిలబడ్డాడు. తిరిగివెళ్ళబోతున్నాడు)

నసీం: తమ్ముడూ? ఏం వెళ్తున్నావు?

రాం: ఏమీలేదు. రహీం యీరోజు - (ఏమో చెప్పబోయాడు. దృష్టి నేలమీదవున్న పేపరుమీదపడింది. తీసి చదివాడు—మనిషి వణికిపోతున్నాడు. పేపరును పరపర చింపేశాడు) దీన్ని ముందు నిప్పులో పారేయ్!

నసీం: ఏం తమ్ముడూ?

రాం: ఇది మనయింట్లో వుండకూడదు.

నసీం: ఏం? ముస్లిములేగా అధికంగా చస్తున్నారు?

రాం: నసీం! (నఖశిఖపర్యంతం వణికిపోయాడు. తటాలున లేచాడు. నసీం నోరు మూసేంతదూరం వచ్చి ఆగింది చేయి. ముఖం చేతుల్తో కప్పుకొని కూలబడ్డాడు.)

నసీం: (తొందరపడి అన్నందుకు చాలా బాధపడుతూంది. ఒక్కక్షణం ఏమి మాట్లాడాలో తెలియక వూరుకుంది. మెల్లగా రామూను సమీపించి) భాయ్!

రాం: బహెన్! (తలపైకెత్తాడు. కళ్ళవెంట నీరు కారుతూంది)

నసీం: (హృదయాన్ని కలచివేసిందాసంబోధన) రాం! ఊర్కే తమాషా కన్నదాన్ని గూర్చి ఇంత ఆవేదన పడాలా?

రాం: తమాషా కాదు నసీం! తమాషా కిదికాదు సమయం. నా హృదయం ఎంతగా బాధపడుతుందో మీకు తెలీదు. రహీంకూడా యీనాడు - అసలు మీరందరూ ఎందు చేతనో యీనాడు - నా హృదయాన్నిట్లా బాధపెడుతున్నారు.

నసీం: రహీం ఏం చేసాడు?

రాం: కారణం ఎరగను. కానీ నాతో మాట్లాడటం మానేసాడు.

నసీం: అదెప్పటి నుంచి?

రాం: అన్నీ యీనాడే! ఈనాడే! అన్నీ జరిగినవి - జరుగుతూన్నవి. బజారులో కనుపించి రహీం నాతో పల్కకుండా ఎన్నడూ పోయింది లేదు. ఎందుచేతనో యీ రోజు ముఖం తిప్పేసాడు - వెళ్ళిపోయాడు.

నసీం: (నవ్వు వచ్చింది కాని ఆపుకొని) చాలా బాగుంది మీ ఇద్దరి తగాదా! నువ్వు పలకలేదని రహీము, రహీము పలకలేదని నువ్వు——

రాం: రహీం నీతో అన్నాడా నేను పలకలేదని?

నసీం: అవును. ఇప్పుడే అన్నాడు. నువ్వే ముఖం తప్పించావట.

రాం: కేవలం పొరపాటు నసీం! రహీం ఇప్పుడెక్కడికి వెళ్ళాడు?

నసీం: ఏమో! ఏమీ చెప్పలేదు.

రాం: ఉండు నసీం! రహీంను కలుసుకొస్తా. (నడ్రని వీధివైపు వెళ్ళాడు.)

వాకిలి వైపునుంచి అక్బర్, డాక్టరు వచ్చారు.

అక్బర్: కూర్చోండి డాక్టర్‌సాబ్! - నసీం కాస్త ఛా పెట్టివ్వు డాక్టర్‌గారికి? (నసీం వంటింట్లోకి వెళ్ళింది)

డాక్టర్: ఆc - ఇప్పుడెందుకు లేండి!

అక్బర్: ఏం ఫర్వాలేదు. మా ఛా కాస్త తాగండి. మీ దేశం వెళ్తున్నారు. మీక్కావాలన్నా దొరకదు మా ముస్లిం ఛా!

డాక్టర్: ఇంతలో పంపేస్తున్నారే మూటగట్టి?

అక్బర్: మీరు చెప్పిందేగా?

డాక్టర్: ఆc - అవును. మా సిబ్బందినంతా పంపేసాను. కాని -

అక్బర్: కాని?

డాక్టర్: ఊళ్ళో కొందరు ఏవో కొన్ని పరిష్కారాలుచేసి మరీ వెళ్ళమని పట్టుబడుతున్నారు. అదీగాక - ఆc - నేను చెప్పదలచుకున్నది కూడా చెప్పేస్తాను.

అక్బర్: చెప్పండి. చల్లకొచ్చి ముంతదాచడ మెందుకూ?

డాక్టర్: ఆc ఏమీలేదు. నన్నుమీరు సరిగా అర్థంచేసుకోవాలి. చూశారూ? నేను ఇటు అటు ఇద్దరికీ కావాల్సిన వాడినే - అదీగాక వెళ్ళిపోయేవాడికి నాకు యీ విషయాల్లో జోక్యం కలుగజేసుకోవాల్సిన అవసరమూ లేదు. అయినా నాడ్యూటీ నేను చెయ్యాలిగా? ఏమంటారు?

అక్బర్: ఇదంతా కేవలం ఉపోద్ఘాతం అంటాను. అంతేనా?

డాక్టర్: (కొద్దిగా నవ్వి) అవునులెండి! ఆఁ వూళ్ళో పరిస్థితి గమనిస్తున్నారా?

అక్బర్: గమనిస్తూనే వున్నా.

డాక్టర్: ఎట్లాగుందంటారు?

అక్బర్: చాలా ఘోరంగానే వుంది. రేషన్ చాలటం లేదు. బ్లాక్‌మార్కెట్ ఆగటం లేదు. లంచాలు కిందనుంచీ పైదాకా బాగా పాకినవి. అధికారమో, పలుకుబడో లేని పేదవాడి బ్రతుకు—

డాక్టర్: అబ్బ! కాదండి!

అక్బర్: మరి?

డాక్టర్: మీరు చాల అజాగ్రత్తగా—నిద్రపోతూ వున్నారని చెప్పాలి. అంతే!

అక్బర్: అంటే?

డాక్టర్: రహీం మీతో ఏమీ చెప్పలేదు?

అక్బర్: ఏమిటి విశేషం?

డాక్టర్: విశేషంకాదు! ఇట్లా వుంటే మీరు, మీ మతం, జాతి నిశ్శేషం! అంతే! (రహస్యంగా) హిందువులు మిమ్మల్ని మసి - మసి చేసేయాలని సిద్ధపడుతున్నారు. తెలుసా?

అక్బర్: మంచిదే!

డాక్టర్: ప్రతి హిందువు ఇంట కత్తులు, తుపాకులు సరఫరాచేసి పెట్టారు, తెలిసిందా?

అక్బర్: మరఫిరంగులు ఇళ్ళల్లో పట్టవు గనక మానేశారు. అంతేనా?

డాక్టర్: మీకంతా వేళాకోళమే! నేను చెప్పాల్సింది చెప్పాను. తరువాత మీ యిష్టం.

అక్బర్: డాక్టర్‌సాబ్! ఇది తెలిసిన విషయమేగా! కొత్త ఏమీలేదు. అందుకు మనం ఏంచేస్తాం?

డాక్టర్: నేను ఒకే ఒక్క పాయింటు చెప్తాను మీ కిష్టంవుంటే వినండి, లేదా మానేయండి; అదీ మీవాళ్ళు చెప్పమంటే చెపుతున్నా. వెళ్ళేవాడికి నా కెందుకీ గొడవ లేకుంటే!

అక్బర్: సరే, ఆ పాయింటేమిటో చెప్పండి.

డాక్టర్: మరి - మీరు కొంచెం మనసుకు నొప్పి కలిగినా ఓర్చుకొని ఆ దర్వాజాను మూసేయాలి.

అక్బర్: ఏమన్నారు?

డాక్టర్: నే ననడం కాదు, మీ వాళ్ళందరూ అంటున్నారు. అట్లా దర్వాజా తెరిచి వుంచడం మంచిదికాదని, ఏమంటారు?

అక్బర్: ఆ అధిక ప్రసంగం వాళ్ళ కక్కుర్తే దంటాను.
డాక్టర్: ఇది కేవలం మీకు సంబంధించింది మాత్రం కాదని -
అక్బర్: అవును, కేవలం నా సొంత విషయం. అంతే!
డాక్టర్: అయితే—

ఇంతలో లోపలనుంచి పురుషోత్తం వస్తూ.

పురు: అక్బర్, ఏమిటోయ్! ఇదిగో వస్తానంటూ వచ్చేశావు! అరగంటయింది, పత్తాలేవే! ఓ, డాక్టర్‌గారా! నమస్తే!
డాక్టర్: నమస్తే! మిమ్మల్ని రెస్టు తీసుకోమన్నానుగా! ఎందుకొచ్చారు? నాకు ఒక అర్జంట్ కేసుంది. వస్తా. సెలవు! (వెళతాడు)
అక్బర్: కూర్చో పురుషోత్తం!
పురు: ఏమిటోయ్! అంత బెదిరిపోయి జారుకున్నాడు దాక్టరు?
అక్బర్: ఆఁ, వాడి దుంప తెగింది. అది సరేగానీ నువ్వు సుస్తీగా వుండి ఎందుకొచ్చావు? నేను రానూ?
పురు: నువ్వూ దాక్టరూ కలిసి నన్ను పెద్దరోగిని చేసేస్తున్నారే? ఏదో యీ రేషన్ బియ్యం తిని కాస్త మందగిస్తే అదీ గొప్ప రోగమేనా!
నసీం: (టీ పట్టుకొచ్చి) దాక్టరు వెళ్లాడా బాబా?
అక్బర్: ఆ వెళ్ళాడు. ఆ ఛా పురుషోత్తం బాబా కివ్వు తాగుతాడు.
నసీం: ఛా తాగొచ్చా బాబా మీరు?
అక్బర్: ఆ ఇంగ్లీషు పత్యాలు మనకొద్దులే యింక. తాగు ఫర్వాలేదు.

నసీం టీ పురుషోత్తానికి యిచ్చింది. పురుషోత్తం తాగుతున్నాడు. రాం వీధి వైపు నుంచి వస్తాడు............

రాం: కాఫీర్! కాఫిర్‌నట!
అక్బర్: రాం! ఏమిటది?
రాం: ఇంత అవమానం చేస్తాడని కలలో కూడా అనుకోలేదు.
పురు: ఏమిట్రా అది?
రాం: మనం కాఫిర్లమట! వాళ్ళ దాపునకైనా రాకూడదట!
పురు: ఎవరన్నార్రా!
రాం: ఎవరో అంటే ఎందు కీ ఏడుపు?
అక్బర్: రహీం అన్నాడా?

పురు: సప్వార్కో అక్బర్! రహీం ఎందుకంటాడు? అట్లాంటి కూత లెన్నడూ కూయడు రహీం!

రాం: తానుగా అనడు. ఇతరులచేత అనిపిస్తాడు.

పురు: చాల్లే! బుద్ధిలేకుండా మాట్లాడకు.

అక్బర్: నువ్వెప్పుడూ రహీమును పైనవేసుకొస్తా వెందుకూ? నీకు తెలియదు వాడి విషయం, వాడెప్పుడూ వుద్రేకం మనిషి. అన్నా అని వుంటాడు.

పురు: వీడేమీ అనకుంటే వాడెందుకంటాడు? వీడుమాత్రం ఏం సామాన్యుదా? ఏమీ తీసిపోడు!

నసీం: అసలు ఏమిటి రాం యీ తగాదాలంతా! ఈనాడు మీరిద్దరూ వింత తగాదాలు తెచ్చుకుంటున్నారే?

పురు: ఏమిటోనమ్మా యీ కుర్రవాళ్ళూ, వీళ్ళ స్నేహాలూ! మేము మా చిన్నతనంలో ఇట్లా ఎన్నడూ తగాదాలు పడి ఎరగం. చీటికి మాటికి చిటపటలాడుతా రీ కుర్రాళ్లు.

అక్బర్: ఏం జరిగింది రాం?

రాం: నేనేమీ చెప్పదలుచుకోలేదు. కానీ రహీం ప్రవర్తన మాత్రం నాకేమీ బాగుండలేదు అంతే! (వెళ్తున్నాడు)

పురు: రాం! ఆగు - ఒకవేళ రహీం ఏమైనా అన్నాడే అనుకో నువ్వు కాస్త సర్దుకొనిపోతే ఏం? అంతటితో నీ నెత్తిన కిరీటం జారిపోతుందా!

రాం: నెత్తిన కిరీటం జారిపోతుందని కాదు. సర్దుకొని పోవటమంటే ఏమిటో నాకూ తెలుసున్నాన్నా! సర్దుకొనే పోతున్నాను.

పురు: అంత సర్దుకొని పోయినా సహించరానిదేం వచ్చిందిప్పుడు?

రాం: ఇది ఇప్పుడు వచ్చింది కాదు. ఎన్నో రోజులుగా రహీం మనసులోనే పేర పెట్టుకొంటున్నాడు.

నసీం: రాం! ఏమన్నావు?

పురు: ఊఁ హుఁ! తమరు జ్యోతిషం చెప్తున్నారన్నమాట! వెధవ వేషాలు వేయకు. తెలిసిందా? రాం! యింకొక్కసారి ఇట్లాంటి కూతలు కూసావంటే పళ్ళూడ గొడతాను. నేర్చుకొంటూన్నట్లుంది రాజకీయాలు!

రాం: నేనేం కొత్తగా నేర్చుకోలేదు. మొన్న విందులు కూడా వేరే చేయాల్సిందని డాక్టరుతో తానే చెప్పాడటగా?

నసీం: ఎవరు? రహీమా?

రాం: అవును.

అక్బర్: డాక్టర్ సీతో చెప్పావా నాయనా?

రాం: అవును.

అక్బర్: మంచిదే! వాడు మీ దగ్గరకూడా చేరుతున్నాడన్నమాట. ఊఁ - సరే? ఆ మూడవవాడిమాట నువ్వు నమ్మావు కదూ?

రాం: కళ్ళ ఎదుట కనిపిస్తూన్నదాన్నే నమ్మొద్దంటారా?

పురు: నీ నమ్మకాపనమ్మకాలు ఎవరిక్కావాలోయ్!

రాం: మీ యిష్టం మీరేమన్నా అనండి. కానీ - నా మనసారా చెప్తున్నాను - దీన్ని పెద్దది చేసుకోవాలని నా కే మాత్రం ఏ కోశాన లేదు. మీరు నమ్మండి. (వెళ్లాడు)

అక్బర్: ఆ వెధవకు స్నేహం మంచీ చెడ్డ ఏమీలేకుండా పోయింది. ఆవేశంవస్తే ఎంతమాటైనా అనేస్తాడు.

నసీం: వీళ్ళిద్దరూ మాట్లాడుకోవడం లేదు బాబా.

పురు: అదెప్పటి నుంచి?

నసీం: ఈనాడే ఉదయమే నాకు తెలిసింది.

పురు: మొన్న స్వాతంత్ర్య దినంనాడు పండుగంతా తమనెత్తినే వున్నట్లు రాత్రి తెల్లవార్లూ ఇద్దరూ వూరంతా అలంకారాలు చేస్తూండినారే! ఇంతలో ఏం వచ్చింది వీళ్ళకు?

నసీం: ఏమో! ఇది యిట్లా పెరిగిపెరిగి విరుచుకొని పడుతుందేమో! మీరు కాస్త రహీముకు చెప్పండి బాబా.

పురు: వాడికి చెప్పేదేమిటి! వీడికి ముందు బుద్ధిచెప్పాలి గానీ!

అక్బర్: అదంతా కాదు పురుషోత్తం! ఆ నిజార్లవా డింతా చేస్తున్నాడు. నాకదే అనుమానం.

పురు: ఎవరు? డాక్టరా?

అక్బర్: ఆఁ - డాక్టరే! అసలతను డాక్ట రెందుకవుతాడు? మందుల వ్యాపారం చేసుకొనేవాడు.

నసీం: నేను మొదటినుంచీ అంటూనే వున్నా. అతనంటే నా కెందుకో మంట. బోడితలకు మోకాలికి ముడిపెట్టే వ్యవహారం అతనిది.

పురు: అట్లా చేసే కదూ ఇంత ఆస్తి, పలుకుబడి సంపాయించాడు.

అక్బర్: అతన్నని ఏం వుపయోగం? మనవాళ్ళ కుండొద్దూ బుద్ధి? అసలు యీమధ్య రహీంకు కొత్త స్నేహితులు చేరినట్లుంది. ఇంట్లో కాలు నిలపక తిరుగు తున్నాడు కదు నసీం?

నసీం: అవును బాబా! మరీ యీ మధ్య పేపర్లో ముఖ్యంగా యీ గలాటాల విషయాలు చదివి ఏకరువు పెట్టటం అధికమైపోయింది.

అక్బర్: ఊఁ ___

పురు: వాడిమీద తంటాలు చెప్పటం నీకు చిన్నతనంనుంచి అలవాటైపోయింది!

నసీం: ఇందులో తంటాలేవీ లేవులే బాబా! ఇటువంటి విషయాల్లో మనం ముందుగా తెగ్గోయకపోతే ప్రమాదం.

పురు: అందరూ ఆ రహీంమీదే విరుచుకపడతారేం?

అక్బర్: వాడి విషయం మాకు బాగా తెలుసుగనక. పట్టి కోతిపిడికిలి మనిషి. తాపట్టిన కుందేటికి మూడేకాళ్ళు.

నసిం: అసలింతెందుకు. వాడితో ఎంత పోరు ఇంట్లో! ఇంత వంట చేస్తామా - వాడి కొక్కటీ గిట్టదు. తీరా నీకేం కావాలో చెప్పరా అంటే ___

పురు: వాడికని వేరే కూర చేస్తే ఏంపోతుంది?

నసీం: ఎట్లాంటి కూర కావాలో చెప్తేనా! వాడికే తెలియదు వాడికేం కావాలో!

అక్బర్: ఇప్పుడు వీడెక్కడ!

నసీం: ఏమో! ఎక్కడికెళ్ళాడో! గంటముందు వచ్చి గల్లంతుచేసి పోయాడు.

అక్బర్: ఏమని?

నసీం: ఊళ్ళో ఏదో వుడికిపోతూందట. గలాటా జరిగేటట్లుంది! మనం జాగ్రత్త పడాలని.

అక్బర్: ఏడవలేకపోయాడు.

పురు: ఆ డాక్టరూ అంతే. ఊర్కే చెప్పుకొచ్చేవాడీ చావుకబుర్లు. ఒక రిక్షావాణ్ణి పొడిచేసారు. ఒక స్కూలుమాష్టరు చచ్చాడు అని.

నసీం: నిజమే బాబా యీ కలహాలు వూరూరు పాకిపోతున్నాయి.

పురు: పాకుతాయి కాళ్ళువచ్చి! ఎందుకంట యీ పశు ఆవేశం? రిక్షావాడికీ - స్కూలుమాష్టరికీ ఏది ఎట్లాపోతే ఏం కావాలి? వాళ్ళకేం తెలుసు. అట్లా చంపటమేనా ఆవేశం - మగతనం? ఛీఛీ! చండాలం!

అక్బర్: అవును. చచ్చేదంతా అమాయకప్రజ.

పురు: పోనీలే మనకెందుకా పాడుగోల. మనం స్మరించవన్నా స్మరించకూడదు.

రహీం వాకిలివైపు నుంచి వచ్చాడు.

నసీం: రాం లగుపించాదా ఖాయ్?

రహీం: లేదు. (కొయ్యపెట్టెమీద కూర్చోబోతున్నాడు.)

అక్బర్: ఆ పెట్టెమీద కూర్చోవద్దని ఎన్నిసార్లు చెప్పాను. అందులో ఖురా నుందిరా!

రహీం: (వేరేగా కూర్చున్నాడు).

పురు: ఏం నాయనా అట్లా వున్నావు?

రహీం: ఏమీ లేదు.

నసీం: ఛా కావాలా?

రహీం: కావాలి.

నసీం: (లోపలి కెళ్ళింది).

అక్బర్: రాముడూ నీకూ ఏమిట్రా తగాదాలు?

రహీం: తగాదాల కేమున్నాయి? ఏమీలేదు.

అక్బర్: రాముని నువ్వేమన్నావు?

రహీం: నే నేమన్నాను?

అక్బర్: వాడేమైనా అన్నాడా నిన్ను?

రహీం: ఏమీ అనలేదే!

అక్బర్: మరి మీ రిద్దరూ ఎందుకు మాట్లాడటం లేదు?

రహీం: అదేమో రాంనే అడగండి.

అక్బర్: నువ్వెందుకు మాట్లాడటంలేదురా?

రహీం: అతను మాట్లాడటం మానేశాడు గనుక!

అక్బర్: నువ్వు రాంను కాఫిర్ అన్నావా?

రహీం: నేనా?

అక్బర్: నువ్వే!

రహీం: ఎప్పుడు?

అక్బర్: ఈనాడే! ఇంతకుముందే!

రహీం: నేనేమీ అనలేదు.

అక్బర్: ఛీ! అబద్ధాలు చెప్తావ్ బద్మాష్!

రహీం: ఏమిటి మీ కేకలు?

పురు: ఊర్కో అక్బర్! నిజానిజాలు తెలియకనే కేకలేస్తావెందుకు?

అక్బర్: పురుషోత్తం! నువ్వు మరీ వీణ్ణి నెత్తి కెక్కించుకొంటున్నావ్? వీడు నలుగురు రౌడీలను వెంటవేసుకొని వాళ్ళచేత కూయించి వుంటాడు.

రహీం: మీరు నిజం తెలియకుండా మాట్లాడుతున్నారు. రాం మీ దగ్గర ఏం తంటాలు చెప్పాడో —

అక్బర్: చాల్లే! ముయ్ నోరు!

రహీం: అయితే సన్నేం చేయమంటారు? నాతో చదువుకున్న స్నేహితులతో నేనుండగా రాం అక్కడికి వచ్చాడు. వాళ్ళందరూ మనలాగే వుంటారా? అందులో ఎవడో అన్నాడు. దాంతో రాము వచ్చేశాడు పిలుస్తున్నా పలక్కుండా. ఇది నా తప్పంటారా? నేను చెప్పి చేయించా నంటారా?

అక్బర్: అటువంటి మూకతో నీకేం స్నేహంరా?

రహీం: ప్రపంచంలో అందరూ మనలాగే వుండరు. కాలం మారుతూంటే కళ్ళు మూసుక్కూచోలే రందరూ. ఎవరి అభిప్రాయాలు వారివి.

అక్బర్: ఇదిగో ఖచ్చితంగా చెప్తున్నాను. నువ్విటువంటి విషయాల్లో ఏమీ జోక్యం కలగజేసుకోడానికి వీల్లేదు. మేము బతికి వున్నంతకాలం ఈ కుటుంబాలు యిట్లా వుండాల్సిందే. మే మిద్దరం ఒకటిగా పెరిగాం. మా కళ్ళముందే మా స్నేహం నాశనం కాకూడదు.

రహీం: నేనిప్పుడు స్నేహాన్ని నాశనం చేసుకోమని చెప్పడం లేదు.

అక్బర్: నువ్వేమీ చెప్పనక్కర్లే దసలు.

రహీం: అంత మూర్ఖంగా వుంటే అనవసరంగా అందరికీ ఆపదలు తెచ్చిపెట్టిన వాళ్ళవుతారు.

అక్బర్: చాల్లేవోయ్ నువ్వేనా మహా రక్షించేవాడివి?

పురు: ఉండు అక్బర్! చెప్పనీ అతన్ని?

రహీం: ఊర్కే కేకలేస్తా రెందుకూ? నేను చెప్పేది వినండి. తరువాత మీ ఇష్టం.

అక్బర్: ఏమిటి నువ్వు చెప్పేది?

రహీం: నేను మీకేం రాజకీయాలు చెప్పటంలేదు. జాతి మత విషయా లంతకుముందే చెప్పను. నా అభిప్రాయం ఒక్కటే — ఆత్మరక్షణ చేసుకోవటం అత్యవసరం, మానవధర్మం కూడా. అందుకు మనం ఏనాటికైనా సిద్ధంగా వుండాలి. కేవలం మొండిగా కూర్చొని ప్రాణాలు పోగొట్టుకోవడం పిరికితనం అంటాను అంతే!

అక్బర్: అంతేనా?

రహీం: కత్తులు నూరిపెట్టుకోమని. వీథులవెంబడి ఉరుక్తేరి పొడవాలని నేను చెప్పటం లేదు.

అక్బర్: అంతేనా?

రహీం: అంతే.

అక్బ: చాలా సంతోషించాం. ఆ మాత్రం మాకూ తెలుసు.

రహీం: తెలిస్తే చాలా మంచిదే! ఇప్పటికే ఊళ్ళో మనల్ని గురించి విమర్శలు జరుగుతున్నాయి. మనం యిట్లా కలిసివుండటం ఏ మతంవారికీ ఇష్టంలేదు. గుసగుసలు బయల్దేరాయి. బలవంతంగానైనా యీ రెండు కుటుంబాలను వేరు చేయాలని సంకల్పించుకొన్నారు. ఐక్యతను హర్షించే రోజులు కావివి. అది కేవలం ఆదర్శం మాత్రమే. ఆ ఆదర్శం అమలు జరిపినప్పుడు అదొక అవమానంగా రెండు జాతులూ అసహ్యించుకొంటున్నాయి. ఇది మీరు గమనించాలి.

అక్బర్ అదోవిధంగా కోపం, దుఃఖంతో గదిలోకి వెళ్లాడు. పురుషోత్తం ఆలోచన బరువులో కూలబడ్డాడు . . .

నసీం: ఏమిటి భాయ్ యిదంతా?

రహీం: బయటిప్రపంచాన్ని గమనించకుండా కూపస్థమండూకాలలా వుంటే లాభం లేదు. 'నా యిష్టం నా ఇంట్లో నే నెలాగైనా వుంటా'నంటే జరిగే కాలం కాదిది. సంఘానికి ప్రతి వ్యక్తిజీవితం మీద అధికారం ఏర్పడ్డది.

పురు: (ఉద్రేకం వచ్చింది) సంఘం! ఏమిటా సంఘం? ఏమిటా అధికారం! స్నేహాన్ని, ప్రేమను, ఐకమత్యాన్ని నాశనం చేయటమేనా సంఘం పని? ఒకరి నొకరు పొడుచుకొని చావమనటమేనా సంఘం ఆశ? ఇవేనా రాజకీయాలు? మానవసంఘం యిదేనా? మన నాగరికత చేరగలిగిన శిఖరం ఇదేనా? నువ్వనే బయట ప్రపంచం ఇదేనా? అయితే మన కా ప్రపంచంతో పనిలేదు! ఆ సంఘంలో మనకు స్థానంలేదు. ఆ ప్రపంచాన్ని చూడకుండా కళ్ళుమూసుకొని పడివుంటాం? కూపస్థమండూకాల్లాగే వుండిపోతాం! ఆ సంఘాధికారాన్ని ఎదిరిస్తాం! (మంచంమీద కూలిపోయాడు)

నసీం: బాబా!

అక్బర్: (గదిలోనుంచి వచ్చాడు. అట్లా చూస్తూ నిలుచున్నాడు)

రహీం: (హృదయం దెబ్బతిన్నది. పురుషోత్తమాన్ని సమీపించి) బాబా!

పురు: నాయనా!

రహీం: క్షమించండి.

పురు: (నిట్టూర్పు వదిలాడు) కాదు నాయనా! ఆవేశాన్ని ఆపుకోలేకపోయాను. అధర్మాన్ని అణుమాత్రం సహించలేని దుర్బలహృదయం ఇది. చెప్పు! ఇప్పుడేం ఫర్వాలేదు. చెప్పు.

రహీం: అదికాదు బాబా! నాకుమాత్రం హృదయంలేదా? నేనేమాత్రం బాధపడటం లేదనుకొంటున్నారా? కానీ ——

పురు: కానీ ఏమిటో చెప్పు నాయనా చెప్పు.

రహీం: వ్యక్తిగతంగా వుండే స్నేహాలను, అభిమానాలను మొత్తంమీద ఒక సంఘంలో జరిగే జాతిమతద్వేషాలు తెంచేస్తాయి. అది నిజంగా బాధే! హింసే! కానీ ఏం చేస్తాం? ఒక హిందువును ముస్లిం అభిమానిస్తున్నా, ఒక ముస్లింకు హిందువు నిలువనీడ నిచ్చాడన్నా కులభ్రష్టులుగా, జాతిద్రోహులుగా చూస్తున్నారు. అట్లాంటివారిని ఆ జాతివారే సర్వనాశనం చేయటానికి సిద్ధపడుతున్నారు. ఈ మతకలహప్రవాహంలో స్నేహం, ప్రేమ అన్నీ కొట్టుకొనిపోతూన్నవి. ఇది మానవత్వానికి కళంకమే! కానీ.... తెలిసి తెలిసి మనం ఆపదలెందుకు తెచ్చుకోవాలి? ఇది ఇద్దరికీ మంచిదేకదా! మీరే చెప్పండి.

పురు: మనం ఎట్లావుంటే వాళ్ళకేంపోయింది? మనయింటి విషయాలతో వాళ్ళ కేంపని బాబూ!

రహీం: ఆ వాదనలన్నీ ఇప్పుడెవరి బుర్రకెక్కుతాయి బాబా!

పురు: అయితే ... (మంచంమీద నుంచి లేచి రెండడుగులు వేసాడు) (అక్బరు అలాగే చూస్తూ నిలుచున్నాడు) అయితే మనం కూడా యీ వేలంవెర్రికి తలవంచాల్సిందేనా?

రహీం: ఇద్దరి శ్రేయస్సుకోరి అట్లా చేయటం మంచిదంటాను. నన్ను మీరు సరిగా అర్థంచేసుకున్నారో లేదో? నేనూ మానవుణ్ణే! నాకూ హృదయం వుంది. బాబా! మీ కంచంముందు నేను కూర్చుని మీ చేతులారా అన్నం ముద్దలు చేసిపెడితే తిన్న రోజులు నా కళ్ళ ఎదుట ఇంకా తారాడుతున్నవి. కానీ....

పురు: రహీం ——

రహీం: బాబా!

అక్బర్: (కళ్ళు గట్టిగా మూసుకున్నాడు)
నసీం: (నిలువలేక లోపలికి వెళ్ళింది)
రహీం: మన స్నేహం, మన ప్రేమ నాశనం కావటానికి వీల్లేదు. ఈ చెడుపడటం తాత్కాలికం మాత్రమే. మళ్లా మనం కలుసుకొంటాం, తప్పదు.
పురు: ...... .. .......
రహీం: ఈ మతకలహాలు ఎందరినో ఇట్లాంటి వాళ్ళను వేరుచేసినవి. ఎన్నో హృదయాలను బలాత్కారంగా లాగిపారేసినవి. ఇదే యీనాడు జరుగుతూన్నది.

పురు: (తలవంచుకొని మెల్లగా వెళ్తున్నాడు)
రహీం: బాబా!
అక్బర్: పురుషోత్తం!
పురు: (చరచరా వెళ్ళాడు)
అక్బర్: (రహీంను ఒక్కక్షణం చూచాడు) నెరవేరిందా నీ కోరిక?
రహీం: బాబా! (కాళ్ళమీద వాల్తాడు)

బయట పెద్ద కల్లోలం, అరుపులు, ఏడ్పులు, కిటికీలోనుంచి మంటలు, పొగలు అగుపిస్తున్నవి.....

నసీం: బాబా! బాబా! ఇల్లు తగులబడిపోతుంది. బాబా!
అక్బర్: ఆఁ –
రహీం: (తటాలున లేచి వీధివైపు పరుగెత్తాడు)
అక్బర్: ఏ కసాయివాళ్ళు చేసారో పాపం?
నసీం: లోపల పిల్లా జెల్లా ఎవరైనా వున్నారేమో?
అక్బర్: గాలిలేదు. కొంతనయం.

వీధిలోనుంచి డాక్టరు వచ్చాడు దాపీగా. ఎవ్వరూ అతన్ని గమనించలేదు. దగ్గాడు.

అక్బర్: (తిరిగిచూసి) ఏమిలా వచ్చారు?
డాక్టరు: ఏమీలేదు. ఏమిటట్లా చూస్తున్నారు?
అక్బర్: ఎవరిదో కొంప తగులబడిపోయింది పాపం.
డాక్టరు: పాపం....ఊఁ....మొదలు పెట్టావన్న మాట!
అక్బర్: ఏమిటది?

డాక్టరు: ఏముంది! నౌకాలీ, బెంగాల్, పంజాబుల్లో జరిగింది - జరుగుతూన్నదే ఇది.
అక్బర్: ఇంత దూరం వచ్చిందా, అప్పుడే?
డాక్టరు: (కొద్దిగా నవ్వాడు. ఆ నవ్వు నసీంకు అసహ్యంగా వుంది. ఆమె గదిలోకి వెళ్ళింది) అప్పుడే అంటున్నారే! ఎంతసేపు రావాలి?
అక్బర్: ఎవ రీ ఘనకార్యానికి కంకణం కట్టింది?
డాక్టర్: ఎవరైతేనేం? జరుగుతుంది అంతే - ఓ! ఈనాడు ఆగష్టు 18 గా.
అక్బర్: అవును. ఎందుకూ?
డాక్టరు: ఏమీలేదు. స్వాతంత్ర్యం వచ్చి మూడు రోజులైంది.
అక్బర్: (ఆ మాట సులభంగానే అర్థమైంది. ఒక్క క్షణం కుమిలిపోయాడు. వెంటనే తేరుకొని) తమరు ఇంకా వెళ్ళలేదేం?
డాక్టరు: వెళ్ళినట్లే! సామానంతా బుక్ చేసాను.
అక్బర్: మంచిపని చేశారు. అయితే తమరిప్పుడు ఎందుకొచ్చినట్లు?
డాక్టరు: ఏమీలేదు. ఇదిగో - ఈ రివాల్వరు మీ దగ్గరుంచండి, వేరే ఎందుక్కాకున్నా నా జ్ఞాపకార్థమైనా వుంచండి. బహుశా మీకు ఆపత్కాలంలో ఉపయోగపడవచ్చు.
అక్బర్: (తీసుకోలేదు)
డాక్టరు: ఊళ్ళో పరిస్థితిలో నూరోవంతు మీ రిప్పుడు చూచారు, అంతే! ఇంకా ముందు ముందు ఎంతో వున్నది. మీరు నామాట వినండి. అయితే ఒక్క మాట ___
అక్బర్: ఊఁ -
డాక్టరు: నా కిందులో ఒకటే వుద్దేశం. మీరు ఈ రివాల్వరును కేవలం ఆత్మ రక్షణకు మాత్రమే వుపయోగించాలని నా కోరిక, ప్రార్థన. అట్లా వుపయోగించే పక్షంలోనే నేను మీ కివ్వదలచా.
అక్బర్: మంచిదే తమరు దయచేయొచ్చు!
డాక్టరు: యిట్లా వుంచిపోనా?
అక్బర్: అక్కర్లేదు. తీసుకెళ్ళండి.
డాక్టరు: ఆపత్కాలం ___
అక్బర్: మీకే రావచ్చు. మీరే ఉపయోగించుకోండి.
డాక్టరు: అందరూ తయారుగా వుంటే మీరుమాత్రం ___
అక్బర్: అక్కర్లేదని మీక్కూడా చెప్పటం.

డాక్టరు: మీరంటే వున్న అభిమానం ——

అక్బర్: డాక్టర్! నన్ను రెచ్చగొట్టకండి. దయచేసి ——

డాక్టరు: మీర్జాసాహేబు - ఇంతెందుకు - చివరికి ఫిర్దయ్యా ఇంట్లో నా దగ్గర కొన్ని కత్తులే పదిదాకా వున్నవి.

అక్బర్: దయచేసి తమరు వెళ్తారా వెళ్ళరా? - (ద్వారంవైపు చూచి) పురుషోత్తం-

డాక్టరు: (తిరిగిచూచి) సరే! వెళ్ళొస్తానండి! సెలవు!

అక్బర్: డాక్టర్! ఆగండి!

డాక్టరు: ఆఁ-ఆఁ- ఎందుకు? చాలా అవసరమైన కేసుంది.

అక్బర్: ఫర్వాలేదు ఆగండి. మా పురుషోత్తం రావాలంటాడేమో.

పురు: ఏమిటది?

అక్బర్: ఆఁ ఏమీలేదు. మతకలహాలకు మారణాయుధాలు.

డాక్టరు: నేను వస్తా.

అక్బర్: అబ్బ! కొంచెం వుండండి. మన డాక్టరుగారు పాపం వూరు వెళ్తున్నారు. వారు వెళ్ళే సమయానికి సరిగ్గా అదృష్టవశాత్తు మన వూళ్ళోకూడా మత కలహాలు మొదలుపెట్టారు. అది చూచి పాపం వారు మనకు ఆత్మరక్షణార్థం ఆయన దగ్గరున్న ఆయుధాలు ఇవ్వదలిచారు. అమ్ముతున్నారా? ఫ్రీగా ఇస్తున్నారా?

డాక్టరు: ఆఁ - ఏమీలేదు వస్తా.

అక్బర్: అది అమ్మకమే అనుకో. కానీ ఆత్మరక్షణకు మాత్రం వుపయోగిస్తామన్న షరతుమీదే ఇస్తున్నారు. తెలిసిందా? నీకేమన్నా కావాలా? కావాలంటే ఒక్క రివాల్వరు మాత్రం వుంది. ఏదీ! ఇట్లా ఇవ్వండి చూద్దాం.

డాక్టరు: ఆఁ - ఆఁ - ఆఁ - (వెనకడుగువేస్తూ జారుకున్నాడు)

అక్బర్: హుఁ - నీ దగ్గరకెప్పుడూ ఎప్పుడైనా వచ్చాడా?

పురు: వచ్చాడు?....(ఆలోచిస్తూ బరువుగా కూర్చున్నాడు)

అక్బర్: ఏమిటి పురుషోత్తం అంతగా దిగులుపడుతున్నావు? రహీం మాటలకేనా?

పురు: వాడి మాటలలో సత్యం లేకపోలేదు. చూడు ఆ మతకలహాల మంటలు. అవి మన కొంపమీదికి రావడం కష్టమంటావా?

అక్బర్: రానీ ——

పురు: అదికాదు అక్బర్! ——

అక్బర్: ఏమిటి నీ సందేహం?

పురు: ఏమీలేదు.......ఏంచేయాలి? ఏమీ తోచటంలేదు. భయంకరమైన యుద్ధమే సంప్రాప్తించేటట్లుంది. ఈ యుద్ధంలో మనం తటస్థంగావుండి యీ హత్యాకాండనంతా చూస్తుండాల్సిందేనా? ఒక సుదినాన మనం కూడా ఏ వెనక పాటు బాకుపోటుకో గురి కావాల్సిందేనా? అబ్బ! గుండె లదిరిపోతున్నాయి. ఆ దృశ్యాలు చూస్తే—

అక్బర్: ఊర్కో పుత్రం.

పురు: రహీం అన్నట్లు మనం ఇక ఒకరిసుఖాలొకరు చూచుకోటానికి వీల్లేదు. అంతేనా అక్బర్!

అక్బర్: (రివ్వుమని తిరిగాడు) ఎందుకు వీల్లేదు? రానీ. ప్రాణాలు పోనీ మనం ఒకటిగానే వుంటాం! ఒకటిగానే చస్తాం!

పురు: భాయ్!

అక్బర్: భాయ్!

ఇద్దరూ కౌగిలిలో మైమరచి వున్నారు. ఎడమచేతివైపు తలుపు తోసుకుని రాం పరుగెత్తు కొచ్చాడు .....

రాం: నాన్నా! నాన్నా!

పురు: ఏమిట్రా యీ హడావిడి?

రాం: బజార్లో ఇద్దర్ని పొడిచేశారు.

పురు: ఎవరు?

రాం: ఎవరో, ఎవర్నో తెలియదు. ఎక్కడివాళక్కడ పరుగెడుతున్నారు. కొంపలు కూడా తగలెట్టేస్తున్నారు.

పురు: ఆఁ. దౌర్భాగ్యులు! వీళ్ళకేం పోయేకాలంరా?

రాం: మనం చాలా ఆపదలో వున్నాం!

అక్బర్: ఏమిటి రాం?

రాం: నాన్నా! మీరు—మీరు—

పురు: ఏం? ఏమిట్రా?

రాం: మీరిక్కడ వుండటం మంచిదికాదు. నా మాట వినండి. వచ్చేయండి.

అక్బర్: రాం! (గట్టిగా అరిచాడు. కాని వెంటనే తగ్గాడు.) అనుమానిస్తున్నావా?

రాం: కాదు, కానేకాదు. కానీ —

వీధి తలుపులు వేసిన చప్పుడు, వీధిలో నుంచి రహీం వసుగెత్తుకొచ్చాడు.

రహీం: నసీం! నసీం!

నసీం: ఏమిటన్నయ్యా?

రహీం: తలుపులన్నీ మూసెయ్! త్వరగా! అన్ని కిటికీ తలుపులు మూసెయ్! వాళ్ళు వస్తారు.

అక్బర్: ఎవర్రా ఆ వచ్చేవాళ్ళు?

పురు: హిందువులేనా?

రహీం: ఎవరయితే యేం? ఎవరి బాకయినా పదును. బాధ ఒకటే. బాబా! ఇప్పటికైనా నామాట వినరూ?

పురు: ఏమిటి నాయనా?

రహీం: మీరే ఆలోచించండి! వాళ్ళు వస్తున్నారు. బలాత్కారంగా మనల్ని వేరు చేసి, యీ దర్వాజాను మూయించాలని నిశ్చయించారు. హిందూ - ముస్లిం ఇళ్ళను కలుపుతూన్న దర్వాజా వుండటం ఎవరికీ యిష్టంలేదు. మనం మొండిగా నిలిస్తే ఆ యింటికి పట్టిన గతే మనకూ వస్తుంది బాబా!

పురు: అయితే ఇప్పుడేం చేయాలంటావు?

రహీం: వాళ్ళొచ్చేస్తున్నారు. ఆ సమయానికైనా మీ రెవ్వరూ ఇక్కడ లేకుంటే చాలు. ఆ దర్వాజాను మూసేసి తాళం వేస్తే చాలు. చచ్చి ఏం సాధిస్తాం చెప్పండి! బాబా! దయచేసి ___

పురు: దయచేసి వెళ్ళాలి, అంతేనా?

రాం: రహీం చెప్పేది అక్షరాలా నిజం నాన్నా! మీరు త్వరపడకపోతే....

నసీం: మీరిద్దరూ ఇందులోనైనా ఏకీభవించారా?

రహీం: మా కెప్పుడు మాత్రం ఏముందీ? రాం! ఇంకా ఊహాపోహపడుతున్నావా?

రాం: లేదు రహీం! పరిస్థితులు! ఏం చేస్తాం? నాన్నా! రాండి మామాట యీ ఒక్క విషయంలో పాటించండి. (లాగుతున్నాడు)

పురు: ఒక్క కంచంలో తిన్నాం! ఒక్క మంచంలో పడుకున్నాం! దేహాలు వేరే అయినా ప్రాణాలు ఒకటిగా పెరిగాం! కానీ యీనాడు___

అక్బర్: ఈనాడు మనం ఒకటిగానే వుంటాం! ఒకటిగానే చస్తాం! పొడిచేస్తారా? పొడిచేయనీ! మమ్మల్ని వదిలేయండి.

రహీం: బాబా మొండిగా యిట్లా పట్టుబడితే ఎట్లా (లాగుతున్నాడు) మీ కోసం కాకున్నా మీ బిడ్డలకోసం—మాకోసం మా ప్రాణాలు కాపాట్టానికి —

రాం: నాన్నా! ఒకర్నొకరు చావు నోటి కందిచ్చుకొనే స్నేహం ఏం లాభం చెప్పండి. అక్బర్ బాబా క్షేమంకోరి రాండి. (లాగుతున్నాడు)

పురు: అక్బర్!

అక్బర్: ఉత్తం!

నసీం: బాబా! (ఏడుస్తుంది)

అక్బర్: నసీం! తల్లీ!

రాం నాన్నను లాక్కెళ్ళుతున్నాడు. అక్బర్ చివరిసారి చేయిచాపి 'ఉత్తం' అన్నాడు. తలుపు దబాలని మూయబడింది. 'అక్బర్' అన్న కేక వినిపించింది. అక్బర్ 'హా' అంటూ చెయ్యి లాక్కున్నాడు. తలుపుసందులోపడి వేలు చితికిపోయింది. నెత్తురు కారుతూంది.

నసీం: కలకత్తా, ఢిల్లీలలో పారిన నెత్తురులో ఇదెంత? వీధుల్లో పారబోయే నెత్తురులో ఇదెంత?

వాకిటితలుపు ఎవరో తట్టినారు.

అక్బర్: ఆ వుద్ధారకులకు చెప్పు ఇక్కడెవ్వరూ లేరని. అంతా శూన్యమైపోయిందని చెప్పు. (పెద్దగా అరిచాడు.)

రహీం వాకిలివైపు కదిలాడు.

తెర పడుతుంది.



# రెండవ రంగం

## మొదటి రంగస్థలమే

నసీం కూర్చొని వుంది. అక్బర్ మంచంమీద కూర్చున్నాడు. రహీం ఒకవైపు పెట్టెమీద చేతుల్లో తలపెట్టుకొని కూర్చున్నాడు. అందరూ ఏదో ఆలోచిస్తున్నట్లున్నారు. ఒక్క క్షణకాలం నిశ్శబ్దం. ... ..

రహీం: ఛా కు పాలులేవుకదూ?

నసీం: ఈ పూటకు బియ్యం ఒక్క గింజలేదు.

రహీం: (ఒక్కసారి లేచి పచారుచేసి కూర్చొంటూ) రేషన్ కొట్లన్నీ మూసేసారు. కొన్ని లూటీచేసారు. వీధుల్లో నరపురుగు మెదిలేటట్టుగా లేదు....(మళ్ళా లేచాడు) ఈలా ఎన్నాళ్ళు బ్రతగ్గలం?

అక్బర్: రహీం! ఖురాను యిట్లా తీసుకురా.

రహీం: (ఒక్క తృటికాలం ఆగి కొయ్యపెట్టెతీసి ఖురాను తెస్తూ) మస్తాన్ ఇంటికైనా వెళ్ళి కాస్త బియ్యం తీసుకురాకపోతే ఎట్లా? (ఖురానిచ్చాడు.)

అక్బర్: (ప్రశాంతంగా పుస్తకం విప్పి కళ్ళకద్దుకొని చదువుకొంటున్నాడు.)

రహీం: ఖురాను చదువుకొంటూంటే కడుపునిండుతుందా?

అక్బర్: గొంతులు కోసుకోమన్నది ఖురానే అయితే కడుపు నింపుకోడానికికూడా మార్గం చూపుతుందిలే!

రహీం: ఈ వాదనల కిదేనా సమయం?

అక్బర్: నన్నేం చేయమన్నావు?

రహీం: ఏమీ చేయక కూర్చుంటే, అందరం ఆకలితో ఏకంగా చస్తాం.

అక్బర్: చస్తే చస్తాం. ఇప్పుడు మహా బతికున్నట్టా?

నసీం: మనగతే యిట్లా వుంటే సన్నప్రజ ఏమవుతారో పాపం!

అక్బర్: ఏమవుతారు? చస్తారు. అంతే! బెంగాల్‌లో ఎండిపోయిన పట్టీపీనుగులైతే ఇప్పుడు కరుడుగట్టిన చిక్కని నెత్తురులో చివికిపోయిన పీనుగుల్ని చూస్తాం! అంతే! మనుష్యులే లేని దేశాన్ని ఏలుకోబోయే మహానుభావులెవరో సంతోషిస్తారు. (ఎడమచేతివైపు ద్వారందగ్గర కెళ్ళాడు మెల్లగా. అది మూసి వుంది. పెద్ద తాళంకూడా వేసివుంది. ఆ తాళాన్ని లాకి చూచాడు, తాళంకూడా వేసుకపోయారు.) వీళ్ళబ్బ సొమ్మంతా పోయినట్టు! — ఉత్తంబాదేమయ్యాడో

(తలుపుదగ్గర ముఖంపెట్టి) ఉత్తం! పురుషోత్తం (పిలిచాడు. బదులు లేదు.)
అల్లా! ఖుదా!

రహీం: ఆ వైపువాళ్ళు కూడా తాళం వేసుకుంటారు బాబా!

అక్బర్: వాళ్ళెన్నడూ అట్లా వేయరు. పశువుల్లా ప్రవర్తించరు.

రహీం: మీరు భ్రమపడుతున్నారు. హిందువులేం తీసిపోవటం లేదు. బాగా శివ
మెక్కివున్నారు. దెబ్బకు దెబ్బ తీస్తూనే వున్నారు.

అక్బర్: దౌర్భాగ్యులు! అందరూ అందరే! (కూలబడ్డాడు)

రహీం: మస్తాన్ దగ్గిర కెళ్ళిరానా?

అక్బర్: ........

నసీం: ఆ కిటికీ తెరిచి చూడు భాయ్! వీధి ఎలాగుందో చూచి మరీ వెళ్ళు!

రహీం కిటికీతెరిచి చూస్తున్నాడు. రెండుమూడు నీడలు
పొడుచుకొని, వికారంగా అరుస్తూ కూలినవి. నసీం వెర్రి
కేక వేసి గట్టిగా కళ్లు మూసుకున్నది.

అక్బర్: సైతాన్లు!

రహీం రహీమని తలుపులు మూసినాడు.

అక్బర్: (అదో విధంగా కొంచెం పెద్దగానే నవ్వుతూ) స్వతంత్ర భారతదేశం నోచు
కున్న నోము పండింది!

బయట ఎవరో తలుపులు దబదబా బాదుతున్నారు.

ఒక స్త్రీ కంఠం: తలుపు! తలుపు! తలుపు తెరవండి! చంపేస్తారు! నా బిడ్డను చంపే
స్తారు! నా బిడ్డను చంపేస్తారు! కాస్త తల దాచుకోనివ్వండి! (ఏడుపు, వికా
రపు అరుపు.)

అక్బర్: ఆడమనిషిరా పాపం! తలుపు తెరవండి! నసీం! వెళ్ళమ్మా వెళ్ళు! ఆ
సైతాన్లు తరుముకొస్తున్నారేమో! పదండిరా!

నసీం పరుగెత్తింది. రహీంకూడా ఆమెవెంట వెళ్ళాడు. తలుపు తెరచిన
చప్పుడు. ఒక స్త్రీ చిన్నబిడ్డతో వగర్చుకొంటూ లోపలికి పరుగెత్తింది.

స్త్రీ: వేసేయండి! తలుపు గట్టిగా గడియ వేయండి. వాళ్ళు నా కోసం వస్తారు. వేసే
యండి. (ఇటు తిరిగింది. అక్బర్‌ను చూసింది. వెర్రికేక. ఏడుస్తూ) మీరూ
వాళ్ళేనా? మీరు నన్ను చంపేస్తారా? పొడిచేస్తారా? నా బిడ్డనైనా బతకనివ్వరూ?

(ఏడుపు అధికమైంది) కాళ్ళుంగ పరుగెత్తానే! నా బిడ్డనైనా కాపాడుకొందా మని పరుగెత్తానే? మళ్ళా మీ మధ్య పడటానికేనా? చావు నోట్లో పడడానికేనా?

అంతలో నసీం, రహీం కూడా వచ్చారు.

అక్బర్: ఊర్కోమ్మా ఊర్కో!

నసీం: ఎందుకు చెల్లీ అట్లా గాబరాపడతావు?

స్త్రీ: నేను హిందువును. (రహీంకు పిడుగులాగుంది ఈ వార్త).

అక్బర్: అయితే ఏం?

స్త్రీ: నన్ను మీరు బతకనిస్తారా? నన్ను చంపేసినా పోనీ — నా బిడ్డను వదిలేస్తారా? చెప్పండి కాస్త కనికరించరూ? పసికందుమీద కూడా మీకు కసి ఎందుకు? కాపాడండి. మీ కాళ్ళంటి ——

నసీం: ఏం భయంలేదులే చెల్లీ! ఎవర్నీ చంపం! ముసల్మానులందరు హృదయం లేనివాళ్ళనేనా నీ అభిప్రాయం?

అక్బర్: ఆమేం చేస్తుంది పాపం! మన నాగరికతలో మనిషిమీద మనిషికంటే నమ్మకం వుంది!

నసీం: ఇటుచూడు చెల్లీ!

ఇంతవరకా స్త్రీ కళ్ళు మూసుకునే వుంది భయంవల్ల. హిందువని తెలిసిం తర్వాత రహీం ఆలోచనలో పడ్డాడు. అటు ఇటు మెల్లగా తారాడుతున్నాడు.

నసీం: (ఆమెను కొంచెం గమనించి చూచింది) వత్సలా!

వత్సల: (కొంచెం ధైర్యం కలిగి నసీంవైపు చూచి) నసీం! నువ్వా?

నసీం: (ఒక్కసారి ఆమెను ఎగా దిగా చూచింది. రహీం వీళ్ళిద్దరూ స్నేహితులన్నది తెలుసుకున్నాడు. ఆలోచన మరీ అధికమయింది) ఈ రక్తమంతా ఏమిటి వత్సలా?

వత్సల: (తన్ను తాను చూచుకొన్నది) నా బిడ్డ? (బిడ్డను చూచుకొన్నది ఒక్క నిట్టూర్పు) బిడ్డనైనా కాపాడుకొందామని పరుగెత్తాను. దేవున్నాడు. నీ పంచకు చేర్చాడు. లేకుంటే....ఎంత వేగంగా పరుగెత్తాను! గుండెలు ఆగి పోతాయనుకున్నాను. కాళ్ళకింద ఒకటే తడి....ఎన్ని పీనుగలు కాళ్ళకు తగి లాయి? ఎంత నెత్తురు! అబ్బ! ఘోరం నసీం! చీకట్లో సరిగ్గా కనపడలేదు. లేకుంటే గుండెలు పగిలి చచ్చేదాన్ని.

అక్బర్: అయిపోయింది! మానవత్వం నాశనమైపోయింది! మనుష్యులంతా మృగాలు, రాక్షసులయ్యారు. (వికారంగా అరిచాడు)

నసీం: బాబా!

అక్బర్: (ఒక్కక్షణం) ఏంలేదు నా కేమీ లేదు. ఆ అమ్మాయి విషయం చూడు పాపం! కాస్త ఓదార్చు!

వత్సల: మీ నాన్నా నసీం?

నసీం: అవును.

వత్సల: నసీం! నన్ను నీ పంచలో తలదాచుకోనిస్తావా? నన్ను కాకపోయినా నా బిడ్డనైనా కాపాడు నీ కడుపున పుడతా నసీం!

నసీం: స్కూల్లో చదివేటప్పుడు చాక్లెట్లు, పెప్పరమెంట్లు తెచ్చుకొని ఇద్దరం తినేవాళ్ళం జ్ఞాపకముందా వత్సలా?

వత్సల: అవును. ఒకరోజు నువ్వు, ఒకరోజు నేను ఇంటినుంచి ఫలహారం తెచ్చుకొనేవాళ్ళం.

నసీం: రౌడీ కుర్రవా డొకడు నామీది కొస్తే నువ్వు అడ్డుపడి వాణ్ణి లాగి లెంపకాయ కొట్టావు. దాంతో వాడు పరారయ్యాడు మరిచిపోయావా?

వత్సల: అవును. అంతా మొన్ననే జరిగినట్లుంది. కానీ నసీం! అదంతా చిన్నతనం - ఆ రోజులు వేరు ఈనాడు ——

నసీం: ఈనాడు మాత్రం ఏం? పెద్ద అయితే బుద్ధి మందగిస్తుందా? ఏం ఫర్వాలేదు. పద వేరే చీర కట్టుకుందువు (గదిలోకి తీసుకువెళ్ళింది.)

రహీం: (కాస్సేపు పచారుచేసి కూర్చున్నాడు.)

అక్బర్: (నసీంను చూచి చాలా సంతోషం కలిగింది. ఖురాన్‌లో నుంచి ఏదో చదువుకొంటున్నాడు.)

నసీం: (వచ్చింది.)

రహీం: (ఒక్కక్షణం నసీంను చూచాడు) నసీం! ఇట్లా రా!

నసీం: (దగ్గర కొచ్చింది.)

రహీం: ఏం తీర్మానించుకున్నావు?

నసీం: దేన్ని గురించి?

రహీం: (వత్సల వున్న గదివైపు తల వూపుతూ చూపించాడు.)

నసీం: మనిషిగా వున్నవాళ్ళు చేయతగ్గ తీర్మానమే చేసాను.

రహీం: అంటే?

నసీం: అంటే ఆమె ఇక్కడే వుంటుంది.

రహీం: బాగా ఆలోచించావా?

నసీం: ఆహా! బాగా ఆలోచించాను.

రహీం: ఆడవాళ్ళకు ముందువెనుకల ఆలోచనలు వుండవు. మరీ ఇటువంటి విషయాల్లో మెదడు పూర్తిగా పనిచేయదు.

నసీం: మెదడు పనిచేయదు కానీ హృదయం పనిచేస్తుంది.

రహీం: ఈ వేదాంతాలకేం లే!

అక్బర్: రహీం! నువ్వు నోరుముయ్ ముందు.

ఈపాటికి వత్సల వేరే చీర కట్టుకొని వచ్చింది. వాకిటిలో ఏదో అలజడిగా వుంది. ఎవరో గుంపు చేరినట్లున్నారు. ఒక్కసారిగా పదిమంది తలుపు బాదుతున్నారు.

రహీం: (కంగారుగా) అదో వాళ్ళే; కొంపమీది కొచ్చి పడ్డారు. ఇప్పుడేం చేస్తారో చేయండి. వాళ్ళకేం వేదాంతం చెప్తారో చెప్పండి. దారిని పోయేదాన్ని పిలిచి తెచ్చుకున్నారు నెత్తికి. వాళ్ళు మాటల్తో వదలరు; ఆమెనైనా వదిలేయాలి. మనమైనా చావాలి. నిర్ణయించుకోండి.

అక్బర్! నువ్వెందుకురా అరుస్తావు?

వత్సల: (రహీం కాళ్ళమీద పడ్డది) చెల్లెల్లాంటిదాన్ని. కులం వేరే అయినంత మాత్రాన నా గొంతు కోస్తారా? మీ చేతులారా బలి ఇస్తారా? పోనీండి నన్ను బలివ్వండి! నేను పోతా. కానీ నా బిడ్డనైనా కాపాడరూ?

అక్బర్: (వేగంగా వచ్చి ఆమెను లేవదీసి) నీకేం భయంలేదు మా ప్రాణాలుండగా! రహీం నువ్వూర్కో! మేమంతా చూచుకోగలం!

తలుపు బాదుతున్నారు

నసీం: వత్సలా! నువ్వా గదిలోకి వెళ్ళు.

వత్సల: ఫర్వాలేదులే నసీం.

నసీం: అట్లాకాదు. నా మాట విను. నువ్వెళ్ళి బిడ్డను చూచుకో. ఈ గలాభాకు బిడ్డ లేచి ఏడుస్తుందేమో!

వత్సల: (వెళ్ళింది.)

అక్బర్, నసీం వాకిలివైపు వెళ్ళారు. రహీం మాత్రం వున్నాడు.

అక్బర్: ఎవరు? ఎవరా తలుపులు బాదేవాళ్ళు?

బయట: అక్బర్‌దాదా! దర్వాజా ఖోలో!

అక్బర్: ఎందుకు? మీకేం పని?

బయట: పనుంది, తలుపు తెరవండి.

నసీం: తెరవటానికి వీల్లేదు.

మళ్ళా తలుపులు పూర్కే బాదుతున్నారు.

నసీం: వీల్లేదని మీక్కాదు చెప్పటం? మీకేం మతుల్లేవూ? పిచ్చికుక్కల్లా అట్లా అరుస్తా రెందుకు? వెళ్ళండి.

బయట: నసీం! నువ్వు కేవలం ఆడదానివి! నీ కీ విషయాలన్నీ అనవసరం!

నసీం: మీ కసలే అనవసరం తెలిసిందా?

బయట: ఇది గ్రామానికంతా సంబంధించిన విషయం. తలుపు తెరిచి తీరాలి.

నసీం: ఏమిటా విషయం? మీ అబ్బగాడి సొమ్మయినట్లు డబాయిస్తున్నారే! మా యింటిమీదికొచ్చి ఏమిటీ దౌర్జన్యం! తలుపు తెరవటాని కేమాత్రం వీల్లేదు. ఎవడితో చెప్పుకుంటారో చెప్పుకోండి.

బయట: నసీం! మీ రనవసరంగా ఆపదలను కొనితెచ్చుకొంటున్నారు. మా మాట వినండి. జాతికంతా ఎదురుతిరగడం మంచిదికాదు.

నసీం: మా కంతా తెలుసు. మీరు చెప్పాల్సిన అవసరం లేదు.

అక్బర్: నువ్వూర్కో తల్లీ! నన్ను మాట్లాడనీ - ఏమిట్రా మీ డబాయింపు? అసలు తలుపెందుకు తెరవాలో చెప్పండి?

బయట: మీ యింట్లో ఒక కాఫిర్‌ను చేరదీసారట.

అక్బర్: ఇక్కడెవ్వరూ లేరు.

బయట: అక్బర్‌దాదా! ఎందు కబద్ధం ఆడటం. ఇప్పుడే మీ యింట్లో ఒక హిందూ స్త్రీ వచ్చింది. మీ రామెకు ఆశ్రయ మిచ్చారు.

నసీం: ఇస్తే?

బయట: అట్లా హిందువుల కాశ్రయం ఇవ్వటానికి వీల్లేదు.

నసీం: అది మా యిష్టం! మీరెవరు హుకుం చేయటానికి?

బయట: మీ యిష్టం కాదు. ఊళ్ళో మన పెద్దలందరూ కలిసి నిర్ణయించారు. ఆ నిర్ణయాన్ని వ్యతిరేకిస్తే ___

నసీం: ఏం? తలతీసేస్తారా? మీరెవ రసలు నిర్ణయించడానికి?

అక్బర్: మా యింటి విషయాలతో మీకేం పని? మా యింటిని తనిఖీ చేయటానికి మీరెవరు?

బయట: అక్బరు దాదా! ఇది కేవలం నీ విషయం కాదు. మన మతానికి, అల్లాకు సంబంధించింది.

నసీం: ఛీ! నోరు మూయ్యండి! అల్లా పేరెందుకు చెరుపుతారు. ఆడవాళ్ళను, పసి కందులను చంపమని అల్లా చెప్పాడా? మనుష్యుల్ని మనుష్యులు చంపు కోవటమేనా మన మతం? సిగ్గులేదూ?

అక్బర్: బయల్దేరారు మతోద్ధారకులు. సైతాన్లు!

బయట: అయితే తలుపు తెరవరూ?

నసీం: వీల్లేదు.

బయట: అక్బర్ దాదా! పోనీండి! ఆ కాఫిర్‌ను వెంటనే మీ యింట్లోనుంచి వెళ్ళ గొట్టండి.

నసీం: వెళ్ళగొట్టకపోతే?

బయట: మేమిప్పుడేమీ చెప్పదలుచుకోలేదు. నయంగా చెప్తున్నా. అదీ అక్బర్ దాదా! నీ మీదవున్న గౌరవంచేత వూరుకున్నాం. లేకుంటే —

అక్బర్: లేకుంటే ఏం చేస్తారు?

బయట: మతద్రోహులు చచ్చేచావు మీకు తప్పదు. చివరిసారి చెప్తున్నాం. మొండి పట్టుదల మానేసి ఆ కాఫిర్‌ను తరిమేయండి.

నసీం: మీరందరూ మొగాళ్ళేనా?

బయట: అవును.

నసీం: మీకందరికీ పెళ్లాలున్నారా? బిడ్డలున్నారా? మీ కక్కచెల్లెళ్ళయినా లేరూ? వాళ్ళందర్నీ మీరు వీధుల్లో వదిలేస్తారూ? ఇళ్ళల్లో భద్రంగా కాపాడుకోటం లేదూ? ఈ ఒక్క ఆడదాని మీదికి ఇందరు మొగాళ్ళు బయల్దేరి వచ్చారే మీకు సిగ్గులేదూ?

బయట: ఏయ్! (తలుపు తన్నుతొకడు)

నసీం: విరగ్గొట్టండి వీలైతే!

బయట: విరగ్గొట్టడం కాదు, తగలబెట్టేస్తాం.

నసీం: పెట్టండి. అందరం చస్తాం మంటల్లోపడి. కానీండి.

బయట: కాఫిర్ల చావెందుకు చస్తారు అగ్గిలోపడి. మామాట వినండి.

అక్బర్: మేమేమీ వినదలచుకోలేదు. మీ చేతనయినది చేసుకోండి వెళ్ళండి.
రౌడీలు! రాక్షసులు!

బయట: అక్బరు దాదా! మీకని కొంత టైమిచ్చాం. ఆలోచించండి

అక్బర్: మాకేమీ అక్కర్లేదు, వెళ్ళండి.

కల్లోలం అణిగింది. అందరూ వెళ్ళారు.

అక్బర్: కాఫిర్ల వావు! చావులోకూడా మతం. జాతి! వెర్రికుక్కలు! కొంపను తగులబెడతారూ? పెట్టనీ —

రహీం: (ఇంతవరకూ వీళ్ళ సంభాషణ జాగ్రత్తగా వింటూ - అప్పుడప్పుడు విసుగ్గా పచారుచేస్తున్నాడు.) వాళ్ళు అన్నంతపని చేస్తారు.

అక్బర్: రహీం! తు ఛుప్‌రహో!

వత్సల మెల్లగా వచ్చింది. అక్బర్ పాదాలమీద వ్రాలింది.

అక్బర్: లే తల్లీ! లే! ఏమిటిది?

వత్సల: నన్ను వెళ్ళనీండి!

అక్బర్: ఎక్కడికి?

వత్సల: ఎక్కడికి? ఈ క్షణం వీధిలోకి, మరొక క్షణంలో మరో లోకానికి.

నసీం: అట్లాగే వెళ్ళనిస్తాంలే, కూర్చో.

వత్సల: కాదు నసీం! నాకింకేమీ లేదు. ప్రపంచంలో నాక్కావలసిం దేమీ లేదు. బ్రతకాలని ఆశాలేదు, ఆ ఒక్క పసిప్రాణం వుంది. అదొక్కటే బంధం. దాన్ని మీ చేతుల్లో పెడుతున్నాను. నసీం! నా బిడ్డకాదు, నీ బిడ్డ. ఆ ఒక్క మాట నువ్వు ఇచ్చావంటే ప్రశాంతంగా చచ్చిపోతా! చెప్పు నసీం!

నసీం: వత్సలా! ఏమిటిదంతా? ఇప్పుడేం వచ్చింది?

వత్సల: కాదు నసీం! నా మూలంగా మీరందరూ ఆపదల పాలుకావటం దేనికి? చెప్పు, నాకింకేం కావాలి ప్రపంచంలో? తల్లి, తండ్రి, అన్న, అందరూ, అందరూ ఒక్కరోజే, ఒక్క క్షణంలో, నా కళ్ళెదుటే కత్తిపోట్లు తిని పోయారు. చివరికి నా మాంగల్యం - ఇక నేను బతికుండి ఏం చేయాలి? నా బతుకుకోసం మిమ్మల్నంతా ఎందుకు వేధించాలి? వెళ్తాను. దేశంలో ఎందరో చచ్చారు. అందులో నేనూ ఒకతెనై పోతాను. అన్నయ్యా —

రహీం: (ఊగిపోయాడు)

వత్సల: అన్నయ్యా! క్షమించు! నీ హృదయాన్ని చాలా బాధపెట్టాను. ఏం చేయను? తల్లి కావటమే నా తప్పు! ఆ బిడ్డే కనక లేకుంటే అందరితోపాటు. నా భర్తతోపాటు ఆ బాకుకే బలి అయ్యేదాన్ని. కాని వెళ్ళొస్తా అన్నయ్యా!

రహీం: (ఊపిరి పీల్చుకోలేకుండా వున్నాడు)

వత్సల: గ్రామం నిండుకు శవాల కుప్పలే! ఆ పీనుగులలో నేనూ ఒకటవుతాను. అంతే! ఆ వీధుల్లో లాగిపారేసేవాళ్ళు కూడా లేక అలాగే కుళ్ళికుళ్ళి పోతాను. అన్నయ్యా! ఇక కొద్దికాలానికైనా నదిలో బిడ్డతో వస్తుంది. అప్పటికీ చెల్లి బిడ్డనుకూడా నీ బిడ్డ అనుకో.

రహీం: (ఆగలేకపోయాడు) చెల్లీ —

అక్బర్: (ఆ ముక్క అన్నందుకు పరిహాసంచేసినట్లుంది. లేచాడు) ఇదిగో అమ్మాయ్! ఒకటే మాట! ఇది ముసల్మాన్ పుట్టుక! మాటతప్పే ఘటం కాదిది; తెలిసిందా? మమ్మల్నేమంత తీసిపారేయాల్సిన అవసరంలేదు. చస్తే అందరం చస్తాం. నిన్ను చంపైనా బ్రతకాల్సినంత ప్రాణాలతీపి మాకేమీ లేదు. వెర్రి వెర్రి వేషాలు వేయక వెళ్ళి కూర్చో.

వత్సల: (అక్బరు పాదాలమీద వాలబోయింది)

అక్బర్: లే తల్లీ! లే! నీలాంటి కూతుర్ని కన్నవాణ్ణేకదా నేను?

మళ్ళా తలుపు చప్పుడు

అక్బర్: ఈ సైతాన్ల పోరు ఇంతటితో తప్పదు. ఎవరు?

బయట: నేను. డాక్టరును.

అక్బర్: ఇంకా ఎవరు?

బయట: ఇంకెవ్వరూ లేరు, తలుపు తెరవండి. కాస్త అర్జంటుగా మాట్లాడాలి.

నసీం: వీల్లేదని ఖచ్చితంగా చెప్పేయండి బాబా!

అక్బర్: భయమెందుకూ? ఏం ఫర్వాలేదులే! నువ్వూ ఆ అమ్మాయి గదిలోకి వెళ్ళండి. నేను చూచుకొంటా.

నసీం, వత్సల వెళ్లారు. అక్బర్ తలుపు తెరచి డాక్టరుతో సహా వచ్చాడు...

అక్బర్: (ఏమీ పల్కకుండా వచ్చి కూర్చున్నాడు. డాక్టరు నిలబడివున్నాడు. కూర్చో మని చెప్పలేదు అక్బర్. డాక్టర్ ఒక్క క్షణంచూచాడు.)

డాక్టరు: చాలా దీర్ఘాలోచనలో వున్నట్టున్నారు!

అక్బర్: మీరు వచ్చిన విశేషమేమిటో?

డాక్టరు: మీకు నామీద చాలాకోపం కలిగినట్లుంది?

(నవ్వుతున్నాడు.)

అక్బర్: అబ్బే! కోపానికేముంది! ఏమీ లేదు అదీగాక యీ రోజో రేపో వెళ్తు న్నారు. మీమీద కోపం దేనికి?

డాక్టరు: అట్లాకాదులెండి. నేను చెప్పిన విషయాలు, చెప్పే విషయాలు మీకు కొంచెం కటువుగానే వుంటవి. కానీ ఏం చేయను? చెప్పక తప్పదు.

అక్బర్: ఇప్పుడేదైనా చెప్పదలచుకునే వచ్చారా?

డాక్టరు: ఇటువంటి విషయాల్లో జోక్యం కలగజేసుకోవడం నాకు సుతరామూ ఇష్టంలేదు. కానీ తప్పటం లేదు. అయినా యీసారి నేను కేవలం రాయ బారినే లెండి.

అక్బర్: ఓహో! అట్లాగా? ఆ రాయబారమేదో విప్పండి.

డాక్టరు: ముస్లింలందరూ వచ్చి నాతో మొరపెట్టుకున్నారు. నాకెందుకు చడలా రయ్యా యీ పనులన్నీ అంటే వాళ్ళు వింటేనా? కాదంటే కాదని మొండికి వేసుకొని కూర్చున్నారు. సరే వెళ్తున్నాం కదా యీ సహాయంకాస్తా చేసిపెట్టిపోతే ఏంపోతుందని వచ్చాను.

అక్బర్: మంచిదే! అసలు విషయం?

డాక్టరు: మరి మీ యింట్లో ఒక హిందూ స్త్రీ తలదాచుకొని వుందట. నిజమేనా? లేక —

అక్బర్: మీతో ఎవరు చెప్పారు? వాళ్ళేనా?

డాక్టరు: అవును.

అక్బర్: ఊఁ ఉంటే?

డాక్టరు: ఉంటే పంపించేయటం శ్రేయస్కరం.

రహీం: శ్రేయస్సుతో మాకేం పని?

అక్బర్: రహీం! నువ్వూరుకో. ఉంటే పంపేయాలి! ఊఁ - పంపించేస్తే?

డాక్టరు: వాళ్ళు శాంతిస్తారు. ఏ తగాదాలుండవు.

అక్బర్: శాంతి! అంతటితో శాంతిస్తారా?

డాక్టరు: తప్పక.

అక్బర్: ఒక్క ఆడదాన్ని చంపాలని తరుముకొచ్చిన మృగాలు కేవలం ఆమె నాయింట్లో వున్నందుకే ఇంత ఆవేశపడుతూన్నరనటం అబద్ధం. నాకు తెలుసు. ఆమెను వాళ్ళు చంపేస్తారు.

డాక్టరు: అదంతా మనకెందుకు చెప్పండి.

అక్బర్: ఎందుకంటే మనుష్యులుగా పుట్టినందుకు.

రహీం: కాదు నడివీధి చావు చావటానికి.

అక్బర్: నిన్ను మాట్లాడ వద్దన్నాను.

రహీం: నేనూ మనిషినే.

అక్బర్: నాకు తెలుసు.

రహీం: మీరు పెద్దవాళ్ళయినంత మాత్రాన నా నోరు నొక్కేయడం న్యాయంకాదు. నాకూ ఆలోచన, అభిప్రాయం అంటూ వున్నవి. నేనేమంత పసిపిల్లవాణ్ణి కాదు.

అక్బర్: పెద్దవాడవయ్యావని తెలుస్తూనే వుందిరా.

రహీం: కాదు. మీరే పెద్దవాళ్లు. మీమాట శిరసావహిస్తాం. చస్తాం.

అక్బర్: చావొద్దు. పదిమందిని నువ్వు చంపు.

రహీం: మీరు చాలా పొరబడుతున్నారు, క్షమించండి.

డాక్టరు: మధ్య మీ రెందుకు పోట్లాడటం. శాంతించండి.

ఈ అబ్బాకొడుకుల చిటపటలు విని నసీం వచ్చింది.

డాక్టరు: జాతి అంతా చేసుకున్న కట్టుబాటుకు తలవంచటం ధర్మం. వ్యక్తిగతంగా మనకున్న అభిమానాలు సంఘక్షేమం కోసం త్యాగంచేయాలి. అదే మానవ జీవితంలో వున్న గొప్పతనం.

నసీం: మీరు చెప్పేది సంఘక్షేమమే అయితే, ఎంతటి త్యాగాన్నయినా చేయటానికి మేము సిద్ధంగానే వున్నాం.

డాక్టరు: పదిమంది కోరిందే సంఘక్షేమం.

నసీం: పదిమందీ పిచ్చివాళ్ళయితే మెదడున్న వాళ్ళిద్దరే అయినందున మంచి కొట్టుకొని పోవాల్సిందేనా?

డాక్టరు: ఈ వింతవాదనకేం నసీం! ప్రాణంమీదికొచ్చినప్పు డెవ్వరూ నీతులకు ధర్మాలకు అంటిపెట్టుకొని వుండరు. మనం పిచ్చిగా పట్టుకు పాకులాడితే అనవసరంగా స్నేహాలన్నీ ఈ సమయంలో ఎగిరిపోతున్నాయి. నువ్వొట్టి భ్రమలో పడుతున్నావు. ఎవ్వరూ నిన్ను వుద్ధరించరు. ఇంతెందుకు చిన్నతనం నుంచి ప్రాణంగా వుంటూన్న మీ పుత్తం బాబేమైనాడు యీనాడు?

అక్బర్: ఏమైనాడు?

డాక్టరు: ఏమీలేదు. బాగనేవున్నాడు. రహీం! వాండగ్గర ఎప్పుడైనా కత్తివుండేదేనా?

రహీం: నే నెప్పుడూ చూడలేదు.

డాక్టరు: నాకూ అదే జ్ఞాపకం. కాని మొన్న అతని మొలలో బాకొకటుంది. నా కళ్లారా చూశాను. అదేఘుందిలే! ఆత్మరక్షణ కందరూ వుంచుకొంటున్నారు. కాని ఒక్క విషయంమాత్రం నాకు చాలా కష్టంగా వుంది. అబ్బ! మనుష్యులు ఎంతలో ఎంత మారిపోతారు? పురుషోత్తం అట్లా మాట్లాడుతాడని ——

అక్బర్: ఏమన్నాడు?

డాక్టరు: ఏముంది? ఈ దర్వాజా మూసేయటమే మంచిదన్నాడట. లేకుంటే ఈపాటికి వాళ్ళంతా మీ చేతుల్లోనే చచ్చేవాళ్ళట. మొత్తంమీద మీ జాతే పాముజాతట! ఎంత పాలుపోసి పెంచినా——

అక్బరు: అట్లాగా ——

డాక్టరు: ఆఁ - ఇంకా ——

అక్బర్: డాక్టర్‌సాబ్. దయచేసి కొంచెం లేవండి.

డాక్టరు: (లేచాడు)

అక్బర్: అదిగో అటుచూడండి. అదే - ఆ ద్వారమే వీధిలోకి తీసుకెళ్తుంది మిమ్మల్ని. దయచేయండి.

డాక్టరు: (కొంచెం దెబ్బతిన్నాడు. కాని సర్దుకొని) సరే దయచేస్తాను. కాని చివరిసారి చెప్తున్నాను బాగా ఆలోచించండి. కాదన్నారా - మీలో ఎవ్వరికీ లేకుండా యీ ఇల్లు స్వాధీనం చేసుకోవాల్సి వస్తుంది. మీ మూలంగా ఇల్లు నాశనంకావటం ఎవ్వరికీ ఇష్టంలేదు. సరేనా?

అక్బర్: సరే! ఊఁ——(చేయి చూపించాడు.)

డాక్టర్ వెళుతున్నాడు. గదిలోనుంచి బిడ్డ ఏడుపు వినిపించింది; ఆగి విన్నాడు. ఒక్కసారి 'సరే తెలిసింది' అన్నట్లు తలవూపి వెళ్ళిపోయాడు. . ....

అక్బర్: జావ్! ఉల్లూకాబేటా?

రహీం: మష్య అతన్నెందుకు తిడతారు?

అక్బర్: మాకు తెలుసు. నీకంటె ముందునుంచి అతనంటే ఏమిటో మాకు బాగా తెలుసు.

నసీం: బిడ్డ ఏడుస్తూంది. పాలులేవు బాబా!

అక్బర్: (పెద్ద నిట్టూర్పు వదిలాడు) ఏంచేస్తాం తల్లీ! బిడ్డకు నాలికెండుకు పోతుం దేమో పాపం!

నసీం: వత్సల తనికూడా మూడురోజులైందట.

అక్బర్: అరె! అల్లా!... (మెల్లగా కొంతదూరం నడిచాడు.) సరే! ఆ గ్లాసు ఇట్లా ఇవ్వు. వెళ్ళొస్తా.

నసీం గ్లాసు తెచ్చిచ్చింది.

అక్బర్: జాగ్రత్తమ్మా. నేను త్వరలోనే వస్తా. తలుపు వేసుకో.

వెళ్లాడు. నసీం అతని వెంబడే వెళ్ళి తలుపు వేసుకొచ్చింది. రహీం ఘుమ ఘుమ లాడుతూండటం నసీం గమనించింది. ఏమీ పలకరించకుండా ఏదో పని చూసుకొంటూంది

రహీం: అబ్బా కూతురు మహాత్మాగాంధీ అయ్యారు. ఇంకేం?

నసీం: ఈమాత్రానికే మహాత్మాగాంధీ అవడం ఆయన్ని చిన్నబుచ్చడమే!

రహీం: చిన్నబుచ్చటమా! (కూలబడ్డాడు)

మళ్ళా ఎవరో తలుపు తట్టారు.

నసీం: ఎవరు?

బయట: నేను కరీంను. రహీం వున్నాడా?

నసీం: ఎందుకు?

బయట: ఊరిపెద్దలు పిలుచుకు రమ్మన్నారు. మాట్లాడాలట.

నసీం: ఏమిటన్నయ్యా ఇది?

రహీం: ఏమో!

నసీం: వెళ్తావా?

రహీం: ఆఁ -

నసీం: ఎందుకై వుంటుంది?

రహీం: ఎందుకై వుంటుంది? మీరు చేస్తూన్న పనులకు సంజాయిషీ చెప్పుకోడానికి.

నసీం: అంతేనా. ఇంకేమైనా....

రహీం: అంతభయపడేవాళ్ళు ఇంత మొండిగా ఎందుకుండాలి?

నసీం: అదివేరే విషయం. ఇప్పుడెవ్వరూ భయపట్టంలేదు. సరే వెళ్ళిరా!

రహీం: వెళ్ళిరా! ఎంతతేలిగ్గా అంటున్నావు? నేను చస్తే నీకేం?

నసీం: అన్నయ్యా! ఆగు. నువ్వెళ్ళక్కర్లేదు. అంతగా అయితే నేనే వెళ్ళి వాళ్ళకు సంజాయిషీ చెప్పొస్తాను.

రహీం: నువ్వామాత్రం గొప్పదానివయ్యావని తెలుస్తుందిలే. (వెళ్తున్నాడు)

నసీం: జాగ్రత్తసుమా! తొందరపడి మాటజారవిడుచుకోనేవు?

రహీం: (వెళ్ళాడు. నసీం తలుపువేసుకొచ్చింది. ఇంతవరకు ఈ సంభాషణంతా గడి గడపమీద నిలుచొని వింటూన్న వత్సల వచ్చింది.)

నసీం: వత్సలా! అబ్బాయి నిద్రపోతున్నాడా?

వత్సల: ఆఁ.

నసీం: ఏడ్చి ఏడ్చి అలసిపోయి వుంటాడు పాపం! బాబా వెళ్ళారు. త్వరలో పాలు తెస్తారులే....నీకూ ఆకలి మండిపోతూందికాదూ?

వత్సల: లేదు నసీం.

నసీం: అబద్ధాలు ఎప్పట్నుంచి నేర్చావు?

వత్సల: అన్నం దొరకనప్పట్నుంచి? (ఆ విషయంలో కూడా ఇద్దరూ నవ్వారు.) కరువులో అధికమాసమన్నారు! అట్లా ...

నసీం: అట్లా మాకు నువ్వొక భారంగా చేరావు. అంతేనా? చెంపలు వాచిపోతాయి చూడు.

వత్సల: నసీం! మీరు నిజంగా దేవతలు సుమా!

నసీం: బాగానే వుంది. ఇదా నువ్వు తీరిగ్గా కూర్చొని చేసిన ఆలోచన. మేమిట్లా వుండడం నీకేం ఇష్టంలేనట్టుందే?

వత్సల: ఏం నసీం ఏమన్నాను?

నసీం: దేవతలన్నావు. ఇంకేమనాలి. మమ్మల్ని అప్పుడే పంపించేస్తున్నా వీ లోకం నుంచి!

వత్సల: అదేమిటి?

నసీం: దేవతలు యీ లోకంలో వుండరు. తెలుసా? మేము పదహారణాలా మనుష్యులమే!

వత్సల: (ఆవులించి నవ్వింది) ఈ పరిస్థితిలో కూడా నీ హాస్యం పోలేదే!

నసీం: నీకు నిద్రో?

వత్సల: అవును నసీం! నిద్రొస్తూంది.

నసీం: ఆకలెక్కువయితే నిద్రొస్తుందిలే!

వత్సల: కాదు నసీం! మూడు రోజులైంది. కూడులేదు కదా! కునుకుకూడా లేదు. ఆ చిట్టడవిలో, ఆ ఎండలో, చీకట్లో ఆ పసికందును పెట్టుకొని అట్లా కూచు న్నాను. ఎంతకాలమని వుండను? ఆకలి ఆగలేక వూళ్ళోకి వచ్చాను. కర్మం చాలక కాలుపెట్టిందే తడవు మళ్ళా వాళ్ళకంటే పడ్డాను నసీం....

నసీం: తరగని దుఃఖం ఎంతసేపు చెప్తే తీరుతుంది. వెళ్ళి పడుకో....
వత్సల: కాస్సేపు పడుకుంటా.... (వెళ్ళింది)

నసీం పడాయి చేస్తుంది, వాకిట రహీం పిలుపు వేస్తాడు.

రహీం: నసీం! దర్వాజా ఖోలో!
నసీం: భయ్యా!
రహీం: ఆఁ.
నసీం: (వెళ్ళి తలుపు తెరచి రహీంతోపాటు వచ్చింది.)
రహీం: నసీం! ఇదిగో బియ్యం. కాస్త వండిపెట్టు
నసీం: ఎక్కడివి భయ్యా!
రహీం: ఒక స్నేహితుడిచ్చాడు కాళ్ళావేళ్ళా పడితే!
నసీం: ఈనాటికి బ్రతికాం. అయితే నువ్వెళ్ళినపని ఏమైంది?
రహీం: ఆఁ ఏమీ లేదులే! నాన్న ఇంకా రాలేదు కదూ?
నసీం: రాలేదు.
రహీం: వత్సల ఎక్కడ?
నసీం: నిద్రపోతూంది పాపం!
రహీం: సరే! నువ్వెళ్ళి త్వరగా వండు. ఆకలితో చచ్చిపోతున్నాం.
నసీం: (వెళ్ళింది)

రహీం ఇటటు పచారుచేసాడు. గది పరదా లోని చూశాడు. వంటింటి వైపు వెళ్ళి చూశాడు. ఒకటి రెండుసార్లు పచార్లు. చాకు తీశాడు. కాస్సేపు ఆలోచించాడు. చాకు దాచేశాడు. మళ్ళా పచారు. మళ్ళా చాకు తీశాడు. ఒక్కసారి ఒళ్ళు జలదరించి కళ్ళుమూసి తెరిచాడు. గదివైపు నడుస్తున్నాడు, నసీం వచ్చింది.

నసీం: భాయ్!
రహీం: (కొయ్యబారి పోయాడు.)
నసీం: (దగ్గరకెళ్ళి చూసింది) అన్నయ్యా, ఏమిటది?

రహీం ముఖంలో కత్తివేస్తే నెత్తురు చుక్కలేదు. నసీం గమనించింది ..

నసీం: (రహీంరెక్కపట్టుకొని దూరంగా లాక్కొచ్చింది) కూర్చో. (కూర్చో పెట్టింది.) పాలులేకుండా ఛా తాగటం నీ కలవాటే కదూ? వుండు వస్తా! (వంటింటిలోకి వెళ్ళింది. మళ్ళా ఒక కప్పు ఛాతో వచ్చింది) తీసుకో.

రహీం: (ఏం చేయాలో తెలియలేదు. సమిలిపోతున్నాడు.)

నసీం: తీసుకో అన్నయ్యా! ఆలోచించి ఆలోచించి చాలా అలసిపోయుంటావు పాపం! కాస్త ఛా తాగు. తరువాత మాట్లాడుదాం (చాలా వినయంగా) తీసుకో అన్నయ్యా!

రహీం: (తనకే తెలియక తీసుకున్నాడు.)

నసీం. తాగు (రహీం అయోమయంగా తాగుతున్నాడు. అతను తాగుతున్నంతసేపూ నసీం ఏదో కూనిరాగం లాగుతూంది. రహీం టీ ముగించాడు. చూచింది) అన్నయ్యా! నిన్ను చూస్తే నాకు చాలా చింతగా వుంది నిజంగా? ఊళ్ళో అందరూ ఇలాగే వున్నారా? అందరూ మొగవాళ్ళలా, వీరుల్లా ఖూనీలు చేస్తుంటే నువ్వు మాత్రం ఎందుకిలా చేయాలి? చూడు, ఈనాడు వాళ్ళంతా ఏంచేస్తున్నారు? దర్జాగా, పట్టపగలే, బట్టబయలుగా భర్తలయెదటే, కట్టెదటే భార్యలను చెరుపుతున్నారు! అన్నల సమక్షంలో చెల్లెళ్ళను చంపుతున్నారు! తల్లి ఒడిలోనుంచి పాలు తాగుతూన్న బిడ్డనైనా సరే నేరుగా లాగి ఎగరవేసి ముక్కలు చేస్తున్నారు! కన్నతండ్రి చేతికే కత్తి ఇచ్చి బలవంతంగా కన్న కొడుకును పొడిపిస్తున్నారు! ఇందులో దాపరికం దొంగతనం ఏమీలేదు. చాటుమాటు ఏమీలేదు! అల్లాంటప్పుడు నువ్వు మాత్రం ముసల్మాన్ పుట్టుక పుట్టలేదూ? నువ్వు మాత్రం ఏం గాజులు తొడుక్కున్నావా, నిద్రపోయే టప్పుడు చంపడానికి? నా కెంత అవమానం నా అన్నయ్య అలా చేశాడంటే? దర్జాగా నిలబెట్టిపొడు నువ్వు కూడా! ఉండు వత్సలను లేపుకొస్తా! (గదిలోకి పోబోతుంది)

రహీం: నసీం!

నసీం: ఆఁ అడగటం మరిచా! వత్సల మాత్రమేనా? బిడ్డ కూడా కావాలా? పసిబిడ్డ అయితే మాత్రం ఏం? పుట్టినప్పుడే హిందూమతంలో పుట్టింది కదూ? కాఫిర్?

రహీం: నసీం!

నసీం: పొడిస్తే చచ్చిపోతారు. చచ్చిపోవడమంటే వాళ్ళ మతంలో ఆత్మ వేరే దేహాన్ని తొడుక్కోవడం. అది మాత్రం చావదు. ఇంకో జన్మకయినా వాళ్ళంతా కాఫిర్లుగా పుట్టకుండా అల్లా కరుణిస్తాడులే! వత్సలా, వత్సలా! ఈలారా!

వత్సల: (కళ్ళు నులుముకొంటూ వచ్చింది) ఏం నసీం!

నసీం: (తీవ్రంగా) ఇలారా! నిలబడు.

వత్సల: ఎందుకు?

నసీం: చెప్పినట్లు చేయి. అంతే.

వత్సల: (అలా చేసింది)

నసీం: చేతులు వెనక్కి కట్టుకో.

వత్సల: (అలా చేసింది)

నసీం: ఏ పరిస్థితిలోనైనా సరే చేతులు విదిలకూడదు. వినిపించా. అట్లా వుంచలేని పక్షంలో తాడుతో కట్టేయాల్సి వస్తుంది.

వత్సల: నసీం!

నసీం: వత్సలా! ఊర్కో! ఏ పరిస్థితిలోనైనా నోరు మెదపకూడదు. అట్లా వుంచ లేని పక్షంలో నోట్లో గుడ్డలు కుక్కాల్సి వస్తుంది.

వత్సల: (ఏమో అనబోయింది.)

నసీం: శ్! కదలకుండా నిల్చో! నువ్వు తప్పించుకొని పారిపోలేవు. ఆ ప్రయత్నం చేయకు. సరేనా! ఇక అన్నయ్యా! ఇదిగో ఈమె ఒక హిందూస్త్రీ అంటే కాఫిర్. నాలాగే ఈమెను ఒక తల్లి కన్నది. నీలాగే యీమె కొక అన్నయ్య వుండేవాడు. అత్తగారింట్లో వున్న నీ భార్యలాగే ఈమె కూడా ఒక బిడ్డతల్లి! ఏదీ వత్సలా! రొమ్ము బాగా చూపు! ఇక్కడే. సరిగ్గా ఇక్కడే పొడిస్తే ప్రాణాలు పోతవి. ఈమె లాగెందరో చచ్చారు. ప్రపంచం ఏమీ అనలేదు. జరుగుతోనే వుంది. ఈమె కూడా చస్తుంది ఎవ్వరూ ఏడవరు. పొడిచే - చూస్తావేం - బాకు తీ - ఇదేవిధంగా రేపు నీ చెల్లెల్ని పొడిచేస్తారు. నేనూ చస్తాను. అంతే! ఊఁ - పొడువు. చూస్తావేం? ఆడదాన్ని పొడవటానికి జడుపెందుకూ? బలం తెచ్చుకో. ఒక్క ఒక్క పోటు!

రహీం: నసీం! (కూలబడ్డాడు)

వత్సల: నసీం! ఏమిటిదంతా?

నసీం: నువ్వు చెప్పుకోవలసిందేదైనా వుందా? చెప్పుకో! వీధుల్లో పొడవబడే వాళ్ళకీ అవకాశం దొరకదు. అకస్మాత్తుగా వెనకపాటుగా బాకు వీపులో దిగిపోతుంది. అంతే! నీకు మాత్రం యీ అవకాశం దొరికింది చెప్పుకో . .

వత్సల: నసీం! . . .చంపేస్తారా? పొడిచేస్తారా? చివరికించేనా? సరే నేనూ సిద్ధంగానే వున్నాను. నా రక్తంతో మీరు మీ రాజ్యాన్ని. మతాన్ని, సౌఖ్యాలను వృద్ధి చేసుకొనేట్టుంటే సంతోషంగా చస్తాను. కాని ఒక్క ప్రార్థన నా బిడ్డను మాత్రం బ్రతకనివ్వండి.

నసీం: సరే! అలాగే! ఏమన్నయ్యా, తీసుకో బాకు. (అందిస్తుంది)

రహీం కళ్ళవెంట నీటిధార ప్రవహిస్తుంది. ఏమీ పలకలేదు. బాకు తీసుకున్నాడు. ఒక్కక్షణం తన రొమ్ముకు గురిపెట్టుకొని పైకెత్తాడు. ......

వత్సల: అన్నయ్యా! (చేయిపట్టుకొంది)

రహీం మరీ క్రుంగిపోయాడు. కూలబడ్డాడు. సరిగ్గా ఇదే సమయానికి వాకిట అక్బరు

అక్బరు: బేటీ నసీం!

నసీం: ఆఁ. (వెళ్ళి తలుపు తెరిచింది.)

అక్బరు: (వచ్చి బాకును, రహీంను, వత్సలను చూశాడు.) ఏమిట్రా యిదంతా?

రహీం: (కలలోనుంచి తటాలని మేల్కొన్నాడు.) బాబా! (చరచర గదిలోకి వెళ్ళాడు.)

అక్బర్: ఏమిటమ్మా యిదంతా!

వత్సల: నసీంను నడగండి. నాకేమీ తెలియదు.

అక్బర్: బేటీ! ఏమిటిదంతా!

నసీం: రహీంనే అడగండి చెప్తాడు.

అక్బర్: ఏమిటి రహీం ఈ గడబిడ? (గదివైపు వెళ్తున్నాడు.) (గది తలుపులు దబాలున మూయబడ్డవి.)

అక్బర్: అరె! ఖ్యాహువారే! (నసీం, వత్సలవైపు చూసి కిందవున్న బాకు మెల్లగా చేతిలోకి తీసి చూస్తున్నాడు.)

తెర పడుతుంది.



# మూడవ రంగం

మొదటి రంగస్థలమే:

తేడీ మార్పు... ..

అక్బర్, నసీం వున్నారు.

అక్బర్: రహీం ఎక్కడికి వెళ్ళాడు?

నసీం: ఏమో! తిండికైనా రాలేదు.

అక్బర్: పట్టి వెర్రివాడు. తాను చేసిందానికి కుమిలిపోతున్నాడు.

వత్సల: (వంటింటిలోనుంచి వస్తూ) నసీం మరీ అఘాయిత్యం చేసి చాలా బాధపెట్టిందతని హృదయాన్ని.

నసీం: సరే! నీకేం తెలుసు? అంత ఘాటుగా తగిల్తేగానీ అతనికి ఎక్కదు.

లోపల పెద్దగా నవ్వు, 'హా' అన్న కేక వినిపిస్తుంది.

—ద్రోహీ! తురకవాడికి మంచినీళ్ళిస్తావా? (నవ్వు)

—దౌర్భాగ్యుల్లారా! ముసల్మానైనంత మాత్రాన దాహంతో నాలికెండుకుపోతూంటే మంచినీళ్ళిస్తేనే మతమంతా పోయిందట్రా! రాక్షసుల్లారా!

—(మళ్ళా 'అబ్బా!' అని కేక)

అక్బర్: అరె! ఏ క్యా బేటీ? (అందరూ తలుపు దగ్గరకు వెళ్ళి వింటున్నారు)

—అబ్బా! అక్బర్! అక్బర్!

అక్బర్: అల్లా! పురుషోత్తం! పురుషోత్తం!

—ఆఁ-

అక్బర్: నసీం! సుత్తి పట్లా తీసుకో!

నసీం: (తొందరగా తెచ్చి ఇచ్చింది.)

అక్బర్: గట్టితాళమే వేసారు వెధవలు. (ఒక దెబ్బ వేశాడు) ఒక్కసారి వేరుపడితే మళ్ళా కలవడం ఎంత కష్టమో చూచావా? (మళ్ళా ఒక దెబ్బ) అల్లాహో అక్బర్ (మళ్ళా ఒకటి తాళం విరిగి కింద పడ్డది. తలుపులు తెరచాడు. 'ఉత్తం' అంటూ లోపలికి వెళ్ళాడు.)

వత్సల: ఎవరు నసీం?

నసీం: పురుషోత్తంబాబుని చిన్ననాటినుంచి ఎత్తి పెంచినవారు. నాన్నతో సమానం మాకు. (లోపలి కెళ్ళింది)

అక్బర్: (లోపల) నసీం! నీళ్ళు-గుడ్డపేలిక-ఆ జాంబిక్ అయినా పట్రా వెళ్ళు!

నసీం తొందరగా వచ్చి వాటిని తీసుకెళ్ళింది.
ఒకటి రెండు నిమిషాల తరవాత అక్బర్, నసీం
చేతికి కట్టుకొన్న పురుషోత్తం వచ్చారు

పురు: మంచి చేయబోతే చెడువచ్చింది.

అక్బర్: అస లింతకూ ఏం జరిగింది?

నసీం: కత్తితో పొడిచాడా బాబా?

పురు: పెద్దకత్తి లేకపోయింది వాడిచేత సమయానికి. ఉండుంటే చెయ్యి వాస్త తెగిపోయేదే రెండుగా. చిన్నబాకుతో తీర్చుకున్నాడు వాడి మత ద్వేషం!

అక్బర్: ఇంతకూ నువ్వేం చేశావని?

పురు: (పత్సలను చూచి) ఆ అమ్మాయి ఎవరు?

అక్బర్: మన అమ్మాయే.

పురు: ఆఁ హాఁ ఏంచేశానని? మతద్రోహం చేశాను; జాతి ద్రోహం చేశాను. మహా పాపం చేశాను. అందుకే అనుభవించాను ప్రాయశ్చిత్తం.

అక్బర్: అబ్బ! ఏమిటో చెప్పరాదూ?

పురు: ఏమీలేదు. కేవలం మనిషిలా ప్రవర్తించాను. అంతే!

అక్బర్: అంటే!

నసీం: అంటే ఏ ముసల్మాన్‌కో నిలువనీడయిచ్చారు. అంతేనా?

పురు: అంత తేలిక పాపం కాదు. ముసల్మాన్ నాలికెండు కొనిపోయి ఈ వెధవ లోకాన్ని వదలి అల్లా దగ్గరికి పోతూ దాహమో దాహమో అంటూంటే అత నికి గుక్కెడు నీళ్ళుపోశాను. అందుకే యీ శిక్ష.

నసీం: ఓహో పాపం!

పురు: ఏమిటమ్మా?

నసీం: మేమూ అంతకంటే మహాపరాధం చేశాము. అందుకు ఏం శిక్ష విధించాలో ఇంకా సంఘోద్ధారకులు తీవ్రంగా ఆలోచిస్తున్నారట.

పురు: మీరేం చేశారేం?

అక్బర్: మొనగాళ్ళయిన మొగాళ్ళంతా తరుముకొస్తే ఒక ఆడది పాపం, ఒక హిందూ ఆడది అయ్యో అంటూ అరుస్తూవస్తే ఆశ్రయ మిచ్చాం. అదీ విషయం. (ఈ విషయం చెప్తూండగా పక్కల గదిలోకి వెళ్ళింది.)

పురు: అయితే ఇద్దరూ ఇద్దరమే! పాపం! ఆ ముసల్మాన్ను రాళ్ళతో కొట్టారట. తలంతా చిల్లులే. దౌర్భాగ్యులు! అయిందేదో అయిందని ఆ గాయాలు మానే దాకి .(ద్వారం దగ్గరికెళ్ళి) గులాం! గులాం!

___ఆ(___

పురు: ఆవ్!

గుండా వచ్చాడు. సామాన్యమైన పాలివాడు. అన్నం ముఖం చూచి ఎన్నో రోజులైనట్లు కన్నులు గూళ్ళల్లో ఎక్కడో వున్నవి. పేదరికాన్ని దుస్తులు చాటుతున్నవి. గడ్డం పెరిగింది. తలకంతా కట్లు. ఒళ్ళంతా అతుకుల లాగు ప్లాస్త్రివేసి వున్నది. కదిలిస్తే దుఃఖం పొంగిపొర్లేటట్టుంది ఆ కళ్ళల్లో. ........

పురు: చూశావా అక్బర్! ఇది నౌఖాలీ. ఇది పంజాబ్. ఇది ఢిల్లీ! ఇది బెంగాల్! (ఒక్కొక్క కట్టూ, దెబ్బ చూపిస్తున్నాడు.)

నసీం: మరి ఇది? (పురుషోత్తం దెబ్బను చూపుతుంది.)

పురు: ఇది నా పుట్టినిల్లే! నావూరే!

గుండా: నిల్చోలేను బాబూ! (కూర్చో బోతున్నాడు నేలమీద)

అక్బర్: ఇటు ఇటు కూర్చో భయ్యా!

గుండా: ఫర్వాలేదు లేండి బాబూ?

అక్బర్: (అతన్ని మంచంమీద కూర్చోబెట్టాడు) నీ కెవరైనా వున్నారా?

గుండా: ఎవరికి?

అక్బర్: నీకే?

గుండా: నన్నడిగితే నాకేం తెలుసు? ఉన్నారో పోయారో! ఎవరి కెవరు? అందరూ వున్నారొకప్పుడు. పెళ్లాం, బిడ్డలు, అన్నలు, తమ్ముళ్లు అందరూ వున్నారు. ఏమయ్యారో, ఎటుబోయారో, ఏడనచ్చారో, ఆ దేవుణ్ణి అడగాలి. అంతే! మా పాలెం వందగడపా అట్టయిపోయింది. కొందరు సుకపడ్డారు నచ్చి! తిండిలేకే నచ్చారు. దేశం బాగుణ్ణ నాడే తిండిలా! పనిలా! ఈనాడిట్టా తగులడుతుంటే ఏంసేస్తాం సావక? ఎట్టా బతికుంటాం? దేశాని కిదేం తెగు

లొచ్చిందో? సొతంత్రం సొరాజ్జెం అన్నారు. సొరాజ్జెం సొరగం అన్నారు. ఇదే సొరగం. అవును. సత్తెకపూ సొరగం కినపడేది. అంటే.

అక్బర్: ధయ్యా! జావ్! సోజావ్!

గుండా: సోజావ్! (అక్బరు మెల్లగా అతన్ని లోనికి తీసుకెళ్ళి వదిలి వచ్చాడు)

పురు: స్వతంత్ర భారతదేశంలోని పేదవాడు! కోటానుకోట్ల కూలీ రైతులంతా యిదే స్థితిలో వున్నారు. వాళ్ళకొచ్చే ప్రతి కష్టానికి స్వాతంత్ర్యాన్ని ముడి బెడతారు. వాళ్ళకేం తెలుస్తుంది. తెలియజేసేవా ళ్లెవరు? ఎంతటి మానవబలం, మేధ వృధాబోతూంది. ఈ స్థితిలో స్వరాజ్యం భద్రంగా వుంటుందా?

అక్బర్: ఎందుకుండదు? స్వార్థంలేని ఈ కష్టజీవుల్నంతా సమీకరించి ఒకే బాటలో నడిపితే దేశానికి బలమైన కోటవుతుంది.

పురు: అక్బరు! మరచా! వెంటనే మనము ఒకచోటి కెళ్లాలి.

అక్బర్: ఎక్కడికి?

పురు: మోహన్‌దాస్, అబ్దుల్‌కలాం కలసి శాంతి సైన్యాన్ని, రక్షణ శిబిరాల్ని ఏర్పాటు చేస్తున్నారు. ఒక్కసారి వచ్చి పొమ్మన్నారు. మనకు చేతనైన సహాయం చేద్దాం నచ్చితే!

నసీం: రక్షణ శిబిరాలు, మన వూళ్ళోనే!

పురు: అవును.

నసీం: ఇప్పటికైనా జాగ్రదవస్థ కలిగిందన్నమాట రెండు జాతులకు. దేశం స్మశానం కాకముందే మేల్కొన్నారు.

పురు: ఎక్కడో ఒకచోట వుండకపోతాయా దయాదాక్షిణ్యాలు?

నసీం: బాబా! కాస్త ఆగండి. (గదిలోకి వెళ్ళివచ్చింది) ఈ గుడ్డలు శరణార్థుల వుపయోగాని కిచ్చి రండి.

పురు: ఎంతలో ద్రవించిపోతుందమ్మా నీ మనసు! రా! అక్బర్!

ఇద్దరూ వెళ్ళారు. ఒక్కక్షణం వ్యవధి. ఈ సమయంలో నసీం వంటకు సంబంధించిన పని ఏదో చేస్తుంది. రాముడు వచ్చాడు. ఎడమచేతి వైపునుంచి....

నసీం: (చాలా వుత్సాహంగా) తమ్ముడూ!

రాం: (ఏమీ పలకకుండా కూర్చున్నాడు)

నసీం: (చిన్నబోయింది) ఏం తమ్ముడూ అలా వున్నావు?

రాం: ఇక్కడ కొత్తవాళ్ళెవరైనా వున్నారా?

నసీం: అంటే?
రాం: కొత్తగా ఇంట్లో ఎవరైనా వచ్చి వున్నారా అని
నసీం: వున్నారు.
రాం: ఎవరు?
నసీం: సత్యం అని నా స్నేహితురాలు.
రాం: ఆమెను రాత్రి పిలుస్తావా!
నసీం: ఎందుకు!
రాం: నేనామెను చూడాలి.
నసీం: ఎందుకు!
రాం: కారణం ఇప్పుడు చెప్పను.
నసీం: అంతకోపం ఎందుకు! ఆ రహస్యమేమిటో చెప్పరాదూ! అసలు ముందెనా మొహం ఎరగని ఆమెను నువ్వు చూడాలనటం ఏమిటి!
రాం: ఆమెతో మాట్లాడాలి.
నసీం: ఇది మరీ బాగుంది. చూడటం కాకుండా మాట్లాడాలి! ఏమిటి విశేషం!
రాం: విశదాలన్నీ విన్నవించుకోవాలా?
నసీం: తప్పక. ఆమె మా ఇంటిలో వుంది. ఆమెను ఎరిగే మంచి చెడ్డలు మేం ఇష్టపడ్డాం.
రాం: నసీం! 'మేము, మీరు' దాకా వచ్చిందన్నమాట?
నసీం: నువ్వేగా కారణం? లేకుంటే నీకింత గోప్యం ఎందుకురా!
రాం: గోప్యం ఏమీలేదు. ఆమెను మీరెందుకు హిందువు ఇంట్లో వుండనివ్వకూడదు!
నసీం: అది మా ఇష్టం! ఆమె సరాసరి మా ఇంటికి వచ్చింది. చేరదీశాం. ఇకనాడే వుండి పోతుంది!
రాం: శాశ్వతంగానా! (వ్యగ్రంగా వుంది ప్రశ్న)
నసీం: (అర్థం చేసుకొన్నది) ఏమో? ఉంటే వుంటుంది. ఏం?
రాం: (ఒకనాక్షణం ఆలోచించాడు. కోపం వచ్చింది) నేను కేవలం పొరబడ్డాను. నా నమ్మకమంతా వృథా అయిపోయింది.
నసీం: అందుకనే రాదోయ్. ఎప్పుడూ మొలలో బాకుతో తిరుగుతున్నావు పాపం!
రాం: నేనా!

నసీం: ఆఁ - డాక్టర్ చూశాడటగా!

రాం: అబద్ధం! పచ్చి అబద్ధం!

నసీం: మమ్మల్ని నమ్మవుంటావా?

రాం: తప్పకుండా!

నసీం: మరైతే మమ్మల్ని మీరెందుకు నమ్మరండి?

రాం: (చెంపకు తపీమని దెబ్బ ఇచ్చినట్లుంది. కాని ఒక్కక్షణంలో తేరుకున్నాడు.) ఎట్లా నమ్మమంటావు! మీ రింత నమ్మకద్రోహం చేసి ఎట్లా నమ్మమంటావు? మా కళ్ళ ఎదటే మా జాతిని. మతాన్ని అవమానిస్తూంటే ఇంకా నమ్మమంటావా?

నసీం: మతిపోయిందా?

రాం: అవును. మతిపోయింది. నసీం! నువ్వు. నువ్వుకూడా ఈ అన్యాయాన్ని నీ కళ్ళెదుటే ప్రోత్సహిస్తావనుకోలేదు. స్త్రీ సహజమైన హృదయం నీ కుందనుకున్నాను. ఏ మతం అయితే ఏం? ఏ కులం అయితే ఏం? నీ జాతిని. స్త్రీ జాతినే నువ్విట్లా అవమానిస్తావనుకోలేదు. ఈ రాక్షస కృత్యాన్ని నువ్వు —

నసీం: రాం?

రాం: బెదిరిస్తున్నావా? మీ దగ్గర బాకు లెప్పుడూ వుంటాయని నాకు తెలుసు! తెలిసే వచ్చాను. పొడిచేస్తావా? పొడిచే - కానీ - ఆ అమ్మాయిని ముందు పొడిచే, ఆ తరువాత నన్ను. నువ్వు పొడిచేలేవా? నేనే చంపేస్తానామెను. నన్ను నువ్వు నీ ఇష్టంవచ్చినట్లు చిత్రవధచేయి. సంతోషమే!

నసీం: నువ్వు ఆమెందుకు చావాలి?

రాం: చావాలి. చావక తప్పదు. మతంకోసం కాదు. కులంకోసం కాదు. స్త్రీ జన్మ కోసం. స్త్రీ జన్మ పవిత్రతను కాపాడ్డంకోసం. ఈ నీచపు బ్రతుకు బ్రతకటం కంటే చావటం మేలు.

నసీం: అది మీ హిందువుల కాదినుంచీ వున్న ఆచారమేగా? ఆడదాని శీలాన్ని కాపాడటానికి చంపేయటంతప్ప వేరేమార్గం లేదు మీకు.

రాం: అవును. మాకు ఎట్లాగో బ్రతకటంకాదు కావాల్సింది. మర్యాదగా బ్రతకడం.

నసీం: ఇంతకూ ఆమె మర్యాదకేం లోపం వచ్చింది?

రాం: నసీం! ఆమెను మీరు బలాత్కారంగా నిఖా —

నసీం: రాం! (ఉగ్రమూర్తి అయింది)

వత్సల: (చాలా బాధకలిగింది. ఏమీ పలకలేదు)

రహీం: (గమనించా) వత్సలా! నామాట వింటావా?

వత్సల: ఏమిటో చెప్పన్నయ్యా!

రహీం: నీకు నసీం అంటె వాత్సల్యం వుందా?

వత్సల: ఉందని నేను చెపితే నమ్ముతావా?

రహీం: అయితే నసీంకోసం, నసీం అన్నయ్యకోసం. నసీం సంసారంకోసం. ఈ ఒక్క సహాయం చేస్తావా? నసీం నీకోసం ఎంత త్యాగం చేసింది? ఇంకా ఆమె ప్రాణాలను, ఆమె కుటుంబ ప్రాణాలను కూడా కోరటం నీకు న్యాయమా చెప్పు?

వత్సల: అన్నయ్యా! (దుఃఖం పొంగి వచ్చింది.)

రహీం: ఎవ్వరికీ బాధలేని మార్గం ఒకటి చెప్తాను. వింటావా?

వత్సల: (తల ఆడించింది)

రహీం: దయచేసి నువ్వు——

వత్సల: వెళ్తాను.

రహీం: కాదు వత్సలా! రెఫ్యూజీ క్యాంపులు ఏర్పాటు చేస్తున్నారు. అక్కడికి వెళ్లు. నిన్ను భద్రంగా నేను చేర్చి వస్తాను. ఏం? నసీముమ్మా వచ్చుచెప్పు. వత్సలా! ఇందర్నీ కాపాడినదాన వవుతావు! ఏం?

వత్సల: అలాగే అన్నయ్యా! కానీ——

రహీం: కానీ?

వత్సల: నా కోరిక ఒక్కటి నువ్వంగీకరిస్తావా?

రహీం: ఏమిటి?

వత్సల: ఇదివరకే చెప్పాను. నేను వెళ్తాను. నాకేమీ ఆశలేదు. అన్నయ్యా! ఆ ఒక్క పసికందును మాత్రం కాపాడతానని మాట యిస్తావా?

రహీం: ....అలాగే. బిడ్డనిక్కడే వుండనీ!

వత్సల: నసీం! నసీం!

నసీం వచ్చింది.

వత్సల: నా మాట ఒక్కటి నువ్వు మన్నించాలి నసీం!

నసీం: నాకంతా తెలుసు, విన్నాను. సరే, వెళ్ళిరా!

వత్సల: బాబాతో చెప్తావు కదూ!

నసీం: (తల ఊపుతుంది) రహీం! ఒక్కమాట! బ్రతుకు నాకు శాశ్వతం! చావు వస్తున్నది! ఈ ఇంటి గౌరవాన్ని – ఎందుకు – మానవజన్మ మర్యాదలను నిలబెట్టు. పిల్లలను నీకు అప్పగిస్తున్నా, జాగ్రత్త!

పిల్లలను, రహీంను గడపదాకా వదిలి వచ్చింది. రాం ఇటువైపునుంచి పరుగెత్తి వచ్చాడు.... .

రాం: నసీం! నసీం!

నసీం: ఏం?

రాం: రహీం వున్నాడా?

నసీం: లేడు.

రాం: బాబా?

నసీం: బాబా ఇంకా రాలేదు.

రాం: ఓహ్! ఏంచేయాలి? వాళ్ళు వచ్చేస్తారు....వచ్చేస్తున్నారు. నసీం. దొడ్డి త్రోవ వెళ్ళగలవా? వెళ్ళు నసీం! వెళ్ళు.

నసీం: ఎక్కడికి ఎందుకు రాం?

రాం: నేను చూడలేను నసీం! నా కళ్ళారా నేను చూస్తూండలేను. నిన్ను వాళ్ళు బతకనివ్వరు. వాళ్ళు రాక్షసులు. వాళ్ళ దృష్టిలో ఆడ. మగ. పెద్ద. చిన్న. ముసలి. ముతక అన్న భేదాలే లేవు. వెళ్ళు నసీం!

నసీం: ఈ ముస్లింపై ఇంతలో దయ కలిగిందేం? ఇంతలో మారిపోయావేం?

రాం: నసీం! ఏమైనా అను. నీ ఇష్టంవచ్చినట్లు అను. కానీ. దెప్పిపొడుపుల కిది కాదు సమయం. ఒక్కటి మాత్రం నమ్ము. ఈ హృదయంలో ద్వేషం అన్నది ఏనాడూ లేదు. నువ్వు ముస్లిం స్త్రీ వయినా నీ తల తెగిపడుతూంటే చూడలేను నసీం! వెళ్ళు నసీం! నా తల్లివికదూ వెళ్ళు!

నసీం: వెళ్ళను. అధర్మం ఏ రూపంలో వచ్చినా ఎదుర్కొంటాను. ముస్లిం అయినా హిందువైనా అధర్మం అధర్మమే! మనం ధర్మవీరులం కావాలి రాం! పిరికి పందలు కాకూడదు.

రాం: నసీం! (లోపలికి పరుగెత్తాడు.)

నసీం నడుం బిగిస్తుంది

రాం: (మళ్ళా వచ్చాడు) నసీం! కొంప కగ్గిపెట్టారు. తగలబడి పోతూంది. ఆ పక్కంతా కాలిపోయింది. ఇంకొక్క క్షణంలో ఈ కొంప కూడా మసి అయిపోతూంది. వాళ్ళు వచ్చేస్తున్నారు నసీం!

నసీం. రాం! నువ్వు మగవాడివన్నది మరిచిపోకు. ఆడదాని వలెనె ఇట్లా ఏడుస్తావా! రానీ, నిలు ——

రాం: (చెప్పలేని బాధ. ఏమీ చేయలేని పరిస్థితిలో అవస్థపడుతున్నాడు. బయట కలకలం.)

నసీం: వచ్చారు.

రాం: వచ్చారు! (వాకిలిదగ్గరకు పరుగెత్తాడు. తలుపులు మూయబోయాడు. బయటి వాళ్ళు దబాలున తీసారు. నసీం కర్ర విసిరింది. ఎవరికో తగిలింది. కెవ్వుమని కేక. ఒకడు రామును తోసుకొని లోపలికొచ్చాడు. నసీం కర్ర పైకెత్తింది. వాడు కత్తి తీశాడు. రాం అడ్డుపడ్డాడు.)

రాం: ముందు నన్ను చంపండి!

గుండా: నువ్వు హిందువు కావూ?

రాం: అవును.

గుండా: మరి దాని కడ్డు నిలుస్తావేం?

రాం: ఆమె నా చెల్లెలు.

గుం: తురకది.

రాం: అవును.

గుండా: చెల్లెలు (వాడు. వాడి వెనకాల వున్నవాళ్ళందరూ ఒక్కసారి పెద్దగా నవ్వారు) ఛీ! సిగ్గులేదూ?

రాం: నేనుకాదు సిగ్గుపడాల్సింది, మీరే! హిందూమతానికే కళంకం తెస్తున్నందుకు మీరు సిగ్గుపడాలి. మతం పేరిట మానవ మారణహోమం చేస్తున్నందుకు మీరు సిగ్గుపడాలి!

గుండా! ఆపు నీ ఉపన్యాసం అంతటితో! పేడివెధవ! మహా ఏడ్వగలవాడు బయల్దేరాడు. ఇటువంటి ముండమోపు ఉండబట్టే మనవాళ్ళు నౌఖాలీలో కసాయి కత్తికింద మాంసం మాదిరయ్యారు.

రాం: అవును. మీబోటి వారుండబట్టే పంజాబులో మతం నిలిచింది.

గుండా: నరేలేవోయ్ అడ్డులే! ఎందు కన్యాయంగా చస్తావ్?

రాం: చంపేయండి. మానవత్వంకోసం చస్తాను. చంపేయండి.

గూండా: బెదిరిస్తావేం చంపేయంటని! (ఊప్పి లాగి విసిరాడు ముందుగా.)

నసీం కర్ర విసిరింది. వాడు దెబ్బతో పడిపోయాడు. ఇంతలో ఇంకొకడు నసీంను కత్తితో పొడిచాడు. నసీం కేకవేసి ఒరిగింది. రాం ఆమెను చేతుల్లో పట్టుకున్నాడు. 'హిందూస్థాన్ జిందాబాద్!' అని అంటూ అరుస్తూ పడ్డాడు.

రాం: నసీం! నసీం!

నసీం: భాయ్! వత్సలా! వత్సలేమైందో. ఇంకా రహీం రాలేదా!

కిటికీలోంచి తుపాకి ప్రేలింది. రాం ఆ దెబ్బతో నేల కొరిగాడు. 'పాకిస్తాన్ జిందాబాద్!' అని కేక. వాకిలివైపునుంచి రహీం వచ్చాడు.

రహీం: రాం!

రాం: రహీం!

రహీం: ఒక్కటే కంచంలో తిన్నాం!

రాం: ఒక్కటే గోతిలో నిద్రపోతాం! (పడిపోయాడు).

నసీం: భాయ్! వత్సలా! వత్సలా! (అతి కష్టంమీద లేచింది.)

రహీం: బహిన్! వత్సల ఖూనీహూవా!

నసీం: ఖూనీ! రహీం! ఖూనీ! వత్సలను చంపేశారు. వత్సల చచ్చిపోయింది. ద్రోహం! జాగ్! జాగ్!

అయిపోయింది! అయిపోయింది!
స్వతంత్రభారత స్వర్గఖండము
శ్మశాన భూమిగ అయిపోయింది!
మతావేశ పైశాచిక భీకర
నాట్యరంగముగ అయిపోయింది!
మానవ మారణ హోమధూమము
పల్లె పల్లెకును ప్రాకినవి
మానవరక్త నదీనదమ్ములు
మన భూమంతా పారినవి!

పాట ఆగిపోయింది. లోపల్నుంచి పొగమంటలు వస్తున్నాయి. వాకిలివైపునుంచి తాపీగా డాక్టరు ప్రవేశించాడు. పడివున్న శవాల నొకసారి తీరికగా చూసి వికటాట్టహాసం చేశాడు........

డాక్టర్: భారతదేశం స్వతంత్రమైంది. భారతదేశానికి స్వాతంత్ర్యం ఇచ్చాం. (మరల వికటాట్టహాసం.)

ఇదే సమయానికి బయటనుంచి 'రాం! రహీం!' అంటూ అక్బర్, పురుషోత్తములు అరుస్తూ వచ్చారు. చచ్చి పడివున్న బిడ్డలను చూశారు. తాపీగా నిల్చున్న డాక్టరును చూశారు. ఇద్దరు అగ్నిపర్వతాలలా చేతులు కలిపి ఒక్కసారిగా లేచారు.

అక్బర్: బద్మాష్; బంగారు భారతదేశాన్ని వల్లకాడు చేయాలని చూశావ్!

పురు: మాలో మాకు కలతలు పెట్టి నెత్తికెక్కి కూర్చోవాలని చూశావ్!

అక్బర్: నీ ఆటలు సాగవు. మేము ఒకటిగా నిలుస్తాం.

పురు: నిలచి నీ పెత్తనాన్ని నాశనం చేస్తాం.

అక్బర్ పురుషోత్తముల నరసింహాకృతులు చూసి డాక్టర్ బెదిరాడు. మెల్లగా జారుకున్నాడు.

రహీం: నసీం! బహెన్! వత్సలను నేనుకాదు చంపినది! చూడు.. నేనూ వత్సలతో పాటు పోతున్నాను. వత్సల తుదికోర్కె తీర్చలేకపోయాను. ఆమెను ప్రాణాలతో నీకు చూపించలేకపోయాను. నీ చేతుల్లో నీ స్నేహితురాల్ని, కాదు - నీ స్నేహితురాలి శవాన్ని పెట్టాను. నసీం! రెఫ్యూజీ క్యాంపుకు కాదు, ఈ మత భేదాలే లేని మరో లోకానికి ఆమెతోపాటు, ఆమెకు తోడుగా వెళ్తున్నాను. భద్రంగా చేరుస్తాను.

నసీం: వత్సలా! నేనూ, నేనూ నీతో - వస్తున్నా. (వత్సల శవంమీద వాలింది. పై రహీం, వత్సల మాటలు జరుగుతూండగానే నేపథ్యంలో సన్నగా పాట వినిపిస్తూంది.)

తెర పడుతుంది.

